# కృతజ్ఞత



కీ॥ శే॥ తాతపూడి సంజీవశాస్త్రిగారి పుత్రులు శ్రీ తాతపూడి సత్యనారాయణమూర్తిగారు (చింతలూరు) గ్రంధప్రచురణకు పూర్వమే ఒక సంచికకు సరిపడు ముద్రణభారం వహించారు. వారికీ వారి కుటుంబ పరివారానికీ గ్రంథనాయకుడైన శ్రీకృష్ణభగవానుడు ఆయురారోగ్య ఐశ్వర్యము లిచ్చి రక్షించుగాక !

ఇట్లు,

కార్యదర్శి

**భాగవత ప్రచారక సంఘం**

రాజమండ్రి — విక్రమహాలు



---

## సంపాదక సహకారం

పురాణపండ రాధాకృష్ణమూర్తి (రాష్ట్రభాషావిశారద)

దువ్వూరి సోమయాజులు

పి. కామేశ్వరరావు

వ్యాఖ్యాత



శ్రీ పురాణపండ రామమూర్తి

ఆవిష్కర్త



శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారీజీమహరాజ్

# ఉపోద్ఘాతము



మ. లలితస్కంధముఁ గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితముఁ సువర్ణసుమనస్సుజ్ఞేయముఁ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయుఁ భాగవతాఖ్యకల్పతరు వుర్విఁ సద్ద్విజశ్రేయ మై.

శ్రీమద్భాగవతం సాక్షాత్తూ భగవత్స్వరూపం కనుకనే భగవద్భావనయూ భక్తులందరూ పఠించి ఆరాధిస్తూంటారు. వ్యాసముని చంద్రునంతటి వానికి మనశ్శాంతిని కలుగజేయగలిగిన యీ మహోత్తమ గ్రంథంలో సర్గ విసర్గ స్థాన పోషణ ఊతి మన్వంతర ఈశానుకథ నిరోధ ముక్తి ఆశ్రయాలనే దశ లక్షణాలూ శ్రుతి తాత్పర్యానుభవాలచే నిర్ణయింపబడి యుండ కల్ప మహాకల్ప అవాంతర కల్పాలూ భూత భవిష్యద్వర్తమాన కాలాల సూక్ష్మగతి, సత్త్వరజస్తమోగుణాలూ, పృథివ్యాకాశరసాతల దిశాగ్రహనక్షత్ర నదనదీ సాగర ద్వీపాలూ, అందు నివసించు జీవులూ, యుగభేద ప్రమాణ ధర్మాలూ వివిధావతారాలూ వర్ణాశ్రమ ధర్మాలూ, తత్త్వంయొక్క సంఖ్యా స్వరూప లక్షణాలూ, భగవదారాధనాక్రమమూ, అధ్యాత్మయోగ విధీ వేదోపనిషద్ధర్మ శాస్త్రేతిహాసాదుల స్వరూప తాత్పర్యాలూ సర్వ జీవకోటి యొక్క ఉత్పత్తి స్థితిలయాలూ వాపీ కూప తటాకోద్యానవనాది నిర్మాణాలూ, శ్రౌత స్మార్త కామ్య కర్మలూ, ధర్మార్థకామాలూ తత్సాధనోపాయాలూ ప్రకృతియందు లయమయిన సమస్త జీవుల పునర్జన్మ క్రమమూ బంధమోక్షాలూ సర్వతంత్ర స్వతంత్రుడైన భగవానుడు నిజ మాయతో క్రీడించుట,

మాయాతీతుడై కేవలం సాక్షివలె ఉదాసీనుడుగా ఉండువిషయములూ సకామ నిష్కామ కర్మలూ జ్ఞానోపాసనా ప్రేమభక్తులూ, ద్వైత,అద్వైత విశిష్టాద్వైత, ద్వైతా ద్వైతాది మతసిద్ధాంత సర్వస్వమూ సర్వమత సామరస్యం చేకూరుస్తూ ప్రత్యేక స్కంధంనుండీ జ్ఞాన సుధా స్రవంతినిప్రవహింప జేస్తున్నది. గనుకనే దీనిపఠన శ్రవణాదులవల్ల లౌకిక పారలౌకిక సిద్ధులన్నీ కరతలామలకాలవుతూన్నట్లు గోచరిస్తాంది. భక్తిభావపూర్ణమై విద్యాసారమైన యీ మహోత్తమ గ్రంథాన్ని విద్యాసంపత్కుల ధన యౌవన గర్వ పర్వతాన్నధిరోహించిన మహాత్ములెందరో పఠించి తరించినట్లు ప్రమాణాలు అసంఖ్యాకంగా గోచరిస్తున్నాయి. అహోరాత్ర భేదరహితంగా వేద శాస్త్రాలను పఠించినా ప్రయోజనం లేదు. అతి సుగమ మయిన యీ భాగవత నిగమాన్ని పారాయణ చేసి మానవులు నిరతిశయమైన మోక్షాన్ని పొందగల రనడంలో సందేహ మెంతమాత్రం లేదు.

మహామహిమాన్వితమై శాంతిని ప్రసాదించడంలో ఏకైక గ్రంథమై కృష్ణద్వైపాయన విరచితమైన శ్రీమద్భాగవతాన్ని ఉపన్యాససార్వభౌమ బ్రహ్మ శ్రీపురాణపండ రామమూర్తిగారు ఆంధ్రీకరించి యున్నారు. దేశ దేశాంతరాలలో వివిధ భాషలయందు సులభ శైలిలో మూలంతో అనువదింపబడిన యీబృహద్గ్రంథాన్ని ఇంతదనుక ఆంధ్రంలో మూలంతో లేదన్న లోటును శ్రీరామమూర్తిగారు తీర్చియున్నారు గనుక ఆంధ్రులందరూ ఆ మహనీయునికి ఋణపడి యున్నారనడంలో అతిశయోక్తి లేదు. అధ్యాత్మ రామాయణ మహాభారతాలను వ్యాఖ్యానించిన యీ గ్రంథకర్త జీవితమే పురాణ ప్రవచనంగా పురాణ ప్రవచనమే జీవితంగా గడుపుతూ అనేక పల్లెలలో పట్టణాలలో తమ గంభీరోపన్యాసములతో ఆంధ్రావనికి పరిచయమై యున్నారు. ఈ మహనీయుని గన్న మాతా పితరుల ధన్యత్వాన్ని అభినందిస్తూ అష్టాదశ పురాణాలనూ

సులభ వ్యావహారిక శైలిలో ఆంధ్రీకరించి అశాంతియుత సమాజంలో యీ సద్గ్రంథ ప్రచారం ద్వారా శాంతిజ్యోతిని పునఃసృష్టించ బద్ధకంకణులైన వీరికిభగవానుడు ఆయురారోగ్యైశ్వర్యము లిచ్చి కాపాడుగాక శ్రీరామమూర్తిగారు వ్యాఖ్యానించిన శ్రీమద్భాగవతాన్ని మూలంతో సహా అందజేయు మహాభాగవత సంఘాన్ని స్థాపించి ప్రచారకార్యక్రమాన్ని నిర్వహింప బూనిన భాగవత ప్రచారక సంఘానికి భక్తజనులెల్లరూ తమ సంపూర్ణ సహకారాలన్ని అందజేయుదురుగాక।

18-6-60
ఆలమూరు

ఇట్లు
నరసింహదేవర జనార్దనశాస్త్రి
కార్యదర్శి
అధ్యాత్మ ప్రచారక సంఘం



# ★ విషయసూచిక ★

## — ప్రథమస్కంధం —


| అధ్యాయం | | పుట |
|---|---|---|
| 1 | శౌనకాదులు సూతుని ప్రశ్నించుట | 1 |
| 2 | భగవత్కథా-భక్తిమాహాత్మ్యం | 5 |
| 3 | అవతార వర్ణన | 10 |
| 4 | వ్యాసుని విచారం | 15 |
| 5–6 | కీర్తన మహిమ – నారద పూర్వ వృత్తాంతం | 19 |
| 7 | ఉపపాండవ సంహారం అశ్వత్థామ - గర్వభంగం | 28 |
| 8 | పరీక్షిత్తు రక్షణ – కుంతీస్తుతి - ధర్మరాజు సంతాపం | 35 |
| 9 | ధర్మరాజు భీష్ముని చేరుట - భీష్మనిర్యాణము | 43 |
| 10 | శ్రీకృష్ణుని ద్వారకాగమనం | 49 |
| 11 | శ్రీకృష్ణునకు ద్వారకలో రాజోచిత స్వాగతం | 53 |
| 12 | పరీక్షిత్తు జననం | 58 |
| 13 | గాంధారీ ధృతరాష్ట్రుల వనగమనం | 62 |
| 14 | అపశకునములు చూచి ధర్మజుడు శంకించుట అర్జున పునరాగమనం | 70 |
| 15 | శ్రీకృష్ణవియోగంతో పాండవుల రాజ్యత్యాగం - పరీక్షిత్తు పట్టాభిషేకం - పాండవేయుల మహాప్రస్థానం | 75 |
| 16 | పరీక్షిత్తు దిగ్విజయం - పృథ్వీదేవతా సంవాదం | 81 |
| 17 | పరీక్షిత్తు కలిని శిక్షించుట. | 87 |
| 18 | శృంగి శాపం. | 93 |
| 19 | పరీక్షిత్తు నిరశన వ్రతం – శ్రీశుకుల ఆగమనం. | 100 |

## — ద్వితీయస్కంధం —


| అధ్యాయం | | పుట |
|---|---|---|
| 1 | ధ్యానవిధి-విరాట్ రూపవర్ణన | 105 |
| 2 | భగవానుని స్థూల–సూక్ష్మ రూపవర్ణన, ధారణ–క్రమ, సద్యోముక్తుల వివరణ. | 110 |
| 3 | అన్యదేవతోపాసన-భక్తిప్రాధాన్యత. | 117 |
| 4 | సృష్టివిషయక ప్రశ్న-కథారంభం. | 120 |
| 5 | సృష్టివర్ణన. | 124 |
| 6 | విరాట్‌రూప–విభూతుల వర్ణన. | 130 |
| 7 | లీలావతారకథనం. | 138 |
| 8 | పరీక్షితుని వివిధ ప్రశ్నలు. | 145 |
| 9 | బ్రహ్మ నారాయణుని దర్శించుట - చతుశ్శ్లోకీ ఉపదేశం. | 149 |
| 10 | భాగవత లక్షణాలు. | 155 |


## — తృతీయస్కంధం —


| | | |
|---|---|---|
| 1 | ఉద్ధవ– విదుర సమాగమం. | 164 |
| 2-3 | భగవల్లీలా వర్ణన. | 169 |
| 4 | విదురమైత్రేయ సమాగమం. | 17 |
| 5 | సృష్టిక్రమ వర్ణవ | 18 |
| 6 | విరాట్ శరీరోత్పత్తి | 189 |
| 7 | విదుర ప్రశ్న | 195 |
| 8 | బ్రహ్మోత్పత్తి | 201 |
| 9 | బ్రహ్మ భగవానుని స్తుతించుట | 206 |
| 10 | దశవిధ సృష్టి వర్ణన | 212 |
| 11 | కాల విభాగం | 217 |

| అధ్యాయం | | పుట |
|---|---|---|
| 12 | సృష్టి విస్తరణ | 225 |
| 13 | వరాహావతారం | 235 |
| 14 | దితి గర్భంధరించుట | 243 |
| 15 | జయ విజయులకు సనకాదుల శాపం | 250 |
| 16 | జయవిజయుల పతనం | 258 |
| 17 | హిరణ్యాక్ష–హిరణ్యకశిపులజన్మ దిగ్విజయం | 264 |
| 18 | హిరణ్యాక్ష–యజ్ఞవరాహదేవుల యుద్ధం | 268 |
| 19 | హిరణ్యాక్షవధ | 272 |
| 20 | వివిధ సృష్టి వర్ణన | 277 |
| 21 | కర్దముని తపస్సు | 284 |
| 22-23 | దేవహూతీ కర్దముల కళ్యాణ విహారాలు | 292 |
| 24 | కపిలావిర్భావం | 305 |
| 25 | కపిల దేవహూతీ సంవాదం | 311 |
| 25-29 | పిండోత్పత్తి వర్ణన–ప్రకృతి– పురుష వివేక వివరణ–మోక్ష ప్రాప్తి వర్ణన-అష్టాంగయోగవిధి–భక్తిరహస్యం–కాలమహిమ | 318 |
| 30 | దేహ గేహాలపై ఆసక్తిగల వారి అధోగతి | 354 |
| 31 | మానవ జన్మనొందిన జీవునిగతి | 360 |
| 32 | ధూమ, అర్చిరాది మార్గాలగుండా పోవువారిగతి భక్తియోగవర్ణన | 370 |
| 33 | దేవహూతి తత్త్వజ్ఞానం - మోక్షప్రాప్తి | 377 |






## స్వర్గీయ మాదేటి సూర్యప్రకాశరావు గారు

మా భారద్వాజా ప్రింటింగు ప్రెస్‌కు రు 1116 లు విరాళముగా ఇచ్చిన దాతలు. భగవానుడు వీరికి శాశ్వత స్వర్గాన్ని ప్రసాదిస్తూ వీరి కుటుంబానికి ఆయురారోగ్యైశ్వర్యాదులు ప్రసాదించుగాక.

గ్రంథకర్త

# శ్రీమద్భాగవతం

## ప్రథమస్కంధము

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.

జన్మాద్యస్య యతోఽన్వయాదితరత శ్చార్థే ష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యంతి య త్సూరయః,
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి.
ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్,
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరై రీశ్వరః
సద్యో హృ ద్యవరుధ్యతేఽత్ర కృతిభి శ్శుశ్రూషుభి స్తత్క్షణాత్.
నిగమకల్పతరో ర్గళితం ఫలం శుకముఖా దమృతద్రవసంయుతమ్,
పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః.

నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు సత్రయాగం చేస్తున్నారు. అనేకప్రాంతాలనుండి ఋషులూ మునులూ వచ్చి ఆ యాగంలో పాల్గొంటున్నారు. ప్రాత ర్మాధ్యందిన సాయం సవన విభాగంచేత స్వాహాకార స్వధాకార వషట్కారాలతో విధి-విధానంగా యాగం జరుగుతూన్నది. విశ్రాంతిసమయాలలో సూతమహర్షి వల్ల పురాణేతిహాసాలు వింటున్నారు. బ్రహ్మ పద్మ విష్ణు శివ పురాణాలు వరుసగా వినిపిస్తున్నాడు సూతర్షి. ఆ సద్గోష్ఠిలో సృష్టి స్థితి లయాలను గురించీ మనువులూ వారిసంతతీ సప్తఋషులూ ఇంద్రాది దేవతలూ అగ్నిష్వాత్తాది పితృగణం గరుడ గంధర్వ యక్ష నాగాదులూ వారిసంతతీ సూర్యచంద్ర వంశాలూ వారిలో విశేషచరిత్రగల మహారాజులూ మహాత్ములూ మొదలైన వారందరి చరిత్రలూ సంగ్రహంగా సవిస్తరంగా చెప్పుకున్నారు. కల్పకల్పాంతకాలను సంబంధించిన అనేకవిషయాలు వివ

నైమిశేఽనిమిషక్షేత్రే ఋషయశ్శౌనకాదయః,
సత్రం స్వర్గాయలోకాయ సహస్రసమమాసత.
త ఏకదా తు మునయః ప్రాతుర్హుతహుతాగ్నయః,
సత్కృతం సూతమాసీనం పప్రచ్ఛురిదమాదరాత్.
త్వయా ఖలు పురాణాని సేతిహాసాని చానఘ,
ఆఖ్యాతాన్యప్యధీతాని ధర్మశాస్త్రాణి యాన్యుత.
యాని వేదవిదాం శ్రేష్ఠో భగవాన్ బాదరాయణః,
అన్యే చ మునయస్సూత పరావరవిదో విదుః.
వేత్థ త్వం సౌమ్య తత్సర్వం తత్త్వతస్తదనుగ్రహాత్,
బ్రూయుస్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత.
తత్ర తత్రాంజసాయుష్మన్ భవతా యద్వినిశ్చితమ్,
పుంసామేకాంతతశ్శ్రేయస్తన్నశ్శంసితుమర్హసి.

రిస్తూ కృత త్రేతా ద్వాపరయుగాలూ వాటి ప్రమాణాలూ లక్షణాలూ వివరిస్తున్నాడు. విశేషించి కలియుగధర్మాలు చెపుతున్నాడా సూతమహర్షి.

ఒకనాడు ప్రాతఃకాలాన నిత్యకృత్యాలు నిర్వర్తించుకొని అగ్నిహోత్రాదులన్నీ పూర్తిచేసుకొని వ్యాసాసనం అలంకరించిన సూతుని సమీపించి పూజా నమస్కారాలతో ప్రసన్నుని చేసుకొని శౌనకాది మహర్షులు ఇలా అడిగారు.

సూతమహర్షీ! నువ్వు సర్వపురాణేతిహాస కథాకథన సమర్థుడవు. నీ వల్ల అనేక గాథలు వింటున్నాము. ప్రతీ చతుర్యుగపరిభ్రమణంలోనూ కలియుగం వస్తూనే ఉంటుంది. కలియుగ లక్షణాలు చూస్తే భయం విచారం కలుగుతూన్నవి. వేదవేదికమైన భరతఖండంలో కూడా వేద విరుద్ధమైన ధర్మాలే వ్యాప్తిచెందడం మానవులు స్వధర్మాన్ని వీడి పరధర్మాలను అనుష్ఠించడం తల్లిదండ్రుల్ని ద్వేషించే కుమార్తూ అత్త మామలను హింసించే కోడళ్లూ ఉంటున్నారు. గురు శిష్యుల మధ్య అంతఃకలహాలు రేగుతున్నాయి. భార్యాభర్తలకు పరస్పరం ప్రేమలేక పోగా విద్వేషాలు పెంపొందుతున్నాయి. లోకం అస్తవ్యస్తమై ఛిన్నా

ప్రాయేణాల్పాయుషః సర్వే కలావస్మిన్ యుగే జనాః,
మందాస్సుమందమతయో మందభాగ్యా హ్యుపద్రుతాః.
భూరీణి భూరికర్మాణి శ్రోతవ్యాని విభాగశః,
అతస్సాధోఽత్ర యత్సారం సముద్ధృత్య మనీషయా.
బ్రూహి భద్రాయ భూతానాం యేనాత్మా సంప్రసీదతి,
సూత జానాసి భద్రం తే భగవాన్ సాత్వతాంపతిః.
దేవక్యాం వసుదేవస్య జాతో యస్య చికీర్షయా,
తన్నః శుశ్రూషమాణానామర్హస్యంగానువర్ణితుం.
యస్యావతారో భూతానాం క్షేమాయ చ భవాయ చ,
ఆపన్నః సంసృతిం ఘోరాం యన్నామ వివశో గృణన్.
తతః సద్యో విముచ్యేత యద్బిభేతి స్వయం భయమ్,
యత్పాదసంశ్రయాః సూత మునయః ప్రశమాయ నాః.

భిన్నమై యుక్తాయుక్త వివేక జ్ఞాన శూన్యమై ఉంటోంది. అల్పమైన మేధ. అతిస్వల్పమైన ఆయుర్దాయం. దార పుత్ర ధనాసక్త చిత్తులై పాపాచార పరాయణులై ఇంద్రియ లోలురై కాముకులై సుఖశబ్దార్థాన్నే గ్రహించలేక చరించే మానవులు నిరంతరం ఆధి వ్యాధి పీడితులై దుఃఖ శోకాలే అనుభవిస్తూ ఐహికంగానూ ఆముష్మికంగానూ సుఖాన్ని పొందలేక ధనహీనులై పుత్రహీనులై బాధపడుతూ ఉంటారు. వేదసిద్ధమైన కర్మ ఉపాసన జ్ఞానం అనే సాధన త్రయ జ్ఞానమే లేని కలియుగ మానవులు సుఖించడం ఎలా అని మాకు విచారం కలుగుతూ ఉంది. కేవలం అజ్ఞానులైన కలికాలపు మానవులు తరించడానికి మార్గం యేదైనా ఉందా? లేదా! అనే సంశయంతో మా హృదయాలు తపించి పోతున్నాయి. భూత భవిష్యద్వర్తమాన కాలాలు తెలిసినవాడవూ వేదవేదాంగ విజ్ఞానం గ్రహించిన వాడవూ అవడం వల్ల నీకు తెలియని ధర్మాలేవీ లేవు. నీకంటే మానవులకు తరుణోపాయ మార్గాలు చెప్ప గలవాడు లేడు. కలికాలపు మానవులు తరించే ఉపాయంతో పాటు భక్తవత్సలుడైన భగవానుడు యదువంశంలో ఎందుకు అవతరించాడో ఆయన లీల లెట్టివో! జనన మరణ రూపమైన కాలచక్రంలో పరిభ్రమించే జీవులు ఏ నామసంకీర్తన మాత్రం చేత నిరతిశయానందాన్ని

సద్యః పునంత్యుపస్పృష్టాః స్వర్ధున్యాపోఽ నుసేవయా,
కో వా భగవతస్తస్య పుణ్యశ్లోకేడ్యకర్మణః.
శుద్ధికామో న శృణుయాద్యశః కలిమలాపహమ్,
తస్య కర్మాణ్యుదారాణి పరిగీతాని సూరిభిః.
బ్రూహి నః శ్రద్దధానానాం లీలయా దధతః కలాః,
అథాఖ్యాహి హరేర్ధీమన్నవతారకథాః శుభాః.
లీలా విదధతః స్వైరమీశ్వరస్యాత్మమాయయా,
వయం తు న వితృప్యామ ఉత్తమశ్లోకవిక్రమే.
యచ్ఛృణ్వతాం రసజ్ఞానాం స్వాదు స్వాదు పదే పదే,
కృతవాన్ కిల వీర్యాణి రామేణ సహ కేశవః.
అతిమర్త్యాని భగవాన్ గూఢః కపటమానుషః,
కలిమాగతమాజ్ఞాయ క్షేత్రేఽస్మిన్ వైష్ణవే వయమ్.
ఆసీనా దీర్ఘసత్రేణ కథాయాం సక్షణా హరేః,
త్వం నః సందర్శితో ధాత్రా దుస్తరం నిస్తితీర్షతామ్.

పొందకలుగుతారో?కూడా చెప్పు. బ్రహ్మజ్ఞానులేకృష్ణలీలాసంకీర్తనంలో నిత్యానందానుభూతి పొందుతారో అట్టి శ్రీకృష్ణుని లీలతో కూడిన కథలు వినాలని మాకుసంపూర్ణంగా ఆసక్తిఉంది. మాకే కాదు పునరావృత్తి రహితమైన మోక్షాన్ని ప్రసాదించే భగవత్కథామృతపానం చెయ్యాలని ఎవరికుండదు గనుక: నువ్వుసర్వమానవతరణోపాయమూ హరిలీలా భూయిష్టమూ అయిన భగవత్కథామృతం మాకు అందించి లోకకల్యాణం ప్రసాదించు.

సూతమహర్షీ తాను భగవంతుడైయుండీ యోగమాయ నాశ్రయించి లీలాగృహీతశరీరుడై లోకాన్ననుసరించి నటించాడు. ద్వాపరాంతంలో అవతరించి కలిప్రవేశించే సమయానికిఅంతర్ధానం మైపోయాడు. కృష్ణుని ఆశ్రయించిన ధర్మం ఆయన అంతర్ధానం చెందాక ఎవరి నాశ్రయించింది. కలియుగ మానవులు ఆ ధర్మాన్ని గ్రహించలేనప్పుడు వారి గతి యేమౌతుంది? నదిని దాటించడానికి నావికుడెట్లు ఆధార మౌతాడో అలానే కలియుగ మానవులను సంసార సముద్రం నుండి దాటించడానికి నువ్వు మహానావికుడవు. నీకంటే యీమానవుల్ని

కలిం సత్త్వహరం పుంసాం కర్ణధార ఇవార్ణవమ్,
బ్రూహి యోగేశ్వరే కృష్ణే బ్రహ్మణ్యే ధర్మవర్మణి.
స్వాం కాష్ఠామధునోపేతే ధర్మః కం శరణం గతః-

తొలింప జేయగలవాడు లేడు. కరుణారసహృదయుడవైన నువ్వు మాసం దేహాన్ని నివారించి కలియుగ మానవ తరుణోపాయం చెప్పు— అని శౌనకాదులు మానంవహించారు.

## 1 అధ్యాయం

ఇతి సంప్రశ్నసంతుష్టో విప్రాణాం రౌమహర్షణిః,
ప్రతిపూజ్య వచస్తేషాం ప్రవక్తుముపచక్రమే.
యం ప్రవ్రజంతమనుపేతమపేతకృత్యం
ద్వైపాయనో విరహకాతర అజుహావ,
పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదుః
స్తం సర్వభూతహృదయం మునిమానతోఽస్మి.
యః స్వానుభావమఖిలశ్రుతిసారమేక
మధ్యాత్మదీపమతితీరషతాం తమోఽంధమ్,
సంసారిణాం కరుణయాహ పురాణగుహ్యం
తం వ్యాససూనుముపయామి గురుం మునీనామ్.
నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్.
మునయః సాధు పృష్టోఽహం భవద్భిర్లోక మంగళమ్,
యత్కృతః కృష్ణసంప్రశ్నో యేనాత్మా సుప్రసీదతి,

శౌనకాదులకు సంశయ నివారణం చేస్తూ కలియుగ మానవ తరుణోపాయం చెప్పడం ఆరంభిస్తున్నాడు సూతమహర్షి :- ఉపనయనం కాకుండానే సన్యాసం తీసుకోవాలనే వాంఛతో సర్వకర్మలనూ త్యజించి బ్రహ్మనిష్ఠుడై వెడుతూ ఉన్న కుమారుని చూచి వియోగదుఃఖితుడైన వేదవ్యాసుడు కుమారా! కుమారా! అని పిలుస్తూఉంటే తన్మయులై వెడుతూన్న శుకుని వైపునుండి ఓ అని వృక్షాలు ప్రతిధ్వనిస్తున్నాయి అట్టి బ్రహ్మవిదుడైన శ్రీశుకునకు నమస్కారము.

స వై పుంసాం పరో ధర్మోయతో భక్తిరధోక్షజే,
అహైతుక్యప్రతిహతా యయాత్మా సుప్రసీదతి.
వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః,
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్.
ధర్మః స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేనకథాసు యః,
నోత్పాదయేద్యది రతిం శ్రమ ఏవ హి కేవలమ్.
శ్రుతమప్యౌపనిషదం దూరే హరికథామృతాత్,
యన్న సంతి ద్రవచ్చిత్తస్వేదాశ్రుపులకోద్గమాః.
ధర్మస్య హ్యాపవర్గ్యస్య నార్థోఽర్థాయోపకల్పతే,
నార్థస్య ధర్మైకాంతస్య కామో లాభాయ హిస్మృతః.
కామస్య నేంద్రియప్రీతిర్లాభో జీవేత యావతా,
జీవస్య తత్త్వజిజ్ఞాసా నార్థో యశ్చేహ కర్మభిః.
వదంతి తత్తత్త్వవిదస్తత్త్వంయచ్ జ్ఞానమవ్యయమ్,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే.

అధ్యాత్మతత్త్వప్రతిపాదకమైన మానవులను సంసార దుఃఖం నుండి విముక్తులనుచేసే సామర్థ్యం కల మహాభాగవతప్రవక్తయైన శుక యోగికి సుమనోంజలులు.

నరనారాయణులకూ సరస్వతీదేవికీ వేదవ్యాసఋషికీ నమస్కరించి జయరూపమైన భాగవతం పఠించాలి. కనుక వారందరకూ నమస్కారాలు.

శౌనకాదులారా! మీరు లోకకల్యాణవాంఛతో అడిగిన ప్రశ్న నాకు చాలా ఆనందం కలిగించింది. మీప్రశ్నలో ఆత్మశుద్ధి కలగడానికి అవకాశం ఉంది. భక్తి జ్ఞాన వైరాగ్యాలు వృద్ధి జెంది మోక్షం కూడా పొందవచ్చు. అనన్యమైన ప్రేమతో కూడిన భక్తి మోక్షసాధనం. భక్తిలేని కర్మలు మోక్షాన్నివ్వలేవు. ధర్మానికిఫలంమోక్షం కాని అర్థం కాదు. అర్థం ధర్మానికి సాధనం కానీ భోగ విలాసాదులకు కాదు. భోగవిలాసాలు జీవనం కొరకే గానీ ఇంద్రియ తృప్తికి కాదు. జీవన ఫలం తత్త్వజిజ్ఞాస. కర్మలకు ఫలం చిత్తశుద్ధి. తత్త్వవేత్తలు జ్ఞాతాజ్ఞేయ

తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞానవైరాగ్యయుక్తయా,
పశ్యంత్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుతగృహీతయా.
అతః పుంభిర్ద్విజశ్రేష్ఠా వర్ణాశ్రమవిభాగశః,
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధిర్హరితోషణమ్.
తస్మాదేకేన మనసా భగవాన్ సాత్వతాంపతిః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః,
యదనుధ్యాసినా యుక్తాః కర్మగ్రంథినిబంధనమ్,
ఛిందంతి కోవిదాస్తస్య కో న కుర్యాత్కథారతిమ్.
శుశ్రూషోః శ్రద్దధానస్య వాసుదేవకథారతిః,
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థనిషేవణాత్.
శృణ్వతాం స్వకథాః కృష్ణ పుణ్యశ్రవణకీర్తనః,
హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్సతామ్.
నష్టప్రాయేష్వభద్రేషు నిత్యం భాగవతసేవయా,
భగవత్యుత్తమశ్లోకే భక్తిర్భవతి నైష్ఠికీ.
తదా రజస్తమోభావాః కామలోభాదయశ్చ యే
చేత ఏతైరనావిద్ధం స్థితం సత్త్వే ప్రసీదతి.

భేదం లేకుండా అద్వితీయమై అఖండమైనజ్ఞానానుభవమే తత్వమన్నారు. దాన్నే కొందరు పరమాత్మ అనీ మరి కొందరు పరబ్రహ్మమనీ కొందరు భగవంతుడనీ అంటున్నారు. భాగవతశ్రవణరూపమైన భక్తి వల్ల ఆత్మానందానుభూతి పొందుతున్నారు మహర్షులు. సర్వవర్ణాశ్రమ ధర్మాలూ మహాభాగవతంలో అంతర్గత మౌతాయి. దృఢమైన కర్మ బంధం విచ్ఛిన్నం కావాలంటే భాగవతం చదవాలి, వినాలి. అంతేకాకుండా కృష్ణసంకీర్తన ధ్యానాలతో భగవంతుని ఆరాధించాలి. భగవచ్చింతన రూపమైన ఖడ్గంచే కర్మబంధాన్ని విచ్ఛిన్నంచేస్తారు విజ్ఞానులు.

శౌనకాదులార తీర్థసేవనవల్ల సత్సాంగత్యమూ దానివల్ల సత్కథాశ్రవణమూ లభించి దానివల్లభక్తివృద్ధిచెందుతుంది. ఆ భక్తుని హృదయంలో భగవంతుడు నిత్యంవాసం చేస్తాడు. ఆ మహాభక్తుడు సర్వపాప విముక్తుడై శ్రీకృష్ణునియందు నిత్యమైన భక్తి వృద్ధి చేసుకుంటూ పునరావృత్తి రహితమైనమోక్షం పొంద కలుగుతాడు.

ఏవం ప్రసన్నమనసో భగవద్భక్తియోగతః,
భగవత్తత్త్వవిజ్ఞానం ముక్తసంగస్య జాయతే.
భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి దృష్ట ఏవాత్మనీశ్వరే.
అతో వై కవయో నిత్యం భక్తిం పరమయా ముదా,
వాసుదేవే భగవతి కుర్వంత్యాత్మప్రసాదనీం.
సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తై-
ర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్య ధత్తే,
స్థిత్యాదయే హరివిరించిహరేతి సంజ్ఞాః
శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనోర్నృణాం స్యుః.
పార్థివాద్దారుణో ధూమస్తస్మాదగ్నిస్త్రయీమయః,
తమసస్తు రజస్తస్మాత్సత్త్వం యద్బ్రహ్మదర్శనమ్.
భేజిరే మునయోఽథాగ్రే భగవంతమధోక్షజమ్,
సత్త్వం విశుద్ధం క్షేమాయ కల్పంతే యే ను తానిహ.
ముముక్షవో ఘోరరూపాన్ హిత్వా భూతపతీం స్తథా,
నారాయణకలాశ్శాంతా భజంతే హ్యనసూయవః.
రజస్తమః ప్రకృతయః సమశీలా భజంతి వై,
పితృభూతప్రజేశాదీన్ శ్రియైశ్వర్యప్రజేప్సవః.

పరమాత్మ ఒక్కడై కూడా ప్రకృతి గుణములైన సత్త్వ రజస్తమో గుణములందు బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకంగా అవతరించి సృష్టి స్థితి లయాలు చేస్తూంటాడు. పృథివీ వికారమైన కాష్ఠం కాష్ఠం కంటే ధూమం ధూమం కంటే అగ్ని శ్రేష్ఠమైనట్లే తమస్సు కంటే రజస్సు రజోగుణం కంటే సత్త్వగుణం శ్రేష్ఠమన్నారు విజ్ఞానులు. సత్త్వగుణాన్ని ఆశ్రయించిన వానికే భగవత్ప్రాప్తి కలుగుతుంది. కనుకనే పూర్వయుగాల్లో మహర్షులు సత్త్వగుణాశ్రయుడైన శ్రీహరినే ఆరాధించి నిత్యానందం అనుభవించేవారు.

మోక్షాసక్తులైన మానవులు పరనింద చేయకుండా క్రూరకర్మలు ఆచరించకుండా ఘోరమైన భైరవాది ఉపాసనలు చేయక సత్త్వమూర్తియైన శ్రీహరినీ, శ్రీహరి సంబంధమైన అంశావతారమూర్తులనూ కళావతారమూర్తులనూ ధ్యానించి పూజిస్తూ మోక్షాన్ని సాధించాలి.

వాసుదేవపరా వేదా వాసుదేవపరా మఖాః,
వాసుదేవపరా యోగా వాసుదేవపరాః క్రియాః.
వాసుదేవపరం జ్ఞానం వాసుదేవపరం తపః,
వాసుదేవపరో ధర్మో వాసుదేవపరా గతిః.
స ఏవేదం ససర్జాగ్రే భగవానాత్మ మాయయా,
సదసద్రూపయా చాసౌ గుణమయ్యాఽ గుణో విభుః
తయా విలసితేష్వేషు గుణేషు గుణవానివ,
అన్తః ప్రవిష్ట ఆభాతి విజ్ఞానేన విజృమ్భితః.
యథా హ్యవహితో వహ్నిర్దారుష్వేకః స్వయోనిషు,
నానేవ భాతి విశ్వాత్మా భూతేషు చ తథా పుమాన్.
అసౌ గుణమయైర్భావైర్భూతసూక్ష్మేంద్రియాత్మభిః,
స్వనిర్మితేషు నిర్విష్టో భుఙ్క్తే భూతేషు తద్గుణాన్.
భావయత్యేష సత్త్వేన లోకాన్ వై లోకభావనః,
లీలావతారానురతో దేవతిర్యఙ్నరాదిషు.

అలాకాకుండా దారా పుత్ర ధనాదుల యందిచ్ఛగలవారై క్షుద్ర దేవ తోపాసనలుచేస్తే జనన మరణ రూపమైన కాలచక్రంలో తిరుగు లాడుతూనే ఉంటారు.

వేదాది సమస్తవిద్యలూ శ్రీకృష్ణ ప్రాప్తి సాధనలనే చెపు తున్నాయి. యోగ, జ్ఞాన, భక్తి తపో దానాదులన్నీ శ్రీకృష్ణపర బ్రహ్మను పొందడానికే సాధనాలు. భగవంతుడు మాయాజగత్తు నందు అనేక నామరూపాలతో భావింపబడుతున్నా అగ్ని ఒకటే అయినా ఉపాదిభేదంచే అనేకాకారులుగా తోచినట్లేఒకడైన పరమాత్మ మాయాకల్పితమైన ఉపాధి భేదాలచేత అనేకాకారాలుగా గోచరిస్తా డేకాని స్వతః సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుడైన భగవానుడు ఒక్కడే. ఆతడే మాయగుణాల నాశ్రయించి ఈభూతాదులనూ చతురశీతిలక్షాత్మకమైన జీవజాలాన్నీ సృష్టించి ఆయాజీవులకు అనువైన విషయ భోగాలను సృష్టించి అనేక రూపాలలో అవతరిస్తూ జీవరాసిని పాలిస్తూ పోషిస్తూ ఉంటాడని చెప్పి ముందుకు సాగుతున్నాడు.

## 2 అ ధ్యా య ం

జగృహే పౌరుషం రూపం భగవాన్మహదాదిభిః,
సంభూతం షోడశకలమాదౌ లోకసిసృక్షయా.
యస్యాంభసి శయానస్య యోగనిద్రాం వితన్వతః,
నాభిహ్రదాంబుజాదాసీద్బ్రహ్మా విశ్వసృజాం పతిః.
యస్యావయవసంస్థానైః కల్పితో లోకవిస్తరః,
తద్వై భగవతో రూపం విశుద్ధం సత్త్వమూర్జితమ్.
పశ్యంత్యదో రూపమదభ్రచక్షుషా సహస్రపాదోరుభుజాననాద్భుతమ్,
సహస్రమూర్ధశ్రవణాక్షినాసికం సహస్రమౌళ్యంబరకుండలోల్లసత్.
ఏతన్నానావతారాణాం నిధానం బీజమవ్యయం,
యస్యాంశాంశేన సృజ్యంతే దేవతిర్యఙ్నరాదయః.
స ఏవ ప్రథమం దేవః కౌమారం సర్గమాస్థితః,
చచార దుశ్చరం బ్రహ్మా బ్రహ్మచర్యమఖండితం.
ద్వితీయం తు భవాయాస్య రసాతలగతాం మహీం,
ఉద్ధరిష్యన్నుపాదత్త యజ్ఞేశః సౌకరం వపుః.
తృతీయమృషిసర్గం వై దేవర్షిత్వముపేత్య సః
తంత్రం సాత్వతమాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః.
తుర్యే ధర్మకలాసర్గే నరనారాయణావృషీ
భూత్వా శమదమోపేతమకరోద్దుశ్చరం తపః.

విజ్ఞానులారా: భగవానునికి లోకాలను సృష్టించాలనే ఇచ్ఛ కలిగింది. మహత్తత్త్వాదులతో నిష్పన్నమైన పురుషాకారం ధరించాడు. ఆ రూపం దశేంద్రియాలూ మనస్సూ భూతపంచకం వీనితో కూడి ఉంటుంది. ఇవి మొత్తం పదహారు. వీనికే షోడశ కళలని పేరు. ఈపదహారు కళలతో కూడినవాడు గనుకనే ఆయన షోడశ కళా పరిపూర్ణుడు. అతడే శ్రీహరి. ఆయన కారణ జలమందు యోగనిద్రాపరవశుడై యుండగా ఆయన నాభినుండి కమలంపుట్టింది. ఆకమలంనుండి చతుర్ముఖుడు ఆవిర్భవించాడు. విరాట్పురుషుడైన శ్రీహరి అవయవాల నుండే సర్వలోకాలూ ఆవిర్భవించాయి. సర్వలోకకారణమైన ఆరూపం సత్వగుణ ప్రధానమైనది. ఆరూపాన్నే వేలకొలది శిరస్సులూ కన్నులూ పాదములూ హస్తములూ కలదిగా కిరీట హార కేయూరాది భూషణ భూషిత మైనదిగా అభివర్ణించి ధ్యానిస్తారు పరమయోగులు. అతడే

పంచమః కపిలో నామ సిద్ధేశః కాలవిప్లుతమ్,
ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామవినిర్ణయమ్.
షష్ఠమత్రేరపత్యత్వం వృతః ప్రాప్తోఽనసూయయా,
ఆన్వీక్షికీమలర్కాయ ప్రహ్లాదాదిభ్య ఊచివాన్.
తతః సప్తమ ఆకూత్యాం రుచేర్యజ్ఞోఽభ్యజాయత,
స యామాద్యైః సురగణైరపాత్స్వాయంభువాంతరమ్.
అష్టమే మేరుదేవ్యాం తు నాభేర్జాత ఉరుక్రమః,
దర్శయన్ వర్త్మ ధీరాణాం సర్వాశ్రమనమస్కృతమ్,
ఋషిభిర్యాచితో భేజే నవమం పార్థివం వపుః,
దుగ్ధేమామోషధీర్విప్రాస్తేనాయం స ఉశత్తమః.
రూపం స జగృహే మాత్స్యం చాక్షుషోదధిసంప్లవే,
నావ్యారోప్య మహీమయ్యామపాద్వైవస్వతం మనుమ్.
సురాసురాణాముదధిం మథ్నతాం మందరాచలమ్,
దధ్రే కమఠరూపేణ పృష్ఠ ఏకాదశే విభుః.
ధాన్వంతరం ద్వాదశమం త్రయోదశమ మేవ చ,
అపాయయత్సురానన్యాన్మోహిన్యా మోహయన్ స్త్రియా.
చతుర్దశం నారసింహం బిభ్రద్దైత్యేంద్రమూర్జితమ్,
దదార కరజైరూరావేరకాం కటకృద్యథా.

ఆదినారాయణుడు. ఆనారాయణుని యందే సమస్త చరాచరప్రపంచం సృష్టింప బడుతుంది. నారాయణుడే సనక సనందన సనత్కుమార సనత్సుజాత నామాలతో అవతరించి అఖండ బ్రహ్మచర్యాన్ని అవలంబించాడు. భూమిని ఉద్ధరించడానికి వరాహరూపం ధరించాడు. పాంచరాత్రాగమ ప్రచారానికి నారదావతారం ఎత్తాడు. మనోనిగ్రహప్రతిష్ఠాపనకోసం నరనారాయణ రూపాల్లో అవతరించాడు. సాంఖ్యయోగ ప్రతిష్ఠాపకుడుగా కపిలుడై అవతరించాడు. దత్తాత్రేయుడై అవతరించి ప్రహ్లాద అలర్కులకు వేదాంతం ఉపదేశించేశాడు. ఆకూతి యందు రుచిప్రజాపతికి యజ్ఞుడై అవతరించి యమాదులైన తనపుత్రులతో కూడి స్వాయంభువ మన్వంతరాన్ని రక్షించాడు. నాభికి మేరుదేవియందు ఋషభుడై అవతరించి పరమహంస తత్వం ఋషులకు చెప్పి పృథుచక్రవర్తిగా అవతరించి పృథివిని సర్వసస్య సమృద్ధం చేశాడు. చాక్షుష

పంచదశం వామనకం కృత్వాఽగాదధ్వరం బలేః,
పదత్రయం యాచమానః ప్రత్యాదిత్సుస్త్రివిష్టపమ్.
అవతారే షోడశమే పశ్యన్ బ్రహ్మద్రుహో నృపాన్,
త్రిస్సప్తకృత్వః కుపితో నిఃక్షత్రామకరోన్మహీమ్.
తతః సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్,
చక్రే వేదతరోః శాఖా దృష్ట్వా పుంసోఽల్పమేధసః.
నరదేవత్వమాపన్నః సురకార్యచికీర్షయా,
సముద్రనిగ్రహాదీని చక్రే వీర్యాణ్యతః పరమ్.
ఏకోనవింశే వింశతిమే వృష్ణిషు ప్రాప్య జన్మని,
రామకృష్ణావితి భువో భగవానహరద్భరమ్.
తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్,
బుద్ధో నామ్నాఽజనసుతః కీకటేషు భవిష్యతి.
అథాసౌ యుగసంధ్యాయాం దస్యుప్రాయేషు రాజసు,
జనితా విష్ణుయశసో నామ్నా కల్కిర్జగత్పతిః.
అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధేర్ద్విజాః,
యథాఽవిదాసినః కుల్యాః సరసః స్యుః సహస్రశః.
ఋషయో మనవో దేవా మనుపుత్రా మహౌజసః,
కలాః సర్వే హరేరేవ సప్రజాపతయః స్మృతాః.

మన్వంతరాంతంలో మత్స్యావతారమెత్తి పృథివీరూపమైన నౌకలో వైవస్వత మన్వాదులను ఉంచి కాపాడాడు. అమృత మథన కాలంలో కూర్మరూపంతో మందర పర్వతాన్నెత్తి ధన్వంతరి రూపంలో అమృత హస్తుడై అవతరించాడు. అంతేగాక మోహినీ రూపంతో దేవతలకు అమృతం ప్రసాదించాడు. నరహరిగా అవతరించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించి వామనావతారంలో బలిని బంధించి స్వర్గాన్ని ఇంద్రునికిచ్చి పరశురామ రూపంలో దుష్టక్షత్రియులను శిక్షించి ధర్మాన్ని రక్షించాడు. వ్యాసుడై అవతరించి శ్రుతి పురాణేతిహాసాలు వ్యాప్తిచేసి లోకాలను ఉద్ధరించి రామావతారుడై రావణాది దుష్టసంహారంచేసి ధర్మసంస్థాపన గావించాడు. బలరామకృష్ణులై అవతరించి భూభారాన్ని హరించాడు. జినపుత్రుడై బుద్ధనామముతో దేవద్వేషులను మోహింపజేసి ఆసురీ సంపత్తులను నశింపజేశాడు. కలి

ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్స్వయమ్,
ఇంద్రారివ్యాకులం లోకం మృడయంతి యుగే యుగే.
జన్మ గుహ్యం భగవతో య ఏతత్ప్రయతో నరః,
సాయం ప్రాతర్గృణన్ భక్త్యా దుఃఖగ్రామాద్విముచ్యతే.
ఏతద్రూపం భగవతో హ్యరూపస్య చిదాత్మనః,
మాయాగుణైర్విరచితం మహదాదిభిరాత్మని.
యథా నభసి మేఘౌఘో రేణుర్వా పార్థివోఽనిలే,
ఏవం ద్రష్టరి దృశ్యత్వమారోపితమబుద్ధిభిః.
అతః పరం యదవ్యక్త మవ్యూఢగుణబృంహితమ్.
అదృష్టాశ్రుతవస్తుత్వా త్స జీవో యత్పునర్భవః.
యత్రేమే సదసద్రూపే ప్రతిసిద్ధే స్వసంవిదా;
అవిద్యయాఽఽత్మని కృతే ఇతి తద్బ్రహ్మదర్శనమ్.
యద్యేషోపరతా దేవీ మాయా వైశారదీ మతిః,
సంపన్న ఏవేతి విదుర్మహిమ్ని స్వే మహీయతే.
ఏవం జన్మాని కర్మాణి హ్యకర్తురజనస్య చ,
వర్ణయంతి స్మ కవయో వేదగుహ్యాని హృత్పతేః.
స వా ఇదం విశ్వమమోఘలీలః సృజత్యవత్యత్తి న సజ్జతేఽస్మిన్.
భూతేషు చాంతర్హిత ఆత్మతంత్రః షాడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః.

యుగాంతంలో దొంగలే ప్రభువులై ప్రజలను పీడిస్తూ ఉంటే కలికి రూపంగా అవతరించి దుష్టులను శిక్షించి ధర్మసంస్థాపన చేస్తాడు.

శౌనకాదుల్లారా! అగాధమైన సరస్సునుండి చిన్న చిన్న కాలువలు పుట్టినట్లే తత్త్వనిధియైన శ్రీహరినుండి అంశావతారాలూ కళావతారాలూ జనించడమే గాకుండా దేవతలూ మనువులూ ఋషులూ మొదలైన శక్తిసంపన్నులందరూ అవతరించి లోక కల్యాణ కారకులౌతూ ఉంటారు. కృష్ణావతారం పూర్ణావతారం. మిగిలినవన్నీ అంశావతారములే. జీవులకు బాధలు కలిగినప్పుడల్లా ఏదో ఒక రూపంలో అవతరించి రక్షిస్తూ ఉంటాడు. గోప్యమైన ఈ హరిచరిత్ర సంధ్యాకాలాల్లో చదివినా విన్నా సమస్త దుఃఖాలు నశిస్తాయి. రూపరహితుడైన శ్రీహరియందు ఈరూపాలన్నీ మాయచేత కల్పింపబడతాయి. అజ్ఞానులు సత్యాన్ని గ్రహించలేక వాయువు నాశ్రయించిన మేఘాలు

నచాస్య కశ్చిన్నిపుణేన ధాతురవైతి జంతుః కుమనీష ఊతీః,
నామాని రూపాణి మనోవచోభిః సంతన్వతో నటచర్యామివాజ్ఞః,
స వేద ధాతుః పదవీం పరస్య దురంతవీర్యస్య రథాంగపాణేః,
యో మాయయా సంతతయాఽనువృత్త్యా భజేత తత్పాదసరోజగంధమ్.
అథేహ ధన్యా భగవంత ఇత్థం యద్వాసుదేవేఽఖిలలోకనాథే,
కుర్వంతి సర్వాత్మకమాత్మభావం న యత్ర భూయః పరివర్త ఉగ్రః.
ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్,
ఉత్తమశ్లోక చరితం చకార భగవానృషిః.
నిఃశ్రేయసాయ లోకస్య ధన్యం స్వస్త్యయనం మహత్,
తదిదం గ్రాహయామాస సుతమాత్మవతాం వరమ్,
సర్వవేదేతిహాసానాం సారం సారం సముద్ధృతమ్,
స తు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్.
ప్రాయోపవిష్టం గంగాయాం పరీతం పరమర్షిభిః,
తత్ర కీర్తయతో విప్రా విప్రర్షేర్భూరితేజసః.
అహం చాధ్యగమం తత్ర నివిష్టస్తదనుగ్రహాత్,
సోఽహం వః శ్రావయిష్యామి యథాధీతం యథామతి.

ఆకాశాశ్రయాలని భావించినట్లే మాయాశ్రయమైన జగత్తును పరమాత్మయందు ఆరోపిస్తూ ఉంటారు. స్థూల సూక్ష్మ శరీరాదులు ఆత్మయందారోపించడం అజ్ఞానంగాని వాస్తవంగాదు. ఆత్మసాక్షాత్కారం కలిగితే ఈఆరోపణలన్నీ పోయి బ్రహ్మానందానుభూతి పొందకలుగుతాడు. బుద్ధిరూపమైన మాయ నశిస్తే జీవుడు ఆనందమయుడౌతాడు. పరమాత్మయందు జన్మ కర్మలు లేవు. అతని లీలలన్నీ వేదరహస్యాలు. భగవంతుని లీలలే సృష్టిస్థితి లయాలు. అతడు నియంత. అజ్ఞానులు భగవంతుని లీలలు గ్రహించలేరు.

అనంతుడైన ఈశ్వరుడు అఖిలాండ కోట్లను సృష్టించి వీటన్నిటికంటె పరమైనవాడుగానే ఉంటాడు. కపటంలేకుండా భగవంతుని సేవించేవాని కీలీలలు అర్థమౌతాయి. మీరట్టివారే. మీరు కాల చక్రంలో ప్రవేశించరు. వేదవ్యాస రచితమై శ్రీశుకునిచే పరీక్షిన్మహారాజుకు గంగాతీరంలో వినుపింప బడిన సర్వ విద్యాసారమూ భవ

కృష్ణే స్వధామోపగతే ధర్మజ్ఞానాదిభిః సహ,
కలౌ నష్టదృశామేష పురాణార్కోఽధునోదితః.

బంధవిమోచన సాధనమూ ఐన భాగవతం వినిపిస్తాను వినండి- అని సూతమహర్షి కథాప్రస్థానంలో అడుగుపెడు తున్నాడు.

౪ అధ్యాయం

ఇతి బ్రువాణం సంస్తూయ మునీనాం దీర్ఘసత్రిణామ్,
వృద్ధః కులపతిః సూతం బహ్వృచః శౌనకోఽబ్రవీత్.
సూత సూత మహాభాగ వద నో వదతాం వర,
కథాం భాగవతీం పుణ్యాం యదాహ భగవాన్ శుకః.
కస్మిన్ యుగే ప్రవృత్తేయం స్థానే వా కేన హేతునా,
కుతః సంచోదితః కృష్ణః కృతవాంత్సంహితాం మునిః.
తస్య పుత్రో మహాయోగీ సమదృఙ్నిర్వికల్పకః,
ఏకాంతమతిరున్నిద్రో గూఢో మూఢ ఇవేయతే.
కథమాలక్షితః పౌరైః సంప్రాప్తః కురుజాంగలాన్,
ఉన్మత్తమూకజడవద్విచరన్ గజసాహ్వయే.
దృష్ట్వానుయాంతమృషిమాత్మజమప్యనగ్నం
దేవ్యో హ్రియా పరిదధుర్న సుతస్య చిత్రమ్,
తద్వీక్ష్య పృచ్ఛతి మునౌ జగదుస్తవాస్తి
స్త్రీపుంభిదా న తు సుతస్య వివిక్తదృష్టేః.
కథం వా పాండవేయస్య రాజర్షేర్మునినా సహ,
సంవాదః సమభూత్తాత యత్రైషా సాత్వతీ శ్రుతిః.

సూతమహర్షీ: మీరు వక్తలలో సర్వశ్రేష్ఠులు. శుకునిచేత పరీక్షిన్మహారాజుకు ఉపదేశింపబడ్డ భాగవతకథ మాకు చెప్పండి. ఆ కథ ఏ యుగంలో ఏ కారణంచేత యే స్థానంలో ప్రవృత్త మైంది? ఎవరి ప్రేరణచేత కృష్ణద్వైపాయనుడు భాగవతం రచించాడు. సర్వసమదర్శీ పరమయోగీ బ్రహ్మానుసంధాతా ఐన శ్రీశుకుడు గోదోహనకాలంకంటే జనపదంలో ఉండడే? భాగవతం వినిపించేవరకూ పరీక్షిత్తు దగర ఎలా ఉన్నాడు. ఉపనయనం కాకుండానే సన్యాసియై-

స గోదోహనమాత్రంహి గృహేషు గృహమేధినామ్,
అవేక్షతే మహాభాగస్తీర్థీకుర్వం స్తదాశ్రమం.
అభిమన్యుసుతం సూత ప్రాహుర్భాగవతోత్తమం,
తస్య జన్మ మహాశ్చర్యం కర్మాణి చ గృణీహి నః.
స సమ్రాట్ కస్య వా హేతోః పాండూనాం మానవర్ధనః,
ప్రాయోపవిష్టో గంగాయామనాదృత్యాధిరాట్ఛ్రియం.
నమంతి యత్పాదనికేతమాత్మనశ్శివాయ చానీయ ధనాని శత్రవః,
కథం స వీరః శ్రియమంగదుస్త్యజాం యువైషతో త్స్రష్టుమహో సహాసుభిః.
శివాయ లోకస్య భవాయ భూతయే య ఉత్తమశ్లోకపరాయణా నరాః,
జీవంతి నాత్మార్థమసౌ పరాశ్రయం ముమోచ నిర్విద్య కుతః కళేబరం.
తత్సర్వం నః సమాచక్ష్వ పృష్టో యదిహ కించన,
మన్యే త్వాం విషయే వాచాం స్నాతమన్యత్ర ఛాందసాత్.
ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే,
జాతః పరాశరాద్యోగీ వాసవ్యాం కలయా హరేః.
స కదాచిత్సరస్వత్యా ఉపస్పృశ్య జలం శుచి,
వివిక్త ఏక ఆసీన ఉదితే రవిమండలే
పరావరజ్ఞః స ఋషిః కాలేనావ్యక్తరంహసా,
యుగధర్మవ్యతికరం ప్రాప్తం భువి యుగే యుగే,

వెళుతూంటే వివస్త్రలై స్నానం చేస్తూకూడా శుకుణ్ణిచూచి స్త్రీలు సిగ్గుచెందలేదు. అదే సమయంలో వ్యాసుని చూచి సిగ్గుపడి వస్త్రాలు ధరించడమే కాకుండా ఇదేమని అడిగితే శుకుడు సర్వాత్మభావం కలవాడవడం వల్ల తమకు సిగ్గు కలగలేదనీ నీకు భేదదృష్టి ఉండడంచేత మేం వస్త్రాలు ధరించామనీ కదా చెప్పారు. ఉన్మత్త బధిర జడ లక్షణాలతో ఉన్న శ్రీశుకుని మహారాజు ఎలా గ్రహించ కలిగాడు. పరీక్షిత్తుయొక్క జన్మ కర్మ లెలాంటివి. పరీక్షిన్మహారాజు రాజ్యాన్ని ఎందుకు త్యజించాడు. గంగాతీరంలో ఎందుకున్నాడు. సర్వం తెలిసిన నువ్వు మాకివన్నీ సవిస్తరంగా చెప్పు – అని శౌనకుడు కోరగా సూతుడు చెప్పడం ఆరంభించాడు.

వైవస్వతమన్వంతరంలో ఇరవైఏడు మహాయుగాలు గతించి ఇరవైయెనిమిదవమారు చతుర్యుగ పరిభ్రమణం జరుగడంలో కృత

భౌతికానాం చ భావానాం శక్తిహ్రాసం చ తత్కృతం,
అశ్రద్దధానాన్ నిఃసత్త్వాన్ దుర్మేధాన్ హ్రసితాయుషః.
దుర్భగాంశ్చ జనాన్వీక్ష్య మునిర్దివ్యేన చక్షుషా,
సర్వవర్ణాశ్రమాణాం యద్దధ్యౌ హితమమోఘదృక్.
చాతుర్హోత్రం కర్మ శుద్ధం ప్రజానాం వీక్ష్య వైదికం,
వ్యదధాద్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధం.
ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాశ్చత్వార ఉద్ధృతాః,
ఇతిహాసః పురాణం చ పంచమో వేద ఉచ్యతే.
తత్రర్గ్వేదధరః పైలః సామగో జైమినిః కవిః
వైశంపాయన ఏవైకో నిష్ణాతో యజుషాం గణే.
అథర్వాంగిరసామాసీత్సుమంతుర్దారుణో మునిః,
ఇతిహాసపురాణానాం పితా మే రోమహర్షణః.
త ఏవ ఋషయో వేదం స్వంస్వం వ్యస్యన్ననేకధా,
శిష్యైః ప్రశిష్యైస్తచ్ఛిష్యైర్వేదాస్తే శాఖినోఽభవన్.
త ఏవ వేదా దుర్మేధైర్ధార్యంతే పురుషైర్యథా,
ఏవం చకార భగవాన్వ్యాసః కృపణవత్సలః.

త్రేతలు సమాప్తమై ద్వాపరాంతం సమీపించినప్పుడు కళావతారంగా వేదవ్యాసు డావిర్భవించి సరస్వతీనదీ తీరంలో ఆశ్రమం కల్పించుకొని తపస్సు సాగించి సర్వజ్ఞుడై కాలాన్నిగుర్తించి రాబోయే కలియుగాన్ని దివ్యదృష్టితో చూశాడు. ఆయుగ లక్షణాలన్నీ ప్రమాదంగానే కనిపించాయి. అందులో ప్రధానంగా అల్పమైన ఆయుర్దాయం అత్యల్పమైన మేధకల మానవులు దురాచారులై చరించడం సమస్తవస్తువులూ నిస్సారమై పోవడం, వేదబాహ్యులై శ్రద్ధాభక్తులు నశించి కామాసక్తులై మానవులు కాలాన్ని వృధా చెయ్యడం ప్రధానలక్షణాలుగా మానవులు సర్వవిధాలా భ్రష్టులై పోతారని గ్రహించి అవతారమూర్తియైన వేదవ్యాసుడు ఏకరాశిగా ఉన్న వేదాన్ని విభాగించి పైల జైమిని సుమంత వైశంపాయనులకు ఉపదేశించాడు. వారు ఒక్కొక్క శాఖను అనేక ఉపశాఖలుగా విభాగించి అనేకులకు చెప్పారు. శాఖోప శాఖలుగా వేదం వ్యాప్తిచెందినా వ్యాసుడు తృప్తిచెందక

స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా.
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవేదిహ.
ఇతి భారతమాఖ్యానం కృపయా మునినా కృతం,
ఏవం ప్రవృత్తస్య సదా భూతానాం శ్రేయసి ద్విజా
సర్వాత్మకేనాపి యదా నాతుష్యద్ధృదయం తతః,
నాతిప్రసీదద్ధృదయః సరస్వత్యాస్తటే శుచౌ.
వితర్కయన్వివిక్తస్థ ఇదం చోవాచ ధర్మవిత్,
ధృతవ్రతేన హి మయా ఛందాంసి గురవోఽగ్నయః.
మానితా నిర్వ్యళీకేన గృహీతం చానుశాసనం,
భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రదర్శితః.
దృశ్యతే యత్ర ధర్మాది స్త్రీశూద్రాదిభిరప్యుత,
తథాపి బత మే దైహ్యో హ్యాత్మా చైవాత్మనా విభుః.
అసంపన్న ఇవాభాతి బ్రహ్మవర్చస్యసత్తమః,
కింవా భాగవతా ధర్మా న ప్రాయేణ నిరూపితాః.
ప్రియాః పరమహంసానాం త ఏవ హ్యచ్యుతప్రియాః,
తస్యైవం ఖిలమాత్మానం మన్యమానస్య ఖిద్యతః.
కృష్ణస్య నారదోఽభ్యాగాదాశ్రమం ప్రాగుదాహృతమ్,
తమభిజ్ఞాయ సహసా ప్రత్యుత్థాయాగతం మునిః.
పూజయామాస విధివన్నారదం సురపూజితమ్.

పురాణాలు రచించి సూత వైశంపాయనులకు ఉపదేశించాడు. పంచమ వేదమే అనదగిన మహాభారతం రచించి సర్వజనీనంగా మోక్షమార్గం వెల్లడించాడు. అయినా వ్యాసునికి మనశ్శాంతికలుగలేదు.

పరమహంసలకు సైతం ప్రియమైన భగవత్తత్వ నిరూపితమైన గ్రంథమేదీ వ్రాయకపోవడంవల్లనే ఈ అశాంతి కలుగుతూన్నదని ఖిన్నుడై సరస్వతీ నదీతీరంలో వటవృక్షచ్ఛాయలో కూర్చున్న వ్యాసుని దగ్గరకు దేవర్షి నారదుడు రాగా అర్ఘ్య పాద్యాదులచే పూజించి సుఖాసనమిచ్చాడు వేదవ్యాసుడు.

## 4 అ ధ్యా య ం

అథ తం సుఖమాసీనముపాసీనం బృహచ్ఛ్రవాః,
దేవర్షిః ప్రాహ విప్రర్షిం వీణాపాణిః స్మయన్నివ.
పారాశర్య మహాభాగ భవతః కచ్చిదాత్మనా,
పరితుష్యతి శారీర ఆత్మా మానస ఏవ వా.
జిజ్ఞాసితం సుసంపన్నమపి తే మహదద్భుతం,
కృతవాన్ భారతం యస్త్వం సర్వార్థపరిబృంహితం.
జిజ్ఞాసితమధీతం చ బ్రహ్మ యత్తత్సనాతనమ్,
తథాపి శోచస్యాత్మానమకృతార్థ ఇవ ప్రభో.
అస్త్యేవ మే సర్వమిదం త్వయోక్తం తథాపి నాత్మా పరితుష్యతే మే.
తన్మూలమవ్యక్తమగాధబోధం పృచ్ఛామహే త్వాత్మభవాత్మభూతం.
స వై భవాన్ వేద సమస్తగుహ్యముపాసితో యత్పురుషః పురాణః,
పరావరేశో మనసైవ విశ్వం సృజత్యవత్యత్తి గుణైరసంగః.
త్వం పర్యటన్నర్క ఇవ త్రిలోకీమంతశ్చరో వాయురివాత్మసాక్షీ,
పరావరే బ్రహ్మణి ధర్మతో వ్రతైః స్నాతస్య మే న్యూనమలం విచక్ష్వ.
భవతానుదితప్రాయం యశో భగవతోఽమలమ్,
యేనైవాసౌ న తుష్యేత్తు మన్యే తద్దర్శనం ఖిలమ్.

నారదుడు సుఖాసీనుడై చిరునవ్వుతో వేదవ్యాస మహర్షీ మీరు సర్వజ్ఞులు. చతుర్వేద సారభూతమైన మహాభారతం పురాణోపపురాణాలూ రచించారు. వేదవిభాగం చేసినమహాపురుషులు. అటువంటి మీరు ఖిన్నవదనంతో ఉండటానికి కారణ మేమిటి? విచారమనేది మీవంటి జ్ఞానులకు తగునా అని ప్రశ్నించగా వేద వ్యాసుడు పలుకుతున్నాడు.

నారదమునీంద్రా! మీరు చెప్పిన దంతాసత్యమే. వేదవిభాగం, చేసి పురాణోపపురాణాలు రచించి వేదసారమైన మహాభారతం రచించినా నాకు మనశ్శాంతి కలుగలేదు. పూర్ణానందమూ పొందలేక పోతున్నాను. దానికి కారణం నాకర్థం కావటంలేదు. ఋషిపుంగవా! మీరు సర్వజ్ఞులూ బ్రహ్మమానస పుత్రులూ భగవద్భక్తులు అవడంవల్ల మీకు తెలియనిదేమీ ఉండదు. మీరు మూడు లోకాలూ తిరుగుతూ ఉంటారు. భగవత్తత్వాన్ని గ్రహించిన వారిలో అగ్రేసరులు మీరే.

యథా ధర్మాదయశ్చార్థా మునివర్యానువర్ణితాః,
న తథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః.
న యద్వచశ్చిత్రపదం హరేర్యశో । జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్,
తద్వాయసం తీర్థముశంతి మానసా । న యత్ర హంసా విరమంత్యుశిక్షయాః.
తద్వాగ్విసర్గో జనతాఘవిప్లవో యస్మిన్ ప్రతిశ్లోక మబద్ధవత్యపి,
నామాన్యనన్తస్య యశోఽఙ్కితాని యచ్ఛృణ్వన్తి గాయన్తి గృణన్తిసాధవః.
నైష్కర్మ్యమప్యచ్యుతభావవర్జితం న శోభతే జ్ఞానమలం నిరంజనమ్,
కుతః పునశ్శశ్వదభద్రమీశ్వరే న చార్పితం కర్మ యదప్యకారణమ్.
అతో మహాభాగ భవానమోఘదృక్శుచిశ్రవాః సత్యరతో ధృతవ్రతః,
ఉరుక్రమస్యాఖిలబంధముక్తయే సమాధినానుస్మర యద్విచేష్టితమ్.
తతోఽన్యథా కించన యద్వివక్షతః పృథగ్దృశస్తత్కృతరూపనామభిః,
న కర్హి చిత్క్వాపి చ దుఃస్థితా మతిర్లభేత వాతాహతనౌరివాస్పదమ్.
జుగుప్సితం ధర్మకృతేఽనుశాసతః స్వభావరక్తస్య మహాన్ వ్యతిక్రమః,
యద్వాక్యతో ధర్మ ఇతీతరః స్థితో న మన్యతే తస్య నివారణం జనః.
విచక్షణః కోఽర్హతి వేదితుం విభోరనంతపారస్య నివృత్తితః సుఖమ్,
ప్రవర్తమానస్య గుణైరనాత్మనస్తతో భవాన్ దర్శయ చేష్టితం విభోః.

యోగబలంతో సర్వ జీవ హృదయాల్లో అంతర్యామి రూపంలో ఉంటూ సర్వసాక్షిగా ఉండేవారు మీరే. శ్రీహరికీ మీకూ అవినా భావ సంబంధం ఉంది, కనక మోక్షాసక్తి గల మానవులకు మీ దర్శనం మోక్షసాధన మాతుంది. నేను యోగసాధనవల్ల శబ్ద బ్రహ్మాలను గుర్తించి కూడా పూర్ణానందం పొందలేక పోవడానికి కారణమేమో గుర్తించి చెప్పండి – అని అడిగాడు. నారదుడు నిమీలితలోచనుడై ఆలోచించి చెప్పడం ఆరంభించాడు.

వ్యాసమునీంద్రా, మీ రింతవరకూ వ్రాసిన గ్రంథాలూ చేసిన కృషీ ధర్మార్థకామాలకు సంబంధించినదే. కాని కేవల మోక్షసాధన మైన భగవద్గుణాను కీర్తన రూపమైన గ్రంథం ఏమీ వ్రాయలేదు. అందువల్లనే మీకు పూర్ణానందం కలగడంలేదు. ప్రపంచ సంబంధమైన వర్ణనలెన్ని చేసినా నిరతిశయానందాన్ని ప్రసాదించలేవు. శ్రీహరి లీలాభూయిష్ఠమైన గ్రంథమే నిరతిశయాన్ని వ్వగల్గుతుంది.

త్యక్త్వా స్వధర్మం చరణాంబుజం హరేర్భజన్నపక్వోఽథ పతేత్తతో యది,
యత్ర క్వవా భద్రమభూదముష్యకిం కో వార్థఆప్తోఽభజతాం స్వధర్మతః.
తస్యైవ హేతోః ప్రయతేత కోవిదో న లభ్యతే యద్భ్రమతాముపర్యధః,
తల్లభ్యతే దుఃఖవదన్యతస్సుఖంకాలేన సర్వత్ర గభీరరంహసః.
న వై జనో జాతు కథంచనావ్రజేన్ముకుందసేవ్యన్య వదంగ సంసృతిం,
స్మరన్ ముకుందాంఘ్ర్యుపగూహనం పునర్విహాతుమిచ్ఛేన్నరసగ్రహోజనః.
ఇదం చ విశ్వం భగవానివేతరోయతోజగత్ స్థాననిరోధసంభవాః,
తద్ధి స్వయం వేద భవాంస్తథాపి మే ప్రాదేశమాత్రం భవతః ప్రదర్శితం.
త్వమాత్మనాత్మాన మవేహ్యమోఘదృక్పరస్య పుంసః పరమాత్మనః కలాం.
అజం ప్రజాతం జగతశ్శివాయ తన్మహానుభావాభ్యుదయోఽధిగణ్యతాం.
ఇదం హి పుంసస్తపసశ్శ్రుతస్య స్విష్టస్య సూక్తస్య సుబుద్ధిదత్తయోః,
అవిచ్యుతోఽర్థః కవిభిర్నిరూపితో యదుత్తమశ్లోకగుణానువర్ణనం.
అహంపురాతీతభవేఽభవం మునే దాస్యాస్తు కస్యాశ్చన వేదవాదినాం,
నిరూపితో బాలక ఏవ యోగినాం శుశ్రూషణే ప్రావృషి నిర్వివక్షతాం.
తే మయ్యపేతాఖిలచాపలేఽర్భకే దాంతేఽధృతక్రీడన కేఽనువర్తిని,
చక్రుః కృపాంయద్యపితుల్యదర్శనాః శుశ్రూషమాణేమునయోఽల్పభాషిణి.

మునీంద్రా పూర్వకల్పంలో నేను దాసీపుత్రుడను. నా తల్లి వేదవిదులైన బ్రాహ్మణులకు దాస్యం చేసేది. వారిచాతుర్మాస్యదీక్షా కాలంలో బాల్యంలో ఉన్న నేను కూడా వారిని సేవిస్తూ ఉండేవాడిని. చాతుర్మాస్యదీక్షాకాలంలో వారి భుక్తశేషం తింటూ భగవంతుని నామాన్నే స్మరిస్తూ వారివల్ల శ్రీకృష్ణతత్వాన్నే వింటూ కాలక్షేపం చేస్తూ ఉన్నాను. భగవన్నామస్మరణ వేదవిదులసేవ కారణంగా నాకు పూర్ణమైన భగవద్భక్తి అలవడింది. సర్వమానవతరుణోపాయమైన హరిభక్తితో కాలంగడుపుతూ ఉండేవాడిని. ఆ బ్రాహ్మణులయందు నాకుగల భక్తిశ్రద్ధలకు వారానందించి దీక్షాసమాప్తిచేసుకొని వారు వెళ్లేసమయంలో నాకు అతిరహస్యమైన జ్ఞానం ఉపదేశించి వెళ్లి-పోయారు. వారుపదేశించిన జ్ఞానంవల్ల నేను భగవంతుని మాయను తెలుసుకోగలిగాను. మాయను గ్రహించిన వానికిపరమ పదప్రాప్తి అతి సునాయాసంగాలభిస్తుంది. కనకనే నేను మాయాకల్పితమైన సంసారంవాంఛను వదలి నిరంతరం శ్రీకృష్ణనామ సంకీర్తనతోనే కాలం

ఉచ్ఛిష్టలేపాననుమోదితో ద్విజైః సకృత్స్మ భుంజే తదపాస్తకిల్బిషః,
ఏవం ప్రవృత్తస్య విశుద్ధచేతసస్తద్ధర్మ ఏవాత్మరుచిః ప్రజాయతే.
తత్రాన్వహం కృష్ణకథాః ప్రగాయతామనుగ్రహేణాశృణవం మనోహరాః
తాశ్శ్రద్ధయా మేఽనుపదం విశృణ్వతః ప్రియశ్రవస్యంగ మమాభవద్రతిః.
తస్మింస్తదా లబ్దరుచేర్మహామతే ప్రియశ్రవస్యస్ఖలితా మతిర్మమ,
యయా మమైతత్సదసత్స్వమాయయా పశ్యేమయి బ్రహ్మణి కల్పితం పరే.
ఇత్థంశరత్ప్రావృషి కావృతూహరేర్విశృణ్వతో మేఽనుసవంయశోఽమలమ్,
సంకీర్త్యమానం మునిభిర్మహాత్మ భిర్భక్తిః ప్రవృత్తాత్మరజస్తమోఽపహా.
తస్యైవం మేఽనురక్తస్య ప్రశ్రితస్య హతైనసః,
శ్రద్దధానస్య బాలస్య దాంతస్యానుచరస్య చ.
జ్ఞానం గుహ్యతమం యత్తత్సాక్షాద్భగవతోదితమ్,
అన్వవోచన్ గమిష్యంతః కృపయా దీనవత్సలాః.
యేనైవాహం భగవతో వాసుదేవస్య వేధసః,
మాయానుభావమవిదం యేన గచ్ఛంతి తత్పదమ్.
ఏతత్సంసూచితం బ్రహ్మంస్తాపత్రయచికిత్సితమ్,
యదీశ్వరే భగవతి కర్మబ్రహ్మణి భావితమ్.

గడపడం మొదలు పెట్టాను. శ్రీహరి భక్తి చేతనే నాకీ జ్ఞానం కలిగింది.

వ్యాసమునీ, సమస్తకర్మలనూ శ్రీకృష్ణుని పేరఅర్పిస్తే తాపత్రయం నశిస్తుంది. ఏ పదార్థం సేవిస్తే వ్యాధిజనిస్తుందో ఆరోగానికి ఆపదార్థమే ఔషధి రూపంలో ప్రయోగిస్తే ఆ వ్యాధి నశించిపోతుంది. అదేవిధంగా యే కర్మలు మానవునికి జనన మరణాలను కల్పిస్తాయో ఆకర్మలే కృష్ణార్పణంచేస్తే నిత్యానందాన్ని ప్రసాదిస్తాయి. ఈ లోకంలో శాస్త్ర విహితమైన కర్మలన్నీ పరాభక్తినే కలిగిస్తాయి. జ్ఞానులు భగవదాజ్ఞాను సారం కర్మలు చేస్తూ మాటిమాటికీ భగవన్నామాన్ని స్మరిస్తూ ఉంటారు. ఓ వాసుదేవా నీకు నమస్కారము మేము నిన్ను ధ్యానిస్తున్నాము. ప్రద్యుమ్న అనిరుద్ధ సంకర్షణాది రూపములకునమస్కారము. అని యీవిధంగా చతుర్వ్యూహ రూపమైన శ్రీహరి రూపాలను నామములద్వారా ప్రాకృతమూర్తిరహితమైన అప్రాకృత మంత్రమూర్తి యగు యజ్ఞపురుషుని ఎవడు పూజిస్తాడో ధ్యానిస్తాడో వాడే యథార్థ

అమయో యశ్చ భూతానాం జాయతే యేన సువ్రత,
తదేవ హ్యామయద్రవ్యం న పునాతి చికిత్సితమ్.
ఏవం నృణాం క్రియాయోగాః సర్వే సంసృతి హేతవః,
త ఏవాత్మవినాశాయ కల్పంతే కల్పితాః పరే.
యదత్ర క్రియతే కర్మ భగవత్పరితోషణం,
జ్ఞానం యత్తదధీనం హి భక్తియోగసమన్వితం.
కుర్వాణా యత్ర కర్మాణి భగవచ్ఛిక్షయా సకృత్,
గృణంతి గుణనామాని కృష్ణస్యానుస్మరంతి చ.
నమో భగవతే తుభ్యం వాసుదేవాయ ధీమహి,
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమస్సంకర్షణాయ చ.
ఇతి మూర్త్యభిధానేన మంత్రమూర్తిమమూర్తికం,
యజతే యజ్ఞపురుషం స సమ్యగ్దర్శనః పుమాన్.
ఇమం స్వనిగమం బ్రహ్మన్నవేత్య మదనుష్ఠితమ్,
అదాన్మే జ్ఞానమైశ్వర్యం స్వస్మిన్ భావం చ కేశవః.
త్వమప్యదభ్రశ్రుత విశ్రుతం విభోః సమాప్యతే యేన విదాం బుభుత్సితః
ప్రాఖ్యాహి దుఃఖైర్ముహురర్దితాత్మనాం సంక్లేశనిర్వాణముశంతి నాన్యథా.

మైన జ్ఞానం కలవాడు. నేనెప్పుడైతే భగవంతుని ఆజ్ఞను పాలించానో అప్పుడే శ్రీకృష్ణుడు నాకు ఆత్మజ్ఞానం ప్రసాదించి ఐశ్వర్యం భావరూప మైన భక్తి ప్రసాదించాడు. కనుక నువ్వు భగవద్భక్తితో శ్రీహరి లీలలే వర్ణించు. దానివల్ల జ్ఞానులయొక్క జిజ్ఞాస పూర్తి ఔతుంది. మానవుల సర్వదుఃఖాలు నశించి నిరతిశయానందం పొందడానికి ఇంత కంటె వేరు మార్గం లేదు. నువ్వు భగవంతుని గుణాను కీర్తన రూప మైన గ్రంథం వ్రాసి ఆత్మ కళ్యాణంతో లోకకళ్యాణం సాధించు అన్నాడు నారదమహర్షి.

## 5 అధ్యాయం

ఏవం నిశమ్య భగవాన్ దేవర్షేర్జన్మ కర్మ చ,
భూయః పప్రచ్ఛతం బ్రహ్మన్ వ్యాసస్సత్యవతీసుతః.

నారదుని జన్మ కర్మ సంబంధమైన వృత్తాంతం విని వేదవ్యాసుడు నారదునితో – దేవర్షి మీకు జ్ఞానోపదేశం చేసిన మహాత్ములు వెళ్ళి

భిక్షుభిర్విప్రవసితే విజ్ఞానాదేష్టృభిస్తవ,
వర్తమానే వయస్యాద్యే తతః కిమకరోద్భవాన్.
స్వాయంభువ కయా వృత్త్యా వర్తితం తే పరం వయః,
కథం చేదముదస్రాక్షీః కాలే ప్రాప్తే కళేబరమ్.
ప్రాక్కల్పవిషయామేతాం స్మృతిం తే సురసత్తమ,
న హ్యేష వ్యవధాత్కాల ఏష సర్వనిరాకృతిః.
భిక్షుభిర్విప్రవసితే విజ్ఞానాదేష్టృభిర్మమ,
వర్తమానే వయస్యాద్యే తత ఏతదకారిషం.
ఏకాత్మజా మే జననీ యోషిన్మూఢా చ కింకరీ,
మయ్యాత్మజేఽనన్యగతౌ చక్రే స్నేహానుబంధనమ్.
సాఽస్వతంత్రా న కల్పాసీద్యోగక్షేమం మమేచ్ఛతీ,
ఈశస్య హి వశే లోకో యోషా దారుమయీ యథా.
అహం చ తద్బ్రహ్మకుల ఊషివాంస్తదపేక్షయా,
దిగ్దేశకాలావ్యుత్పన్నో బాలకః పంచహాయనః.
ఏకదా నిర్గతాం గేహాద్దుహంతీం నిశి గాం పథి,
సర్పోఽదశత్పదా స్పృష్టః కృపణాం కాలచోదితః.

పోయాక మీరేం చేశారు? ఆ సమయానికి మీది బాల్యావస్థగదా. శేషించిన కాలం యెలాగడిపారు. మీరా దేహాన్ని ఎలావిడిచారు. కాలం సమస్తవస్తువులను నశింపచేస్తుంది కదా. మీకు పూర్వకల్పస్మృతి ఎందుచేత నశించలేదు? సవిస్తరంగా చెప్పండి – అనగా వ్యాసునికి నారదుడు చెప్తున్నాడు.

వ్యాసమునీంద్రా నాకు జ్ఞానోపదేశం చేసిన మహాత్ములు వెళ్లిపోయిన తరువాయి బాల్యావస్థలో ఉన్న నేను నాతల్లి దగ్గరే ఉండి కాలం గడుపుతున్నాను. ఆమె స్త్రీ. పైగా మూఢురాలు. వృత్తిచూస్తే దాస్యం. ఆమెకు నేనొక్కడనే పుత్రుడను. నాయందామెకు అతిప్రేమ ఉండడంచేత నిరంతరం నా యోగక్షేమ చింతవినా రెండో దృష్టి లేక పోయినా పరాధీన జీవనంవల్ల అనుకున్నంత చేయలేక పోయేది. బొమ్మను సూత్రధారు డాడించినట్లు భగవానుడీ మానవులను కర్మ సూత్రబద్ధులను చేసి ఆడిస్తూ ఉంటాడు ఐదు సంవత్సరాల్ల వయస్సులో

తదా తదహమీశస్య భక్తానాం శమభీప్సతః,
అనుగ్రహం మన్యమానః ప్రాతిష్ఠం దిశముత్తరామ్.
స్ఫీతాన్ జనపదాంస్తత్ర పురగ్రామవ్రజాకరాన్,
ఖేటాన్ ఖర్వటవాటీశ్చ వనాన్యుపవనాని చ.
చిత్రధాతువిచిత్రాద్రీని భభగ్నభుజద్రుమాన్,
జలాశయాన్ శివజలాన్నలినీస్సురసేవితాః.
చిత్రస్వనైః పత్రరథైర్విభ్రమద్భ్రమరశ్రియః,
నలవేణుశరస్తంబకుశకీచకగహ్వరమ్.
ఏక ఏవాతియాతో౽హమద్రాక్షం విపినం మహత్,
ఘోరం ప్రతిభయాకారం వ్యాళోలూకశివాజిరం.
పరిశ్రాంతేంద్రియాత్మాహం తృట్పరీతో బుభుక్షితః
స్నాత్వా పీత్వా హ్రదే నద్యా ఉపస్పృష్టో గతశ్రమః.
తస్మిన్నిర్మనుజే౽రణ్యే పిప్పలోపస్థ ఆశ్రితః,
ఆత్మనాత్మానమాత్మస్థం యథాశ్రుతమచింతయం.
ధ్యాయతశ్చరణాంభోజం భావనిర్జితచేతసా,
ఔత్కంఠ్యాశ్రుకళాక్షస్య హృద్యాసీన్మే శనైర్హరిః.

నేనుండగా నా తల్లిని త్రాచుపాము కరవగా ఆమె మరణించింది. ఉన్న బంధనం అల్లా నాకది ఒక్కటే. భగవదనుగ్రహం వల్ల నాకా బంధనం కూడా విచ్ఛిన్నమై పోయింది. ఇదీ ఈశ్వరానుగ్రహమే అని భావించి నేను ఉత్తరదిశగా ప్రయాణం సాగించడం ఆరంభించాను. సర్వసస్యాలతో కూడిన ప్రదేశాలూ నగరాలూ పల్లెలూ వనాలూ నదులూ దాటి క్రమంగా నిర్జనమై భయంకర మృగాలతో కూడిన అరణ్యంలో అడుగు పెట్టాను. నా ఇంద్రియాల్లో శక్తి తగ్గిపోయింది. శరీరంలో బలం లేదు. ఆకలి దప్పికలు పీడిస్తున్నాయి. ఎలాగో బాధపడి ఘోరారణ్యంలో ఒక నదిని సమీపించి ఆనదిలో స్నానంచేసి జలపానం చేశాను. ఆ నిర్జనారణ్యంలో ఒక రావి చెట్టు మొదట్లో కూర్చుని నాకా మహాత్ములు ఉపదేశించిన నామం స్మరిస్తూ ఆరూపాన్నే ధ్యానిస్తూ భగవంతుని చరణాలమీదే దృష్టిని నిలిపి తపస్సు చెయ్యడం ఆరంభించాను. శీత వాతా తపాలను లెక్క చెయ్యకుండా సాగించే నా తపస్సు ఫలించింది. ఒకనాడు దివ్యమంగళవిగ్రహుడైన శ్రీకృష్ణుడు నా హృద

ప్రేమాతిభరనిర్భిన్నపులకాంగోఽతినిర్వృతః,
ఆనందసంప్లవే లీనో నాపశ్యముభయం మునే.
రూపం భగవతో యత్తన్మనఃకాంతం శుచాపహం,
అపశ్యం సహసోత్తస్థౌ వైక్లబ్యాద్దుర్మనా ఇవ.
దిదృక్షుస్తదహం భూయః ప్రణిధాయ మనో హృది,
వీక్షమాణోఽపి నాపశ్యమవితృప్త ఇవాతురః.
ఏవం యతంతం విజనే మామాహాగోచరో గిరాం,
గంభీరశ్లక్ష్ణయా వాచా శుచః ప్రశమయన్నివ.
హంతాస్మిన్ జన్మని భవాన్ మా మా ద్రష్టుమిహార్హతి,
అవిపక్వకషాయాణాం దుర్దర్శోఽహం కుయోగినాం.
సకృద్యద్దర్శితం రూపమేతత్కామాయ తేఽనఘ,
మత్కామశ్శనకైస్సాధు సర్వాన్ ముంచతి హృచ్ఛయాన్.
సత్సేవయాఽదీర్ఘయా తే జాతా మయి దృఢా మతిః,
హిత్వావద్యమిమం లోకం గంతా మజ్జనతామసి.
మతిర్మయి నిబద్ధేయం న విపద్యేత కర్హిచిత్,
ప్రజాసర్గనిరోధేఽపి స్మృతిశ్చ మదనుగ్రహాత్.

యంలో దర్శనం ఇచ్చాడు. ఆ సమయంలో ప్రేమభావంచేత కలిగిన ఉద్రేకంవల్ల దేహం అంతా గగుర్పాటు కలిగి కనులనుండి ఆనంద బాష్పాలు రాలుతూఉంటే నా హృదయం శాంతరసంతో చల్లబడి పోయింది. సమస్త శోకాల్నీ నశింపజేసే ఆ అనిర్వాచనీయమైన రూపాన్ని క్షణం అలాచూస్తూ ఉండగానే శ్రీహరి అంతర్ధానమైపోయాడు. తరువాయి నే నెంతప్రయత్నించినా ఆ రూపం చూడలేకపోయాను. ఆవేదనతో నే శ్రీహరిని దర్శించాలని ప్రయత్నిస్తూ ఉంటే ఒకనాడు ఆకాశవాణి ఇలా పలికింది; వత్సా, నీ కీ జన్మలో నాదర్శనంకాదు. నీకింకా జన్మాంతరవాసనలు పూర్తిగా నశించలేదు. అలాంటి వానికి నా దర్శనం దుర్లభం. నీకు నాయందు భక్తి వృద్ధి చెందటం కోసం నేనొక్కసారి నీకు దర్శనం యిచ్చాను. నన్ను పొందడానికి సాధకుడు మెల్ల మెల్లగా జన్మాంతర వాసనలు నశింప జేసుకోవాలి. నీకు స్వల్పమైన సత్పురుష సేవా మాత్రం చేతనే నాపై దృఢమైన భక్తి కుదిరింది. నీవీ ప్రాకృత శరీరం విడిచి నా పార్షదులలో ఒకడవై వైకుంఠం పొంద

ఏతావదుక్త్వోపరరామ తన్మహద్భూతం నభోలింగమలింగమీశ్వరమ్,
అహం చ తస్మై మహతాం మహీయసే శీర్ష్ణావనామం విదధేఽనుకంపితః.
నామాన్యనంతస్య గతత్రపః పఠన్ గుహ్యాని భద్రాణి కృతాని చ స్మరన్,
గాం పర్యటంస్తుష్టమనా గతస్పృహః కాలం ప్రతీక్షన్ విమదో విమత్సరః.
ఏవం కృష్ణమతేర్బ్రహ్మన్న సక్తస్యామలాత్మనః,
కాలః ప్రాదురభూత్కాలే తటిత్సౌదామనీ యథా.
ప్రయుజ్యమానే మయి తాం శుద్ధాం భాగవతీం తనుమ్,
ప్రారబ్ధకర్మనిర్వాణో న్యపతత్పాంచభౌతికః.
కల్పాంత ఇదమాదాయ శయానేఽంభస్యుదన్వతః,
అనుప్రాణం శిశయిషోర్విశేఽంతరహం విభోః.
సహస్రయుగపర్యంత ఉత్థాయేదం సిసృక్షతః,
మరీచిమిశ్రా ఋషయః ప్రాణేభ్యోఽహం చ జజ్ఞిరే,
అంతర్బహిశ్చ లోకాంస్త్రీన్ పర్యేమ్యస్కందితవ్రతః,
అనుగ్రహాన్మహావిష్ణోరవ్యాహతగతిః క్వచిత్.
దేవదత్తామిమాం వీణాం స్వర బ్రహ్మవిభూషితామ్,
మూర్ఛయిత్వా హరికథాం గాయమానశ్చరామ్యహమ్.

గలవు. నీకు నా మీద భక్తియెన్నడూ నశించదు. ప్రళయానంతరం కూడా నీకు నాయందు ప్రేమ భావంతో కూడిన భక్తిఉంటుంది. అని చెప్పిన వాక్యాలు విని అవి శ్రీహరి వాక్యాలే అనే విశ్వాసంతో నేను నిరంతరం భగవన్నామ స్మరణ చేసుకొంటూ కాలంగడుపుతూ ఉండగా నాకు వాసనలన్నీ నశించాయి. పరిశుద్ధ హృదయంతో ఉండగా కాలం ఆసన్నమైనప్పుడు మరణించి విష్ణుపార్షదుడనై వైకుంఠాన్ని పొంది కల్పాంతంలో బ్రహ్మయందు ప్రవేశించి చతుర్యుగ సహస్రాలకాలం గతించిన తరువాయి సృష్ట్యారంభంలో బ్రహ్మనుండి మరీచ్యాదులతో జన్మించాను. అప్పటినుండీ శ్రీహరికరుణచే వైకుంఠాది లోకాలన్నీ తిరుగుతూ భగవత్ప్రసాద లబ్ధమైన మహతీ వీణ మీటుకుంటూ శ్రీహరి లీలలతో కూడిన గుణకీర్తనం చేసుకుంటూ ఉన్నాను. నేను గానం మొదలుపెట్టానూ అంటే అదే క్షణంలో భగవానుడు నా హృదయంలో వెంటనే దర్శనం ఇస్తాడు. చిత్తవృత్తులు

ప్రగాయతస్స్వవీర్యాణి తీర్థపాదః ప్రియశ్రవాః,
ఆహూత ఇవ మే శీఘ్రం దర్శనం యాతి చేతసి.
ఏతాదురచిత్తానాం మాత్రాస్పర్శేచ్ఛయా ముహుః,
భవసింధుప్లవో దృష్టో హరిచర్యానువర్ణనమ్.
యామాదిభిర్యోగపథైః కామలోభహతో ముహుః,
ముకుందసేవయా యద్వత్తథాత్మాద్ధా న శామ్యతి.
సర్వం తదిద మాఖ్యాతంయత్పృష్టోఽహం త్వయానఘ,
జన్మ కర్మ రహస్యం మే భవతశ్చాత్మతోషణమ్.
ఏవం సంభాష్య భగవాన్నారదో వాసవీసుతమ్,
ఆమంత్ర్య వీణాం రణయన్ యయౌ యాదృచ్ఛికో మునిః.
అహో దేవర్షి ర్ధన్యోఽయం యః కీర్తిం శార్ఙ్గధన్వనః.
గాయన్మాద్యన్నిరా తంత్ర్యా రమయత్యాతురం జగత్.

నిరోధించి ఏ మానవుడు శ్రీహరినామ సంకీర్తనం చేస్తాడో అట్టివాడు సంసార సముద్రం దాటి నిరతిశయానందం పొందకలుగుతాడు. అందువల్ల పాపరహితుడవూ పరమయోగివీ అవడంచేత నీ జన్మ సార్థకమైంది. నువ్వు శ్రీహరి లీలలతో కూడిన భగవత్కథను రచించి వ్యాప్తిచెయ్యి. దానివల్ల నీకే కాకుండా లోకానికూ్కడా కల్యాణం చేకూరుతుందని భాగవత ధర్మంబోధించి వెళ్లిపోయాడు నారద మహర్షి. లోక తాపత్రయాన్ని హరించే నారదుడు ధన్యుడని సూతుడు శౌనకాదులకు భాగవతగాథ వివరిస్తున్నాడు.

## 6 అ ధ్యా య ం

నిర్గతే నారదే సూత భగవాన్ బాదరాయణిః,
శ్రుతవాంస్తదభిప్రేతం తతః కిమకరోద్విభుః.
బ్రహ్మనద్యాస్సరస్వత్యా ఆశ్రమః పశ్చిమే తటే,
శమ్యాప్రాస ఇతి ఖ్యాత ఋషీణాం సత్రవర్ధనః.

సరస్వతీ నదికి పశ్చిమ తీరంలో శమ్యాప్రాసమనే ఆశ్రమం ఉంది. అక్కడ ఋషులు యాగం చేస్తున్నారు. ఆ సమీపంలోనే వ్యాసుని ఆశ్రమమూ ఉన్నది. దానిచుట్టూ బదరీవృక్షాలు దట్టంగా ఉన్నాయి.

తస్మిన్స్వాశ్రమే వ్యాసో బదరీషండమండితే,
ఆసీనోఽప ఉపస్పృశ్య ప్రణిదధ్యౌ మనస్స్వయమ్.
భక్తియోగేన మనసి సమ్యక్ప్రణిహితే మలే,
అపశ్యత్పురుషం పూర్వం మాయాం చ తదుపాశ్రయామ్,
యయా సమ్మోహితో జీవ ఆత్మానం త్రిగుణాత్మకమ్,
పరోఽపి మనుతేఽనర్థం తత్కృతం చాభిపద్యతే.
అనర్థోపశమం సాక్షాద్భక్తియోగమధోక్షజే,
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్వతసంహితాం.
యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమపూరుషే,
భక్తిరుత్పద్యతే పుంసశ్శోకమోహభయాపహా.
స సంహితాం భాగవతీం కృత్వానుక్రమ్య చాత్మజం,
శుకమధ్యాపయామాస నివృత్తినిరతం మునిం.
సవైనివృత్తినిరతః సర్వత్రోపేక్షకో మునిః.
కస్య వా బృహతీమేతామాత్మారామస్సమభ్యసత్.
ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే,
కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః.

వేదవ్యాసుడు సమాహిత చిత్తుడై ఆచమించి ధ్యానంలో భగవంతునీ అతని మాయనూ చూశాడు. భగవన్మాయా మోహితులైన జీవులు త్రిగుణాతీతులై కూడా గుణాత్ములుగానే ఉండిపోతున్నారు. అందువల్ల త్రిగుణాత్మకమైన విషయాలకు లోనై అనేక దుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు, అజ్ఞానులు. ఈ సంసారదుఃఖాలు నశించాలంటే భక్తి యోగం వినా రెండో మార్గంలేదు. ఈవిషయం అజ్ఞానులు గ్రహించలేక పోతున్నారని ఆలోచించి భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకమైన భాగవతం రచించి తత్వజ్ఞానీ తన కుమారుడూ ఐన శ్రీశుకునికి ఉపదేశించాడని చెప్పిన సూతునిచూచి – మహర్షీ సర్వసంగపరిత్యాగియైన శ్రీశుకుడీ మహాగ్రంథం ఏ కారణం చేత అధ్యయనం చేశాడో చెప్పండి అని అడుగగా సూతమహర్షి :—

శౌనకాదులారా! అవిద్యనశించి జ్ఞానం పొందిన వాడు కూడా అహేతుకంగా భగవత్సేవచేస్తూనే ఉంటాడు. భగవంతుని గుణాలలో

హరేర్గుణాక్షిప్త మతిర్భగవాన్ బాదరాయణిః,
అధ్యగా న్మహదాఖ్యానం నిత్యం విష్ణుజనప్రియః.
పరీక్షితోఽథ రాజర్షే ర్జన్మ కర్మ విలాయనం,
సంస్థానం పాండుపుత్రాణాం వక్ష్యే కృష్ణకథోదయం.
యదా మృధే కౌరవసృంజయానాం వీరేష్వథో వీరగతిం గతేషు,
వృకోదరావిద్ధగదాభిమర్శభగ్నోరుదండే ధృతరాష్ట్రపుత్రే.
భర్తుః ప్రియం ద్రౌణిరితి స్మ పశ్యన్ కృష్ణాసుతానాం స్వపతాం శిరాంసి,
అపాహరద్విప్రియమేవ తస్య జుగుప్సితం కర్మ విగర్హయంతి.
మాతా శిశూనాం నిధనం సుతానాం నిశమ్య ఘోరం పరితప్యమానా.
తదారుదద్బాష్పకలాకులాక్షీ తాం సాంత్వయన్నాహ కిరీటమాలీ;
తదా శుచస్తే విమృజామి భద్రే యద్బ్రహ్మబంధోః శిర ఆతతాయినః,
గాండీవముక్తైర్విశిఖైరుపాహరే త్వాక్రమ్య యత్ స్నాస్యసి దగ్ధపుత్రా,
ఇతి ప్రియాం వల్గు విచిత్రజల్పైః స సాంత్వయిత్వాచ్యుతమిత్రసూతః,
అన్వాద్రవద్దంశిత ఉగ్రధన్వా కపిధ్వజో గురుపుత్రం రథేన.
తమాపతంతం స విలక్ష్య దూరా త్కుమారహోద్విగ్నమనా రథేన,
పరాద్రవత్ప్రాణపరీప్సురుర్వ్యాం యావద్గమం రుద్రభయాద్యథా కః.

ఉన్న మాధుర్యమే. అదివేదవ్యాస పుత్రుడూ భక్తప్రియుడూ ఐన శుకుడు భగవద్గుణగానంలో వివశుడై మహత్తరమైన భాగవతాధ్యయనం చేశాడు. రాజర్షియైన పరీక్షిన్మహారాజుయొక్క జన్మకర్మలూ పాండవుల స్వర్గారోహణ సంబంధమైన వివరాలూ చెప్తాను కృష్ణుని లీలలతో కూడిన అనేక కథలు వస్తాయి. అవి మోక్ష హేతువులు. కురు పాండవ సంగ్రామంలో ఉభయ వర్గాల్లోనూ మహాయోధులు హతులయారు. భీముని గదా ఘాతం వల్ల దుర్యోధనుడు తొడలు విరిగి పడ్డాడు. రారాజుకు ప్రీతిని కలిగించాలని అశ్వత్థామ ఉపపాండవులను సంహరించాడు. అది నీచకార్యం కావడంవల్ల దుర్యోధనుడు కూడా ఆనందించలేదు. అశ్వత్థామను రెండు వర్గాల వారూ నిందించారు. పుత్ర శోకార్తయైన ద్రౌపదీదేవి కన్నీరు మున్నీరుగా విచారిస్తూన్నది. అది చూచి అర్జునుడు – దేవీ ఆ బ్రాహ్మణాధముని సంహరించి ఆ శిరస్సు నీకు కానుకగా ఇచ్చి నీ దుఃఖాన్ని శమింపచేస్తాను.

యదాఽశిరణమాత్మానమమైక్షచ్ఛ్రాంతవాజినమ్,
అస్త్రం బ్రహ్మశిరో మేనే హ్యాత్మత్రాణం ద్విజాత్మజః.
అథోపస్పృశ్య సలిలం సందధేఽస్త్రం సమాహితః,
అజానన్నుపసంహారం ప్రాణకృచ్ఛ్ర ఉపస్థితే.
తతః ప్రాదుష్కృతం తేజః ప్రచండం సర్వతోదిశమ్,
ప్రాణాపదమభిప్రేక్ష్య విష్ణుం జిష్ణురువాచ హ.
కృష్ణకృష్ణ మహాబాహో భక్తానామభయంకర,
త్వమేకో దహ్యమానానామపవర్గోఽసి సంసృతేః.
త్వమాద్యః పురుషః సాక్షాదీశ్వరః ప్రకృతేః పరః.
మాయాం వ్యుదస్య చిచ్ఛక్త్యా కేవలే స్థిత ఆత్మని.
స ఏవ జీవలోకస్య మాయా మోహితచేతసః,
విధత్సే స్వేన వీర్యేణ శ్రేయో ధర్మాదిలక్షణమ్.
తథాయం చావతారస్తే భువో భారజిహీర్షయా,
స్వానాం చానన్యభావానామనుధ్యానాయ చాసకృత్.
కిమిదం స్విత్కుతో వేతి దేవదేవ నవేద్మ్యహమ్,
సర్వతోముఖమాయాతి తేజః పరమదారుణమ్.

నువ్వా శిరస్సును కాలదన్ని స్నానం చేసి ఆనందిద్దువుగాని అని ద్రౌపది నోదార్చి కృష్ణునితో ఆలోచించి కృష్ణునే సారథిగా ఉంచుకొని కవచాదులు ధరించి అశ్వత్థామను వెన్నంటి అస్త్రాలు ప్రయోగిస్తూ ఉంటే ప్రాణరక్షణార్థమై ఉపసంహారం తెలియకుండానే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు అశ్వత్థామ. ఆ అస్త్రం దశదిశలా తేజోరూపంలో వ్యాప్తమౌతూన్నది. ఆ తేజస్సు చూచి అర్జునుడు ప్రాణాపాయ శంకతో

శ్రీకృష్ణా! నువ్వు సచ్చిదానంద స్వరూపుడవు. నీ శక్తి అనంతం. భక్తులకు అభయమీయడం నీకు సహజ లక్షణం. పరంకంటే పరమైన వాడవు. నీప్రభావం చేత మాయా మోహితులైన జీవులను ధర్మాది రూపాల్లో అవతరించి రక్షిస్తూ ఉంటావు. భూభారాన్ని హరించడానికీ, భక్తులు స్మరించి ధ్యానిస్తే మోక్షాన్ని ప్రసాదించడానికి అవతరించావు కృష్ణా! ఈ తేజస్సు యెక్కడ నుండి వస్తూన్నది. దీని యథార్థ స్వరూపమేమిటో నాకేం తెలియటం లేదని భయభ్రాంతుడై అడిగిన

వేత్థేదం ద్రోణపుత్రస్య బ్రాహ్మమస్త్రం ప్రదర్శితమ్,
నైవాసౌ వేద సంహారం ప్రాణబాధ ఉపస్థితే.
నహ్యస్యాన్యతమం కించిదస్త్రం ప్రత్యవకర్శనమ్,
జహ్యస్త్రతేజ ఉన్నద్ధమస్త్రజ్ఞో హ్యస్త్రతేజసా.
శ్రుత్వా భగవతా ప్రోక్తం ఫల్గునః పరవీరహా,
స్పృష్ట్వాపస్తం పరిక్రమ్య బ్రాహ్మం బ్రాహ్మాయ సందధే.
సంహత్యాన్యోన్యముభయోస్తేజసీ శరసంవృతే,
ఆవృత్య రోదసీ ఖం చ వవృధాతేఽర్కవహ్నివత్.
దృష్ట్వాస్త్రతేజస్తు తయోస్త్రీన్ లోకాన్ ప్రదహన్మహత్
దహ్యమానాః ప్రజాః సర్వాః సాంవర్తకమమంసత.
ప్రజోపద్రవమాలోక్య లోకవ్యతికరం చ తమ్,
మతం చ వాసుదేవస్య సంజహారార్జునో ద్వయమ్.
తత ఆసాద్య తరసా దారుణం గౌతమీసుతమ్,
బబంధామర్షతామ్రాక్షః పశుం రశనయా యథా.
శిబిరాయ నినీషంతం బద్ధ్వా రజ్జ్వా రిపుం బలాత్,
ప్రాహార్జునం ప్రకుపితో భగవానంబుజేక్షణః.

పార్థుని చూచి అర్జునా, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం ఇది. ఉపసంహారం తెలియకుండానే ప్రయోగించాడు అశ్వత్థామ. ఈఅస్త్రం యేఅస్త్రం చేతా శాంతించదు. బ్రహ్మాస్త్రం చేతనే శాంతింప జెయ్యాలి. నువ్వు బ్రహ్మాస్త్రం సంధించి దీన్ని శాంతింప జెయ్యి అన్నాడు కృష్ణ పరమాత్మ.

ప్రతిపక్ష వినాశకుడైన అర్జునుడాకృష్ణుని సలహానుపొంది ఆచమనంచేసి శ్రీకృష్ణునకు ప్రదక్షిణ నమస్కారాలుచేసిబ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

బ్రహ్మాస్త్రాలు రెండూ ఒకదాన్ని ఒకటి యెదిరిస్తూ ఒకదాని కంటె మరొకటి వృద్ధిచెందుతూ ప్రళయాగ్నిలా దిక్కుల వ్యాపిస్తున్నాయి. ఆ మంటలలో అనేక జీవులు భస్మమై పోతున్నాయి. అది చూచి శ్రీకృష్ణుడులోకనాశనం కాకుండా అస్త్రాలు పసంహరించమని ఆజ్ఞాపించాడు. అర్జునుడా అస్త్రాలుపసంహరించి మహాక్రోధంతో

మైనం పార్థార్హసి త్రాతుం బ్రహ్మబంధు మిమం జహి,
యోఽసావనాగసః సుప్తానవధీన్నిశి బాలకాన్.
మత్తం ప్రమత్తమున్మత్తం సుప్తం బాలం జడం స్త్రియం,
ప్రపన్నం విరథం భీతం న రిపుం హంతి ధర్మవిత్,
స్వప్రాణాన్ యః పరప్రాణైః ప్రపుష్ణాత్యఘృణః ఖలః,
తద్వధస్తస్య హి శ్రేయో యద్దోషాద్యాత్యధః పుమాన్.
ప్రతిశ్రుతం చ భవతా పాంచాల్యాః శృణ్వతో మమ,
ఆహరిష్యే శిరస్తస్య యస్తే మానిని పుత్రహా.
తదసౌ వధ్యతాం పాప ఆతతాయ్యాత్మబంధుహా,
భర్తుశ్చ విప్రియం వీర కృతవాన్ కులపాంసనః.
ఏవం పరీక్షతా ధర్మం పార్థః కృష్ణేన చోదితః,
నైచ్ఛద్ధంతుం గురుసుతం యద్యప్యాత్మహనం మహాన్.
తతోఽభ్యేత్య స్వశిబిరం గోవిందప్రియసారథిః,
న్యవేదయత్తం ప్రియాయై శోచంత్యా ఆత్మజాన్ హతాన్.
తథాహృతం పశువత్పాశబద్ధమవాఙ్ముఖం కర్మ జుగుప్సితేన,
నిరీక్ష్యకృష్ణాపికృతం గురోస్సుతం వామస్వభావా కృపయా ననామ చ.
ఉవాచ చాసహంత్యస్య బంధనానయనం సతీ,
ముచ్యతాం ముచ్యతామేష బ్రాహ్మణో నితరాం గురుః.

అశ్వత్థామపై కురికి త్రాళ్లతో బంధించి తీసుకువచ్చి ద్రౌపదిముందు నిలిపి – ద్రౌపదీ ఇదుగో పుత్రఘాతకుడైన బ్రాహ్మణాధముడు. వీని శిరస్సు ఖండించి నీకు శాంతి కలిగిస్తాను – అనే అర్జునుని పరీక్షించాలని శ్రీకృష్ణుడిలా అంటున్నాడు –ఫల్గునా! నిద్రాపరవశులైన బాలురను చంపిన వాడుకూడా ఆతతాయులలో చేరతాడు. అతడు బ్రాహ్మణుడైనా చంపదగినవాడే కనుక వెనుదియ్యక పుత్రఘాతకుడైన అశ్వత్థామను నరికి వెయ్యమనగా అర్జునుడు ధర్మం తెలిసినవాడు గనుక గురుపుత్రుని హత్య చెయ్యలేకపోతున్నాడు. మహాసాధ్వి ద్రౌపది అశ్వత్థామను బంధించి తీసుకురావడం చూడలేక అర్జునుని సమీపించి వీడు గురుపుత్రుడు మీరు ద్రోణాచార్యుని అనుగ్రహంవల్లనే ధనుర్వేదవేత్తలలో అగ్రగణ్యులయ్యారు. ద్రోణుడు సర్వశాస్త్రాలూ ఉపదేశించడంలో అశ్వత్థామకంటే మిమ్మల్నే యెక్కువగా ప్రేమించి ఉపదేశిం

నరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయమః,
అస్త్రగ్రామశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్.
స ఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే,
తస్యాత్మనోఽర్ధం పత్న్యాస్తే నాన్వగాద్వీరసూః కృపీ.
తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులమ్,
వృజినం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్యమభీక్ష్ణశః
మారోదీత్తస్య జననీ గౌతమీ పతిదేవతా,
యథాహం మృతవత్సార్తా రోదిమ్యశ్రుముఖీ ముహుః.
యైః కోపితం బ్రహ్మకులం రాజన్యైరజితాత్మభిః,
తత్కులం ప్రదహత్యాశు సానుబంధం శుచార్పితమ్.
ధర్మ్యం న్యాయ్యం సకరుణం నిర్వ్యళీకం సమం మహత్,
రాజా ధర్మసుతో రాజ్ఞ్యాః ప్రత్యనందద్వచో ద్విజాః.
నకులః సహదేవశ్చ యుయుధానో ధనంజయః,
భగవాన్ దేవకీపుత్రో యే చాన్యే యాశ్చ యోషితః.
తత్రాహామర్షితో భీమ స్తస్య శ్రేయాన్వధః స్మృతః,
న భర్తుర్నాత్మనశ్చార్థే యోఽహన్ సుప్తాన్ శిశూన్ వృథా
నిశమ్య భీమగదితం ద్రౌపద్యాశ్చ చతుర్భుజః,
ఆలోక్య వదనం సఖ్యు రిదమాహ హసన్నివ.

చాడు. ద్రోణుడు స్వర్గాన్నలంకరించినా ద్రోణపత్ని జీవించె ఉన్నది. ఆమెకూడా మీకు తల్లితో సమానమే. నేనెలాగైతే పుత్ర శోకంతో కుమిలిపోతున్నానో ఆమె కూడా అశ్వత్థామ మరణానికి అలానే విచారిస్తుంది. దైవగతి యెవరు తప్పించ గలరు. జరిగిందేదో జరిగి పోయింది. ఇక మీరీ అశ్వత్థామను వదిలెయ్యండి. అదే మీధర్మం. అతడు బ్రాహ్మణుడే గాక గురుపుత్రుడు కూడా కనక వధార్హుడు కాడని ద్రౌపది చెప్పింది. అర్జునుని ఉద్దేశం కూడా అదే. ద్రౌపదీ పార్థుల హృదయం గ్రహించినవాసుదేవుడే కాక ధర్మరాజాదులు కూడా ఆనందించి అభినందించారు. తరువాత వాసుదేవుడు పార్థా! భీమసేనుడు వినా మిగిలిన వారందరూ అశ్వత్థామను సంహరించడానికి అంగీకరించ డం లేదు. నా అభిప్రాయంకూడా అదే. పతితుడైనా బ్రాహ్మణుడు వధార్హుడు కాదు. రెండోవైపు చూస్తే ఆతతాయెవడైనా సరే

బ్రహ్మబంధు ర్నహంతవ్య ఆతతాయీ వధార్హణః,
మయైవోభయమామ్నాతం పరిపాహ్యనుశాసనమ్.
కురు ప్రతిశ్రుతం సత్యం యత్తత్సాంత్వయతా ప్రియామ్,
ప్రియం చ భీమసేనస్య పాంచాల్యా మహ్యమేవ చ.
అర్జునః సహసాజ్ఞాయ హరేర్హార్దమథాసినా,
మణిం జహార మూర్ధన్యం ద్విజస్య సహమూర్ధజమ్.
విముచ్య రశనాబద్ధం బాలహత్యా హతప్రభమ్,
తేజసా మణినా హీనం శిబిరాన్నిరయాపయత్.
వపనం ద్రవిణాదానం స్థానాన్నిర్యాపణం తథా,
ఏష హి బ్రహ్మబంధూనాం వధో నాన్యోఽస్తి దైహికః.
పుత్రశోకాతురాః సర్వే పాండవాః సహ కృష్ణయా,
స్వానాం మృతానాం యత్కృత్యం చక్రుర్నిర్హరణాదికమ్.

వధార్హుడే జౌతాడు. కనుక ధర్మ భంగంకలుగకుండా చరించు అన్నాడు. శ్రీకృష్ణుని అభిప్రాయం విని పార్థుడు అశ్వత్థామ శిరోమాణిక్యం శిరోజాలతో కూడా ఖండించి బంధ విముక్తుని చేసి ద్రౌపదీ సమేతంగా పాండవులు పుత్ర శోకాతురులై మరణించిన బంధువులందరికీ అంత్యేష్టి క్రియలు నిర్వర్తించారు.

## 7 అధ్యాయం

అథ తే సంపరేతానాం స్వానాముదకమిచ్ఛతామ్,
ధాతుం సకృష్ణా గంగాయాం పురస్కృత్య యయుః స్త్రియః.
తే నినీయోదకం సర్వే విలప్య చ భృశం పునః,
ఆప్లుతా హరిపాదాబ్జరజః పూతసరిజ్జలే.
తత్రాసీనం కురుపతిం ధృతరాష్ట్రం సహానుజమ్,
గాంధారీం పుత్రశోకార్తాం పృథాం కృష్ణాం చ మాధవః.

పాండవులు కృష్ణునితో సహా స్త్రీలను వెంటబెట్టుకొని గంగా తీరం చేరి మరణించిన బంధువులందరికీ తర్పణాలుచేసి అనేక రీతులుగా వారిని తలచుకొని విచారించి పవిత్రగంగా స్నానం చేసి పరిశుద్ధులై గాంధారీ ధృతరాష్ట్రులూ కుంతీ, ధర్మరాజూ విచారిస్తూంటే

సాంత్వయామాస మునిభిర్హతబంధూన్ శుచార్దితాన్,
భూతేషు కాలస్య గతిం దర్శయన్నప్రతిక్రియాం.
సాధయిత్వాఽజాతశత్రోః స్వం రాజ్యం కితవైర్హృతం,
ఘాతయిత్వాఽసతో రాజ్ఞః కచస్పర్శక్షతాయుషః.
యాజయిత్వాశ్వమేధైస్తం త్రిభిరుత్తమకల్పకైః,
తద్యశః పావనం దిక్షు శతమన్యోరివాతనోత్.
ఆమంత్ర్య పాండుపుత్రాంశ్చ శైనేయోద్ధవసంయుతః,
ద్వైపాయనాదిభిర్విప్రైః పూజితైః ప్రతిపూజితః.
గంతుం కృతమతిర్బ్రహ్మన్ ద్వారకాం రథమాస్థితః,
ఉపలేభేఽభిధావంతీముత్తరాం భయవిహ్వలామ్.
పాహిపాహి మహాయోగిన్ దేవదేవ జగత్పతే,
నాన్యం త్వదభయం పశ్యే యత్ర మృత్యుః పరస్పరమ్.
అభిద్రవతి మామీశ శరస్తప్తాయసో విభో,
కామం దహతు మాం నాథ మా మే గర్భో నిపాత్యతామ్.
ఉపధార్య వచస్తస్యా భగవాన్ భక్తవత్సలః,
అపాండవమిదం కర్తుం ద్రౌణేరస్త్రమబుధ్యత.

మహర్షులు వారికి శాంతి వచనాలు చెప్పి అనునయించారు. కృష్ణుడు ముందుకు వచ్చి ధౌమ్యాది మహర్షుల సన్నిధానంలో ధర్మరాజాదులతో – మహారాజా సమస్త జీవులూ కాలానికి అధీనమయ్యే ఉంటాయి. కాలాన్ని దాటగలజీవియేదీ లేదు. అందుచేత కాలాధీనమైన జీవులను గురించి విచారించడం జ్ఞానికి లక్షణం కాదని అనేకవిధాలుగా దుఃఖోపశమనం చేశాడు.

మహర్షులార! శ్రీకృష్ణు డిట్లు ధర్మరాజుకు రాజ్యం ప్రసాదించాడు. సాధ్వియగు ద్రౌపది కేశాన్ని పట్టియీడ్చిన కారణంగా ఆయుఃప్రమాణం నశించిన ధూర్త దుర్యోధనాదులను నశింపజేసి ధర్మరాజుచేత మూడు అశ్వమేధాలు చేయించి ధర్మరాజు కీర్తిని వృద్ధి జెందించాడు. సర్వం మంగళంగా సమాప్తి చెందిన తరువాయి ఉద్ధవుణ్ణి సాత్యకినీ వెంటబెట్టుకుని ద్వారకకు బో సంసిద్ధుడైనాడు. అంతలో మహాభయంతో కృష్ణా రక్షింపుము రక్షింపు మని యేడుస్తూ

తర్హ్యేవాథ భృగుశ్రేష్ఠ పాండవాః పంచసాయకాన్,
ఆత్మనోఽభిముఖాన్ దీప్తానాలక్ష్యాస్త్రాణ్యుపాదదుః.
వ్యసనం వీక్ష్య తత్తేషామనన్యవిషయాత్మనామ్,
సుదర్శనేన స్వాస్త్రేణ స్వానాం రక్షాం వ్యధాద్విభుః.
అంతస్థః సర్వభూతానామాత్మా యోగేశ్వరో హరిః,
స్వమాయయావృణోద్గర్భం వైరాట్యాః కురుతంతవే.
యద్యప్యస్త్రం బ్రహ్మశిరస్త్వమోఘం చాప్రతిక్రియమ్,
వైష్ణవం తేజ ఆసాద్య సమశామ్యద్భృగూద్వహ.
మామంస్థా హ్యేతదాశ్చర్యం సర్వాశ్చర్యమయేఽచ్యుతే,
య ఇదం మాయయా దైవ్యా సృజత్యవతి హంత్యజః.
బ్రహ్మతేజోవినిర్ముక్తైరాత్మజైస్సహ కృష్ణయా,
ప్రయాణాభిముఖం కృష్ణమిదమాహ పృథా సతీ.
నమస్యే పురుషం త్వాద్యమీశ్వరం ప్రకృతేః పరమ్,
అలక్ష్యం సర్వభూతానామంతర్బహిరవస్థితం.

ఉత్తర యెదురుగా వచ్చి కృష్ణ, అనంత, అచ్యుతా నీవే రక్షించాలి! నీ కంటె రక్షకు లెవరూ లేరు. ఇక్కడ ఒకరి కొకరు మృత్యు రూపు లౌతున్నారు. అదిగో ఆమండుతూవచ్చే భయంకరాస్త్రం నన్నే కాకుండా నా గర్భాన్ని కూడా దహించేలా ఉంది. రక్షింతువుగాక. అని ఆర్తితో ప్రార్థించింది. ఉత్తరనూ ఆ భయంకరమైన అస్త్రాన్నీ చూసి పాండవులు కూడా భయం చెంది ప్రార్థించారు. శ్రీకృష్ణు డనుగ్రహించి సుదర్శన చక్ర ప్రయోగంతో ఆ అస్త్రాన్ని ఉపసంహరించాడు. ఆ అస్త్రం అశ్వత్థామచే ప్రయోగింపబడ్డది. అట్టి భయంకరమైన అస్త్రాన్ని ఉపసంహరించి వాసుదేవుడు పాండవ వంశాన్ని రక్షించి పయనం సాగించే సమయంలో, కుమారులనూ ద్రౌపదినీ వెంటబెట్టుకుని కుంతి ద్వారకానాథుని స్తుతించడం ఆరంభించిది.

కృష్ణా! నువ్వు సమస్తజీవుల బహిరంతరాలలోనూ ఏక స్వరూపుడవుగానిండి ఉండి కూడా ఇంద్రియాలకు గోచరించవు. ప్రకృతి కంటె పరమైన నీకు నా నమస్కారం. నేను అబలను. అవినాశనమైన

మాయాయవనికాశ్ఛన్న మజ్ఞాఒధోక్షజమవ్యయం,
న లక్ష్యసే మూఢదృశాం నటో నాట్యధరో యథా.
తథా పరమహంసానాం మునీనామమలాత్మనాం,
భక్తియోగవిధానార్థం కథం పశ్యేమహిస్త్రియః.
కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ,
నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః.
నమః పంకజనాభాయ నమః పంకజమాలినే,
నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే.
యథా హృషీకేశ ఖలేన దేవకీ కంసేన రుద్ధా సుచిరం శుచార్పితా,
విమోచితాహం చ సహాత్మజావిభో త్వయైవ నాథేన ముహుర్విపద్గణాత్.
విషాన్మహాగ్నేః పురుషాదదర్శనాదసత్సభాయా వనవాసకృచ్ఛ్రతః,
మృధేమృధేఒనేకమహారథాస్త్రతో ద్రౌణ్యస్త్రతశ్చాస్మహరేఒభిరక్షితాః.
సుయోధనవిసృష్టో నః శాపాయామష్టణో మునిః,
పత్యుశ్చత్రష్యత వహ త్రిలోకైశ్వరతాం వనే.

పురుషోత్తముడవు నిన్ను నే నెట్లుగ్రహించగలను. అజ్ఞానులు వేష ధారియగు నటుని యాథార్థరూపాన్ని గుర్తించలేనట్లే సర్వవ్యాపకుడ వైన నిన్ను చూడలేకున్నారు. శుద్ధహృదయులైన భక్తుల హృదయాల్లో భక్తిని వృద్ధి చేసేటందుకే అవతరిస్తూ ఉంటావు. అలాంటి నిన్ను అల్పబుద్ధిగల స్త్రీలమెలా గుర్తించగలం. శ్రీకృష్ణ వాసుదేవ గోవింద దేవకీనందన నీకు నమస్కారము. నీ నాభి కమలంనుండి బ్రహ్మ ఉద్భవించాడు. నీవుపద్మమాలాదులు ధరించిశోభిస్తూఉంటావు. కమల ములవంటి నేత్రములూ పాదముల యందు పద్మచిహ్నాములూ కల నీకు నమస్కారము. కంసునిచే హింసింపబడే దేవకీవసుదేవులను రక్షించి నట్లే నన్నూ నా పుత్రులనూ అనేకవిపత్తులనుండి రక్షించావు. విపత్తులు కలిగినపుడల్లా నీ దర్శనమౌతూ ఉంటుంది గనుక మాకు నిరంతరం విపత్తులే కలుగుతూ ఉండుగాక. విద్యాసంపత్కులరూపవ్యాసాది గర్వములు కలవాడు నిన్ను చూడలేడు.. అహంకారరహితునకే నీ దర్శనం కలుగుతుంది. మాయా ప్రపంచం నిన్నంటదు. నీవు నిర్ధనులకు గనివి. నీవునీయందే విహరిస్తూంటావు. నీవు మోక్షాధిపతివి. నేనునిన్ను

విపదః సంతు తాః శశ్వత్తత్రతత్ర జగద్గురో;
భవతో దర్శనం యత్స్యాదపునర్భవదర్శనమ్.
జన్మైశ్వర్యశ్రుత శ్రీభిరేధమానమదః పుమాన్,
నచార్హత్యభిధాతుం వైత్వామకించనగోచరమ్.
నమోఽకించనవిత్తాయ నివృత్తగుణవృత్తయే,
ఆత్మారామాయ శాంతాయ కైవల్యపతయే నమః.
మన్యే త్వాం కాలమీశానమనాదినిధనం విభుమ్,
సమం చరన్తం సర్వత్ర భూతానాం యన్మిథః కలిః.
న వేద కశ్చిద్భగవంశ్చికీర్షితం తవేహమానస్య నృణాం విడంబనం,
నయస్యకశ్చిద్దయితోఽస్తికర్హిచిద్ద్వేష్యశ్చ యస్మిన్విషమా మతిర్నృణామ్.
జన్మ కర్మ చ విశ్వాత్మన్నజస్యాకర్తురాత్మనః,
తిర్యఙ్నౄషిషు యాదస్సు తదత్యంతవిడంబనం.
గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావ
ద్యా తే దశాశ్రుకలితాంజనసంభ్రమాక్షం,
వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య
సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి.

ఆద్యంతరహితుడవూ సర్వవ్యాపకుడవూ నియంతవూ కాలస్వరూపుడవూ పరమేశ్వరుడవూ అని భావిస్తున్నాను. ప్రపంచంలో ఉండే పదార్థాలు అనేక భేదాలతో ఉన్నా అన్ని వస్తువులయందూ నీవు సమానంగానే ఉంటావు. నీవు మానవాకారంతో అవతరించి చరించడంలో నీ లీలల యందుండే యథార్థం సామాన్యులు గ్రహించలేరు. నీకు ప్రియా ప్రియాలు రెండూ సమానమే. విశ్వాత్ముడవు. విశ్వరూపుడవు. జనన మరణాలు నీకు లేవు. కానీ పశు పక్షి మనుష్య ఋషి జల చరాది శరీరాలతో అవతరించి ఆ యా రూపములకనువైన కర్మలు చేస్తూ వాని యందుండే సుఖ దుఃఖాలకు సంబంధం లేకుండానే ఉంటావు. ఈ విశ్వం అంతా నీ లీల. చిన్నతనంలో నీ కొంటెచేష్టలు చూసి యశోద బంధించాలని ప్రయత్నిస్తూ ఉంటే నీవు తలవంచి కన్నీరు కారుస్తూ కనులకు పెట్టిన కాటుక నలుమూలల వ్యాప్తి చెందేలాగ కండ్లునలుపుతూ నటించే ఆ బాలలీలారూపం నిరంతరం నాహృదయంలో బంధింపబడుగాక. మలయ పర్వతంమీద మంచిగంధపు చెట్లు

కేచిదాహురజం జాతం పుణ్యశ్లోకస్య కీర్తయే,
యదోః ప్రియస్యా న్వవాయే మలయస్యేవ చందనమ్.
అపరే వసుదేవస్య దేవక్యాం యాచితోఽభ్యగాత్
అజస్త్వమస్య క్షేమాయ వధాయ చ సురద్విషాం.
భారావతరణాయాన్యే భువో నావ ఇవోదధౌ,
సీదంత్యా భూరిభారేణ జాతో హ్యాత్మభువార్థితః.
భవేఽస్మిన్ క్లిశ్యమానానామవిద్యాకామకర్మభిః.
శ్రవణస్మరణార్హాణి కరిష్యన్నితి కేచన.
శృణ్వంతి గాయంతి గృణంత్యభీక్ష్ణశః స్మరంతి నందంతి తవేహితం జనాః,
తఏవ పశ్యంత్యచిరేణ తావకం భవప్రవాహోపరమం పదాంబుజమ్.
అప్యద్య నస్త్వం స్వకృతే హితప్రభో జిహాససి స్విత్సుహృదోఽనుజీవినః,
యేషాంనచాన్యద్భవతఃపదాంబుజాత్పరాయణంరాజసుయోజితాంహసామ్.
కే వయం నామరూపాభ్యాం యదుభిః సహ పాండవాః,
భవతో దర్శన యర్హి హృషీకాణామివేశితుః.
నేయం శోభిష్యతే ధాత్రి యథేదానీం గదాధర,
త్వత్పదైరంకితా భాతిస్వలక్షణవిలక్షితైః.

పెరిగి ఆపర్వతం యొక్క కీర్తిని వృద్ధి చెందించినట్లే మహాభక్తుడైన యదువు యొక్క వంశములో అవతరించి ఆ వంశానికి కీర్తి తెచ్చావనీ అందుకే అవతరించావనీ విజ్ఞానులు చెప్తుతూ ఉంటారు. మరికొందరు దేవకీవసుదేవుల జన్మాంతర తపఃఫలముగా అవతరించావని చెప్తారు. భూమి దైత్యుల భారాన్ని భరించలేక నిన్ను ప్రార్థిస్తే భారహరణార్థమై అవతరించావని వేదవేత్తలంటున్నారు. మానవులు కర్మబద్ధులై ఇంద్రియ లోలురై సుఖదుఃఖరూపమైన కాలచక్రంలో పడి తిరుగుతూ ఉంటే నీ లీలరూపమైన చరిత్రద్వారా అజ్ఞానులను తరింపచేయడానికే అవతరించి నట్లు సిద్ధపురుషులభిప్రాయ పడుతున్నారు. వీరందరి భావాలూ యథార్థములే. భక్తులు నీ చరిత్ర మాటిమాటికీ చదువుతూ వింటూ నీ నామ సంకీర్తనం చేస్తూ ఆనందిస్తూ ఉంటారు. వారికి నిరతిశయానందం కలిగి జన్మరాహిత్యం అవుతుంది. నందనందనా! నీవు ఆశ్రితులైన పాండవులను వదలి ద్వారకకు వెడతానంటున్నావు, నీ పాదాలువినా మాకు యింకో ఆధారమేమీ లేదు. భూమండలంలోని రాజులంతా మాకు శత్రు

ఇమే జనపదాస్స్వృద్ధాః సుపక్వౌషధివీరుధః,
వనాద్రినద్యుదన్వంతో హ్యేధంతే తవ వీక్షితైః.
అథ విశ్వేశ విశ్వాత్మన్విశ్వమూర్తే స్వకేషు మే,
స్నేహపాశమిమం ఛింధి దృఢం పాండుషు వృష్ణిషు.
త్వయి మేఽనన్యవిషయా మతిర్మధుపతేఽసకృత్,
రతిముద్వహతాదద్ధా గంగేవౌఘముదన్వతి.
శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనిధ్రుగ్రాజన్యవంశదహనానపవర్గవీర్య,
గోవింద గోద్విజసురార్తిహరావతార యోగీశ్వరాఖిలగురో భగవన్నమస్తే.
పృథయేత్థం కలపదైః పరిణూతాఖిలోదయః,
మందం జహాస వైకుంఠో మోహయన్నివ మాయయా.
తాం బాఢమిత్యుపామంత్ర్య ప్రవిశ్య గజసాహ్వయమ్,
స్త్రియశ్చ స్వపురం యాస్యన్ప్రేమ్ణా రాజ్ఞా నివారితః.
వ్యాసాద్యైరీశ్వరేహాజ్ఞైః కృష్ణేనాద్భుతకర్మణా,
ప్రబోధితోఽపీతిహాసైర్నాబుధ్యత శుచార్పితః.

కూటంలోనివారే. జీవ రహితమైన ఇంద్రియాలవలె నీవులేని పాండవులు శక్తిహీనులై పోతారు. నీవల్లనే యాదవ పాండవులకు నామరూపాలు కలిగాయి. నీ దర్శనంలేని పాండవులకు నామరూపాలెక్కడివి? నీ పదపద్మాంకితమైన కురు జాంగల దేశాలు వనపర్వతాలతో కూడా నూతనమైన శోభనుపొంది వృద్ధిచెందాయి. నీవు విశ్వానికి నాథుడవూ విశ్వాత్ముడవూ విశ్వరూపుడవూ కూడా. నాకు యాదవ పాండవులయందున్న బంధుప్రేమ నశించి అఖండ ధారావాహిని యగు గంగ సముద్రంలో ప్రవేశించినట్లే నా బుద్ధి నీయందే లగ్నమయేటట్లు అనుగ్రహించు. శ్రీకృష్ణా! అర్జునసఖా! రాజవేషధారులై పుట్టిన రాక్షసులను భస్మంచెయ్యడానికి అగ్నివలె అవతరించావు. నీ శక్తి అనంతం. గోవిందా, గోవులనూ, బ్రాహ్మణులనూ దేవతలనూ రక్షించడానికే యిలా అవతరించిన యోగీశ్వరా! నీకు నమస్కారమని కుంతి శ్రీకృష్ణునినేక రీతులుగ ప్రార్థించి నమస్కరించింది.

శ్రీకృష్ణుడు కుంతియొక్క ప్రార్థనకు ప్రసన్నుడై అత్తా! కృష్ణుడెక్కడున్నా నీవాడే. నీకాభయమక్కరలేదని అభయమిచ్చి ద్రౌపది

అహ రాజా ధర్మసుతశ్చింతయన్ సుహృదాం వధమ్,
ప్రాకృతేనాత్మనా విప్రాః స్నేహమోహవశం గతః.
అహెూ మే పశ్యతా జ్ఞానం హృది రూఢం దురాత్మనః,
పారక్యస్యైవ దేహస్య బహ్వ్యో మేక్షౌహిణీర్హతాః.
బాలద్విజసుహృన్మిత్రపితృభ్రాతృగురుద్రుహః,
న మే స్యాన్నిరయాన్మోక్షోహ్యపి వర్షాయుతాయుతైః.
నైనో రాజ్ఞః ప్రజాభర్తుర్ధర్మే యుద్ధే వధో ద్విషాం,
ఇతి మే న తు బోధాయ కల్పతే శాసనం వచః.
స్త్రీణాంమద్ధతబంధూనాం ద్రోహో యోఽసావిహోత్థితః,
కర్మభిర్గృహమేధీయైర్నాహంకల్పో వ్యపోహితుం.
యథా పంకేన పంకాంభస్సురయా వా సురాకృతం,
భూతహత్యాం తథైవైవాం న యజ్ఞో మార్ష్టుమర్హతి.

సుభద్ర మొదలైన వారందరినీ అనునయించి ప్రయాణం సాగించనున్న కృష్ణుని చూచి ధర్మరాజు బాంధవులమరణాన్ని గూర్చి అనేకరీతులుగ విచారిస్తూ వివేకశూన్యుడై యిలా పలుకుతున్నాడు.

కృష్ణా! వ్యాసాది మహర్షులారా! కుక్కలకూ నక్కలకూఆహారమైన యీ శరీరాన్ని నమ్మి బంధుబాంధవులనే గాక గురువులనుకూడా సంహరించి మహా పాపినైనాను. నా యీ పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. కాని ఒకవంక చూస్తే రాజు ధర్మయుద్ధంలో శత్రువులను జయించి ప్రజలను ధర్మంగా పాలించాలని శాస్త్రాలు చెప్పుతున్నాయి. ఇందులో పాపానికి స్థానం లేకపోయినా నాకు సంతోషం కలగడంలేదు. భర్తలను సోదరులను, తండ్రులను సంహరించిన కారణంగా యీస్త్రీలవిషయమై నేను మహాపరాధంచేశాను. ఆ పాపం యజ్ఞయాగాదులుచేసినా నశించదు. బురదనీరు బురదనీటిచేతనూ మద్యం మద్యంచేతనూ శుద్ధికానట్లే హింసాజనితమైన పాపం హింసారూపమైన యజ్ఞాలవల్లనశించదు.

8 అ ధ్యా య ం

ఇతి భీతః ప్రజాద్రోహాత్సర్వధర్మవివిత్సయా,
తతో వినశనం ప్రాగాద్యత్ర దేవవ్రతోఽపతత్.
తదా తే భ్రాతరస్సర్వే సదశ్వైస్స్వర్ణభూషితైః,
అన్వగచ్ఛన్ రథైర్విప్రా వ్యాసధౌమ్యాదయస్తథా.
భగవానపి విప్రర్షే రథేన స ధనంజయః,
సతైర్వ్యరోచత నృపః కుబేర ఇవ గుహ్యకైః.
దృష్ట్వా నిపతితం భూమౌ దివశ్చ్యుతమివామరమ్,
ప్రణేముః పాండవా భీష్మం సానుగాస్స హచక్రిణా.
తత్ర బ్రహ్మర్షయస్సర్వే తథా దేవర్షిసత్తమాః,
రాజర్షయశ్చ తత్రాసన్ ద్రష్టుంభరత పుంగవమ్.
పర్వతో నారదో ధౌమ్యో భగవాన్బాదరాయణః,
బృహదశ్వో భరద్వాజస్సశిష్యో రేణుకాసుతః.
వశిష్ఠ ఇంద్రప్రమద స్త్రితోగృత్సమదోఽసితః,
కక్షీవాన్ గౌతమోఽత్రిశ్చ కౌశికోఽథ సుదర్శనః.
అన్యే చ మునయో బ్రహ్మన్ బ్రహ్మరాతాదయోఽమలాః,
శిష్యైరుపేతా ఆజగ్ముః కాశ్యపాంగిరసాదయః.

ధర్మరాజుకు కృష్ణుడూ వ్యాసాది మహాత్ములూ అనేక విధాల బోధించారు. కురుక్షేత్రంలో వీరశయ్య నలంకరించిన భీష్ముని దగ్గర ధర్మాలు గ్రహించే ఊహతో ధర్మరాజాదులందరూ కృష్ణుని వెంట బెట్టుకొని కురుక్షేత్రానికి వెళ్లి స్వర్గం నుండి వచ్చిన దేవతలవలె ప్రకాశించే భీష్మునికి నమస్కరించారు. అదే సమయానికి భీష్ముణ్ణి చూడడానికి దేవర్షులూ బ్రహ్మర్షులూ వచ్చారు. పర్వత, నారద, ధౌమ్య, వ్యాస, బృహదశ్వ, భరద్వాజ, పరశురామ, వశిష్ఠ, ఇంద్ర, ప్రమద, త్రిత, గృత్స, మద, అసిత, కక్షీవాన్, గౌతమ, అత్రి, సుదర్శన, శ్రీశుకాది మహాత్ములూ శిష్యగణ సమేతంగా కశ్యపుడూ, బృహస్పతీ మొదలైన వారంతా కూడా కురుక్షేత్రానికి వచ్చినతోడనే దేశకాలపాత్రాభిజ్ఞుడైన భీష్మపితామహుడు వారందరినీ ఆహ్వానించి మనసా పూజించాడు. కృష్ణతత్వం తెలిసినవాడవడంవల్ల భీష్మాచార్యుడు శ్రీకృష్ణుని విశేషంగా ధ్యానించి పూజించాడు.

తాన్ సమేతాన్మహాభాగానుపలభ్య వసూత్తమః,
పూజయామాస ధర్మజ్ఞో దేశకాలవిభాగవిత్.
కృష్ణం చ తత్ప్రభావజ్ఞ ఆసీనం జగదీశ్వరం,
హృదిస్థం పూజయామాస మాయయోపాత్తవిగ్రహం.
పాండుపుత్రానుపాసీనాన్ ప్రశ్రయప్రేమసంగతాన్,
అభ్యచష్టానురాగాస్రైరంధీభూతేన చక్షుషా.
అహో కష్టమహోఽన్యాయ్యం యద్యూయం ధర్మనందనా,
జీవితుం నార్హథ క్లిష్టం విప్రధర్మాచ్యుతాశ్రయాః.
సంస్థితేఽతిరథే పాండౌ పృథాబాలప్రజా వధూః,
యుష్మత్కృతే బహూన్ క్లేశాన్ ప్రాప్తా తోకవతీ ముహుః,
సర్వం కాలకృతం మన్యే భవతాంచ యదప్రియమ్,
స కాలో యద్వశే లోకో వాయోరివ ఘనావళిః.
యత్ర ధర్మసుతో రాజా గదాపాణిర్వృకోదరః,
కృష్ణోఽస్త్రీ గాండీవశ్చాపస్సుహృత్కృష్ణస్తతో విపత్.
నహ్యస్య కర్హిచిద్రాజన్ పుమాన్ వేద విధిత్సితమ్,
యద్విజిజ్ఞాసయా యుక్తా ముహ్యంతి కవయోఽపిహి.

అనంతరం తనసమీపంలో ఆసీనులైఉన్న పాండవులను చూసి కన్నీరు కారుస్తూ ధర్మరాజా! మీరంతా బ్రాహ్మణ ప్రియులూ ధార్మికులూ భగవద్భక్తులూ ఐఉండి కూడా కష్టాలే అనుభవించవలసివచ్చింది. ఆలోచించి చూస్తే అవి మీకు రావలసిన కష్టాలు మాత్రం కాదు. ఐనా కష్టాలు తప్పలేదు. చిన్నవయస్సులోనే తండ్రిపోయాము. నాటి నుండీ నేటి వరకూ ఆపత్తులే చుట్టుముట్టాయి. మేఘాలు వాయు వశమైనట్లే లోకపాలుర సమేతంగా జీవులన్నీ కాలానికి వశులై చరించవలసిందే. మీరు పడ్డ కష్టాలన్నీ కాలాన్ననుసరించే పడ్డారు. అలా కాకపోతే సాక్షాత్తూ ధర్మపుత్రుడైన ధర్మరాజూ గదాధరుడైన భీమసేనుడూ గాండీవధారియైన అర్జునుడూ ఉండికూడా విపత్తులు కలిగాయంటే కాలరూపుడైన భగవంతుని యిచ్ఛ కాకపోతే మరేమనాలి? ఇవన్నీ యిలా ఉండగా సాక్షాత్పరబ్రహ్మ కృష్ణుడే తోడునీడై ఉంటే కూడా విపత్తులు తప్పనప్పుడు సర్వం కాలాధీనమని విశ్వసించి ధైర్యంగా ప్రజాపాలన సాగించడం కంటే వేరుమార్గంలేదని అనేక

తస్మాదిదం దైవతంత్రం వ్యవస్య భరతర్షభ,
తస్యానువిహితో నాథాః నాథ పాహి ప్రజాః ప్రభో.
ఏష వైభగవాన్ సాక్షాదాద్యో నారాయణః పుమాన్,
మోహయన్మాయయాలోకం గూఢశ్చరతి వృష్ణిషు,
అస్యానుభావం భగవాన్ వేద గుహ్యతమం శివః,
దేవర్షి ర్నారదస్సాక్షాద్భగవాన్ కపిలో నృప.
యం మన్యసే మాతులేయం కృష్ణం మిత్రం సుహృత్తమం,
అకరోస్సచివం దూతం సౌహృదాదథ సారథిం.
సర్వాత్మనస్సమదృశో హ్యద్వయస్యానహంకృతేః,
తత్కృతం మతివైషమ్యం నిరవద్యస్య న క్వచిత్.
తథాప్యేకాంతభక్తేషు పశ్య భూపానుకంపితమ్,
యన్మేఽసూంస్త్యజతస్సాక్షాత్కృష్ణో దర్శనమాగతః.
భక్త్యావేశ్య మనో యస్మిన్ వాచా యన్నామ కీర్తయన్,
త్యజన్ కళేబరం యోగీ ముచ్యతే కామకర్మభిః.
స దేవదేవో భగవాన్ ప్రతీక్షతాం కళేబరం యావదిదం హినోమ్యహమ్,
ప్రసన్నహాసారుణలోచనోల్లసన్ముఖాంబుజో ధ్యానపథశ్చతుర్భుజః.

ధర్మాలు బోధించి ధర్మరాజా! ఈసమయంలో నువ్వుకాకఅన్యులెవ్వరూ ఈ భూమిని పాలించ లేరు. నువ్వే సమర్థుడవు. సర్వం ఈశ్వరాధీన మని నమ్మి ప్రజాపాలన చెయ్యి — అని చెపుతూ యింకా ఇలా అన్నాడు.

ధర్మనందనా! శ్రీకృష్ణుడు సర్వసమ దృష్టి కలవాడైనా భక్తుల యందధికమైన అనుగ్రహం చూపుతాడు. కనుకనే నాయందు పూర్వానుగ్రహంతో నాప్రాణత్యాగ సమయానికిక్కడకు వచ్చి నాకు దర్శన మిచ్చాడు. భగవత్పరాయణులైన పరమయోగులు కృష్ణ నామం స్మరిస్తూ భగవద్ధ్యానంతో శరీరం త్యజించి పునరావృత్తిరహిత మైన మోక్షం పొందుతారు. మోక్ష ప్రదాత యైన శ్రీకృష్ణ పర బ్రహ్మ నాదేహత్యాగ సమయం వరకూ యిక్కడే ఉండి ఆ సమ యంలో చతుర్భుజ రూపంలో నాకు దర్శనమిచ్చి మోక్షం ప్రసాదించు గాక — అని చెపుతూ ఉన్న భీష్ముని మాటలు విని ధర్మరాజ సేక

యుధిష్ఠిర స్తదాకర్ణ్య శయనాం శరపంజరే,
అపృచ్ఛద్వివిధాన్ ధర్మాన్నృషీణామనుశృణ్వతామ్.
పురుషస్వభావవిహితాన్ యథావస్థం యథాశ్రమమ్,
వైరాగ్యరాగోపాధిభ్యామామ్నాతోభయలక్షణాన్.
దానధర్మాన్ రాజధర్మాన్ మోక్షధర్మాన్ విభాగశః,
స్త్రీధర్మాన్ భగవద్ధర్మాన్ సమాసవ్యాసయోగతః.
ధర్మార్థ కామమోక్షాంశ్చ సహోపాయాన్ యథా మునే,
నానాఖ్యానేతి హాసేషు వర్ణయామాస ధర్మవిత్.
ధర్మాన్ ప్రవదతస్తస్య స కాలః ప్రత్యుపస్థితః,
యో యోగినశ్ఛంద మృత్యోర్వాంఛితస్తూత్తరాయణః.
తదోపసంహృత్య గిరస్సహస్రణీర్విముక్తసంగం మన ఆదిపూరుషే,
కృష్ణే లసత్పీతపటే చతుర్భుజే పురస్స్థితే మీలితదృగ్వ్యధారయత్.
విశుద్ధయా ధారణయా హతాశుభస్తదీక్షయైవాశు గతా యుధవ్యథః,
నివృత్తసర్వేంద్రియవృత్తివిభ్రమ స్తుష్టావ జన్యం విసృజన్ జనార్దనం,
ఇతి మతిరుపకల్పితా వితృష్ణా భగవతి సాత్వతపుంగవే విభూమ్ని,
స్వసుఖ ముపగతే క్వచిద్విహర్తుం ప్రకృతిము పేయుషి యద్భవప్రవాహః.

విషయాలడిగి ధర్మసంశయాలన్నీ నివారించు కొంటున్నాడు. ధర్మ రాజుకు భీష్మాచార్యులనేక ధర్మాలు బోధిస్తూండగా ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చింది. మహారథికులలో అగ్రేసరుడూ, సర్వధర్మ మర్మాలు తెలిసినవాడూ ఐన భీష్ముడు ఇంద్రియాలను నిరోధించి మౌన వ్రతుడై ఆదిపురుషుడైన శ్రీకృష్ణుని యందు లగ్నమైన మనస్సు కలవాడై శ్రీహరిని స్తుతిస్తున్నాడు.

అనేక సాధనల వల్ల పరిశుద్ధమై కామనారహితమైన నా మ నస్సు శ్రీకృష్ణునియందే లగ్నమగుగాక! సర్వదా ఆనందమయ స్వరూ పుడై యుండి లీలల కొరకై ప్రకృతిని గ్రహించి యీ సృష్టి పరం పరకు కారకుడైన శ్రీకృష్ణుని పదపద్మములయందే నా చిత్తం లగ్నం చేస్తున్నాను. త్రిభువన మోహనమై తమాల శ్యామలమై పీతాంబర ధారియై ముంగురులచే ప్రకాశమానమైన ముఖంగల పార్థ సఖుడైన వానియందే నా మనస్సు రమించుగాక! యుద్ధరంగంలో అశ్వపద

త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే,
వపురలకకులావృతాననాబ్జే విజయ సఖే రతిరస్తు మేఽనవద్యా.
యుధి తురగరజోవిధూమ్రవిష్వక్కచలులిత శ్రమవార్యలంకృతాస్యే,
మమ నిశితశరైర్విభిద్యమానత్వచి విలసత్కవచేఽస్తు కృష్ణఆత్మా.
సపది సఖివచోనిశమ్య మధ్యే నిజపరయోర్బలయో రథం ప్రవేశ్య,
స్థితవతి పరసైనికాయురక్ష్ణా హృతవతి పార్థసఖే రతిర్మమాస్తు.
వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య స్వజనవధాద్విముఖస్య దోషబుద్ధ్యా,
కుమతిమహరదాత్మవిద్యయా యశ్చరణరతిః పరమస్య తస్య మేఽస్తు.
స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞా మృత మధికర్తు మవప్లుతో రథస్థః,
ధృతరథచరణోఽభ్యయాచ్చలద్గుర్హరిరివహంతుమిభం గతోత్తరీయః.
శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే,
ప్రసభమభిససార మద్వధార్థం స భవతు మే భగవాన్ గతిర్ముకుందః.
విజయరథకుటుంబ ఆత్తతోత్రే ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే,
భగవతి రతిరస్తు మే ముమూర్షోర్యమిహ నిరీక్ష్య హతా గతాస్సరూపమ్.
లలితగతివిలాసవల్గుహాసప్రణయనిరీక్షణకల్పితోరుమానాః,
కృతమనుకృతవత్య ఉన్మదాంధాః ప్రకృతిమగన్ కిల యస్య గోపవధ్వః.

ఘట్టనచే బయలు వెడలిన ధూళిచే ధూసరితమైన ముంగురులతో ప్రకాశించే ముఖమూ నా బాణ పరంపరాఘాతంచే విచ్ఛిన్నమైన కవచమూ కలిగి పార్థసారథ్యంలో నిమగ్నుడై యున్న శ్రీకృష్ణునకు నామనో వాక్కాయాలు అర్పిస్తున్నాను. పాండవ కౌరవ సేనా మధ్యంలో రథం మీద నిలచి దృష్టి మాత్రంచేత కౌరవ పక్షంలో ఉన్న వీరుల ఆయుర్దాయం హరించిన కృష్ణునియందే నామనస్సు నిలచుగాక. అర్జునుడు స్వజన వధావిముఖుడై శోకిస్తూంటే మోహ శోక నాశకమైన గీతోపదేశం చేసిన కృష్ణచరణారవిందాలమీదనే నా చిత్తం లగ్నమగుగాక. ఆతతాయినైన నేను నిశిత బాణాలతో కృష్ణార్జునుల కవచాలు నరికి వారి దేహాలు గాయపరుస్తే ఆ సమయంలో అర్జునుడు అడ్డుపెట్టినా ఆగక నన్ను చంపుతానని మీదకురుకుతూ నా యందనుగ్రహం చూపిన కృష్ణుడే నాకు గతి. ఎడమచేత పగ్గాలూ కుడిచేత తోలుకర్రా పట్టి శ్వేతాశ్వాలుపూన్చిన రథం అధిరోహించి కురుక్షేత్ర రణయాగంలో ఆధ్వర్యం వహించిన పార్థసారథిని చూస్తూనే ప్రాణాలు

మునిగణనృపవర్యసంకులేఽంతస్సదసి యుధిష్ఠిర రాజసూయ ఏషాం,
అర్హణముపపేద ఈక్షణీయో మమ దృశి గోచర ఏష ఆవిరాత్మా.
క్షితిభరమపరోపితుం కురూణాం శ్వసన ఇవాన్నృజపక్ష వంశవహ్నిమ్,
తమిమమహమనువ్రతార్తిహంత్రిం హృది పరిరభ్య జహామి మర్త్యనీడమ్.
తమిమమహమజం శరీరభాజాం హృది హృది ధిష్ఠిత మాత్మకల్పితానామ్,
ప్రతిదృశమివనైకధార్కమేకం సమధిగతోఽస్మి విధూతభేదమోహః.
కృష్ణ ఏవం భగవతి మనోవాగ్దృష్టివృత్తిభిః,
ఆత్మన్యాత్మానమావేశ్య సోఽంతశ్శ్వాస ఉపారమత్.
సంపద్యమానమాజ్ఞాయ భీష్మం బ్రహ్మణి నిష్కళే,
సర్వే బభూవుస్తే తూష్ణీం వయాంసీవ దినాత్యయే.
తత్ర దుందుభయో నేదుర్దేవమానవవాదితాః,
శశంసుస్సాధవో రాజ్ఞాం ఖాత్పేతుః పుష్పవృష్టయః,
తస్య నిర్హరణాదీని సంపరేతస్య భార్గవ,
యుధిష్ఠిరః కారయిత్వా ముహూర్తం దుఃఖితోఽభవత్.
తుష్టువుర్మునయో హృష్టాః కృష్ణం తద్గుహ్యనామభిః,
తతస్తే కృష్ణహృదయాస్స్వాశ్రమాన్ ప్రయయుః పునః.

త్యాగం చెయ్యడంవల్ల కురుక్షేత్రంలో వీరులకు స్వారూప్య ముక్తి కలిగింది. అట్టి అర్జునసారథి నా మరణ కాలంలో కూడా నాకు ప్రేమపాత్రుడే గాక! రాసలీలా సమయంలో అంతర్ధానమైన శ్రీకృష్ణుని యందు తన్మయులైన గోపికలు ఏ కృష్ణలీలలననుకరించి నటించారో ఆ గోపికా మనోహరుడైన గోపాలుని యందే నా చిత్తము లగ్నమగుగాక! ధర్మరాజు చేసిన రాజసూయయాగంలో అగ్రపూజ నందిన కృష్ణుడు మరణసమయంలో నాకనులలోనే ఉండుగాక. సూర్యుడు అనేక నేత్రాలకు అనేకంగా కన్పిస్తున్నట్లే తా నొక్కడైఉండీ అనేక హృదయాల్లో అనేక రూపాల్లో గోచరించే కృష్ణుడు నా హృదయంలో విరాజిల్లు గాక – అని ధ్యానిస్తూ శ్రీకృష్ణునియందే లీనమయ్యాడు. ఆ సమయంలో మలయ మారుతం వీచింది. దేవ దుందుభులు మోగాయి. పూల వాన కురిసింది. ధర్మరాజు భీష్ముని మృతకళేబరానికి దహన సంస్కారాదులు పూర్తి చేసి స్వల్ప కాలం విచారించాడు.

తతో యుధిష్ఠిరో గత్వా సహకృష్ణో గజాహ్వయమ్,
పితరం సాంత్వయామాస గాంధారీం చ తపస్వినీమ్.
పిత్రాచానుమతో రాజా వాసుదేవానుమోదితః,
చకార రాజ్యం ధర్మేణ పితృపైతామహం విభుః.

మహర్షులంతా శ్రీకృష్ణుని స్తుతించి వారివారి ఆశ్రమాలకు వెళ్లి పోయారు. కృష్ణునితో ధర్మరాజు సపరివారంగా హస్తినాపురం చేరి గాంధారీ ధృతరాష్ట్రులకు ధైర్యం చెప్పి వారి అనుమతి మీద పట్టాభిషిక్తుడై రాజ్యపాలన ధర్మంగా సాగిస్తున్నాడు.

9 అధ్యాయం

హత్వా స్వరిక్థస్పృహ ఆతతాయినో యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః,
సహానుజైః ప్రత్యవరుద్ధభోజనః కథం ప్రవృత్తః కిమకారషీత్తతః.
వంశం కురోర్వంశదవాగ్నినిర్హృతం సంరోహయిత్వా భవభావనో హరిః,
నివేశయిత్వా నిజరాజ్య ఈశ్వరో యుధిష్ఠిరం ప్రీతమనా బభూవహ.
నిశమ్య భీష్మోక్త మథాచ్యుతోదితం ప్రవృత్తవిజ్ఞానవిధూతవిభ్రమః,
శశాస గామింద్ర ఇవాజితాశ్రయః పరిధ్యుపాంతామనుజానువర్తితః.
కామం వవర్ష పర్జన్యస్సర్వకామదుఘా మహీ,
సిషిచుస్స్మ వ్రజాన్ గావః పయసోధస్వతీర్ముదా.
నద్యస్సముద్రాగిరయ స్సవనస్పతివీరుధః.
ఫలంత్యోషధయస్సర్వాః కామమన్వృతు తస్యవై.

పరస్పర కలహాగ్ని చే దగ్ధమైన కురువంశాన్ని తిరిగి అంకురింప జేసి ధర్మనందనుని సింహాసనాధిష్ఠితుని చేసి ఆనందించాడు. భీష్ముని యొక్క, కృష్ణునియొక్క ఉపదేశంవల్ల ధర్మరాజు భ్రాంతి విడచి భగవంతుడైన శ్రీకృష్ణునాశ్రయించి చతుస్సముద్రవేలావలయిత భూమండలాన్ని శాసిస్తున్నాడు. భీమాదిసహోదరులందరూ ధర్మరాజు యొక్క ఆజ్ఞావర్తులై నడుస్తున్నారు. ఆ ధర్మరాజ్యంలో కాలీన వర్షాలు కురుస్తున్నాయి. భూమి సస్యసమృద్ధమై ఉన్నది. గోవులు సమృద్ధిగా పాలిస్తున్నాయి. నదులూ, పర్వతాలూ, వనస్పతులూ

నాథయో వ్యాధయః క్లేశా దైవభూతాత్మ హేతవః,
అజాతశత్రావభవన్ జంతూనాం రాజ్ఞి కర్హిచిత్.
ఉషిత్వా హస్తినపురే మాసాౙ కతిపతియాౙ హరిః,
సుహృదాం శోకనాశాయ స్వసుశ్చ ప్రియకామ్యయా.
ఆమంత్ర్యాథాభ్యనుజ్ఞాతః పరిష్వజ్యాభివాద్య తమ్,
ఆరురోహ రథం కైశ్చిత్పరిష్వక్తోఽభివాదితః.
సుభద్రా ద్రౌపదీ కుంతీ విదురోఽథ యుధిష్ఠిరః,
గాంధారీ ధృతరాష్ట్రశ్చ యుయుత్సుర్గౌతమో యమౌ.
వృకోదరశ్చ ధౌమ్యశ్చ స్త్రియో మత్స్యసుతాదయః,
న సేహిరే విముహ్యంతో విరహం శార్ఙ్గధన్వనః.
సత్సంగాన్ముక్తదుస్సంగో హాతుం నోత్సహతే బుధః,
కీర్త్యమానం యశో యస్య సకృదాకర్ణ్య రోచనమ్.
తస్మిన్న్యస్తధియః పార్థాః సహేరన్ విరహం కథమ్,
దర్శనస్పర్శనాలాప శయనాసనభోజనైః.
సర్వే తేఽనిమిషైరక్షైస్తమనుద్రుతచేతసః,
వీక్షంతః స్నేహసంబద్ధా విచేలుస్తత్ర తత్ర హ.
న్యరుధంన్నుద్గళద్బాష్ప మౌత్కంఠ్యా ద్దేవకీసుతే,
నిర్యాత్యగారా న్నోభద్ర మితి స్యాద్బాంధవస్త్రియః.

ఓషధులూ ఋతుధర్మానుసారం సాగుతున్నవి. ప్రజలందరూ సుఖ సంతోషాలతో జీవిస్తున్నారు.

బంధుగణానికీ సుభద్రకూ దుఃఖశాంతికై కొంతకాలం కృష్ణుడు కూడా హస్తినాపురంలో ఉండి ద్వారకా గమనేచ్ఛతో ధర్మరాజు అనుమతిని పొంది పెద్దలకు నమస్కరించి తోడివారిని ఆలింగనం చేసు కుని పిన్నలనాశీర్వదించి ద్వారకకు బయలుదేరుతున్న కృష్ణుని చూచి వియోగాన్ని సహించ లేక వారంతా మూర్ఛితులైనారు. ఒక్కసారి చూచిన మాత్రాన యే జీవీ భగవానుని విరహం సహించ లేదంటే శయనాసనభోజనాదులలో సాన్నిహిత్యంకల పాండవులెట్లు కృష్ణ వియోగాన్ని భరించగలరు? కృష్ణుడు పయనంసాగించే సమయంలో వద్దంటే దుశ్శకునమనే భయంచేత కాదనలేక రెప్పపాటు వేయకుండా వాసుదేవునే చూస్తున్నారు.

మృదంగశంఖభేర్యశ్చ వీణాపణవగోముఖాః,
ధుంధుర్యానకఘంటాద్యా నేదుర్దుందుభయః సమం.
ప్రాసాదశిఖరారూఢాః కురునార్యో దిదృక్షవః,
వవృషుః కుసుమైః కృష్ణం ప్రేమవ్రీడాస్మితేక్షణాః,
సితాతపత్రం జగ్రాహ ముక్తాదామవిభూషితమ్,
రత్నదండం గుడాకేశః ప్రియః ప్రియతమస్య హ.
ఉద్ధవఃసాత్యకిశ్చైవ వ్యజనే పరమాద్భుతే,
వికీర్యమాణః కుసుమైః రేజే మధుపతిః పథి.
అశ్రూయంతాశిషః సత్యాస్తత్ర తత్ర ద్విజేరితాః,
నానురూపానురూపాశ్చ నిర్గుణస్య గుణాత్మనః.
అన్యోన్యమాసీత్సంజల్ప ఉత్తమశ్లోకచేతసామ్,
కౌరవేంద్రపురస్త్రీణాం సర్వశ్రుతిమనోహరః.
స వై కిలాయం పురుషః పురాతనో య ఏక ఆసీదవిశేష ఆత్మని,
అగ్రే గుణేభ్యో జగదాత్మనీశ్వరే నిమీలితాత్మన్నిశి సుప్తశక్తిషు.
స ఏవ భూయో నిజవీర్యచోదితాం స్వజీవమాయాం ప్రకృతిం సిసృక్షతీం,
అనామరూపాత్మని రూపనామనీ విధిత్సమానోఽనుససార శాస్త్రకృత్.
స వా అయం యత్పదమత్ర సూరయో జితేంద్రియా నిర్జితమాతరిశ్వనః,
పశ్యంతి భక్త్యుత్కలితామలాత్మనా నన్వేష సత్త్వం పరిమార్ష్టుమర్హతి.

శ్రీహరి ప్రస్థానం సాగించే సమయంలో భేరీ మృదంగ వీణా వేణు పటహ ఢక్కాది మంగళ వాద్యాలు మారుమోగుతున్నాయి. భగవంతుణ్ణి చూడాలనే ఆశతో కురువంశీయులైన స్త్రీలంతా సౌధాగ్రాలనుండి చూస్తూ పువ్వులవాన కురుపిస్తున్నారు. అర్జునుడు శ్వేతచ్ఛత్రంపట్టాడు. ఉద్ధవుడూ, సాత్యకీ వింజామరలు వీస్తున్నారు. బ్రాహ్మణులు వేదోక్తంగా మంగళాశీర్వాదాలు చేస్తున్నారు. హస్తినాపురంలో ఉన్న ఉత్తమస్త్రీలంతా కృష్ణాయత్తమైన చిత్తములతో వారిలో వారిలా చెప్పుకుంటున్నారు.

సఖులారా! సనాతనుడైన పరమపురుషుడితడే. ప్రళయ కాలంలో కూడా అద్వితీయమైన నిర్విశేష రూపంతో ఉండి సమస్త జీవబీజములనూ తనయందే లయం చేసుకుంటాడు. ఆ సమయంలో త్రిగుణాలూ కూడఉండవు. మహత్తత్త్వాదులన్నీ అవ్యక్తంలో లీనమై పరమాత్మ

స వా అయం సఖ్యనుగీతసత్కథో వేదేషు గుహ్యేషు చ గుహ్యవాదిభిః
య ఏక ఈశో జగదాత్మలీలయా సృజత్యవత్యత్తి న తత్ర సజ్జతే.
యదా హ్యధర్మేణ తమోధియో నృపా జీవంతి తత్రైష హి సత్త్వతః కిల,
ధర్మం భగం సత్యమృతం దయాం యశో భవాయ రూపాణి దధద్యుగే యుగే.
అహో బత శ్లాఘ్యతమం యదోః కులం అహో అలం పుణ్యతమం మధోర్వనం,
యదేష పుంసామృషభః శ్రియః పతిః స్వజన్మనా చంక్రమణేన చాంచతి.
అహో బత స్వర్యశసస్తిరస్కరీ కుశస్థలీ పుణ్యయశస్కరీ భువః,
పశ్యంతి నిత్యం యదనుగ్రహేషితం స్మితావలోకం స్వపతిం స్మ యత్ప్రజాః,
నూనం వ్రతస్నానహుతాదినేశ్వరః సమర్చితో హ్యస్య గృహీతపాణిభిః,
పిబంతి యాః సఖ్యధరామృతం ముహుర్వ్రజస్త్రియః సమ్ముముహుర్యదాశయాః,
యా వీర్యశుల్కేన హృతాః స్వయంవరే ప్రమథ్య చైద్యప్రముఖాన్హి శుష్మిణః,
ప్రద్యుమ్నసాంబప్రసవాదయోఽపరా యాశ్చాహృతా భౌమవధే సహస్రశః.
ఏతాః పరం స్త్రీత్వమపాస్తపేశలం నిరస్తశౌచం బత సాధు కుర్వతే,
యాసాం గృహాత్పుష్కరలోచనః పతిర్న జాత్వపైత్యాహృతిభిర్హృది స్పృశన్.
ఏవంవిధా వదంతీనాం స గిరః పురయోషితాం,
నిరీక్షణేనాభినందన్ సస్మితేన యయౌ హరిః.

యందే ప్రవేశిస్తాయి. తిరిగి సృష్టి ఆరంభం కావాలనే సంకల్పం జనించగానే నామరూపాత్మకమైన యీ సృష్టి అంతా ఆరంభమౌతుంది. ప్రపంచవ్యవహారానికిగాను వేదాదులను కూడా రచిస్తాడు. ఆ పరమాత్మయే యీ కృష్ణుడు. లోకంలో అధర్మం పెరిగి ఆసురీ ప్రవృత్తి వృద్ధిజెందినపుడల్లా యేదో ఒక రూపంలో అవతరించి అధర్మాన్నీ అసురులనూ ఖండించి శిష్టరక్షణ ధర్మస్థాపనా చేస్తూ ఉంటాడు. శ్రీకృష్ణుడవతరించడం వల్ల యదువంశం పవిత్రమైయింది. ఈతడు నివసించడంచేత ద్వారక స్వర్గాన్ని తిరస్కరించింది. వ్రత, దాన, తపస్సులచే యెన్ని జన్మలలో శ్రీహరినారాధిస్తే ఆ పదహారు వేలనూటయెనమండుగురికీ కృష్ణుని భర్తగా వరించే యోగం కలిగిందో కదా! స్వయంవరంలో శిశుపాల, జరాసంధులను జయించి బాహుబలాన్ని ప్రదర్శించి రుక్మిణిని గ్రహించాడు. అట్టి శ్రీహరి నెవడు వర్ణించగలడు. ద్వారకావాసు లెంత ధన్యులో! అని ప్రపంచాన్ని మరచారు.

అజాతశత్రుః పృతనాం గోపీథాయ మధుద్విషః,
పరేభ్యః శంకితః స్నేహాత్ప్రాయుంక్త చతురంగిణీం.
అథ దూరాగతాన్ శౌరిః కౌరవాన్విరహాతురాన్,
సన్నివర్త్య దృఢస్నిగ్ధాన్ప్రాయాత్స్వనగరం హరిః.
కురుజాంగలపాంచాలాన్ శూరసేనాన్ స యామునాన్,
బ్రహ్మావర్తం కురుక్షేత్రం మత్స్యాన్ సారస్వతానథ.
మరుధన్వాతిక్రమ్య సౌవీరాభీరయోః పరాన్,
ఆనర్తాన్భార్గవః ప్రాగాచ్ఛ్రాంతవాహో మనాగ్విభుః.
తత్రతత్ర హ తత్రత్యైః హరిః ప్రత్యుద్యతార్హణః,
సాయం భేజే దిశం పశ్చాద్గవిష్ఠో గాం గతస్తదా.

శ్రీకృష్ణుడు హస్తినాపురం విడిచి ప్రయాణం సాగిస్తూ ఉంటే రథ గజ తురగ పదాతివర్గంతో ధర్మరాజాదులు వెన్నంటి చాలా దూరం వరకూ వస్తుంటే కృష్ణుడు బలవంతంగా వారిని వెనుకకు పంపి వేసి ఉద్ధవ సాత్యకుల సమేతంగా కురుజాంగల పాంచాల శూరసేనాది దేశాలు దాటి బ్రహ్మావర్త కురుక్షేత్ర మత్స్య సారస్వత మరుదేశాలు ప్రయాణం సాగిస్తూ ఉంటే అశ్వాలు దీర్ఘ ప్రయాణం సాగించడం వల్ల అలసిపోతున్నాయి. మధ్య మధ్య అనేక దేశాల్లో శ్రీకృష్ణునికి ఉపహారాలు సమర్పిస్తూ ఉన్నారు. నిత్యం సకాలంలో సంధ్యావందనాలు చేసుకుంటూ క్రమంగా వాసుదేవుడు తన ఆనర్తక దేశం చేరాడు.

## 10. అధ్యాయం

ఆనర్తాన్ స ఉపవ్రజ్య స్వృద్ధాన్ జనపదాన్ స్వకాన్,
దధ్మౌ దరవరం తేషాం విషాదం శమయన్నివ.
స ఉచ్చకాశే ధవలో దరోదరో ఉప్యురుక్రమస్యాధరశోణశోణిమా,
దాధ్మాయమానః కరకంజసంపుటే యథాబ్జఖండే కలహంస ఉత్స్వనః.

శ్రీకృష్ణుడు ద్వారకానగరం సమీపించిన తోడనే పాంచజన్యం పూరించాడు. మధురమైన పాంచజన్య శబ్దం విన్నారో లేదో నగర వాసులందరూ కృష్ణ దర్శనాభిలాషతో ఎదురుగా వచ్చి హారతి

తముపశ్రుత్య నినదం జగద్భవభయావహం,
ప్రత్యుద్యయుః ప్రజాః సర్వా భర్తృదర్శనలాలసాః.
తత్రోపనీతబలయో రవేర్దీపమివాదృతాః,
ఆత్మారామం పూర్ణకామం నిజలాభేన నిత్యదా,
ప్రీత్యుత్ఫుల్లముఖాః ప్రోచుర్హర్ష గద్గదయా గిరా,
పితరం సర్వసుహృదమవితారమివార్భకాః.
నతాః స్మ తే నాథ తవాంఘ్రిపంకజం విరించివైరించసురేంద్రవందితం,
పరాయణం క్షేమ మిహేచ్ఛతాం పరం న యత్ర కాలః ప్రభవేత్పరః ప్రభుః
భవాయ నస్త్వం భవ విశ్వభావన త్వమేవ మాతాథసుహృత్పితా పతిః,
త్వం సద్గురుర్నః పరమం చ దైవతం యస్యానువృత్త్యా కృతినో బభూవిమ.
అహో సనాథా భవతాస్మ యద్వయం త్రైవిష్టపానామపి దూరదర్శనం,
ప్రేమస్మితస్నిగ్ధ నిరీక్షణాననం పశ్యేమ రూపం తవ సర్వసౌభగం.
యర్హ్యంబుజాక్షాపససార భో భవా న్కురూన్మధూన్వాథ సుహృద్దిదృక్షయా,
తత్రాబ్దకోటిప్రతిమః క్షణోఽభవ ద్రవేర్వినాక్ష్ణో మివ నస్తవాచ్యుత.
ఇతి చోదీరితా వాచః ప్రజానాం భక్తపాలకః,
శృణ్వన్ననుగ్రహం దృష్ట్యా వితన్వన్ప్రావిశత్పురీం.

పేకంతో ఆనంద బాష్పాలు రాలుస్తూ గద్గద కంఠంతో – కృష్ణా! భక్తవత్సలా బ్రహ్మేంద్రాదులూ శంకరుడూ మొదలైన దేవాధిదేవత లందరూ నీకు నమస్కరిస్తారు. నీ రక్షణలో ఉన్న జీవిని సర్వసమర్థమైన కాలంకూడా యేమీ చేయలేదు. అట్టి నీకు నమస్కార మని నమస్కరిస్తూ స్వాగతమిచ్చిన ద్వారకావాసుల నందరనూ ఆదరించి ద్వారకానగరంలో ప్రవేశించాడు. సమస్త ఋతుధర్మాలూ కలిగి మధు భోజ అంధక వృష్ణి దాశార్హ కుకుర యదు వీరులతో కూడి భోగవతీ నగరంతో సమానమైన ద్వారకానగరానికి ఉద్యాన వనాలూ కమలములతో కూడిన సరోవరాలూ నూతన శోభ కల్పిస్తున్నాయి. శ్రీకృష్ణుడు వస్తున్నాడనే ఆనందం చేత నగరం అంతా స్వాగత పత్రాలతోనూ ధ్వజ, పతాక, తోరణాదులతోనూ అలంకరించారు. రాజమార్గాలపై నగరవీధులపై సుగంధ జలాలు చల్లి ముత్యాల ముగ్గు పెట్టి కృష్ణునిపై పువ్వులు చల్లుతూ ప్రతీ ద్వారందగ్గరా నీరా జనలిస్తూ ఉపహారాలు సమర్పిస్తూ గౌరవ సత్కారాలు చేస్తు

మధుభోజదశార్హార్హకుకురాంధకవృష్ణిభిః,
ఆత్మతుల్యబలైర్గుప్తాం నాగైర్భోగవతీమివ,
సర్వర్తుసర్వవిభవైః పుణ్యవృక్షలతాశ్రమైః.
ఉద్యానోపవనారామైర్వృతాం పద్మాకరశ్రియం,
గోపురద్వారమార్గేషు కృతకౌతుకతోరణాం.
చిత్రధ్వజపతాకాగ్రైరంతః ప్రతిహతాతపామ్.
సంమార్జితమహామార్గరథ్యాపణకచత్వరాం,
సిక్తాం గంధజలైరుప్తాం ఫలపుష్పాక్షతాంకురైః.
ద్వారి ద్వారి గృహాణాం చ దధ్యక్షతఫలేక్షుభిః,
అలంకృతాం పూర్ణకుంభైర్బలిభిర్ధూపదీపకైః.
నిశమ్య ప్రేష్ఠమాయాంతం వసుదేవో మహామనాః,
అక్రూరశ్చోగ్రసేనశ్చ రామశ్చాద్భుతవిక్రమః.
ప్రద్యుమ్నశ్చారుదేష్ణశ్చ యే చ సాంబగదాదయః,
ప్రహర్ష వేగోచ్ఛ్వసితశయనాసనభోజనాః.
వారణేంద్రం పురస్కృత్య బ్రాహ్మణైస్ససుమంగళైః.
శంఖతూర్యనినాదేన బ్రహ్మఘోషేణ చాదృతాః.

న్నారు. వసుదేవ అక్రూర ఉగ్రసేన బలరామ చారుదేష్ణ ప్రద్యుమ్న సాంబాదులు వాసుదేవుని రాకవల్ల కలిగిన ఆనందంలో అన్నపానాదులుకూడా విడచి శ్వేతగజాన్ని ముందుంచుకుని మంగళ ద్రవ్యాలతో యెదురుగా వెళుతున్నారు. దేవాంగనలతో సమానమైన సౌందర్యం గల వారాంగనలు కృష్ణలీలాగానం చేస్తూ వచ్చారు. వారి నందరనూ చూచి వాసుదేవుడు వారి వారి కనుగుణమైన ఆద రాభిమానాలు చూపుతూ కొందరికి శిరస్సువంచి కొందరికి వాక్కు తోనూ నమస్కరిస్తూ కొందరిని కౌగలించుకొని మరికొందరివైపు చిరునవ్వు ప్రసరిస్తూ వారి వారి మనోగతాభిప్రాయాల ననుసరించి ఆనందింపజేసి చాండాలాది సర్వవర్ణములవారికీ ఆనందం చేకూర్చి సపత్నీకులైన బ్రాహ్మణుల ఆశీర్వాదాలు గ్రహించి వంది మాగధుల కైవారాలతో నగరం ప్రవేశించాడు. పీతాంబరధారి ద్వారకానగర వాసులైన నరనారీజనుల కానందం కలిగిస్తూ ఛత్ర చామరాది రాజ లక్షణలక్షితుడై నగరులో ప్రవేశించి తల్లిదండ్రుల భవనంచేరి ప్రప్రథ

ప్రత్యుజ్జగ్మూ రథైర్హృష్టైః ప్రణయాగతసాధ్వసాః,
వారముఖ్యాశ్చ శతశో యానైస్తద్దర్శనోత్సుకాః.
లసత్కుండలనిర్భాతకపోలవదనశ్రియః,
నటనర్తకగంధర్వాస్సూతమాగధవందినః.
గాయంతి చోత్తమశ్లోక చరితాన్యద్భుతాని చ,
భగవాంస్తత్ర బంధూనాం పౌరాణామనువర్తినామ్.
యథావిధి సమాగమ్య సర్వేషాం మానమాదధే,
ప్రహ్వాభివాదనాశ్లేష కరస్పర్శస్మితేక్షణైః.
ఆశ్వాస్య చాశ్వపాకేభ్యో వరైశ్చాభిమతైర్విభుః.
స్వయంచ గురుభిర్విప్రైస్సదారైః స్థవిరైరపి.
ఆశీర్భిర్యుజ్యమానోఽన్యైర్వందిభిశ్చావిశత్పురం,
రాజమార్గం గతే కృష్ణే ద్వారకాయాం కులస్త్రియః.
హర్మ్యాణ్యారురుహుర్విప్రాస్తదీక్షణమహోత్సవాః
నిత్యం నిరీక్షమాణానాం యదపి ద్వారకౌకసాం.
న వితృప్యంతి హి దృశః శ్రియోధామాంగమచ్యుతం,
శ్రియో నివాసో యస్యోరః పానపాత్రం ముఖం దృశాం

మంగా దేవకీ ప్రభృతులకు నమస్కరించాడు. వారు వెంటనే నందనందనుని ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఆనందించారు. తల్లుల ఆజ్ఞతీసుకొని క్రమంగా పదహారు వేలమంది భార్యలనూ చూడటానికి వారి గృహాలకు వెళ్ళాడు. శ్రీహరి అనంతుడు గనుక అనంతరూపాలతో ఒక్కసారిగానే అన్ని వేల గృహాలయందూ గోచరించాడు. చిరకాల వియోగంలో ఉన్న వారంతా కృష్ణదర్శనం వల్ల కలిగిన ఆనందంలో మైమరచి సిగ్గుతో తలవంచి నిలచారు. శ్రీకృష్ణ సందర్శనం వల్ల కలిగిన ఆనంద బాష్పాలు ఎంత నిరోధించినా నిరోధింప బడక ముత్యాల వలె రాలడం ఆరంభించాయి. మహా భక్తిగల ఆ కాంతలకు కృష్ణసందర్శనం ఏకాంతంగా కలుగుతున్నా తృప్తి కలగటం లేదు. ముని జన మోహనుడైన శ్రీకృష్ణుని క్షణిక వియోగంమాత్రమెవరు భరించగలరు?

అరణ్యంలో వాయుసంఘర్షణవల్ల అగ్ని జనించి ఆ అరణ్యాన్నే దహించినట్లు భూ భార భూతులైన రాజులు వారిలో వారు కలహించి మరణించారు. ఇదంతా శ్రీకృష్ణుని మాయా ప్రభావమే

బాహవో లోకపాలానాం సారంగాణాం పదాంబుజం.
సితాతపత్రవ్యజనైరుపస్కృతః ప్రసూనవర్షైరభివర్షితః పథి,
పిశంగవాసా వనమాలయా బభౌ ఘనో యథార్కోడుపచాపవైద్యుతైః.
ప్రవిష్టస్తు గృహం పిత్రోః పరిష్వక్తస్స్వమాతృభిః,
వవందే శిరసా సప్త దేవకీప్రముఖాస్తదా.
తాః పుత్రమంకమారోప్య స్నేహస్నుతపయోధరాః,
హర్షవిహ్వలితాత్మానస్సిషిచుర్నేత్రజైర్జలైః.
అథావిశత్స్వభవనం సర్వకామమనుత్తమం,
ప్రాసాదా యత్ర పత్నినాం సహస్రాణి చ షోడశ.
పత్న్యః పతిం ప్రోష్య గృహానుపాగతం విలోక్య సంజాతమనో మహోత్సవాః,
ఉత్తస్థురారాత్సహసాసనాశయాత్సాకం వ్రతైర్వ్రీడితలోచనాననాః.
తమాత్మజైర్దృష్టిభిరంతరాత్మనా దురంతభావాః పరిరేభిరే పతిం.
నిరుద్ధమప్యాస్రవదంబునేత్రయోర్విలజ్జితానాం భృగువర్యవిక్లబాత్.
యద్యప్యసౌ పార్శ్వగతో రహోగతస్తథాప్యం ఘ్రియుగం నవంనవం,
పదే పదే కా విరమేత తత్పదాచ్చలాపి యం శ్రీర్నజహాతికర్హిచిత్.
ఏవం నృపాణాం క్షితిభారజన్మనామక్షౌహిణీభిః పరివృత్తతేజసాం,
విధాయ వైరం శ్వసనో యథానలం మిథో వధేనోపరతో నిరాయుధః.
స ఏవం నరలోకేఽస్మిన్నవతీర్ణస్స్వమాయయా.
రేమే స్త్రీరత్నకూటస్థో భగవాన్ప్రాకృతో యథా.
ఉద్దామభావపిశునామలవల్గుహాసవ్రీడావలోకనిహతో మదనోఽపి యాసాం,
సంముహ్య చాపమజహాత్ప్రమదోత్తమాస్తాయస్యేంద్రియం విమథితుంకుహకైర్న శేకుః.
మన్యతే తమయం లోకో హ్యసక్తమపి సంగినం,
ఆత్మౌపమ్యేన మనుజం వ్యాపృణ్వానమతో బుధః.
ఏతదీశనమీశస్య ప్రకృతిస్థోఽపి తద్గుణైః,
న యుజ్యతే సదాత్మస్థైర్యథా బుద్ధిస్తదాశ్రయా.
తం మేనిరేఽబలామౌఢ్యాత్ స్త్రైణంచానువ్రతం రహః,
అప్రమాణవిదో భర్తురీశ్వరం మతయో యథా.

ఆ అనంతుడే ఈ ద్వారకానగరంలో పదహారువేల భార్యలతో అందరకూ అన్నిరూపాలతో ఆనందాన్ని చేకూర్చాడు. హరి లీలలను గ్రహించలేని మూర్ఖులు తమతో సమానంగా వాసుదేవుని యందు కూడా సంసార ధర్మాలు ఆరోపిస్తారు. ఆ స్త్రీలుకూడా శ్రీకృష్ణుడు తమ భర్త యని కామాదులకు లోనైన వాడనీ భావించి భగవంతుని ఐశ్వర్యాన్ని గుర్తించలేక ప్రాకృతుడుగా భావించి ఆనందిస్తున్నారు.

## 11 అధ్యాయం

అశ్వత్థామ్నోపసృష్టేన బ్రహ్మశీర్షోరుతేజసా,
ఉత్తరాయా హతో గర్భః కృష్ణేనాజీవితః పునః
తస్య జన్మ మహాబుద్ధేః కర్మాణి చ మహాత్మనః,
నిధనం చ యథైవాసీత్స ప్రేత్య గతవాన్ యథా.
తదిదం శ్రోతుమిచ్ఛామి గదితుం యది మన్యసే,
బ్రూహి నశ్రద్దధానానాం యస్య జ్ఞానమదాచ్ఛుకః.
అపీపలద్ధర్మరాజః పితృవద్రంజయన్ప్రజాః,
నిస్పృహస్సర్వకామేభ్యః కృష్ణపాదానుసేవయా.
సంపదః క్రతవో లోకాః మహిష్యోభ్రాతరో మహీ,
జంబూద్వీపాధిపత్యం చ యశశ్చ త్రిదివం గతమ్.
కిం తే కామాస్సురస్పృహ్యా ముకుందమనసో ద్విజ,
అధిజహ్రుర్ముదం రాజ్ఞః క్షుధితస్య యథా పరే.
మాతుర్గర్భగతో వీరస్స తదా భృగునందన.
దదర్శ పురుషం కంచిద్దహ్యమానోఽస్త్రతేజసా.
అంగుష్ఠమాత్రమమలం స్ఫురత్పురటమౌళినమ్.
అపీచ్యదర్శనం శ్యామం తటి ద్వాససమచ్యుతమ్.

అశ్వత్థామచే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రంచే నష్టమైన ఉత్తరాగర్భం భగవంతుడైన వాసుదేవునిచే పునః ప్రతిష్ఠితమై పరీక్షిత్తు జన్మించాడు. జ్ఞాని యగు నాతని జన్మ కర్మా మృత్యువు అనంతరం యే గతిని పొందాడో సవిస్తరంగా వినిపించమని అడిగిన శౌనకునకు సూతుడు చెప్పడం మొదలు పెట్టాడు.

శౌనకా! ధర్మరాజు తన రాజ్యంలో ప్రజలను తండ్రితో సమానంగా పాలిస్తూ శ్రీకృష్ణ ధ్యానం చేస్తూ భోగవిరక్తుడై చరిస్తున్నాడు. అతడు ఐశ్వర్యములు కలిగి అనేక యజ్ఞాలు చేసి స్వర్గలోకం పొందడానికి అధికారం పొందాడు. సమస్త భూమండలం యుధిష్ఠిరుని అధీనంలోనే ఉంది. ఆయన కీర్తి స్వర్గందాకా వ్యాపించింది. దేవతలు వాంఛించదగిన భోగ సామగ్రి ఉండి కూడా విరాగిగానే ఉంటున్నాడు.

ఉత్తరాగర్భస్థుడైన పరీక్షిత్తు అశ్వత్థామచే ప్రయుక్తమైన బహ్మాస్త్రంచే పీడింప బడునప్పుడు అంగుష్ట మాత్ర శరీరుడైన పీతాం

శ్రీమద్దీర్ఘచతుర్బాహుం తప్తకాంచనకుండలమ్,
క్షతజాక్షం గదాపాణిమాత్మ నస్సర్వతో దిశమ్.
పరిభ్రమంతముల్కాభాం భ్రామయంతం గదాం ముహుః,
అస్త్రతేజస్స్వగదయా నీహారమివ గోపతిః.
విధమంతం సన్నికర్షేపర్యైక్షత క ఇత్యసౌ,
విధూయ తదమేయాత్మా భగవాన్ ధర్మగుబ్విభుః.
పశ్యతో దశమాస్యస్య తత్రైవాంతర్దధే హరిః.
తతస్సర్వగుణోదర్కే సానుకూలగ్రహోదయే.
జజ్ఞే వంశధరః పాండోర్భూయః పాండురివౌజసా,
తస్య ప్రీతమనా రాజా విప్రైర్ధౌమ్యకృపాదిభిః.
జాతకం కారయామాస వాచయిత్వాచ మంగళమ్,
హిరణ్యం గాం మహీం గ్రామాన్ హయాంశ్చ నృపతిర్వరాన్.
ప్రాదాత్స్వన్నం చ విప్రేభ్యః ప్రజాతీర్థే స తీర్థవిత్,
తమూచుర్బ్రాహ్మణాస్తుష్టా రాజానంప్రశ్రయాన్వితమ్.
ఏషహ్యస్మిన్ప్రజాతంతౌ పురూణాం పౌరవర్షభ
దైవేనాప్రతిఘాతేన శుక్లేసంస్థాముపేయుషి.

బరధారిని చూచి యెవరీ పురుషుడని ఆలోచిస్తూండగా శ్రీహరి బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించి అక్కడే అంతర్థానమైనాడు.

అనంతరం యోగ్యమైన తిథి, వార, నక్షత్ర లగ్నములతో కూడిన శుభ సమయంలో పరీక్షిత్తు దివ్య తేజంతో జన్మించాడు. ఆ సమయంలో గ్రహాలన్నీ ఉత్తమస్థానాలలో ఉన్నాయి. పరీక్షిత్తు జన్మవృత్తాంతం విని ధర్మరాజు ఆనందంతో ధౌమ్య కృపాచార్యాదులను పిలిపించి మంగళ వాచనములు, జాతకర్మ చేయించాడు. ప్రజాతీర్థ నామకమైన ఆ సమయంలో ధర్మరాజు గోభూసువర్ణాలూ, ఏనుగులూ, గుర్రాలూ మొదలైనవన్నీ ఉత్తములకు దానంచేసి అన్నదానం కూడా చేశాడు. సంతుష్టులైన బ్రాహ్మణులు కృష్ణానుగ్రహంవల్ల పాండవ వంశం నిలిచిందని ఆనందం వెల్లడిస్తూ ఆనందించారు. వారిని చూచి – విద్వాంసులారా ఈ బాలకుడు దీర్ఘాయుర్దాయం కలవాడై పవిత్రమైన కీర్తిని ప్రతిష్ఠించి రాజర్షుల ననుసరిస్తాడా – అని అడిగిన ధర్మరాజుకి ఆ బ్రాహ్మణులు ఇలా చెప్పుతున్నారు.

రాతో వేఽనుగ్రహార్థాయ విష్ణునా ప్రభవిష్ణునా,
తస్మాన్నామ్నా విష్ణురాత ఇతి లోకే బృహచ్ఛ్రవాః.
భవిష్యతి న సందేహో మహాభాగవతోత్తమః.
అప్యేష వంశ్యాన్రాజర్షీన్పుణ్యశ్లోకాన్మహాత్మనః.
అనువర్తితాస్విద్య శసా సాధువాదేన సత్తమః.
పార్థ ప్రజావితా సాక్షాదిక్ష్వాకురివ మానవః.
బ్రహ్మణ్యస్సత్యసంధశ్చరామో దాశరథిర్యథా,
ఏషదాతాశరణ్యశ్చ యథాహ్యౌశీనరశ్శిభిః.
యశోవితనితాస్వానాం దౌష్యంతిరివ యజ్వనామ్,
ధన్వినామగ్రణీరేషతుల్యశ్చార్జునయో ర్ద్వయోః.
హుతాశఇవ దుర్ధర్షస్సముద్ర ఇవ దుస్తరః,
మృగేంద్రఇవ విక్రాన్తో నిషేవ్యో హిమవానివ.
తితిక్షుర్వసుధేవాసౌ సహిష్ణుః పితరావివ,
పితామహసమస్సామ్యే ప్రసాదే గిరిశోపమః.
అశ్రయస్సర్వభూతానాం యథా దేవో రమాశ్రయః,
సర్వసద్గుణమాహాత్మ్యే ఏషకృష్ణమనువ్రతః.

ధర్మనందనా! ఈ బాలుడు ఇక్ష్వాకులతో సమంగా ప్రజలను పాలిస్తాడు. రామచంద్రునితో సమానంగా బ్రాహ్మణ భక్తీ, సత్య ప్రతిజ్ఞా కలవాడవుతాడు. శిబితో సమానమైన దాత, భరతునితో సమానమైన యజ్వ, కార్తవీర్యార్జునునితో సరితూగు ధనుర్ధారి, అగ్ని వలే దుర్ధర్షుడు, సముద్రునివలె దుస్తరుడు, సింహ సమ పరాక్రముడు, హిమాచలంవలె ఆశ్రయుడు, భూమితో సమానమైన తితిక్షు, తలి దండ్రులతో సమానమైన సహనం, బ్రహ్మయందుండే సమత్వం, శంకరుని యందుండే కృప కలిగి ప్రాణులకు ఆశ్రయ మిచ్చుటలో శ్రీహరితో సమానుడౌతాడు. సమస్త సద్గుణాలు యీ బాలుని యందుండడంవల్ల కృష్ణుని కత్యంత ప్రేమ పాత్రు డౌతాడు.

రంతిదేవుని యందున్న ఔదార్యం, యయాతి యందున్న ధార్మి కత్వం, ప్రహ్లాదుని వంటి దృఢనిష్ఠ కలిగి బలితో సమానమైన ధైర్యం కలవాడు కూడా తా గలడు. అనేక అశ్వమేధాలుచేసి వృద్ధులను

రంతి దేవఇవోదార్యే యయాతిరివ ధార్మికః,
ధృత్యా బలిసమః కృష్ణేప్రహ్లాదఇవ సద్గ్రహః.
ఆహర్తైషో౽శ్వమేధానాం వృద్ధానాం పర్యుపాసకః,
రాజర్షీణాం జనయితా శాస్తాచో త్పథగామినామ్.
నిగృహీతా కలేశ్చైషభువో ధర్మస్య కారణాత్,
తక్షకాదాత్మనో మృత్యుం ద్విజపుత్రోపసర్జితాత్.
ప్రపత్స్యత ఉపశ్రుత్య ముక్తసంగః పదం హరేః.
జిజ్ఞాసితాత్మయాథాత్మ్యో మునేర్వ్యాససుతాదసౌ.
హిత్వేదం నృప గంగాయాం యాస్యత్యద్ధా౽కుతోభయం,
ఇతి రాజ్ఞ ఉపాదిశ్య విప్రాజాతకకోవిదాః.
లబ్ధాపచితయస్సర్వే ప్రతిజగ్ముః స్వకాన్ గృహాన్,
స ఏవ లోకే విఖ్యాతః పరీక్షిదితి యత్ప్రభుః.
గర్భేదృష్టమభిధ్యాయన్పరీక్షేత నరేష్విహ.
స రాజపుత్రో వవృధే హ్యాశు శుక్లఇవోడురాట్.
ఆపూర్యమాణః పితృభిః కాష్ఠాభిరివ సో౽న్వహం,
యక్ష్యమాణో౽శ్వమేధేన జ్ఞాతిద్రోహజిహాసయా.

సేవించి రాజర్షి తుల్యుడైన కుమారుని కని దుష్టులను శిక్షిస్తూ కలి యుగంలో కృతయుగ ధర్మాలు ప్రతిష్ఠించి బ్రాహ్మణ శాపంచే తక్షకుని వల్ల తనకు మరణం కలుగుతుందని తెలిసికొని సర్వసంగపరిత్యాగంచేసి వ్యాసపుత్రుడైన శుకునివల్ల భాగవత తత్వం గ్రహించి ఆత్మ జ్ఞానం పొంది గంగాతీరంలో దేహ త్యాగం చేసి నిరతిశయానందం పొందగలడని చెప్పిన దైవజ్ఞులను పూజించి ధర్మరాజు వారి వారి ఇండ్లకు పంపివేశాడు. ఆ బాలుడు దిన దిన ప్రవర్ధమానంగా వృద్ధిచెందుతున్నాడు. గర్భమందే భగవానునిచే రక్షింపబడ్డ ఆ బాలుడెట్లు వృద్ధిచెందుతాడో ఏ ఏ పనులు చేస్తాడో అని విజ్ఞులతని జీవితాన్ని అనుక్షణం పరీక్షిస్తూ ఉండడం వల్ల అతడు పరీక్షిత్తు అని పిలువబడ్డాడు.

ఆ సమయంలో ధర్మరాజు బంధువధకు ప్రాయశ్చిత్తంగా యజ్ఞం చెయ్యాలని నిశ్చయించుకొని తన దగ్గర పన్నుల రూపంలోనూ

రాజా లబ్ధధనో దధ్యౌ నాన్యత్ర కరదండయోః,
తదభిప్రేతమాలక్ష్య భ్రాతరోఽచ్యుతచోదితాః.
ధనం ప్రహీణమాజహ్రురుదీచ్యాం భూరిశో దిశి,
తేన సంభృతసంభారో లబ్ధకామో యుధిష్ఠిరః.
వాజిమేధైస్త్రిభిర్భీతో యజ్ఞైశ మయజద్ధరిమ్,
ఆహూతో భగవాన్ రాజ్ఞా యాజయిత్వా ద్విజైర్నృపమ్.
ఉవాస కతిచిన్మాసాన్ సుహృదాంప్రియకామ్యయా,
తతో రాజ్ఞాభ్యనుజ్ఞాతః కృష్ణయా సహ బంధుభిః.
యయౌ ద్వారవతీం బ్రహ్మన్ సార్జునో యదుభిర్వృతః.

దండవిధానంగానూ ఆర్జించినదే గాని పవిత్రంగా ఆర్జించిన ధనం లేక పోవడంచేతవిచారిస్తూంటే కృష్ణుడది గ్రహించి – ధర్మనందనా! ఉత్తర దిక్కున అధికమైన ధనము ఉంది. అది మరుత్తనే మహారాజు యజ్ఞం చేసి బంగారు పాత్రలూ ధనం అక్కడ వదలివేశాడు. బ్రాహ్మణులకు అధికంగా ధనం యిస్తే ఆ ఋత్విక్కులు స్వల్పంగా తీసికొని మిగిలిన దంతా అక్కడే వదిలేశారు. ఆ ధనానికి యిప్పుడు యజమాని లేడు. ధర్మాన్ననుసరించి ఆ ధనం ప్రభువుకే చెందుతుంది. అర్జునుని పంపి ఆ ధనం తెప్పించి నీ వీ యజ్ఞం చెయ్యి – అనగా ఆ ఆజ్ఞ శిరసా వహించి పార్థునిద్వారా ఆ ధనం గ్రహించి ధర్మనందనుడు మూడు అశ్వమేధాలు చేసి భగవంతుని అనుగ్రహం పొందగలిగాడు. వాసుదేవుడు దగ్గరనే ఉండి ధర్మరాజుచేత అశ్వమేధం చేయించి వారికి ఆనందం ప్రసాదించి ద్వారకకు వెళ్ళిపోయాడు.

## 12 అధ్యాయం

విదురస్తీర్థయాత్రాయాం మైత్రేయాదాత్మనో గతిమ్,
జ్ఞాత్వాఽగాద్ధాస్తినపురం తయావాప్తవివిత్సితః.

తీర్థయాత్రలో మైత్రేయుని వల్ల ఆత్మజ్ఞానం గ్రహించి తిరిగి హాస్తినాపురం వచ్చిన వృత్తాంతం విని ధర్మరాజు సపరివారంగా యెదురువెళ్లి స్వాగతమిచ్చి ఆనందంతో తీసుకువచ్చి ఉత్తమాసనం

యావతః కృతవాన్ ప్రశ్నాన్ క్షత్తా కౌషారవాగ్రతః,
జాతైకభక్తిర్గోవిందే తేభ్యశ్చోపరరామ హ.
తంబంధుమాగతం దృష్ట్వా ధర్మపుత్రః సహానుజః,
ధృతరాష్ట్రో యుయుత్సుశ్చ సూతశ్శారద్వతః పృథా.
గాంధారీ ద్రౌపదీ బ్రహ్మన్ సుభద్రా చోత్తరా కృపీ,
అన్యాశ్చ జామయః పాండోర్జ్ఞాతయస్ససుతాః స్త్రియః.
ప్రత్యుజ్జగ్ముః ప్రహర్షేణ ప్రాణం తన్వ ఇవాగతమ్,
అభిసంగమ్య విధివత్పరిష్వంగాభివాదనైః.
ముముచుః ప్రేమబాష్పౌఘం విరహౌత్కంఠ్యకాతరాః,
రాజా తమర్హయాంచక్రే కృతాసనపరిగ్రహమ్.
తం భుక్తవంతం విశ్రాంతమాసీనం సుఖమాసనే.
ప్రశ్రయావనతో రాజా ప్రాహ స్వానాం విశృణ్వతామ్.
అపిస్మరథ నోయుష్మత్పక్షచ్ఛాయాసమేధితాన్ ?
విపద్గణాద్విషాగ్న్యాదేర్మోచితా యత్సమాతృకాః.
కయా వృత్త్యావర్తితం వశ్చరద్భిః క్షితిమండలమ్,
తీర్థానిక్షేత్రముఖ్యాని సేవితానీహ భూతలే.

యిచ్చి విదురుడాసీనుడైన పిమ్మట ధర్మరాజు వినమ్రశీర్షంతో పలుకుతున్నాడు. తండ్రీ! పక్షి గ్రుడ్లను రెక్కల క్రింద ఉంచి పొదిగి పిల్లలను చేసి పెంచినట్లు నువ్వు నీచేతులతో మమ్ములను పెంచి పెద్ద చేశావు. విషాన్నంనుండీ లాక్షాగృహదాహాన్నుంచీ మాత్రమే కాక మాకు కలిగిన అనేక విపత్తులనుండి రక్షించి యింతటి వారమయేలా చేసిన వాడవు. నీకు తీర్థయాత్రా కాలంలో మేము జ్ఞాపకంఉన్నామా? నీవు యాత్రాకాలంలో యే యే క్షేత్రాలుదర్శించావు. స్వతః భక్తుడవైన నీవు తీర్థములను తీర్థం చేయగలవాడవు. యాత్ర చేసేటప్పుడు ద్వారక వెళ్లేవా? అక్కడ బాంధవులూ స్నేహితులూ ఐన యాదవులు కృష్ణునితో కూడా సుఖంగా వున్నారా సవిస్తరంగా చెప్పు — అని అడిగిన ధర్మరాజుతో విదురుడు చెపుతున్నాడు.

ధర్మరాజా! నేను భరతఖండంలో అన్ని క్షేత్రాలు దర్శించాను. ద్వారక కూడా దర్శించాను. అని క్షేత్రవిశేషాలే చెప్పాడు కాని కరుణా

భవద్విధాభాగవతాస్తీర్థభూతాః స్వయంప్రభో,
తీర్థీకుర్వంతి తీర్థాని స్వాంతస్థేన గదాభృతా.
అపి నస్సుహృదస్తాత బాంధవాః కృష్ణదేవతాః,
దృష్టాశ్శ్రుతావా యదవః స్వపుర్యాం సుఖమాసతే.
ఇత్యుక్తోధర్మరాజేన తత్సర్వంసమవర్ణయత్,
యథానుభూతం క్రమశోవినా యదుకులక్షయమ్.
నన్వప్రియం దుర్విషహం నృణాం స్వయముపస్థితం,
నావేదయత్సకరుణో దుఃఖితాన్ ద్రష్టుమక్షమః.
కంచిత్కాలమథావాత్సీత్సత్కృతో దేవవత్సుఖైః,
భ్రాతుర్జ్యేష్ఠస్య శ్రేయస్కృత్సర్వేషాం ప్రీతిమావహన్.
అబిభ్రదర్యమా దండం యథావదఘకారిషు,
యావద్దధార శూద్రత్వం శాపాద్వర్షశతం యమః.
యుధిష్ఠిరో లబ్ధరాజ్యో దృష్ట్వా పౌత్రం కులంధరం,
భ్రాతృభిర్లోకపాలాభైర్ముముదే పరయా శ్రియా.
అథామంత్ర్యాచ్యుతోబంధూన్నివర్త్యానుగతాన్విభుః,
అర్జునోద్ధవశైనేయైర్వృతో ద్వారవతీం యయౌ.

రస హృదయుడైన విదురుడు ధర్మరాజాదులు విచారిస్తారనీ పైగా అమంగళకరమైన విషయమనీ యాదవ నాశనం చెప్పలేదు.

పాండవులు విదురుని దేవతవలె పూజించి ఆరాధిస్తున్నారు. విదురుడు కూడా ధృతరాష్ట్రుని కొరకై కొంతకాలం హస్తినాపురంలోనే ఉన్నాడు. మాండవ్యఋషి శాపంచేత యముడే దాసీ యోని యందు జన్మించి నూరు సంవత్సరాలు భూమండలంలో ఉండవలసి వచ్చింది. కనుకనే విదురుడెప్పుడూ ధర్మచ్యుతుడు కాలేదు. పరీక్షిత్తుని చూసుకొంటూ పాండవులు అఖండైశ్వర్యంతో సుఖములనుభవిస్తున్నారు.

కాలగతి తెలిసిన విదురుడు ధృతరాష్ట్రుని సమీపించి మహారాజా! బాంధవులందరూ నశించారు. నువ్వా వృద్ధుడవయావు కాలవశుడైన మానవుడు బంధువులందరినీ వదలి పోవలసిన వాడై నపుడు ధన ధాన్యాలు శాశ్వతమా? ఐన వారంతా మరణిస్తే నువ్వు

ఏవం గృహేషు సక్తానాం ప్రమత్తానాం తదీహయా,
అత్యక్రామదవిజ్ఞాతః కాలః పరమదుస్తరః.
విదురస్తమభిప్రేత్య ధృతరాష్ట్రమభాషత.
రాజన్నిర్గమ్యతాం శీఘ్రం పశ్యేదం భయమాగతమ్.
ప్రతిక్రియా న యస్యేహ కుతశ్చిత్కర్హిచిత్ప్రభో.
సఏషభగవాన్కాల స్సర్వేషాం నస్సమాగతః.
యేన చైవాభిపన్నోయం ప్రాణైః ప్రియతమైరపి,
జనస్సద్యో వియుచ్యేత కిముతాన్యైర్ధనాదిభిః.
పితృభ్రాతృసుహృత్పుత్రాః హతాస్తే విగతం వయః,
ఆత్మా చ జరయా గ్రస్తః పరగేహముపాససే.
అంధః పురైవ బధిరో మంద ప్రజ్ఞశ్చ సాంప్రతమ్,
విశీర్ణదంతో మందాగ్నిస్సరోగః కఫముద్వహన్.
అహో మహీయసీ జంతోర్జీవితాశా యయా భవాన్,
భీమాపవర్జితం పిండమాదత్తే గృహపాలవత్.
అగ్నిర్నిసృష్టో దత్తశ్చ గరో దారాశ్చ దూషితాః,
హృతం క్షేత్రం ధనం యేషాం తద్దత్తైరసుభిః కియత్.

వృద్ధుడవై పరుల పంచ నుండి భీమసేనుడు తింటి పెడితే తిని బ్రతుకుతున్నావు. ఇది శ్వానంతో సమానమైన లక్షణం. నువ్వెవరినైతే హింసించావో వారి దగ్గరే జీవించడం కంటే నీచాతినీచమైన దింకొకటిలేదు. కనక నువ్వు హస్తినాపురం వదలి సర్వ సంగ పరిత్యాగివై దేహాన్ని చాలిస్తే ఉత్తమ గతి పొందగలవు —అని నీతి మార్గం ఉపదేశించిన విదురుని హితోపదేశంవిన్న ధృతరాష్ట్రుడు తన అంగీకారం వెల్లడించాడు.

వెంటనేధృతరాష్ట్రుని తీసుకొని విదురుడు అరణ్యానికి పయనించడంచూసిన గాంధారి సర్వ సంగ పరిత్యాగం చేసి వారివెనుక నడిచింది. గాంధారీ సమేతంగా ధృతరాష్ట్ర విదురులు హస్తినాపురం వదలి అరణ్యానికి వెళ్లిపోయారు.

ప్రభాత కాలంలో ధర్మరాజు నిత్యకృత్యాలు తీర్చుకుని పెద్దలకు వందనం చేసే అభ్యాసానుసారం ధృతరాష్ట్రుని అంతఃపురానికి వెళ్లి

తస్యాపి తవ దేహోఽయం కృపణస్య జిజీవిషోః,
పరైత్యనిచ్ఛతో జీర్ణో జరయా వాససీ ఇవ,
గతస్వార్థమిమం దేహం విరక్తో ముక్తబంధనః,
అవిజ్ఞాతగతిర్జహ్యాత్సవై ధీరఉదాహృతః.
యస్స్వకాత్పరతోవేహ జాతనిర్వేదఆత్మవాన్,
హృదికృత్వాహరిం గేహాత్ప్రవ్రజే త్సనరోత్తమః.
అథోదీచీం దిశం యాతు స్వైర జ్ఞాతగతిర్భవాన్,
ఇతోర్వాక్ప్రాయశః కాలః పుంసాం గుణవికర్షణః.
ఏవం రాజా విదురేణానుజేన ప్రజ్ఞాచక్షుర్బోధితఆజమీఢః,
ఛిత్వా స్వేషు స్నేహపాశాన్ ద్రఢిమ్నో నిశ్చక్రామ భ్రాతృసందర్శితాధ్వా.
పతింప్రయాతం సుబలస్య పుత్రీ పతివ్రతా చానుజగామ సాధ్వీ,
హిమాలయం న్యస్తదండప్రహర్షం మనస్వినామివ సత్సంప్రహారః,
అజాతశత్రుః కృతమైత్రోహుతాగ్నిర్విప్రాన్నత్వా తిలగోవస్త్రరుక్మైః,
గృహం ప్రవిష్టో గురువందనాయ న చాపశ్యత్పితరౌ సౌబలీం చ.
తత్ర సంజయమాసీనం పప్రచ్ఛోద్విగ్నమానసః,
గావల్గణే క్వనస్తాతో వృద్ధోహీనశ్చ నేత్రయోః.

చూస్తే ధృతరాష్ట్రుడు లేడు సరికదా! గాంధారీ విదురుడూ కూడా లేరు. వారి అదృశ్యానికి ధర్మరాజు విచారించి శోకం భరించలేక వీరు ఏ నదిలోనూ ప్రాణత్యాగం చెయ్యలేదు కదా అని విచారించి వీరి వృత్తాంతమేమైనా నీకు తెలుసునా – అని సంజయుణ్ణి అడుగగా సంజయుడు కూడా అనేక విధాలవిచారిస్తూ నాకేమీ తెలియదని చెపుతుండగానే తుంబురునితో కూడా నారదుడు వచ్చాడక్కడకు. ఆ నారద తుంబురులకు నమస్కరించి వారు యోగ్యాసనాలధిష్టించిన తరువాయి ధర్మరాజు ఇలా అడుగుతున్నాడు.

నారదా! నువ్వు సర్వలోక సంచారివి, సర్వజ్ఞుడవు. ఈ ప్రపంచంలో నీకు తెలియని దేదీ లేదు. మాకు పితృసములైన ధృతరాష్ట్ర విదురులూ, మాతృ సమానురాలైన గాంధారీ యెక్కడకో వెళ్లిపోయారు. వారి జాడ నాకు తెలియ చెప్పు – అనగా నారదుడు –

ధర్మనందనా! నువ్వు వీరిని గూర్చి విచారించకు. ఏమంటే ఈ జగత్తంతా ఈశ్వరాధీనమై ఉంటుంది. సమస్త లోక పాలురూ

అంబా వా హతపుత్రార్తా పితృవ్యః క్వ గతస్సుహృత్,
అపి మ య్యకృతప్రజ్ఞేహతబంధుస్స్వభార్యయా.
ఆశంసమానశ్శమలం గంగాయాం దుఃఖితోఽపతత్,
పితర్యుపరతే పాండౌ సర్వాన్నస్సుహృదశ్శిశూన్.
అరక్షతాం వ్యసనతః పితృవ్యౌ క్వగతావితః.
కృపయాస్నేహవైక్లబ్యాత్సూతో విరహకర్శితః.
అత్మేశ్వరమచక్షాణో నప్రత్యాహాతిపీడితః,
విమృజ్య పాణినాస్త్రాణి విష్టభ్యాత్మానమాత్మనా.
అజాతశత్రుం ప్రత్యూచే భర్తుః పాదావనుస్మరన్,
అహం వ్యవసితం రాజన్నిగ్రోర్వః కురునందన.
నవేద్మి సాధ్వ్యా గాంధార్యా ముషితోఽస్మి మహాత్మభిః,
అథా జగామ భగవాన్నారదస్సహ తుంబురుః.
ప్రత్యుత్థాయాభివాద్యాహ సానుజోఽభ్యర్చయన్నివ.
నాహం వేద గతిం పిత్రోర్భగవన్ క్వ గతః పితా.
అంబా వా హతపుత్రార్తా క్వ గతా చ తపస్వినీ
దిష్ట్యా తే భగవాన్ద్రష్టా మగ్నానాం వ్యసనార్ణవే.
కర్ణధార ఇవాపారే పాహి మాం పారదర్శనః
అథాబభాషే భగవాన్నారదో మునిసత్తమః.

పరమేశ్వరుని ఆజ్ఞా బద్ధులై చరిస్తూంటారు. ఆ భగవానుడే ఒకప్పుడి జీవులకు సంయోగం మరొకప్పుడు వియోగం కల్పిస్తూ ఉంటాడు. ఎద్దు తాడుచే బంధింపబడి బరువులను మోస్తున్నట్లే వర్ణాశ్రమ రూపములైన వేదసూత్రములచే బంధింపబడి ఈశ్వరాజ్ఞానుసారం మానవుడు నడుస్తూ ఉంటాడు. ఐంద్రజాలికుని ఇచ్ఛననుసరించి వస్తువులు సంయోగం పొందుతున్నట్లే భగవానుని ఇచ్ఛానుసారం జీవులకు కూడా సంయోగ వియోగాలు కలుగుతూ వుంటాయి. జీవ రూపంలో నిత్య వస్తువుగా చూసినా దేహరూపంలో అనిత్యంగా చూసినా, జడ రూపంలో అనిత్యంగా చైతన్య రూపంలో నిత్యంగా చూసినా చివరకు శుద్ధ బ్రహ్మ రూపంలో నిత్యా నిత్యాలకు అతీతంగా చూసినా విచారానికి తావులేదు. విచారం మోహజనితమైనది. అందువల్ల విజ్ఞుడైన వాడు దుఃఖించరాదు. వృద్ధులైన ధృతరాష్ట్ర విదురులూ

మా కంచన శుచో రాజన్ యదీశ్వరవశం జగత్,
స సంయునక్తి భూతాని స ఏవ వియునక్తి చ.
లోకాస్సపాల యస్యేమే వహంతి బలిమీశితుః,
యథా గావో నసి ప్రోతాస్తంత్ర్యాం బద్ధాః పదామభిః.
వాక్తంత్ర్యాం నామభిర్బద్ధాః వహంతి బలిమీశితుః,
యథా క్రీడోపస్కరాణాం సంయోగవిగమావిహ.
ఇచ్ఛయా క్రీడితుః స్యాతాం తథైవేశేచ్ఛయా నృణాం,
యన్మన్యసే ధ్రువం లోక మధ్రువం వా న చోభయమ్.
సర్వథాపి న శోచ్యాస్తే స్నేహదన్యత్ర మోహజాత్
తస్మాజ్జహ్యంగ వైక్లబ్య మజ్ఞానకృతమాత్మనః.
కథం త్వదాథాః కృపణావర్తేరన్ బత మామృతే,
కాలకర్మగుణాధీనో దేహోఽ యం పాంచభౌతికః.
కథమన్యాంస్తు గోపాయేత్సర్పగ్రస్తో యథాపరమ్,
అహస్తాని సహస్తానామపదాని చతుష్పదామ్.
ఫల్గూని తత్ర మహతాం జీవో జీవస్య జీవనమ్,
తదిదం భగవాన్ రాజన్నేక ఆత్మాత్మనాం స్వదృక్.

గాంధారీ! మేము లేకుండా ఎలా జీవించగలరనే సంశయం వదలి పెయ్యి. కాల కర్మలకు వశమైన యీ పాంచ భౌతిక శరీరం అజగర ముఖం లోని పురుషుని వలె పరాధీనుడైన మానవుడు తన్ను తానే రక్షించుకో లేడు. వాడు ఇతరుల నేమి రక్షించగలడు. చిన్న జీవులు పెద్ద జీవుల కాహార మౌతాయి. తృణం పశువుల కాహారమైతే నాలుగు కాళ్ల జంతువులు రెండు కాళ్ళ జంతువులకు ఆహారమౌతున్నాయి. అందుచేత ఒక జీవం మరో జీవాని కాహారం.

ఈ సమస్త జీవులందూ లోపలా బైటా అనే వివక్షత లేకుండా నిండి వున్నాడు పరమాత్మ. తాను ఒక్కడై వుండీ తన మాయ చే అనేక రూపాల్లో గోచరిస్తాడు. సమస్త జీవరక్షకుడైన భగవానుడీ సమయంలో ధర్మద్రోహులను సంహరించడానికి కాలరూపుడై అవతరించి వున్నాడు. అతడు దేవకార్యం చాలా వరకూ పూర్తి చేశాడు. కొలది మాత్రం తరువాయి వుంది. అది పూర్తి అయేవరకూ వుంటాడు.

అంతరోఽనం తరో భాతి పశ్య త్వం మాయయోరుధా,
సోఽయమద్య మహారాజ భగవాన్ భూతభావనః.
కాలరూపోఽవతీర్ణోఽస్యామభావాయ సురద్విషామ్,
నిష్పాదితం దేవకృత్యమవశేషం ప్రతీక్షతే,
తావద్యూయమవేక్షధ్వం భవేద్యావదిహేశ్వరః,
ధృతరాష్ట్రస్సహ భ్రాత్రా గాంధార్యా చ స్వభార్యయా.
దక్షిణే వై హిమవత ఋషీణామాశ్రమం గతః,
స్రోతోభిస్సప్తభిర్యా వై స్వర్ధునీ సప్తధా వ్యధాత్.
సప్తానాం ప్రీతయే నానా సప్తస్రోతః ప్రచక్షతే,
స్నాత్వానుసవనం తస్మిన్ హుత్వాచాగ్నీన్ యథావిధి.
అబ్భక్ష ఉపశాంతాత్మా స ఆస్తే విగతైషణః,
జితాసనో జితశ్వాసః ప్రత్యాహృతషడింద్రియః.
హరిభావనయా ధ్వస్త రజస్సత్త్వతమోమలః,
విజ్ఞానాత్మని సంయోజ్య క్షేత్రజ్ఞే ప్రవిలాప్య తమ్.
బ్రహ్మణ్యాత్మానమాధారే ఘటాంబరమివాంబరే,
ధ్వస్తమాయాగుణోదర్కో నిరుద్ధకరణాశయః.

అంతవరకూ నువ్వూ ఆ పరమాత్మనే ధ్యానిస్తూ సమస్త పదార్థాల యందూ స్వయం ప్రకాశుడైన పరబ్రహ్మనే చూస్తూ ఉండు.

మహారాజా! హిమాలయానికి దక్షిణంగా సప్తర్షుల ప్రసన్నతకు గాను గంగ సప్త విధాలుగా విభక్తమైంది. అందుకే వానికి సప్త స్రోతస్సులని పేరు. ఆ సప్త స్రోతస్తీర్థ సమీపంలోని ఋషుల ఆశ్రమాల దగ్గరకు వెళ్లారు గాంధారీ ధృతరాష్ట్రులు విదురునితో కూడా. అక్కడ మూడు వేళలా స్నానంచేస్తూ సర్వ బంధాలూ త్యజించి ఉదక పానమే చేస్తూ ఇంద్రియాలను జయించి శాంతచిత్తంతో భగవద్ధ్యానం చేస్తూ సత్త్వ రజ స్తమో రూపమైన గుణ మాలిన్యాన్ని రూపుమాపి అహంకారాన్ని బుద్ధి యందూ బుద్ధిని ఆత్మయందూ జీవాత్మను పరమాత్మ యందూ లయం చేసి సర్వ కర్మ సన్యాసులై సమాధి నిష్ఠలో ఉన్నారు. వారి నిష్ఠకు భంగంకలిగించకు. మహారాజా! నేటికి ఐదవ దినమున ధృతరాష్ట్రుడి దేహం వదలి గార్హపత్యాది అగ్నుల ద్వారా పర్ణకుటీ

నివవర్తితాఖిలాహార ఆస్తే స్థాణురివాధునా,
తస్యాంతరా యో మైవాభూత్సన్న్యస్తాఖిలకర్మణః.
సవా అద్యతనాద్రాజన్ పరతః పంచమేహని,
కళేబరం హాస్యతి స్వం తచ్చ భస్మీభవిష్యతి.
దహ్యమానేఽ గ్నిభిర్దేహే పత్యుః పత్నీసహోటజే,
బహిఃస్థితా పతిం సాధ్వీతమగ్నిమనువేక్ష్యతి.
విదురస్తు తదాశ్చర్యం నిశామ్య కురునందన,
హర్షశోకయుత స్తస్మాద్గంతా తీర్థనిషేవకః.
ఇత్యుక్త్వాథారుహత్స్వర్గం నారదస్సహ తుంబురుః,
యుధిష్ఠిరో వచస్తస్యహృది కృత్వా జహౌచ్ఛుచః.

దంతో భస్మమై పోతాడు. జ్వలించే భర్త దేహాన్ని చూసి గాంధారి కూడా భర్తననుసరిస్తుంది. వారిద్దరినీ చూసి విదురుడు ఆ ప్రదేశాన్ని విడచి తీర్థయాత్రలకై వెళ్లి పోతాడు. – అని చెప్పి నారద తుంబురులు వెళ్ళిపోయారు. నారదోపదేశం విని ధర్మరాజు దుఃఖాన్ని విడిచి భగవంతుని ధ్యానించడం ఆరంభించాడు.

## 13 అ ధ్యా య ం

సంప్రస్థితే ద్వారకాయాం జిష్ణౌ బంధుదిదృక్షయా,
జ్ఞాతుం చ పుణ్యశ్లోకస్య కృష్ణస్య చ విచేష్టితమ్.
వ్యతీతాఃకతిచిన్మాసాస్తదా నాయాత్తతోఽర్జునః,
దదర్శ ఘోరరూపాణి నిమిత్తాని కురుద్వహః.
కాలస్య చ గతిం రౌద్రాం విపర్యస్తర్తు ధర్మిణః,
పాపీయసీం నృణాం వార్తాం క్రోధలోభానృతాత్మనామ్.

స్వజనులైన యాదవులనూ శ్రీకృష్ణునీ చూడాలని అర్జునుడు ద్వారక వెళ్లి చాలా రోజులైంది. ధర్మరాజుకు చాలా దుస్స్వప్నాలూ దుశ్శకునాలూ కలుగుతున్నాయి. ఋతుధర్మాలు మారిపోయాయి. మానవులు లోభ క్రోధాలతో అసత్య పరాయణులై పాపాచారులై పోయారు. కపటం సర్వత్రా వ్యాప్తమైంది. మిత్రులలో అంతః కలహాలు జనించాయి. తల్లిదండ్రులూ, సోదరీ సోదరులూ అనే వివక్షత

జింహప్రాయం వ్యవహృతం శాఠ్యమిశ్రంచ సౌహృదం,
పితృమాతృసుహృద్భ్రాతృ దంపతీనాం చ కల్కనమ్.
కన్యావిక్రయిణం తాతం సుతం పిత్రోరపోషకమ్,
బ్రాహ్మణాన్వేదవిముఖాన్ శూద్రాన్వై బ్రహ్మవాదినః.
నిమిత్తాన్యత్యరిష్టాని కాలే త్వనుగతే నృణామ్,
లోభాద్యధర్మప్రభృతిం దృష్ట్వోవాచానుజం నృపః.
సంప్రోషితే ద్వారకాయాం జిష్ణుర్బంధుదిదృక్షయా,
జ్ఞాతుం చ పుణ్యశ్లోకస్య కృష్ణస్య చ విచేష్టితమ్.
గతాస్సప్తాధునా మాసాః భీమసేన తవానుజః,
నాయాతి కస్య వా హేతోర్నాహం వేద్మిదమంజసా.
అపి దేవర్షి ణాదిష్టస్స కాలోఽయముపస్థితః,
యదాత్మనోంగమాక్రీడం భగవానుత్సిసృక్షతి.
యస్మాన్న స్సంపదో రాజ్యం దారాః ప్రాణాః కులం ప్రజాః,
ఆసన్ సపత్నవిజయో లోకాశ్చ యదనుగ్రహాత్.
పశ్యోత్పాతాన్నరవ్యాఘ్ర దివ్యాన్ భౌమాన్ సదైహికాన్,
ఘోరమాంశంసతో దూరాద్భయం నో బుద్ధిమోహనం.
ఊర్వక్షి బాహవో మహ్యం స్ఫురంత్యంగ పునః పునః
వేపథుశ్చాపిహృదయ ఆరాద్దాస్యంతి విప్రియం.
శివైషోద్యంతమాదిత్యమభి రౌత్యనలాననా,
మామంగ సారమేయోఽయమభిరోదిత్యభీరువత్.
శస్తాః కుర్వంతి మాం సవ్యం దక్షిణం పశవో పరే,
వాహాంశ్చ పురుషవ్యాఘ్ర లక్షయే రుదతో మమ.

పోయింది. కేవల కాముకులై భార్యనే దేవతగా భావిస్తున్నారు మానవులు. ఉదర పోషణార్థం యే పనైనా చేసే స్థితిలోకి వచ్చారు. కలియుగలక్షణాలు ఇలా వృద్ధిచెందడం చూసి ధర్మరాజు భీమసేనా! అర్జునుడు ద్వారక వెళ్ళి ఏడుమాసాలైనా తిరిగి రాలేదు. నారదుడు చెప్పిన మాటల్లో యాదవుల కుశల వార్త సందేహాస్పదంగా ఉంది. ఆకాశంలో ఉల్కాపాతాలు జనించాయి. భూకంపాలు మాటి మాటికీ కలుగుతున్నాయి. మానవులలో వ్యాధులు వృద్ధిచెందుతున్నాయి. నా ఎడమ భాగం అదురుతూన్నది. హృదయంలో దడ జనించింది. సూర్యునివైపు తిరిగి ఆడ నక్క సంధ్యాకాలాల్లో ఏడుస్తూంటే దాని

మృత్యుదూతః కపోతోఽయములూకః కంపయన్మనః,
ప్రత్యులూకశ్చ కుహ్వానైర్విశ్వం ద్రాక్శూన్యమిచ్ఛతః.
ధూమ్రాదిశః పరిధయః కంపతే భూస్సహాద్రిభిః,
నిర్ఘాతశ్చమ హానాసీత్సాకం చ స్తనయిత్నుభిః.
వాయుర్వాతి ఖరస్పర్శో రజసా విసృజం స్తమః,
అసృగ్వర్షన్తి జలదా బీభత్సమివ సర్వతః.
సూర్యం హతప్రభం పశ్యగ్రహ మర్దం మిథోదివి,
ససంకులైర్భూతగణైర్జ్వలితే ఇవ రోదసీ.
నద్యో నదాశ్చ క్షుభితాస్సరాంసి చ మనాంసి చ,
న జ్వలత్యగ్నిరాజ్యేన కాలోఽయం కిం విధాస్యతి,
న పిబంతి స్తనం వత్సాః న దుహ్యంతి చ మాతరః,
రుదంత్యశ్రుముఖా గావో న హృష్యంత్యృషభా వ్రజే.
దైవతాని రుదంతీవ స్విద్యంతి ప్రచలంతి చ,
ఇమే జనపదా గ్రామాః పురోద్యానాకరాశ్రమాః.
భ్రష్టశ్రియో నిరానందాః కిమఘం దర్శయంతి నః,
మన్యఏతైర్మ హోత్పాతైర్నూనం భగవతః పదైః.
అనన్యపురుషశ్రీభిర్హీనా భూర్హతసౌభగా,
ఇతి చింతయతస్తస్య దృష్టారిష్టేన చేతసా
రాజ్ఞః ప్రత్యాగమద్బ్రహ్మన్ యదుపుర్యాః కపిధ్వజః,
తం పాదయోర్నిపతితమయథాపూర్వమాతురమ్.
అధోవదనమబ్బిందూన్ సృజంతం నయనాబ్జయోః,
విలోక్యోద్విగ్నహృదయం విచ్ఛాయమనుజం నృపః.
పృచ్ఛతిస్మ సుహృన్మధ్యే సంస్మరన్నారదేరితమ్,
కచ్చిదానర్తపుర్యాం నస్స్వజనాస్సుఖమాసతే.
మధుభోజక దాశార్హాస్సాత్వతాంధకవృష్ణయః,
శూరో మాతామహః కచ్చిత్స్వస్త్యాస్తే వాథ మారిషః.

ముఖాన్నుండి అగ్ని జనిస్తూన్నది. గోవు మొదలైన ఉత్తమ జంతువులు అపసవ్యంగానూ గాడిద మొదలైన నీచజంతువులు సవ్యంగానూ ప్రదక్షిణిస్తున్నాయి. గజాశ్వాదులు ఏడుస్తున్నట్లు కనబడడంచూస్తే యేదో అరిష్టం దగ్గరగా ఉన్నట్టు తోస్తున్నది. మృత్యుదూతలైన తీతువు గుడ్లగూబ కాకి పరస్పరం అభిముఖంగా నిలిచి అర్ధరాత్రివేళ కఠోరశబ్దాలు చేస్తున్నాయి.

మాతులస్సానుజః కచ్చిత్కుశల్యానకదుందుభిః,
సప్తస్వసారస్తత్పత్న్యో మాతులాన్యస్సహాత్మజాః.
ఆసతే సస్నుషాః. క్షేమం దేవకీప్రముఖాస్స్వయమ్,
కచ్చిద్రాజాహుకో జీవత్యసత్పుత్రో స్య చానుజః.
హృది కస్య మతో క్రూరో జయంతగదసారణాః,
ఆసతే కుశలం కచ్చిద్యే చ శత్రుజిదాదయః.
కచ్చిదాస్తే సుఖీ రామో భగవాన్ సాత్వతాం పతిః,
ప్రద్యుమ్నస్సర్వవృష్ణీనాం సుఖమాస్తే మహారథః.
యో గంభీరరయో యుద్ధే వర్ధతే భగవానుత,
సుషేణశ్చారుధేష్ణశ్చ సాంబో జాంబవతీసుతః.
అన్యేచకార్ష్ణిప్రవరాస్సపుత్రా ఋషభాదయః,
తథైవానుచరాశ్శౌరేర్శ్రుతదేవోద్ధవాదయః.
సునందనందశీర్షణ్యాయే చాన్యే సాత్వతర్షభాః.
అపి స్వస్త్యాసతే సర్వే కృష్ణరామభుజాశ్రయాః.
అపి స్మరంతి కుశలమస్మాకం బంధుసౌహృదాః,
భగవానపి గోవిందో బ్రహ్మణ్యో భక్తవత్సలః.
పురే కచ్చిత్సుధర్మాయాం సుఖమాస్తే సుహృద్వృతః,
మంగళాయ హి లోకానాం క్షేమాయ చ భవాయ చ.

దిక్కులన్నీ ధూమ్రవర్ణంతో నిండడం, చంద్రమండలానికి నలువైపులా మండలాకారం ఏర్పడడం, పర్వతాలతో భూమి కంపించడం ఆకాశంలో భయంకరమైన ఉరుములు జనించడం, పిడుగులు పడటం భయంకరమైన గాలి ధూళిని వర్షించడం, సూర్యతేజం మందగించడం, గ్రహయుద్ధాలూ, భూమీ అంతరిక్షం మండుతూన్నట్లుచూస్తే చాలాభయం కలుగుతూన్నది. నద నదీ సముద్రాల్లో అమంగళంగా పెద్ద పెద్ద శబ్దాలు బయలుదేరాయి. ఈ ఉత్పాతాలు చూస్తే నా మనస్సుకి చాలా భయం కలుగుతూ ఉంది. ఇవన్నీ చూస్తే శ్రీకృష్ణుడీ లోకాన్ని వదలి వైకుంఠానికి వెళ్ళేడేమో ననే అనుమానం కలుగుతూన్నదని చెప్పుతూండగానే అర్జునుడు వచ్చాడు. అర్జునుని ముఖం తేజోహీనంగా ఉంది. అదిచూసి -అర్జునా ద్వారకనుండి సుఖంగా వచ్చావా, ద్వారకా నగరంలో అందరూ

ఆస్తే యదుకులాంభోధావాద్యోఽనంతసఖః పుమాన్,
యద్బాహుదండగుప్తాయాం స్వపుర్యాం యదవోఽర్చితాః.
క్రీడంతి పరమానందం మహాపౌరుషికా ఇవ,
యత్పాదశుశ్రూషణముఖ్యకర్మణా సత్యాదయో ద్వ్యష్టసహస్రయోషితః.
నిర్జిత్య సంఖ్యే త్రిదశాంస్తదాశిషో హరంతి వజ్రాయుధవల్లభోచితాః,
యద్బాహుదండప్రభవోపజీవినో యదుప్రవీరాహ్యకుతోభయాముహుః.
అధిక్రమంత్యంఘ్రిభిరాహృతాం బలాత్సభాం సుధర్మాం సుసత్తమోచితామ్.
కచ్చిత్తేఽనామయం తాత భ్రష్టతేజా విభాసి మే.
అలబ్ధమానోఽవజ్ఞాతః కిం వా తత్రచిరోషితః.
కచ్చిన్నాభిహతో భావైశ్శబ్దాదిభిరమంగలైః,
స దత్త ముక్తమర్థిభ్యః ఆశయా యత్ప్రతిశ్రుతమ్.
కచ్చిత్త్వం బ్రాహ్మణం బాలం గాం వృద్ధం రోగిణం స్త్రియమ్.
శరణోపసృతం స త్వం నాత్యాక్షీశ్శరణప్రదః
కచ్చిత్త్వం నాగమోఽగమ్యాం వా సత్కృతాం స్త్రియమ్,
పరాజితో వాథ భవాన్నోత్తమైర్నాసమైః పథి.
అపి స్విత్పర్యభుఙ్క్తాస్త్వం సంభోజ్యాన్ వృద్ధబాలకాన్,
ఉపేక్ష్యాతిభిభృత్యాంశ్చ గర్భిణ్యాతురకన్యకాః.
జుగుప్సితం కర్మ కించిత్కృతవాన్న యదక్షమమ్,

కులాసాగా ఉన్నారుకదా? దేవకీవసుదేవులూ బలరామకృష్ణులూ, సుఖులే కదా. వారంతా మనయందు మైత్రితో మనక్షేమం కోరుతున్నారా! పదహారువేల నూటయెనమండుగురు భార్యలూ శ్రీకృష్ణసేవచేస్తూ అన్యోన్య మైత్రికలవారై చరిస్తూన్నారా. ఈ కుశలవార్త వినేవరకూ నా మనస్సు ఆతురత చెందుతూఉంది. నీ ముఖం చూస్తే శ్రీ హీనంగా కనిపిస్తోంది. నిన్నెవరూ అవమానించ లేదుకదా! ఎక్కడా యెవరూ నిన్ను నిందించలేదు కదా. ఎవరికైనా యే వస్తువైనా యిస్తానని వాగ్దానంచేసి యివ్వలేక పోయావా. బ్రాహ్మణులూ బాలురూ, గోవులూ, వృద్ధులూ, రోగులూ, స్త్రీలూ మొదలైన వారెవరైనా శరణంటే వారిని రక్షించలేనని విడచివేయ లేదుకదా. అగమ్యాగమనం మొదలైన ప్రమాదాలకు గురికాలేదు గదా. నీ ముఖం చూస్తే నాకు చాలా బాధ కలుగుతూన్నది. ఇంత

కచ్చిత్ప్రేష్ఠతమేనాంగ హృదయేనాత్మబంధునా,
శూన్యోఽస్మి రహితో నిత్యం మన్యసే తేఽన్యథా న రుక్.

వరకూ యెట్టి ఆపత్తులు కలిగినా నీ ముఖం యిలా లేదే – అని ప్రశ్నించాడు. ధర్మరాజు.

14 అధ్యాయం

ఏవం కృష్ణసఖః కృష్ణో భ్రాత్రా రాజ్ఞా వికల్పితః,
నానాశంకాస్పదం రూపం కృష్ణవిశ్లేషకర్శితః.
శోకేన శుష్యద్వదనహృత్సరోజో హతప్రభః,
విభుం తమే వానుధ్యాయన్నాశక్నోత్ప్రతిభాషితుమ్.
కృచ్ఛ్రేణ సంస్తభ్య శుచః పాణినా మృజ్యనేత్రయోః
పరోక్షేణ సమున్నద్ధప్రణయౌత్కంఠ్యకాతరః
సఖ్యం మైత్రీం సహృత్త్వం చ సారథ్యాదిషు సంస్మరన్,
నృపమగ్రజమిత్యాహ బాష్ప గద్గదయా గిరా.
వంచితోఽహం మహారాజా హరిణా బంధురూపిణా,
యేనమేఽపహృతం తేజో దేవవిస్మాపనం మహత్.
యస్య క్షణవియోగేన లోకోహ్యప్రియదర్శనః,
ఉక్థేన రహితో హ్యేష మృతకః ప్రోచ్యతే యథా.

శౌనకా! అర్జునుడు శ్రీకృష్ణునకు ప్రియమిత్రుడు. ఘోర యుద్ధాలలో సారథ్యం వహించిన శ్రీకృష్ణుని రూపం మరువలేకుండా మరువడానికి వీల్లేకుండా అతని హృదయంలో హత్తుకు పోయింది. అది కారణంగా అర్జునుడు యాదవుల సంకుల మరణానికీ విశేషించి శ్రీకృష్ణుడవతారం చాలించినందుకూ అతి దుఃఖంతో కన్నులు తుడుచు కుంటూ – ధర్మనందనా! బావ మిత్రుడు సారథి ఐన శ్రీకృష్ణుడు మనలను విడిచి పోయాడు. అది కారణంగా నా ముఖం తేజో హీనమైంది. నేను జీవచ్ఛవంలా ఉన్నాను. కృష్ణుని అనుగ్రహంవల్ల కదా ద్రౌపదీ స్వయం వరంలో సర్వశత్రువులనూ జయించకలిగాము. ఆపరమ పురుషానుగ్రహ

యత్సంశ్రయాద్ద్రుపదగేహముపాగతానాం రాజ్ఞాం స్వయంవరముఖేస్మరదానామ్
తేజోహృతం ఖలు మయాభిహతశ్చ మత్స్యస్సజ్జీకృతేన ధనుషాఽధిగతా చ కృష్ణా
యత్సన్నిధావహము ఖాండవమగ్నయేఽదామింద్రంచసామరగణంతరసావిజిత్య
లబ్ధా సభా మయకృతాద్భుతశిల్పమాయా దిగ్భ్యోఽహరన్నృపతయో బలిమధ్వరే తే
యత్సన్నిధౌ నృపశిరోంఘ్రి మహన్మఖార్థమార్యోనుజస్తవ గజాయుతసత్వవీర్యః
తేనాహృతాః ప్రమథనాథమఖాయ భూపా యన్మోచితాస్సమవయఞ బలిమధ్వరే
పత్న్యాస్తవాధిమఖక్లిప్తమహాభిషేకశ్లాఘిష్టచారుక బరం కితవైస్సభాయామ్,
స్పృష్టంవికీర్య పదయోః పతితాశ్రుముఖ్యా యస్తత్స్త్రియోకృతహతేశవిముక్తకేశాః
యో నో జుగోప వనమేత్యదురంతకృ చ్ఛ్రాద్దుర్వాసనోరిరచితాదయుతాగ్రభుగ్యః
శాకాన్నశిష్టముపయుజ్య యతస్త్రిలోకీం తృప్తామమంస్త సలిలే వినిమగ్నసంఘః
యత్తేజసా సభగవాన్యుధి శూలపాణిర్విస్మాపితిస్స గిరిజోఽస్త్రమదాన్నిజం మే,
అన్యేఽపి చాహమమునైవ కళేబరేణ ప్రాప్తో మహేంద్రభవనే మహదాసనార్ధమ్.
తత్రైవ మే విహరతో భుజదండ యుగ్మం గాండీవలక్షణమరాతివధాయ దేవాః
సేంద్రాశ్శ్రితాః యదనుభావిత మాజమీఢ తేనాహమత్య ముషితః పురుషేణ భూమ్నా.
యద్బాంధవః కురుకులాబ్ధిమనంతవరమేకో రథేన తతరాహమతార్యసత్వమ్,
ప్రత్యాహృతం పురుధనం చ మయా పరేషాం తేజః పదం మణిమయంచహృతంశిరోభ్యః.

చేత మత్స్య యంత్రం ఛేదించి ద్రౌపదిని పొందాము. వాని సహాకారంతో ఇంద్రాదులను జయించి అగ్నిహోత్రుని తృప్తి పరచ గలిగాము. మయ సభ వాని వల్లనే లభించింది. భీమసేనుడు ఆ మహాపురుషుని సాన్నిధ్య మాత్రం చేత జరాసంధుని సంహరించ కలిగాడు ఆయనే కదా ద్రౌపదీమాన సంరక్షకుడు. అరణ్యావాస దీక్షాకాలంలో దూర్వాసుడు పది వేల శిష్యులతో రాగా ద్రౌపదిచే సమర్పింప బడిన పత్ర మాత్రంచే తృప్తుడై ఆ దూర్వాసాదులను తృప్తి పరచి మనలను రక్షించిన వాడు. ఎవని అనుగ్రహం చేత ఫాలాక్షుని మెప్పించి నేను పాశుపతం సాధించగలిగానో, సమస్త లోక పాలుర నుండి అస్త్రాలు సాధించి ఇంద్రుని అర్ధాసనం అధిష్టించడాని కెవడు కారకుడో, నివాత కవచుల సంహారానికీ భీష్మ ద్రోణ రక్షితమైన కౌరవులను జయించడానికి యెవరి సహాయం రక్షా కవచమైందో, కురుక్షేత్ర యుద్ధంలో నా అశ్వాలు అలసి నప్పుడు నేను రథం దిగి భూమి మీద నిలబడి నప్పుడు

యో భీష్మకర్ణగురుశల్యచమూష్వదభ్ర రాజన్యవర్యరథమండలమండితాసు,
అగ్రేచరో మమ విభో రథయూథపానామాయుర్మనాంసి చ దృశా సహ ఓజ ఆర్చ్ఛత్.
యద్దోర్షు మా ప్రణిహితం గురుభీష్మకర్ణద్రౌణిత్రికర్తశలసైంధవ బాహ్లికాద్యైః,
అస్త్రాణ్యమోఘమహిమాని నిరూపితాని నోపస్పృశుర్నృహరిదాసమివాసురాణి.
సౌత్యేవృతః కుమతినాత్మద ఈశ్వరో మే యత్పాదపద్మమభవాయ భజంతి భవ్యాః
మాం శ్రాంతవాహమరయో రథినో భువిష్ఠం న ప్రాహరన్యదనుభావనిరస్తచిత్తాః.
నర్మాణ్యుదారరుచిరస్మితశోభితాని హే పార్థ హేఽర్జునసఖే కురునందనేతి,
సంజల్పితాని నరదేవ హృదిస్పృశాని స్మర్తుర్లుఠంతి హృదయమ్మమ మాధవస్య,
శయ్యాసనాటనవికత్థనభోజనాదిష్వైక్యాద్వయస్య ఋతవానితి విప్రలబ్ధః,
సఖ్యుస్సఖేవ పితృవత్తనయస్య సర్వం సేహే మహామహితయా కుమతేరఘం మే.
సోఽహం నృపేంద్రరహితః పురుషోత్తమేన సఖ్యా ప్రియేణ సుహృదాహృదయేనశూన్యః,
అధ్వన్యురుక్రమపరిగ్రహమంగరక్షన్గోపైరసద్భిరబలేవ వినిర్జితోఽస్మి.
తద్వైధనుస్తఇషవస్సరథోహయాస్తేసోఽహం రథీ నృపతయో యతఆనమంతి,
సర్వం క్షణేన తదభూదసదీశరిక్తం భస్మన్ హుతం కుహకరాద్ధమివోప్తమూష్యామ్

రాజం స్త్వయాభిపృష్టానాం సుహృదాం నస్సుహృత్పురే,
విప్రశాపవిమూఢానాం నిఘ్నతాం ముష్టిభిర్మిథః.

ఎవని మాయామోహంతో వీరులందరూ నా మీద ఒక్క బాణమైనా ప్రయోగించ లేక పోయారో నే నెన్ని అపరాధాలు చేసినా తండ్రి కుమారుని రక్షించి మన్నించినట్లే మన్నించి రక్షించిన వాడెవడో శయనాసన భోజనాదులలో కూడా నిరంతరం కలిసి చరించిన వాడెవడో ఆ సఖుడు మన బావ శ్రీకృష్ణుడు యదు, వృష్ణి, భోజ, అంధక, వంశీయులైన సమస్త వీరులతో ఈ లోకాన్ని వదిలేశాడు. మహారాజా! యాదవు లంతా నశించడం వల్ల వీర శూన్యమైన ద్వారకలో స్త్రీలు నివసించడం కష్ట మని కృష్ణుని భార్యలతో కూడా ఆ స్త్రీ లందరనూ తీసుకు వస్తూంటే ఆ సమయంలో ధూర్తు లైన గోపకులు నన్నడ్డుకొట్టి ఆ స్త్రీలను తీసుకు వెడుతూంటే అబల వలె నే నేమీ చెయ్యలేక పోయాను. అవే అశ్వాలు అదే, గాండీవం, అవే అస్త్రాలు. ఆ సారథుడనే కాని కృష్ణుడు లేని అర్జునుని శౌర్య ధైర్యాలు నిష్ప్రయోజన మైపోయాయి. భస్మంలో చేసిన ఆజ్య హోమం వలె కపటుని సేవతో సమా

వారుణీం మదిరాం పీత్వా మదోన్మథితచేతసామ్.
అజానతామివాన్యోన్యం చతుఃపంచావశేషితాః,
ప్రాయేణైతద్భగవత ఈశ్వరస్య విచేష్టితమ్,
మిథోనిఘ్నంతి భూతాని భావయంతి చ యన్మిథః.
జలౌకసాం జలే యద్వన్మహాంతో దంత్యణీయసః,
దుర్బలాన్బలినో రాజన్మహాంతో బలినో మిథః.
ఏవం బలిష్ఠై. ర్యదుభిర్మహద్భిరపరాన్విభుః,
యదూన్యదుభిరన్యోన్యం భూభారాన్ సంజహారహ.
దేశకాలార్థయుక్తాని హృత్తాపోపశమాని చ,
హరంతి స్మరతశ్చిత్తం గోవిందాభిహితాని మే.
ఏవం చిన్తయతో జిష్ణోః కృష్ణపాదసరోరుహమ్,
సౌహార్దేనాతిగాఢేన శాంతాసీద్విమలా మతిః.
వాసుదేవాంఘ్ర్యనుధ్యానపరిబృంహితరంహసా,
భక్త్యా నిర్మథితాశేషకషాయధిషణోఽర్జునః.
గీతం భగవతా జ్ఞానం యత్తత్సంగ్రామమూర్ధని.
కాలకర్మతమోరుద్ధంపునరధ్యగమద్విభుః.

సంగా ఊసరక్షేత్రంలో నాటిన విత్తనం వలె నా బలాలన్నీ వ్యర్థమైనాయి.

యాదవులందరూ బ్రాహ్మణ శాప దగ్ధులై మదిరాపాన ప్రమత్తులై వారిలో వారే కలహించి ఒకరి చేతుల్లో ఒకరు మరణించారు. వాస్తవానికి యిదంతా కృష్ణ లీలయే. లోకంలో ఒక ప్రాణి మరొక ప్రాణిని సంహరించడం, ఒక ప్రాణి మరొక ప్రాణిని పోషించడం జరుగుతూంటుంది. జల చర జంతువులలో పెద్దవి చిన్న వాటిని తినేస్తూంటాయి. అదే రీతిగా భగవానుడు మహాపీరులైన యాదవులచే సర్వ భూమీశులనూ సంహరింప చేసి చివరకు వారిలో ఒకరి వల్ల మరొకరికిమరణం కల్పించి యాదవ నాశనంతో భూ భారం హరించాడు. ఆ పరబ్రహ్మమైన శ్రీకృష్ణుని ఉపదేశం దేశకాలానుగుణమైనది. స్మరించిన మాత్రాన ఆ ఉపదేశ వాక్యాలు నా మనస్సును హరిస్తున్నాయి— అని పార్థుడు సవిస్తరంగా యాదవ నాశనం కృష్ణావతార సమాప్తి వరకూ చెప్పి

విశోకో బ్రహ్మ సంపత్త్యా సంఛిన్నద్వైతసంశయః,
లీనప్రకృతినైర్గుణ్యాదలింగత్వాదసంభవః.
నిశమ్య భగవన్మార్గం సంస్థాం యదుకులస్య చ,
స్వఃపథాయ మతిం చక్రే నిభృతాత్మా యుధిష్ఠిరః.
పృథాప్యనుశ్రుత్య ధనంజయోదితం నాశం యదూనాం భగవద్గతిం చ తామ్,
ఏకాంతభక్త్యా భగవత్యధోక్షజే నివేశితాత్మోపరరామ సంసృతేః.
యయాఽహరద్భువో భారం తాం తనుం విజహావజః,
కంటకం కంటకేనేవ ద్వయం చాపీశితుస్సమమ్.
యథా మత్స్యాదిరూపాణి ధత్తే జహ్యాద్యథా నటః,
భూభారః క్షపితో యేన జహౌ తచ్చకళేబరమ్.
యదా ముకుందో భగవానిమాం మహీం జహౌ స్వతన్వా శ్రవణీయసత్కథః,
తదా హరే వా ప్రతిబుద్ధచేతసామభద్రహేతుః కలిరన్వవర్తత.
యుధిష్ఠిరస్తత్పరిసర్పణం బుధః పురే చ రాష్ట్రే చ గృహే తథాత్మని,
విలోక్య లోభానృతజిహ్మహింసనాద్యధర్మచక్రం గమనాయ పర్యధాత్.
స్వరాట్పౌత్రం వినయినమాత్మనస్సుసమం గుణైః,
తోయనీవ్యాః పతిం భూమేరభ్యషించద్గజాహ్వయే.

భగవానుడు ఉపదేశించిన గీతను స్మరించి సర్వ సంగ విముక్తుడై జనన మరణ రూపమైన కాల చక్రం నుండి విముక్తుడైనాడు.

అర్జునుని వల్ల యదు వంశ నాశనం శ్రీకృష్ణుని స్వర్లోక గమనం విని కుంతీదేవి సర్వ సంగ విముక్తురాలై యీ లోకాన్ని విడచింది. ముల్లు ముల్లుతో తీసి రెండు ముళ్ళనూ వదలి వేసినట్లే శ్రీకృష్ణుడు యాదవ వంశంలో అవతరించి భూ భారాన్ని హరించి ఆ శరీరాన్ని వదలివేశాడు. కృష్ణుని స్వ ధామగమనం విన్న ధర్మరాజు స్వర్గారోహణానికి నిశ్చయించుకొన్నాడు. శ్రీకృష్ణుని అవతార సమాప్తి దివసమే అజ్ఞానులను అధర్మంలో బంధించే కలియుగారంభమైంది. మద, మోహ, లోభ, క్రోధ, కామాదులు సర్వ వ్యాప్తమై పోతున్నాయి. అది చూచి ధర్మరాజు హస్తినాపుర సామ్రాజ్యానికి పరీక్షిత్తుని పట్టాభిషిక్తుని చేసి మథురా మండలానికి అనిరుద్ధపుత్రుడైన వజ్రనాభుని అధిపతిని చేసి వస్త్రభూషణాదులు వర్జించి ప్రాజాపత్యయజ్ఞం చేసి ఆహవనీయాది

అజహారాశ్వమేధాం స్త్రీ స్గంగాయాం భూరిదక్షిణాన్,
శారద్వతం గురుం కృత్వా దేవా యత్రాక్షిగోచరాః.
నిజగ్రాహౌజసా వీరః కలిం దిగ్విజయే క్వచిత్,
నృపలింగధరం శూద్రం ఘ్నంతం గోమిథునం పదా.
కస్య హేతోర్నిజగ్రాహ కలిం దిగ్విజయే నృపః,
నృదేవరూపద్భృచ్ఛూద్రః కోఽసౌ గాం యః పదాహసత్.
తత్కథ్యతాం మహాభాగ యది విష్ణుకథా శ్రయమ్,
అథవాస్య పదాంభోజమకరందలిహాం సతామ్.
కిమన్యైరసదాలాపై రాయుషో యదసద్వ్యయః,
క్షుద్రాయుషాం నృణామంగ మర్త్యానామృతమిచ్ఛతామ్.
ఇహోపహూతో భగవాన్మృత్యుశ్శామిత్రకర్మణి,
న కశ్చిన్మ్రియతే తావద్యావదాస్త ఇహాంతకః,
ఏతదర్థం హ భగవానాహూతః పరమర్షిభిః,
అహో నృలోకే పీయేత హరిలీలామృతం వచః.

శూద్ర రూపంలో రాజవేషం ధరించి కలిపురుషుడు ఒక వృషభాన్నీ మరొక గోవునీ హింసించడం చూసి పరీక్షిన్మహారాజు కలిని దండించి విడచాడని విన్న శౌనకుడు యిలా ప్రశ్నించాడు.

సూత! మృత్యు ధర్మంగల యీ మానవులలో మంద భాగ్యులు రాత్రి నిద్రతోనూ పగలు వ్యర్థ కాలక్షేపములతోనూ జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు. జ్ఞానులు బ్రహ్మజ్ఞానం పొందే వరకూ క్షణం కూడా వృథా చేయకుండా ఆయుర్వృద్ధికిగాను యమధర్మరాజు నాహ్వానించి శాంతి కర్మలు చేస్తూ నిరంతరం సద్గోష్ఠి ఈశ్వరధ్యానా లతో కాలం గడుపుతారు.

భక్తాగ్రేసరుడైన పరీక్షిన్మహారాజు అధర్మప్రవర్తకుడైన కలిని ఎందుకు దండించి వదలి వేశాడో, మరణ దండన విధించక పోవడా నికి కారణమేమో వినాలని కుతూహలంగా ఉంది. పరమార్థమిచ్చేదే ఐతే సవిస్తరంగా చెప్పమని అడిగిన శౌనకునకా కథాక్రమం చెపుతు న్నాడు సూతమహర్షి-

మందస్య మందప్రజ్ఞస్య వయో మందాయుషశ్చ యత్,
నిద్రయా హ్రియతే నక్తం దివా చ వ్యర్థ కర్మభిః.
యదా పరీక్షిత్కురుజాంగలే వసన్ కలిం ప్రవిష్టం నిజచక్రవర్తితే,
నిశమ్య వార్తామనతిప్రియాం తతశ్శరాసనం సంయుగశౌండ ఆదదే.
స్వలంకృతం శ్యామతురంగయోజితం రథం మృగేంద్రధ్వజమాస్థితః పురాత్,
వృతో రథాశ్వద్విపపత్తియుక్తయా స్వసేనయా దిగ్విజయాయ నిర్గతః.
భద్రాశ్వం కేతుమాలం చ భారతం చోత్తరాన్కురూన్,
కింపురుషాదీని వర్షాణి విజిత్య జగృహే బలిమ్.
తత్ర తత్రోపశృణ్వానః స్వపూర్వేషాం మహాత్మనామ్,
ప్రగీయమానం చ యశః కృష్ణమాహాత్మ్యసూచనమ్.
ఆత్మానం చ పరిత్రాతం మశ్వత్థామ్నోఽస్త్రతేజసా,
స్నేహం చ వృష్ణిపార్థానాం తేషాం భక్తిం చ కేశవే.
తేభ్యః పరమసంతుష్టః ప్రీత్యోజ్జృంభితలోచనః,
మహాధనాని వాసాంసి దదౌ హారాన్మహామనాః.

పరీక్షిన్మహారాజు కురు జాంగల దేశాలకు అధిపతియై పరిపాలన సాగిస్తూ కలియుగం ప్రవేశించి ప్రపంచమంతా వేద విరుద్ధ ధర్మాలు వ్యాప్తి చెందుతున్నాయని విని విచారించి సర్వ శస్త్రాలూ ధరించి రథ, గజ, తురగ, పదాతి వర్గం వెంటరాగా దిగ్విజయయాత్రకు బయలుదేరాడు. శ్యామవర్ణం కల అశ్వాలతో సింహ ధ్వజంతో అలరారే రథం అధిరోహించి భద్రాశ్వ కేతుమాల్య భారత ఉత్తర కురు కింపురుష వర్షాలు జయించి ఆ దేశాధిపతులనుండి కానుకలు గ్రహిస్తూ ప్రతీ దేశంలోనూ తన పూర్వులైన పాండవుల యశస్సునూ పాండవ యాదవులకుగల సంబంధం వింటూ కృష్ణపరమాత్మ తనపితామహుడైన అర్జునునకు సారథియై, దూతయై, సఖుడై, బావమరదియై తోడునీడై చరించడం వింటూన్నప్పుడు పరీక్షిత్తుకి రోమాంచం కలుగుతూన్నది.

దిగ్విజయయాత్ర సాగుతూన్నప్పుడు మహారాజు అనేకులైన విద్వాంసులను సత్కరిస్తూ కురువంశానికి ఆదినుండీ ఉన్న కీర్తిని స్థిరం చేస్తున్నాడు. కురుక్షేత్ర యుద్ధంలో రాత్రి కాలమందు శత్రువుల

సారథ్యపారిషదసేవనసఖ్య దౌత్యవీరాసనానుగమనస్తవనాని శృణ్వాన్,
స్నిగ్ధేషు పాణ్డుషు జగత్ప్రణతిం చ విష్ణోర్భక్తిం కరోతి నృపతిశ్చరణారవిందే.
తస్యానువర్తమానస్య పూర్వేషాం వృత్తిమన్వహమ్,
నాతిదూరే కిలాశ్చర్యం యదాసీ త్తన్నిబోధ మే.
ధర్మః పదైకేన చరన్విచ్ఛాయాముపలభ్యగామ్,
పృచ్ఛతి స్మాశ్రువదనాం వివత్సామివ మాతరమ్.
కచ్చిద్భద్రేఽనామయ అత్మనస్తే విచ్ఛాయాసి మ్లాయతా యన్ముఖేన,
అలక్షయే భవతీమంతరాధిం దూరే బంధుం శోచసి కంచనాంబ.
పాదైర్న్యూనం శోచసి మైకపాదమాత్మానాం వృషలైర్భోక్ష్యమాణం,
ఆహో సురాదీన్ హృతయజ్ఞభాగాన్ప్రజా ఉతస్విన్మఘవత్యవర్షతి.
అరక్ష్యమాణాః స్త్రియ ఉర్విబాలాన్ శోచస్యథో పురుషాదైరివార్తాన్,
వాచం దేవీం బ్రహ్మకులే కుకర్మణ్య బ్రహ్మణ్యే రాజకులే కులాగ్ర్యాన్.

వల్ల ప్రమాదం లేకుండా కాపాడుతూ ధర్మరాజు యొక్క రాజ్యంలో సభాసదుడుగా కూడా శ్రీకృష్ణుడున్నాడని విన్న పరీక్షిత్తునకు కృష్ణభక్తి వృద్ధిచెందడమేగాక పాండవుల ఆచరణయే ఆదర్శమైంది.

ఒకనాడు పరీక్షిన్మహారాజు శిబిరానికి యెదుట ఒకపాదంతో బలహీనంగాఉన్న యెద్దూ గోరూపం ధరించిన భూదేవీ విచారిస్తూ కనిపించాయి.

వృషభ శరీరంతో పాదావశేషమైఉన్న ధర్మదేవతా, గోరూపాన్ని ధరించిన భూమీ యిలా సంభాషిస్తూంటే పరీక్షిన్మహారాజు వింటూ అక్కడే నిలిచాడు.

ఓకల్యాణీ! నువ్విలా విచారిస్తున్నావేం. బంధువులుదూరదేశంలో ఉన్నారా, లేక యేదైనా ఆపత్తు సంభవించిందా. ధర్మం పాదావశేషమైపోయిందనా కలిశూద్రరూపంలో నిన్ను శాసిస్తున్నాడనా. నీకు విచారం కలగడం సహజమే వేదబాహ్యంగా నిన్ను శాసించే పరిపాలకులనూ వేదవిక్రేతలై దురాచారులైన బ్రాహ్మణులనూ యజ్ఞాలు లేకుండా ఉండడంచేత హవిర్భాగములులేక హింసనుపొందే దేవతలనూ చూస్తే నీకేకాదు యెవరికైనా విచారం కలుగుతుంది. ప్రజలు స్వేచ్ఛా

కిం క్షత్రబంధూన్ కలినోపసృష్టాన్ రాష్ట్రాణి వా తైరవరోపితాని।
ఇతస్తతో వా శయనాసనవాన్నపానవ్యవాయోన్ముఖజీవలోకం.
యద్వాంబ తే భూరిభరావతారకృతావతారస్య హరేర్ధరిత్రి
అంతర్హితస్య స్మరతీ విసృష్టా కర్మాణి నిర్వాణవిలంబితాని।
ఇదం మమాచక్ష్వ తవాధిమూలం వసుంధరే యేన వికర్శితాసి,
కాలేన వా తే బలినాం బలీయసా సురార్చితం కిం హృతమంబ సౌభగం.
భవాన్ హి వేద తత్సర్వం యన్మాం ధర్మానుపృచ్ఛసి,
చతుర్భిర్వర్తసే యేనపాదైర్లోక సుఖావహైః.
సత్యం శౌచం దయా క్షాంతిస్త్యాగస్సంతోష ఆర్జవం,
శమోదమస్తపస్సామ్యం తితిక్షోపరతిశ్శ్రుతమ్.
జ్ఞానం విరక్తిరైశ్వర్యం శౌర్యం తేజో బలం స్మృతిః,
స్వాతంత్ర్యం కౌశలం కాంతిర్ధైర్యం మార్దవమేవ చ.

చార పరాయణులై ఆహార పానీయాలలో స్నాన, వస్త్ర, స్త్రీ సహవాసములలో ధర్మాన్ని అతిక్రమించి చరించడం చూస్తే అతివృష్టి అనావృష్టి దోషాలు కలిగి దుర్భిక్షంచేత సర్వనాశనమైపోతుందని విచారిస్తున్నావా. అమ్మా! భూమాతా! నీవు ఆలోచించడం లేదా. శ్రీకృష్ణుడు భూమండలాన్ని వదలి గోలోకానికి వెళ్లడంతోనే కలి విజృంభించాడు. అతనివల్ల యీ అధర్మ లక్షణాలన్నీ వృద్ధి చెందుతున్నాయి. ఇదేనా నీ విచార కారణం. మహాబలవంతులుకూడా కాలానికి నమస్కరిస్తారు. ఆ కాలం, దేవతలూ నీకు నమస్కరిస్తారు - అలాంటి నీ సౌభాగ్యాన్ని హరించాడు కలి. ఇంతేనా నీ విచారానికి కారణం - అని అడిగిన ధర్మదేవతకు గోరూపంలో ఉన్న భూదేవి సమాధానం చెపుతూన్నది.

ఓ ధర్మదేవతా! నువ్వడిగిన విషయాలన్నీ నీకు తెలిసినవే. నువ్వు ఈశ్వర సహాయంతో లోకానికి సుఖాన్నే ప్రసాదిస్తూ ఉంటావు. నువ్వు నాలుగుపాదాలు కలవాడవు. సత్యమూ పవిత్రతా దయా క్షమా త్యాగం సంతోషం సరళత్వం శమ దమ తమ సమత్వాలు తితిక్ష ఉపరతి శాస్త్రవిచారణ జ్ఞానం వైరాగ్యం ఐశ్వర్యం వీరత్వం తేజస్సు

ప్రాగల్భ్యం ప్రశ్రయశ్శీలం సహ ఓజో బలం భగః,
గాంభీర్యం స్థైర్య మాస్తిక్యం కీర్తిర్మానోఽనహంకృతిః.
ఏతే చాన్యే చ బహవో యస్మిన్నిత్యా మహాగుణాః,
ప్రార్థ్యామహత్త్వమిచ్ఛద్భిర్న వియంతి స్మ కర్హిచిత్.
తేనాహం గుణపాత్రేణ శ్రీనివాసేన సాంప్రతమ్.
శోచామి రహితం లోకం పాప్మనాకలినేక్షితం.
ఆత్మానం చానుశోచామి భవంతం చామరోత్తమమ్.
దేవాన్పృషిన్పితౄన్ సాధూన్ సర్వాన్వర్ణాశ్రమాం స్తథా.

బ్రహ్మాదయో బహుతిథం యదపాంగమోక్షకామాస్తపస్సమచరన్భగవత్ప్రపన్నాః,
సా శ్రీస్స్వవాసమరవిందవనం విహాయ యత్పాదసౌభగమలం భజతేఽనురక్తా
తస్యాహమబ్జకులిశాంకుశకేతుకేతైః శ్రీమత్పదైర్భగవతస్సమలంకృతాంగీ,
త్రీనత్యరోచ ఉపలభ్య తతో విభూతిం లోకాన్ స మాం వ్యసృజదుత్స్మయతీం తదంతే
యో వై మమాతిభరమాసురవంశరాజ్ఞామక్షౌహిణీశతమపానుదదాత్మతంత్రః,
త్వాం దుస్స్థమూనపదమాత్మని పౌరుషేణ సంపాదయన్యదుషు రమ్యమబిభ్రదంగం.

బలం స్మృతి స్వతంత్రత కౌశలం కాంతి ధైర్యం కోమలత్వం నిర్భయం వినయం శీలం సాహసం ఉత్సాహం సౌభాగ్యం గాంభీర్యం స్థిరత్వం ఆస్తిక్యం కీర్తి గౌరవం నిరహంకారం యీముప్ఫైతొమ్మిది గుణాలే గాక యింకా అనేక కళ్యాణ గుణాలు ఆకృష్ణుని ఆశ్రయించి ఉంటాయి. సర్వగుణాశ్రయుడైన భగవానుడు ఈలోకాన్ని విడచి వెళ్లిపోయాడు. కలి విజృంభించాడు. అధర్మం ప్రబలిపోయింది. ధర్మానికి స్థానంలేదు. నువ్వు పాదావశిష్టుడవై పోయావు. నిన్నుగురించీ నన్ను గురించేగాక దేవతలను గురించి కూడా నాకు విచారంకలుగుతూన్నది. నాతో కూడ దేవతలూ ఋషులూ చిరకాలం ప్రార్థిస్తే భగవానుడవతరించి స్వర్గాదులకుకూడా లేని మహాభాగ్యం భూమండలానికిప్రసాదించాడు. దానితో నా సౌభాగ్యం వృద్ధి చెందింది. భగవానుడవతారం చాలించడంవల్ల నా సౌభాగ్యం కూడా పోయింది. సౌభాగ్యగర్వం పొందిననాకు గర్వభంగం చెయ్యడానికే భగవానుడు నా కీశిక్ష విధించాడు. పాదావశేషంగా ఉన్న నిన్ను, భారభూతనైన నన్ను ఉద్ధరించడానికే కృష్ణరూపంలో అవతరించి అనుగ్రహించాడు. అతడీ భూమియందున్నంత

కా వా సహేత విరహం పురుషోత్తమస్య ప్రేమావలోకరుచిరస్మితవల్గుజల్పైః,
స్థైర్యం సమానమహరన్మధుమానినీనాం రోమోత్సవోమమ యదంఘ్రివిటంకితాయాః.

తయోరేవం కథయతోః పృథివీధర్మయోస్తదా,
పరీక్షిన్నామ రాజర్షిః ప్రాప్తః ప్రాచీం సరస్వతీం.

వరకూ దుష్టుల బాధ లేకుండా లోకాలన్నీ సుఖించాయి. అవతార సమాప్తితో మళ్లీ అధర్మం ప్రబలి పోయింది. ధర్మసంస్థాపకుడైన శ్రీకృష్ణ వియోగంలో దుఃఖంగాక సుఖమెలా కలుగుతుం దని భూమాత ధర్మదేవతకు చెప్తూంటే పరీక్షిత్తు వారిసంవాదం వింటూ తూర్పుగా ప్రవహించే సరస్వతీ తీరానికి వచ్చాడు.

## 16 అ ధ్యా య ం

తత్రగోమిథునం రాజా హన్య మానమనాథవత్,
దండ హస్తం చ వృషలం దదర్శ నృపలాంఛనమ్.
వృషం మృణాళధవళం మేహంతమివ బిభ్యతమ్,
వేపమానం పదైకేన సీదంతం శూద్రతాడితమ్.
గాంచ ధర్మదుఘాం దీనాం భృశం శూద్రపదా హతామ్,
వివత్సాం సాశ్రువదనాం క్షామాం యవసమిచ్ఛతీమ్,
పప్రచ్ఛరథమారూఢః కార్తస్వరపరిచ్ఛదమ్,
మేఘగంభీరయావాచా సమారోపిత కార్ముకః.

పరీక్షిన్మహారాజు సరస్వతీ నదీతీరంలో శూద్రరూపంలో రాజ వేషాన్ని ధరించిన కలిపురుషుడు వృషభ రూపంలో ఉన్న ధర్మాన్నీ గోరూపంలోఉన్న భూమినీ హింసించడం చూసి వెంటనే ధనుర్బాణాలు ధరించి సింహనాదంచేసి కలిని సమీపించి పలుకుతున్నాడు.

అరే నువ్వెవడవు ? బలవంతుడవై ఉండీ నా రాజ్యంలో యీ దుర్బల ప్రాణుల్ని హింసిస్తావేమి? నువ్వు నటునివలె రాజ వేషం ధరించా వెందుకు? శ్రీకృష్ణునితో కూడా మా తాత పరమపదం పొందిన మాత్రాన నిర్జన ప్రదేశాలలో యీసాధుజంతువులను హింసిస్తు

కస్త్వంమచ్ఛరణేలోకేబలాద్ధంస్యబలాన్ బలీ,
నరదేవోఽసి వేషేణ నటవత్కర్మణాఽద్విజః.
యస్త్వం కృష్ణేగతే దూరం సహగాండీవధన్వనా,
శోచ్యోఽస్యశోచ్యాన్రహసి ప్రహరన్వధమర్హసి.
త్వం వా మృణాళధవళః పాదైర్న్యూనః పదాచరన్,
వృషరూపేణ కిం కశ్చిద్దేవో నః పరిఖేదయన్.
న జాతు కౌరవేంద్రాణాం దోర్దండపరిరంభితే,
భూతలేఽనుపతంత్యస్మి న్వినా తే ప్రాణినాం శుచః,
మాసౌరభేయానుశుచోవ్యేతు తే వృషలాద్భయం,
మారోదీరంబ భద్రం తే ఖలానాం మయి శాస్తరి.
యస్యరాష్ట్రే ప్రజాస్సర్వాస్త్రస్యంతే సాధ్వ్యసాధుభిః,
తస్య మత్తస్య నశ్యంతి కీర్తి రాయుర్భగో గతిః.
ఏషరాజ్ఞాం పరో ధర్మః ఆర్తానామార్తినిగ్రహః,
అత ఏనం హనిష్యామి భూతద్రుహమసత్తమం.
కోఽవృశ్చత్తవ పాదాంస్త్రీన్ సౌరభేయచతుష్పదః,
మాభూవంస్త్వాదృశారాష్ట్రే రాజ్ఞాం కృష్ణానువర్తినాం.

న్నావా. అసు నువ్వు అపరాధివి. వధార్హుడవు – అని కలిని నిరోధించి భూ ధర్మదేవతలైన గో వృషభాలను చూచి – ఓవృషభ రాజా కమల నాళంతో సమానమైన శ్వేతవర్ణంకల నువ్వు ఒకే పాదంతో బల హీనుడవై అతి కష్టంతో నడుస్తూంటే నాకు చాలా విచారం కలుగు తూన్నది. వృషభరూపాన్ని ధరించిన దేవతవా ? నీ వెవరు కురువం శంలో జనించిన పరీక్షిత్తు రాజ్యపాలన చేస్తూంటే యేజీవీ అన్యాయంగా దుఃఖించడానికి వీల్లేదు. నీ దుఃఖానికి కారణమేమో చెప్పు నీకు వీనివల్ల యిక భయంలేదు దుష్టులను శిక్షించే నే నున్నాను. విచారించక నిర్భ యంగా నీ కష్టకారణం చెప్పు – అంటూ గోవు వైపు తిరిగి–గోమాతా యే రాజురాజ్యంలో దుర్మార్గులచే సన్మార్గులు హింసింపబడతారో ఆ ప్రభువు యొక్క– ఐశ్వర్యం కీర్తి ఆయుర్దాయం అన్నీ నశిస్తాయి. సత్పురుషుల దుర్బలుల దుఃఖాన్ని దూరంచెయ్యడం మహారాజుకి పరమధర్మం. నువ్వు విచారించకు. ఇప్పుడే యీ దుర్మార్గుని ఖండించి

ఆఖ్యాహి భద్రం వృషవస్సాధూనామకృతాగసాం,
ఆత్మవైరూప్యకర్తారం పార్థానాం కీర్తిదూషణం.
జనేనాగస్యఘం యుంజన్ సర్వతోఽస్యచ మద్భయం,
అనాగస్స్విహ భూతేషు య ఆగస్కృన్నిరంకుశః.
ఆహర్తాస్మి భుజం సాక్షాదమర్త్యస్యాపి సాంగదం,
రాజ్ఞో హి పరమో ధర్మః స్వధర్మస్థానుపాలనం.
శాసతోఽన్యాన్యథాశాస్త్రమనాపద్యుత్పథానిహ.
ఏతద్వః పాండవేయానాం యుక్తమార్తాభయం వచః.
యేషాం గుణగణైః కృష్ణో దౌత్యాదౌ భగవాన్కృతః,
న వయం క్లేశబీజాని యతస్స్యుః పురుషర్షభ.
పురుషం తంవిజానీమోవాక్యభేదవిమోహితాః, కేచిద్వికల్పవసనాఆహురాత్మానమాత్మనః.
దైవమన్యే పరే కర్మ స్వభావమపరేప్రభుం, అప్రతర్క్యాదనిర్దేశ్యాదితి కేష్వపి నిశ్చయః.

మిమ్ము రక్షిస్తాను. మీకీ గతి కలిగించి పాండవుల కీర్తిని భంగపరచదల చినవాడీ భూమండలంలో జీవించలేడు. మీకు కళ్యాణం చేకూరుతుంది. మీకీ దుఃఖాన్ని కలిగించినవాడు దేవుడైనా శిక్షార్హుడే. నాధర్మ ప్రకారం నేను దుష్టులను శిక్షించే తీరతాను - అని అభయమిచ్చే పరీక్షిత్తుతో ధర్మదేవత:

మహారాజా! మీరు పాండువంశంలో జన్మించారు. మీతాత పార్థుడు శ్రీకృష్ణునే దూతగా సారథిగా చేసుకున్న మహాత్ముడు. శాస్త్ర సంబంధమైన విభిన్న మార్గాలతో మోహితులమైన మేము క్లేశ కారణుడెవడో గుర్తింపలేకున్నాము. కొందరు ప్రారబ్ధం దుఃఖకారణ మని కొందరు కర్మఅని మరికొందరు స్వభావమనీ వేరొకకొందరు ఈశ్వరుడనీ చెపుతారు. ఇంకా కొందరు దుఃఖకారణం నిర్ణయించ డానికి అవకాశమే లేదంటారు. రాజర్షీ! మాదుఃఖానికి గల కారణం నీబుద్ధిచేత నువ్వే ఆలోచించి నిశ్చయించు అనగా పరీక్షిత్తు ఇలా పలుకుతున్నాడు.

ఓ ధర్మదేవతా! నిన్ను నేను గుర్తించాను. నువ్వు సాక్షాత్తూ ధర్మదేవతవు. కనుకనే ధర్మం ఉపదేశించావు. అధార్మికునికి ఏదోషం

తత్రానురూపం రాజర్షే విమృశ స్వమనీషయా,
ఏవం ధర్మే ప్రవదతి స సమ్రాడ్ద్విజసత్తమాః,
సమాహితేన మనసా విఖేదః ప్రత్యచష్ట తం.
ధర్మం బ్రవీషి ధర్మజ్ఞ ధర్మోఽసి వృషరూపధృత్.
యదధర్మకృతః స్థానం సూచకస్యాపి తద్భవేత్,
అథవా దేవమాయాయా గతిర్జ్ఞానమగోచరా.
చేతసో వచనశ్చాపి భూతానామితి నిశ్చయః,
తపశ్శౌచం దయా సత్యమితి పాదాః కృతే కృతాః.
అధర్మాంశైస్త్రయో భగ్నాస్స్మయసంగమదైస్తవ,
ఇదానీం ధర్మ పాదస్తే సత్యం నిర్వర్తయేద్యతః.
తం జిఘృక్షత్యధర్మోఽయమనృతైరేధితః కలిః,
ఇయం చ భూర్భగవతా న్యాసితోరుభరా సతీ.
శ్రీమద్భిస్తత్పదన్యాసైస్సర్వతః కృతకౌతుకా,
శోచత్యశ్రుకలా సాధ్వీ దుర్భగేవోజ్ఝితాసతీ.
అబ్రహ్మణ్యా నృపవ్యాజా శ్శూద్రా భోక్ష్యంతి మామితి
ఇతి ధర్మ మహీం చైవ సాంత్వయిత్వా మహారథః,

కలుగుతుందో అపనింద మోపేవారికికూడా ఆ దోషమే కలుగుతుంది. పరమేశ్వరుని మాయ మనోవాక్కులచే నిర్ణయింప బడేదికాదు. కృత యుగంలో నువ్వు నాలుగుపాదాలూ కలవాడవై యుండి త్రేతలో మూడుపాదాలూ ద్వాపరంలో రెండుపాదాలూ కలవాడవై కలి యుగంలో అధర్మాంశలైన గర్వమూ ఆసక్తీ మదమూ కారణంగా మూడుపాదాలు నష్టమై సత్యరూపమైన ఒకే చరణంతో ఉన్నావు. ఈపాదం కూడా కొట్టివేయాలనీ కలిచూస్తున్నాడు. గోరూపధారిణి యైన యీ భూమాత భారం భరించలేనని బాధపడితే భగవానుడే కృష్ణరూపంలో భారాన్ని హరించాడు. శ్రీకృష్ణచరణారవిందములచే పవిత్రమైన యీ ధరిత్రీదేవి హరి గోలోకానికి వెళ్లడంతో అభాగ్యురాలైపోయింది. రాజ వేషధారులై బ్రాహ్మణద్రోహులైన అధార్మికులు తన్ను పాలిస్తారని కన్నీరు కారుస్తూన్నది. ఇదంతా నీ ధర్మోపదేశంవల్ల నేను గ్రహించాను. మీ కేం భయంలేదు. — అని ధర్మదేవతకూ

నిశాతమాదదే ఖడ్గం కలయేఽధర్మ హేతవే,
తం జిఘాంసుమభిప్రేత్య విహాయ నృపలాంఛనం.
తత్పాదమూలం శిరసా సమగాద్భయవిహ్వలః,
పతితం పాదయోర్వీరః కృపయా దీనవత్సలః,
శరణ్యో నావధీచ్ఛ్లోక్య ఆహ చేదం హసన్నివ.
న తే గుడాకేశ యశోధరాణాం బద్ధాంజలేర్వై భయమస్తికించిత్,
న వర్తితవ్యం భవతా కథంచన క్షేత్రేఽస్మదీయే త్వమధర్మబంధుః.
త్వాం వర్తమానం నరదేవదేహేష్వనుప్రవృత్తోఽయమధర్మపూగః,
లోభోఽనృతంచౌర్యమనార్యమంహో జ్యేష్ఠా చ మాయా కలహశ్చ దంభః.
న వర్తితవ్యం తద ధర్మబంధో ధర్మేణ సత్యేన చ వర్తితవ్యే,
బ్రహ్మావర్తే యత్ర యజంతి యజ్ఞైర్యజ్ఞేశ్వరం యజ్ఞవితాన విజ్ఞాః.
యస్మిన్ హరిర్భగవానిజ్య మాన ఇజ్యాత్మమూర్తిర్యజతాం శం తనోతి,
కామానమోఘాన్ స్థిరజంగమానామంతర్బహిర్వాయురివైష ఆత్మా.
పరీక్షితైవమాదిష్టస్స కలిర్జాతవేపథుః,
తముద్యతాసిమాహేదం దండపాణి మివోద్యతమ్.

భూదేవికీ అభయమిచ్చి సర్వాస్త్ర శస్త్రధారియైన పరీక్షిత్తు కలిపురుషుని సంహరించడానికి రాజవేషంలోఉన్న కలిపురుషునిపైకి కత్తినెత్తి ఉరికాడు. మహావీరుడైన పరీక్షిత్తుకు భయపడి కలిపురుషుడు రాజవేషం విడచి పాదాక్రాంతుడై రక్షింపుమని ప్రార్థించాడు. శరణాగత వత్సలుడైన మహారాజు చిరునవ్వు నవ్వుతూ కలితో చెప్తున్నాడు.

కలీ! శరణన్న నిన్ను అర్జునుని వంశంలో జన్మించిన వీరుడెవడూ సంహరించడు. కాని నువ్వు అధర్మానికి సహాయుడవు. నువ్వు నారాజ్యంలో ఉండకూడదు. నువ్వు రాజులయొక్క శరీరంలో ప్రవేశించడంవల్ల లోభం అసత్యం దొంగతనం దుర్మార్గం స్వధర్మపరిత్యాగం కపటం దరిద్రం కలహం యింకా అనేక పాప సంబంధమైన గుణాలు వృద్ధిచెందుతున్నాయి. అందుచేత క్షణంకూడా నువ్వు నా రాజ్యంలో ఉండరాదు. నారాజ్యంలో సత్యధర్మాలే వ్యాప్తి చెందాలి. భగవానుడవతరించిన యీ రాజ్యంలో యజ్ఞాలు వేదవిధుల ననుసరించిన సత్కార్మలూ జరుగుతూ ఉండాలి. సర్వాత్మ

యత్ర క్వ వాథ వత్స్యామి సార్వభౌమ తవాజ్ఞయా,
లక్షయే తత్ర తత్రాపి త్వామాత్తేషుశరాననమ్.
తన్మే ధర్మభృతాం శ్రేష్ఠ స్థానం నిర్దేష్టుమర్హసి,
యత్రైవ నియతో వత్స్య ఆతిష్ఠం స్తేఽనుశాసనమ్.
అభ్యర్థితస్తదా తస్మై స్థానాని కలయే దదౌ;
ద్యూతం పానం స్త్రియస్సూనాయత్రాధర్మశ్చతుర్విధః.
పునశ్చ యాచమానాయ జాతరూపమదాద్విభుః
తతోఽనృతంమదఃకామో రజో వై రంచపంచమమ్.
అమూనిపంచస్థానాని హ్యధర్మప్రభవః కలిః,
ఔత్తరేయేణ దత్తాని న్యవసత్తన్నిదేశకృత్.
అథైతాని నసేవేత, బుభూషుః పురుషః క్వచిత్,
విశేషతో ధర్మశీలో రాజా లోకపతిర్గురుః.
వృషస్య పాదాం స్త్రీన్నష్టాంస్తపశ్శౌచం దయామితి,
ప్రతిసందధ ఆశ్వాస్య మహీం చ సమవర్ధయత్.
స ఏష ఏతర్హ్యధ్యాస్త ఆసనం పార్థివోచితమ్,
పితామహే నోపన్యస్తం రాజ్ఞారణ్యం వివిక్షతా.

రూపుడైన భగవంతుడు సమస్తజీవులయొక్క లోపలా బయటాకూడ వ్యాప్తమైఉండి కోర్కెలు నెరవేరుస్తూ ఉంటాడు. అందుచేత వెంటనే నా రాజ్యం వదలి పొమ్మన్న పరీక్షిత్తునకు నమస్కరించి – మహారాజా! నీ ఆజ్ఞానువర్తినై చరిస్తాను. కాని నేను యెక్కడనో యొకచోట వుండాలి గనుక ఆ స్థానం నువ్వే నిర్ణయించ మన్న కలిపురుషునకు పరీక్షిన్మహారాజు నాలుగు స్థానములు ఇలా నిరూపించాడు.

కలీ! నువ్వు ద్యూతం మద్యం స్త్రీసంగం హింస అనే నాలుగు స్థానాలు ఆక్రమించమని చెప్పుతూంటే కలి ధనంలో కూడా స్థాన మిమ్మని ప్రార్థించాడు. పరీక్షిత్తు ఆ స్థానంకూడా యిచ్చాడు. నాటి నుండీ కలి ద్యూత కలహస్త్రీసంగ హింసా సువర్ణాదులందు ప్రవేశించాడు. విజ్ఞులైన వారీ ఐదింటినీ అధర్మస్థానాలుగా గ్రహించి దూరంగా ఉంటారు. ఆత్మకళ్యాణాన్ని కోరే వారెవరూ యీ ఐదింటినీ సేవించరాదు.

అస్తేఽధునాథ రాజర్షిః కౌరవేంద్రశ్రియోల్లసన్
గజాహ్వయే మహాభాగశ్చక్రవర్తీ బృహచ్ఛ్రవాః.
ఇత్థంభూతానుభావోఽయమభిమన్యుసుతో నృపః,
యస్య పాలయతః క్షౌణీం యూయం సత్రాయదీక్షితాః.

కలిని నిగ్రహించి పరీక్షిన్మహారాజు తప శ్శౌచ దయా రూపము లైన మూడుపాదాలూ ధర్మదేవతకు 'పునఃప్రసాదించి వృషభ గో రూపాల్లో ఉన్న భూ ధర్మదేవతలను ఆశ్వాసించి పితృ పితామహమైన రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. అతని ధర్మరాజ్యంలోనే మీరీ సత్ర యాగం చేస్తున్నారు – అని శౌనకాదులకు సూతుడు చెప్పి నాటికి చాలించాడు.

## 17 అధ్యాయం

యో వై ద్రౌణ్యస్త్రవిప్లుష్టో న మాతురుదరే మృతః,
అనుగ్రహాద్భగవతః కృష్ణస్యాద్భుతకర్మణః.
బ్రహ్మకోపోత్థితాద్యస్తు తక్షకాత్ప్రాణవిప్లవాత్,
న సంముమోహోరుభయాద్భగవత్యర్పితాశయః,
ఉత్సృజ్య సర్వతస్సంగం విజ్ఞాతా జితసంస్థితిః,
వైయాసికేర్జహౌ శిష్యో గంగాయాం స్వకళేబరమ్.
నోత్తమశ్లోకవార్తానాం జుషతాం తత్కథామృతమ్,
స్యాత్సంభ్రమోఽంతకాలేఽపి స్మరతాం తత్పదాంబుజమ్.
తావత్కలిర్న ప్రభవేత్ప్రవిష్టోఽపీహ సర్వతః,
యావదీశో మహానుర్వ్యా అభిమన్యవ ఏకరాట్.

పరీక్షిన్మహారాజు మాతృగర్భంలో ఉండగానే అశ్వత్థామచే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రం నుండి కృష్ణునిచే రక్షింపబడ్డాడు. తరువాత బ్రాహ్మణ శాపంవల్ల తక్షక విషాగ్ని జ్వాలలచే మరణమని తెలిసికూడా మహారాజు విచారించక గంగాతీరంలో శుకునివల్ల భగవత్తత్త్వం గ్రహించి శరీరాన్ని త్యాగంచేశాడు. శ్రీకృష్ణకథామృతాన్ని చెప్పడం వినడం కారణంగా మానవులు మోహరహితులై మోక్షాన్ని

యస్మిన్నహని యర్హ్యేవ భగవానుత్ససర్జ గాం,
తదైవేహానువృత్తోఽసావధర్మప్రభవః కలిః.
నానుద్వేష్టి కలిం సమ్రాట్సారంగ ఇవ సారభుక్,
కుశలాన్యాశు సిద్ధ్యంతి నేతరాణి కృతాని యత్.
కిన్ను బాలేషు శూరేణ కలినాఽధీరభీరుణా,
అప్రమత్తః ప్రమత్తేషు యో వృకో నృషు వర్తతే.
ఉపవర్ణితమేతద్వః పుణ్యం పారీక్షితం మయా.
వాసుదేవకథోపేతమాఖ్యానం యదపృచ్ఛత.
యా యాః కథా భగవతః కథనీయోరుకర్మణః.
గుణకర్మాశ్రితాః పుంభిస్సంసేవ్యాస్తాః బుభూషుభిః.
సూత జీవస్సమాశ్శాశ్వతీర్విశదం యశః,
యస్త్వం శంససి కృష్ణస్య మర్త్యానామమృతం హి నః.
కర్మణ్యస్మిన్ననాశ్వాసే ధూమధూమ్రాత్మనాం భవాన్,
ఆపాయయతి గోవిందపాదపద్మాసవం మధు.
తులయామ లవేనాపి న స్వర్గం నాపునర్భవం,
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః.

పొందగలుగుతారు. కృష్ణుడవతారం చాలించినా పరీక్షిత్తు రాజ్యంలో కలి ప్రవేశించకుండా నిరోధించగలిగాడు. సారగ్రాహియైన పరీక్షిన్మహారాజు సంకల్పమాత్రంచేత పుణ్యఫలం కలుగుతుందనీ పాపకర్మ చేస్తేనే కాని ఫలం కలుగదనీ తెలిసినవాడై కలిని శాసించాడేకాని ద్వేషించలేదు. తోడేలు పసివారి విషయంలో ధైర్యంగానూ వీరుల విషయంలో భయంగానూ సంచరించేటట్లు కలిపురుషుడుకూడా అజ్ఞానుల విషయంలో ధైర్యంతోనూ జ్ఞానులూ వీరులూ ఐన వారివిషయమై భయంతోనూ సంచరిస్తూంటాడు. కనకనే పరీక్షిత్తు రాజ్యంలో తన ప్రభావం చూపలేక పోయాడు. ఋషులార! మీరడిగిన ప్రశ్నకు సవిస్తరంగా పరీక్షిన్మహారాజు చరిత్ర చెప్పాను. కృష్ణలీలతోకూడి మోక్షాసక్తులైన మానవులకు ముక్తిని ప్రసాదించే కథలు అనేకంగా ఉన్నాయి. జిజ్ఞాసువులు భగవత్కథలనే విని పరమాత్మనే సేవించాలన్న సూతుని వాక్యాలు విని శౌనకాదులు ఇలా ప్రశ్నిస్తున్నారు.

కో నామ తృప్యేద్రసవిత్కథాయాం మహత్తమైకాంతపరాయణస్య,
నాంతం గుణానామగుణస్య జగ్ముర్యోగేశ్వరా యే భవపాద్మముఖ్యాః.
తతో భవాన్ వై భగవత్ప్రధానో మహత్తమైకాంతపరాయణస్య,
హరేరుదారం చరితం విశుద్ధం శుశ్రూషతాం నో వితనోతు విద్వన్.
స వై మహాభాగవతః పరీక్షిద్యేనాపవర్గాఖ్యమదభ్రబుద్ధిః,
జ్ఞానేన వైయ్యాసకిశబ్దితేన భేజే ఖగేంద్రధ్వజపాదమూలం.
తన్నః పరం పుణ్యమసంవృతార్థమాఖ్యానమత్యద్భుతయోగనిష్ఠం,
ఆఖ్యాహ్యనంతాచరితోపపన్నం పారీక్షితం భాగవతాభిరామం.
అహో వయం జన్మభృతోఽద్య హాస్మ వృద్ధానువృత్త్యాపి విలోమజాతాః,
దౌష్కుల్యమాధిం విధునోతి శీఘ్రం మహత్తమానామభిధానయోగః.
కుతః పునస్గృణతో నామ తస్య మహత్తమైకాంతపరాయణస్య,
యోఽనంతశక్తిర్భగవాననంతో మహద్గుణత్వాద్యమనంతమాహుః.
ఏతావతాలం నను సూచితేన గుణైరసామ్యానతిశాయనస్య.
హిత్వేతరాన్ ప్రార్థయతో విభూతిర్యస్యాంఘ్రిరేణుం జుషతేఽనభీప్సోః.

సూతా! నువ్వు సర్వోత్తమమైన తపఃఃసోపానమైన శ్రీకృష్ణ కథామృతం వినిపిస్తున్నావు. కనక యుగయుగాలు జీవింతువుగాక. సంవత్సరాలుగా సాగే యజ్ఞధూమంచే దేహాలు ధూమసమానంగా ఐనా మోక్షం కలిగిందనే విశ్వాసం పొందలేకుండా ఉన్న మాకు శ్రీకృష్ణ చరితామృత పానం చేయించి తృప్తి కలిగించావు. క్షణమాత్ర సత్సాంగత్యంతో స్వర్గాదులే తులతూగనినాడు తుచ్ఛభోగాలతో పనేముంది? మహాత్మా! బ్రహ్మేంద్రాదులూ శంకరుడూ కృష్ణచరితామృత పానంలో పారంగతులు కాలేకపోతే సామాన్యులమాట యేంచెప్పాలి. నువ్వు శ్రీకృష్ణ చరితామృతాన్ని వినిపించడంలో సర్వసమర్థుడవు. పరీక్షిన్మహారాజుకు గంగాతీరంలో యే భాగవతం వినిపించాడో ఆభాగవత కథామృతం మాకు వినుపించు – అని అడిగిన శౌనకాదులకు సూతుడు చెప్తున్నాడు,

మహాత్ముల సేవచే నేను ధన్యుడనైనాను. సత్పురుష సేవామాత్రంచేతనే ధన్యుడనైతే వారిమాట చెప్పేదేముంది. వాస్తవంచేత భగవానుని గుణాలు అనంతమైనవి. లక్ష్మీదేవి ఎన్నివిధాలుగా ప్రార్థిం

అథాపి యత్పాదనఖావసృష్టం జగద్విరించోఽపహృతార్హణాంభః,
సేశం పునాత్యన్యతమో ముకుందాత్కో నామ లోకే భగవత్పదార్థః.
యత్రానురక్తాస్సహసైవ ధీరా వ్యపోహ్య దేహాదిషు సంగమూఢమ్.
వ్రజంతి తత్పారమహంస్యమంత్యం యస్మిన్నహింసోపశమస్స్వధర్మః.
అహం హి పృష్టోఽర్యమణో భవద్భిరాచక్ష ఆత్మావగమోఽత్ర యావాన్
నభః పతంత్యాత్మసమం పతత్త్రిణస్తథాసమం విష్ణుగతిం విపశ్చితః
ఏకదా ధనురుద్యమ్య విచరన్మృగయాం వనే,
మృగాననుగతశ్శ్రాంతస్తృషితః క్షుధితో భృశమ్.
జలాశయమచక్షాణః ప్రవివేశ తదాశ్రమమ్,
దదర్శ మునిమాసీనం శాంతం మీలితలోచనమ్.
ప్రతిరుద్ధేంద్రియప్రాణమనోబుద్ధిముపారతమ్,
స్థానత్రయాత్పరం ప్రాప్తం బ్రహ్మభూతమవిక్రియమ్.
విప్రకీర్ణజటాచ్ఛన్నం రౌరవేణాజినేన చ,
విశుష్యత్తాలురుదకం తథాభూతమయాచత.
అలబ్ధతృణభూమ్యాదిరసంప్రాప్తార్ఘ్యసూనృతః,
అవజ్ఞాతమివాత్మానం మన్యమానశ్చుకోప హ.
అభూతపూర్వస్సహసా క్షుత్తృడ్భ్యామర్దితాత్మనః
బ్రాహ్మణం ప్రత్యభూద్బ్రహ్మన్ మత్సరో మన్యురేవ చ.

చినా వారినందరినీ విడచి శ్రీహరి పాదాలే సేవిస్తూ ఉంటుంది. శ్రీహరిపాదాలయందు బ్రహ్మచే సమర్పింప బడిన జలమే గంగా రూపంలో అవతరించింది. ఆజలమే సదాశివ సమేతంగా త్రిభువనా లనూ పవిత్రం చేస్తున్నది. ఎవని పాదజల సంపర్కమాత్రంచేత సమస్తలోకాలూ పవిత్రమౌతున్నాయో ఆతడే భగవానుడగు శ్రీకృష్ణుడు. సర్వసంగ పరిత్యాగంచేసి పరమహంసగతిని పొందడమే మానవధర్మం. ధీరులాస్థితినే పొందుతారు. పక్షి తనశక్తికితగినట్లాకా శంలో ఎలా ఎగురుతుందో అలానే విద్వాంసులు వారివారి శక్తుల ననుసరించి శ్రీకృష్ణలీలలు వర్ణిస్తూంటారు. అనంతములైన శ్రీకృష్ణ లీలల నెవడు సంపూర్ణంగా చెప్పగలడు. శ్రీకృష్ణుని అనుగ్రహం గురు వుల కరుణ కారణంగా నేను విన్నదానిలో నాకు తెలిసినంతలో చెప్ప గలిగినంత చెపుతాను వినండి.

స తు బ్రహ్మఋషేరంసే గతాసుమురగం రుషా,
వినిర్గచ్ఛ౯ ధనుష్కోట్యా నిధాయ పురమాగతః,
ఏష కిం నిభృతాశేషకరణో మీలితేక్షణః,
మృషానమాధిరాహోస్విత్కిం ను స్యాత్క్షత్రబంధుభిః,
తస్య పుత్రోఽతితేజస్వీ విహరన్ బాలకోఽర్భకైః,
రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా తత్రేదమబ్రవీత్.
అహో అధర్మః పాలానాం పీవ్నాం బలిభుజామివ.
స్వామిన్యఘం యద్దాసానాం ద్వారపానాం శునామివ.
బ్రాహ్మణైః క్షత్రబంధుర్హి గృహపాలో నిరూపితః,
సకథం తద్గృహే ద్వాస్స్థః సభాండం భోక్తుమర్హతి.
కృష్ణే గతే భగవతి శాస్తర్యుత్పథగామినామ్.
తద్భిన్నసేతూనద్యాహం శాస్మి పశ్యత మే బలం.
ఇత్యుక్త్వారో క్షతామ్రాక్షో వయస్యానృషిబాలకః.
కౌశిక్యాప ఉపస్పృశ్య వాగ్వజ్రం విససర్జహ.
ఇతో లంఘితమర్యాదం తక్షకస్సప్తమేఽహని,
ధక్ష్యతి స్మకులాంగారం చోదితో మే తతద్రుహం.

ఒకనాడు పరీక్షిన్మహారాజు అరణ్యానికి వేటకు వెళ్లి లేళ్ళ గుంపును వెంటాడి అలసి పోయాడు. తుదకు ఆకలి దప్పికలు పీడించ సాగాయి. జలాశయమేమీ కనుపించలేదు. ఒక ఆశ్రమానికి వచ్చాడు. అది శమీకమహర్షి ఆశ్రమం. ఆయన ఇంద్రియాలను జయించి వాయువును బంధించి జాగ్రత్ స్వప్న సుషుప్త్య వస్థలకతీతుడై బ్రహ్మ నిష్ఠుడై సమాధిలో ఉన్నాడు. మహారాజున కక్కడ తృణాసనమైనా లభించలేదు. దాహపీడితుడైన రాజు మహర్షిని పిలిచి చూచాడు. ప్రయోజనం లేకపోయింది. ఆకలిదప్పికలచే పీడితమైన పరీక్షిత్తులో యుక్తాయుక్త వివేకం నశించింది. ఋషి సమాధిలో ఉన్నాడా ఈమహారాజుతో నాకు ఏమేమని నిరాదరించాడా అనేసంశయంకలిగిన మహారాజు ఋషి నిరాకరించాడనే నిశ్చయానికి వచ్చి అక్కడున్న సర్పశవం ఆఋషి మెడలో పడవేసి తన రాజధానికి వెళ్లిపోయాడు.

శమీకఋషి కుమారుడు శృంగి. అతడు మహాతేజస్వి సర్వ సమర్థుడూ కావడంవల్ల ఆశ్రమంలో జరిగిన అక్రమంచూసి ఈమహారాజు

తతోఽభ్యేత్యాశ్రమం బాలో గళేసర్పకళేబరం,
పితరం వీక్ష్య దుఃఖార్తో ముక్తకంఠో రురోద హ.
స వా ఆంగిరసో బ్రహ్మన్ శ్రుత్వా సుతవిలాపనం,
ఉన్మీల్య శనకైర్నేత్రే దృష్ట్వా చాంసే మృతోరగం.
విసృజ్య పుత్రం పప్రచ్ఛ వత్స కస్మాద్ధి రోదిషి
కేన వా తే విప్రకృతమిత్యుక్తస్సన్యవేదయత్.
నిశమ్య శప్తమతదర్హం నరేంద్రం స బ్రాహ్మణో నాత్మజమభ్యనందత్,
అహో బతాంహో మహదజ్ఞ తే కృతమల్పీయసి ద్రోహ ఉరుర్దమోధృతః.
న వై నృభిర్నరదేవం పరాఖ్యం సంమాతుమర్హస్యవిపక్వబుద్ధే,
యత్తేజసా దుర్విషహేణ గుప్తా విందంతి భద్రాణ్యకుతోభయాః ప్రజాః.
అలక్ష్యమాణే నరదేవనామ్ని రథాంగపాణావయమంగ లోకః,
తథా హి చోరప్రచురో వినంక్ష్యత్యరక్ష్యమాణావివరూథవత్క్షణాత్.
తదద్య నః పాపముపైత్య నన్వయం యన్నష్టనాథస్య వసోర్విలుంపకాత్,
పరస్పరం ఘ్నంతి శపంతి వృంజతే పశూన్ స్త్రియోఽర్థాన్ పురుదస్యవో జనాః.
తదార్యధర్మశ్చ విలీయతే నృణాం వర్ణాశ్రమాచారయుతస్త్రయీమయః,
తతోఽర్థకామాభినివేశితాత్మనాం శునాం కపీనామివ వర్ణసంకరః.

లనబడేవారు కాకులవలె బలిభోక్తలై కుక్కలవలె తపస్వుల ద్వార పాలురుగా ఉండవలసినవారు. తపశ్శాలురు తమ తపోభంగం కలుగకుండా ఉండటానికే యీ చక్రవర్తులను ధర్మశాసకులుగా నిర్ణయించారు. వారు ద్వారంలోనే ఉండాలికాని గృహంలో ప్రవేశించి యజమాని పాత్రలలో భుజించరాదు. శ్రీకృష్ణుడు అవతారం చాలించడంతో చక్రవర్తులు మర్యాద అతిక్రమించారు. వీరిని సమర్థుడైనవాడు దండించి తీరాలి. కనుక నేనీ మహారాజును దండిస్తా ' నని ఆ శమీకపుత్రుడు కౌశికీనదిలో స్నానంచేసి ఆచమించి వజ్రరూపమైన వాక్కుతో 'నాతండ్రిని అవమానించిన మహారాజు నేటికి ఏడవరోజున తక్షక విషాగ్నికి ఆహుతి యగుగాక' - యని శపించి తండ్రి దగ్గరకు వచ్చి అమృతసర్పంచూచి గట్టిగా యేడవడం ప్రారంభించాడు. శమీకమహర్షి సమాధినుండిలేచి తన మెడలోఉన్న మృతసర్పం తీసి కుమారా! ఎందు కేడుస్తున్నావు. నిన్నెవరేంచేశారు - అని అడిగి కుమారునివల్ల వృత్తాంతం అంతా తెలిసికొని అరే మూర్ఖా! యెంతపాపంచేశావు.

ధర్మపాలో నరపతిస్సతు సమ్రాడ్బృహచ్ఛ్రవాః,
సాక్షాన్మహాభాగవతో రాజర్షిర్హయమేధయాట్,
క్షుత్తృట్ఛ్రమయుతో దీనో నైవాస్మచ్ఛాపమర్హతి,
అపాపేషు స్వభృత్యేషు బాలేనాపక్వబుద్ధినా.
పాపం కృతం తద్భగవాన్ సర్వాత్మా క్షంతుమర్హతి,
తిరస్కృతా విప్రలబ్ధాశ్శప్తాః క్షిప్తాహతా అపి.
నాస్య తత్ప్రతికుర్వంతి తద్భక్తాః ప్రభవోఽపి హి.
ఇతి పుత్రకృతాఘేన సోఽనుతప్తో మహామునిః.
స్వయం విప్రకృతో రాజ్ఞా నైవాఘం తదచింతయత్,
ప్రాయశస్సాధవో లోకే పరైర్ద్వంద్వేషు యోజితాః.
న వ్యథంతి న హృష్యంతి యత ఆత్మా గుణాశ్రయః.

సామాన్యదోషానికి చక్రవర్తికి మరణ దండన విధిస్తావా? తెలిసీ తెలియని బుద్ధితో నువ్వు శిక్షించడం? భగవత్స్వరూపుడైన చక్రవర్తిని నువ్వు దండించవచ్చా? మహారాజు లేకపోతే దేశం అరాచకమై పోదా? ధర్మం నశించిపోదా? రాజులేని దేశంలో బలవంతులు బలహీనుల్ని హింసిస్తారు. వైదిక కర్మలకు స్థానం పోతుంది. స్త్రీల సౌశీల్యానికి హామీ ఉండదు. దేశం అంతా అస్తవ్యస్తమై పోతుందే! ఎంత ప్రమాదం తీసుకు వచ్చావు – అని కుమారుని అనేకరీతులుగా మందలించి భగవాన్, బాల్యావస్థలో యుక్తాయుక్త వివేకం లేకుండా నా కుమారుడు చేసిన తప్పు మన్నింతువుగాక – అని భగవంతుని ప్రార్థించాడే కాని శమీక మహర్షి పరీక్షిన్మహారాజుపై ఆగ్రహించలేదు. ఇతరులవల్ల కలిగే మానావమానాలూ సుఖదుఃఖాలూ ఆనందంగా అనుభవిస్తారేగాని తిరిగి అపకారం తలపెట్టరు. – కనుకనే వారిని మహాత్ములన్నారు. అందులో శమీక మహర్షి అగ్రశ్రేణికి చెందినవాడూ గుణములకంటే ఆత్మపరమైనదని తెలిసినవాడు.

## 18 అధ్యాయం

మహీపతిస్త్వథ తత్కర్మ గర్హ్యం విచింతయ న్నాత్మకృతం సుదుర్మనాః,
అహొ మయా నీచ మనార్యవత్కృతం నిరాగసి బ్రహ్మణి గూఢతేజసి.
ధ్రువం తతో మే కృతదేవహేళనాద్దురత్యయవ్యసనం నాతిదీర్ఘాత్,
తదస్తు కామం హ్యఘనిష్కృతాయ మే యథా న కుర్యాం పునరేవమద్ధా.
అద్యైవ రాజ్యం బలమృద్ధికోశం ప్రకోపిత బ్రహ్మకులానలో మే,
దహత్వభద్రస్య పునర్న మేఽభూత్ పాపీయసీ ధీర్ద్విజదేవగోభ్యః.
సంచింతయన్నిత్థమథాశృణోద్యథా మునేస్సుతోక్తో నిర్‌ఋతిస్తక్షకాఖ్యాత్,
స సాధు మేనే న చిరేణ తక్షకానలం ప్రసక్తస్య విరక్తికారణమ్.
అథో విహాయేమమముం చ లోకౌ విమర్శితౌ హేయతయా పురస్తాత్,
కృష్ణాంఘ్రిసేవామభిమన్యమాన ఉపావిశత్ప్రాయముమర్త్యనద్యామ్.
యా వై లసచ్ఛ్రీతులసీవిమిశ్రకృష్ణాంఘ్రిరేణ్వభ్యధికాంబునేత్రీ,
పునాతి లోకా నుభయత్ర సేశాన్ కస్తాం న సేవేత మరిష్యమాణః.
ఇతి వ్యవచ్ఛిద్య స పాండవేయః ప్రాయోపవేశం ప్రతి విష్ణుపద్యామ్,
దధ్యౌ ముకుందాంఘ్రి మనన్యభావో మునివ్రతో ముక్తసమస్తసంగః.
తత్రోపజగ్ముర్భువనం పునానా మహానుభావా మునయస్సశిష్యాః,
ప్రాయేణ తీర్థాభిగమాపదేశైః స్వయం హి తీర్థాని పునంతి సంతః.

పరీక్షిన్మహారాజు హస్తినాపురంచేరి నిరపరాధియైన తపశ్శాలిని అవమానించినందులకై పరితపించి పశ్చాత్తాపంతో ఎంత తప్పు చేశాను. అనార్యులు చేసేపని చేశాను గాని ఆర్యసమ్మతమైన పని చేయలేదు. నా తాత తండ్రులు లేగో బ్రాహ్మణులను దేవతలవలె పూజించారో ఆవంశంలో పుట్టి కూడా బ్రాహ్మణావమానం చేశాను. నా అపరాధం నన్నే కాకుండా రాజ్యాన్ని కూడా విధ్వంసంచేస్తుందేమో. బ్రాహ్మణ కోపాగ్ని దేనిని భస్మంచెయ్యలేదు! నాకీ పాప బుద్ధి యెందుకు కలిగింది. విప్రబాలుని శాపంచే నేను తక్షక దష్టుడనై మరణించవలసిందే. దానికి తిరుగులేదు. సరే నేను విచారించడానికీ ఆలోచించడానికీ సమయం కాదు. సంసారాసక్తుడనైన నాకు యీఋషి శాపం జ్ఞానాన్ని కలిగించింది. మరణం తప్పదనే దృఢసంకల్పంతో రాజ్యం జనమేజయుని కిచ్చి, సర్వసంగ పరిత్యాగం చేసి ఇహాముత్ర భోగాసక్తినివీడి శ్రీకృష్ణ పాదోద్భవీ సర్వపాపాపహారిణియైన గంగను చేరి

అత్రిర్వసిష్ఠశ్చ్యవనశ్శరద్వానరిష్టనేమి ర్భృగురంగిరాశ్చ,
పరాశరో గాధిసుతోఽథ రామ ఉతథ్య ఇంద్రప్రమదేధ్మవాహౌ.
మేధాతిథిర్దేవల ఆర్ష్టిషేణో భరద్వాజో గౌతమః పిప్పలాదః,
మైత్రేయ ఔర్వః కవషః కుంభయోనిర్ద్వైపాయనో భగవాన్నారదశ్చ.
అన్యే చ దేవర్షి బ్రహ్మర్షివర్యా రాజర్షివర్యా అరుణాదయశ్చ,
నానార్షేయప్రవరాంస్తాన్ సమేతా నభ్యర్చ్య రాజా శిరసా వవందే.
సుఖోపవిష్టేష్వథ తేషు భూయః కృతప్రణామః స్వచికీర్షితం యత్,
విజ్ఞాపయామాస వివిక్తచేతా ఉపస్థితోఽగ్రేఽభిగృహీతపాణిః.
అహో వయం ధన్యతమా నృపాణాం మహత్తమానుగ్రహణీయశీలాః,
రాజ్ఞాం కులం బ్రాహ్మణపాదశౌచాద్దూరాద్విసృష్టం బత గర్హ్యకర్మ.
తస్యైవ మేఽఘస్య పరావరేశో వ్యాసక్తచిత్తస్య గృహేష్వభీక్ష్ణమ్,
నిర్వేదమూలో ద్విజశాపరూపో యత్ర ప్రసక్తో భయమాశు ధత్తే.
తం మోపయాతం ప్రతియంతు విప్రాః గంగా చ దేవీ ధృతచిత్తమీశే,
ద్విజోపసృష్టః కుహకస్తక్షకో వా దశత్వలం గాయత విష్ణుగాథాః.

ఆమరణ నిరశనవ్రతంతో గంగాతీరంలో కూర్చుని శ్రీకృష్ణ పర బ్రహ్మానే ధ్యానిస్తూ కృష్ణ నామాన్నే స్మరిస్తున్నాడు.

తీర్థములను తీర్థభూతం చెయ్యగల అనేకులైన మహాత్ముల వృత్తాంతం గ్రహించి "ఆహా కాలవైపరీత్యం కలికాలంలో కృతయుగ ధర్మాన్ని స్థాపించిన పరీక్షిత్తు నేటి కేడవనాడు తక్షక విషాగ్ని జ్వాలల కాహుతి అవుతాడు." అనే పిడుగువంటివార్త తెలిసిన వెంటనే గంగా తీరానికి పయనించారు. అందులో అత్రివశిష్ఠ చ్యవన శరద్వాన్ అరిష్టనేమి భృగు అంగిరస పరశురామ పరాశర విశ్వామిత్ర ఉతథ్య ఇంద్ర ప్రమద ఇధ్మవాహ మేధాతిథి దేవతల ఆర్ష్టిషేణ భారద్వాజ గౌతమ పిప్పలాద మైత్రేయ కవష ఔర్వ అగస్త్య వ్యాస నారదాదులంతా ఉన్నారు. వారందరికీ మహారాజు యథోచితంగా సత్కరించి పాదాభి వందనం చేసి చెపుతున్నాడు.

మహాత్ములారా! నేను ధన్యుడను. ఇందరు మహానుభావుల దర్శనం ఏకకాలంలో చెయ్యకలిగాను. "స్వతస్సిద్ధంగా మహారాజులు

పునశ్చ భూయాద్భగవత్యనంతే రతిప్రసంగశ్చ తదాశ్రయేషు,
మహత్సు యాం యాముపయామి సృష్టిం మైత్ర్యస్తు సర్వత్ర నమో ద్విజేభ్యః.
ఇతి స్మ రాజా వ్యవసాయయుక్తః ప్రాచీనమూలేషు కుశేషు ధీరః,
ఉదఙ్ముఖో దక్షిణకూల ఆస్తే సముద్రపత్న్యాస్స్వసుతన్యస్తభారః.
ఏవం తు తస్మిన్నరదేవదేవే ప్రాయోపవిష్టే దివి దేవసంఘాః,
ప్రశస్య భూమౌ వ్యకిరన్ప్రసూనైర్ముదా ముహుర్దుందుభయశ్చ నేదుః.
మహర్షయస్తం సముపాగతా యే ప్రశస్య సాధ్విత్యనుమోదమానాః,
ఊచుః ప్రజానుగ్రహశీలసారా యదుత్తమశ్లోకగుణానురూపమ్.

న వా ఇదం రాజర్షివర్య చిత్రం భవత్సు కృష్ణం సమనువ్రతేషు,
యేఽధ్యాసనం రాజకిరీటజుష్టం సద్యో జహుర్భగవత్పార్శ్వకామాః.
సర్వే వయం తావదిహాస్మహేఽద్య కళేబరం యావదసౌ విహాయ,
లోకం పరం విరజస్కం విశోకం యాస్యత్యయం భాగవతప్రధానః.
ఆశ్రుత్య తదృషివచః పరీక్షిత్సమం మధుచ్యుద్గురు చావ్యళీకం,
ఆభాషతైనానభినంద్య యుక్తం శుశ్రూషమాణశ్చరితాని విష్ణోః.
సమాగతాస్సర్వత ఏవ సర్వే వేదా యథా మూర్తిధరాస్త్రిపృష్ఠే,
నేహాథవాముత్ర చ కశ్చనార్థ ఋతే పరానుగ్రహమాత్మశీలమ్.

నిందిత కర్మలు చెయ్యడంవల్ల బ్రాహ్మణులు పాదప్రక్షాళన చేసే అర్హత కూడా లేకుండా పోతారు. అల్లాకాకుండా రాజవంశంలో పుట్టినా సామ్రాట్టునై యున్నా విప్రశాపం కారణంగా దేహగేహాదులందు ఆసక్తి విడచాను. ఇహపర భోగాలు కూడా తుచ్ఛంగా గోచరిస్తున్నాయి. నేను ఇప్పుడు శ్రీకృష్ణ చరణారవింద ధ్యానం వినా వేరు దృష్టిలో లేను. మహాత్ములారా! కరుణించి నాకు కృష్ణకథామృతం వినిపించండి. హరికథలువింటే భగవద్భక్తి కలుగుతుందని విశ్వసిస్తున్నాను. నాకు రోజుల్లోనే మరణం సిద్ధాంతమై పోయింది. కనుక శ్రీకృష్ణలీలలు విని మోక్షం పొందుతాను. నాకు భక్తి వృద్ధిచెందేలా ఆశీర్వదించి మోక్ష హేతుభూతమైన హరి కథ విని పించండి – అని మహర్షులను అడిగాడు.

గంగకు దక్షిణతీరంలో పూర్వాగ్రమైన కుశాసనం అధిష్ఠించి సర్వసంగ పరిత్యాగియై ఆమరణ నిరశన వ్రతబద్ధుడైన సామ్రాట్టుపై

తతశ్చవః పృచ్ఛ్యమిమం హి పృచ్ఛే విస్రభ్య విప్రా ఇతికృత్యతాయామ్,
సర్వాత్మనా మ్రియమాణైశ్చ కృత్యం శుద్ధం చ తత్రామృశతాభియుక్తాః.
తత్రాగమద్భగవాన్ వ్యాసపుత్రో యదృచ్ఛయా గామటమానోఽనపేక్షః,
అలక్ష్యలింగో నిజలాభతుష్టో వృతశ్చ బాలైరవధూతవేషః.
తం ద్వ్యష్టవర్షం సుకుమారపాదకరో రుజాహ్వాంసకపోలగాత్రమ్,
చార్వాయతాక్షోన్నసతుల్యకర్ణ సుభ్ర్వాననం కంబుసు జాతకంఠమ్.
నిగూఢజత్రుం పృథుతుంగవక్షసమావర్తనాభిం వళివల్గూదరం చ,
దిగంబరం, వక్త్రవికీర్ణకేశం ప్రలంబబాహుం స్వమరోత్తమాభమ్.
శ్యామం సదాపీవ్యవయోంగలక్ష్మ్యా స్త్రీణాం మనోజ్ఞం రుచిరం స్మితేన,
ప్రత్యుత్థితాస్తే మునయస్స్వాసనేభ్యస్తల్లక్షణజ్ఞా అపి గూఢవర్చసం.
స విష్ణురాతోఽతిథయ ఆగతాయ తస్మై సపర్యాం శిరసా జహార,
తతో నివృత్తాః హ్యబుధాస్త్రియోఽర్భకా మహాసనే సోపవివేశ పూజితః.
స సంవృతస్తత్ర మహాన్మహీయసాం బ్రహ్మర్షి రాజర్షి సురర్షిసంఘైః,
వ్యరోచతాలం భగవాన్యథేందుర్గ్రహర్క్షతారానికరైః పరీతః.
ప్రశాంత మాసీనమకుంఠమేధసం మునిం నృపో భాగవతోఽభ్యుపేత్య,
ప్రణమ్య మూర్ధ్నావహితః కృతాంజలిర్నత్వా గిరా సూనృతయాన్వపృచ్ఛత్,

దేవతలు పుష్పవృష్టి కురిపించారు. పరీక్షిత్తుయొక్క నిశ్చితాభిప్రాయం చూసి మహర్షులు ఆనందించి శుభవాక్యాలు పలుకుతూ మహారాజా సమస్త దేశాధీశులు కప్పాలుకడుతూ నతమస్తకులై సేవిస్తూంటే చతుస్సముద్ర వేలావలయిత భూమండలాన్ని పాలించే మహారాజువై యుండీ క్షణకాలంలో సర్వభోగాలనూ సర్వైశ్వర్యాలనూ ఇహలోక పరలోకాలనూ త్యజించి మహావైరాగ్యం పొందకలిగిన నీజన్మ ధన్యమైనది. నీవు జన్మతః కృష్ణ భక్తుడవు. కనక నీకీ ధైర్యస్థైర్యాలు కలిగాయి. అన్నీ పరిత్యజించ కలిగావు. నువ్వు వైకుంఠధామాన్ని పొందేటంతవరకూ మేము ఇక్కడనే ఉంటాము. నీమనోవాంఛ నెరవేరుతుంది- అన్నారు మహర్షులు.

మీరు అనేక ప్రాంతాలనుండి ఇక్కడకు వచ్చారు. సత్య లోకంలో మూర్తివంతములై ఉన్న వేదాలతో సమానులు. మీకు పరోపకార వాంఛ వినా రెండో కోర్కెయే ఉండదు. మీలో మీరాలోచించి నాకు మోక్షమార్గం ఉపదేశించండి. జీవుడు సర్వకాలము లందూ సర్వవిధములచేతా ఏమి చేస్తూ ఉండాలి? స్వల్పకాలంలో

అహో అద్య వయం బ్రహ్మన్ సత్సేవ్యాః క్షత్రబంధవః,
కృపయాఽతిథి రూపేణ భవద్భిస్తీర్థకాః కృతాః.
యేషాం సంస్మరణా త్పుంసాం సద్యశ్శుద్ధ్యంతి వై గృహాః,
కిం పున ర్దర్శన స్పర్శపాదశౌచాసనాదిభిః.
సాన్నిధ్యాత్తే మహాయోగిన్పాతకాని మహాంత్యపి,
సద్యో నశ్యంతి వై పుంసాం విష్ణోరివ సురేతరాః.
అపి మే భగవాన్ ప్రీతః కృష్ణః పాండుసుతః ప్రియః,
పైతృష్వ సేయప్రీత్యర్థం తద్గోత్రస్యాత్తబాంధవః,
అన్యథా తేఽవ్యక్తగతేర్దర్శనం నః కథం నృణామ్.
నితరాం మ్రియమాణానాం సంసిద్ధస్య వనీయసః.
అతః పృచ్ఛామి సంశిష్టిం యోగినాం పరమం గురుమ్,
పురుషస్యేహ యత్కార్యం మ్రియమానస్య సర్వదా.
యచ్ఛ్రోతవ్యమథో జప్యం యత్కర్తవ్యం నృభిః ప్రభో,
స్మర్తవ్య భజనీయం వా బ్రూహి యద్వా విపర్యయమ్.
నూనం భగవతో బ్రహ్మన్ గృహేషు గృహమేధినామ్,
న లక్ష్యతే హ్యవస్థానమపి గోదోహనం క్వచిత్.
ఏవమాభాషితః పృష్టస్స రాజ్ఞాశ్లక్ష్ణయా గిరా,
ప్రత్యభాషత ధర్మజ్ఞో భగవాన్బాదరాయణిః.

---

మరణం కలిగేవాని కర్తవ్యం ఏమిటి? సవిస్తరంగా నాకు వినిపించండి. అని పరీక్షిన్మహారాజు ఆమహర్షుల నడుగుతూ ఉన్న సమయానికి వ్యాసపుత్రుడైన శ్రీశుకుడు ఆప్రదేశానికి వచ్చాడు.

శ్రీశుకుని యందు వర్ణాశ్రమ ధర్మాలకు సంబంధించిన బాహ్య చిహ్నాలులేమీలేవు. ఆత్మానందానుభూతికలవాడు. పిల్లలూ స్త్రీలూ ఆయనను చుట్టిముట్టి ఉంటారు. పదహారు సంవత్సరాలవయస్సు. సుందరమూ సుకుమారము అయిన అవయవాలు. విశాలములైన నేత్రాలూ ఎత్తైన నాసిక సమానమైన చెవులు. విల్లుతో సమానమైన కనుబొమలు శంఖంవంటి కంఠం, విశాలమైన ఫాలభాగం. వక్షస్థలం కలిగి దిగంబరుడై, అపర శివునివలె వచ్చిన శ్రీశుకుని చూడటంతోనే విజ్ఞులైన ఋషులందరూ లేచి నమస్కరించారు.

పరీక్షిన్మహారాజు కూడా అతిధి రూపంలో వచ్చిన శ్రీశుకమహర్షిని అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు. ఇదంతా చూచిన స్త్రీలు ఆతడు మహాత్ముడని గుర్తించి వెనుతిరిగి పోయారు. శ్రీశుకయోగి సభామధ్యంలో ఉత్తమాసీనుడైన వెనుక మహర్షులందరూ శుకునికి నలుప్రక్కలా ఆసీనులయ్యారు. గ్రహనక్షత్రాదుల మధ్యనున్న చంద్రునివలె శోభిస్తున్నాడు శుకయోగీంద్రుడు. శాంతచిత్తుడై సుఖాసనాన్ని అధిష్ఠించిన శుకయోగిని సమీపించి పరీక్షిన్మహారాజు నమస్కరించి మధురస్వరంతో ఇలా అడిగాడు.

శుకయోగీంద్రా! అపరాధినైన క్షత్రియుడను. అయినా నేను ధన్యుడనే యేమందువా? ఇంతమంది సత్పురుషుల మధ్య దేహత్యాగం చేసే అవకాశం నాకే లభించింది. అందులో నీదర్శనం కేవలం మోక్షప్రదమైనది. తమవంటి మహాత్ముల పాదాలు కడిగి ఆపవిత్రోదకం శిరస్సున ధరించి మీకాసనాలిచ్చి పూజించడంకంటే జన్మకు కావలసిన దేముంది. పాండవుల వంశంలో పుట్టడంవల్ల నాకీ మహద్భాగ్యం కలిగింది. పాండవులకు మిత్రుడు కావడంవల్ల కృష్ణునకు నాయందనుగ్రహం ఉంది. కురువంశవివర్ధనుడైన వ్యాసపుత్రుడవగుట మీకు నాయందనుగ్రహం ఉండాలి. కనక నాయందు కరుణఉంచి మానవధర్మం చెప్తూ మరణం ఆసన్నమైన వాని కర్తవ్యంకూడా చెప్పండి. మానవుడేమి వినాలి? ఎవరిని సేవించాలి. ఎవని నామాన్ని స్మరించాలి. ఎవరిని త్యజించాలి. చేయకూడని పనులేవి. శీఘ్రంగా మోక్షంపొందాలంటే యేమిచెయ్యాలో చెప్పగల సమర్థుడవు నువ్వే. నీదర్శనం దుర్లభం. గోదోహన కాలాన్ని అతిక్రమించి గృహస్థుల యిండ్లలో ఉండనివాడవు, ఐనా నన్ను అనుగ్రహించి నాకు మోక్షమార్గం ఉపదేశింపు మని ప్రార్థించిన పరీక్షిన్మహారాజుకు శ్రీశుకుడు భాగవత ధర్మం వినిపింప సంసిద్ధుడైనాడని సూత మహర్షి శౌనకాదులకు చెప్పి సంధ్యాకృత్యములకై లేచాడు.

వేదవ్యాస మహర్షి ప్రోక్తమైన మహాభాగవతానికి
ఆంధ్ర వ్యాఖ్యానానువాదంతో ప్రథమస్కంధము.

# శ్రీ మ ద్భా గ వ త ం

## ద్వి తీ య స్కం ధ ము

---

వరీయానేష తే ప్రశ్నః కృతో లోకహితో నృప,
ఆత్మవిత్సంమతః పుంసాం శ్రోతవ్యాదిషు యః పరః.
శ్రోతవ్యాదీనిరాజేంద్ర నృణాం సంతి సహస్రశః,
అపశ్యతామాత్మతత్త్వం గృహేషు గృహమేధినామ్.
నిద్రయా హ్రియతే నక్తం వ్యవాయేన నవం వయః,
దివా చార్థేహయారాజన్కుటుంబభరణేన చ.
దేహాపత్యకళత్రాదిష్వాత్మసైన్యేష్వసత్స్వపి,
తేషాంప్రమత్తోనిధనం పశ్యన్నపి న పశ్యతి.
తస్మాద్భారతసర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చస్మర్తవ్యశ్చే చ్ఛతాఽభయమ్,

పరీక్షిన్మహారాజా! లోకహితార్థం నీవడిగిన ప్రశ్న ఉత్తమమైనది. మనుష్యులకు వినుటకూ స్మరించడానికీ జ్ఞాపకం ఉంచుకొనుటకూ యింతకంటె శ్రేష్ఠమైనది లేదు. ఈప్రశ్న నాత్మజ్ఞానులానందిస్తారు. మహారాజా! సంసారి గృహకృత్యాల్లో పడి తన్ను తానే మరచిపోతాడు. ప్రపంచ సంబంధమైన మాటలతో కాలం వ్యర్థం చేస్తాడు. రాత్రినిద్ర స్త్రీసంగాలతోనూ పగలు ధనార్జనాదులతోనూ వాని ఆయువు గడచి పోతుంది. సంసారంలో సన్నిహితులనుకొనే పుత్ర కళత్ర శరీరాలు కూడా అసత్యములే. కాని పురుషుడు రాత్రింబవళ్లు మృత్యువు మ్రింగి వేస్తూన్నా అశాశ్వతమనుకోడు. మహారాజా! సర్వాత్ముడైన శ్రీకృష్ణుని లీలాచరిత్రల నెవడు వింటాడో వాడే సుఖం పొంద కలుగుతాడు. భక్తిజ్ఞాన వైరాగ్యాలవల్ల మరణ సమయంలో భగవంతుడు జ్ఞాపకం ఉంటాడు. నిర్గుణమందే రమిస్తూ విధినిషేధాల కతీతులై చరించే మహాత్ములుకూడా శ్రీహరి లీలా కథనంలో ఆనందిస్తూ

ఏతావాన్ సాంఖ్యయోగాభ్యాం స్వధర్మపరినిష్ఠయా,
జన్మలాభః పరః పుంసామంతే నారాయణస్మృతిః.
ప్రాయేణ మునయో రాజన్నివృత్తా విధినిషేధతః,
నైర్గుణ్యస్థా రమంతే స్మ గుణానుకథనే హరేః.
ఇదం భాగవతం నామపురాణం బ్రహ్మసంమితమ్,
అధీతవాన్ ద్వాపరాదౌ పితుర్ద్వైపాయనాదహమ్.
పరినిష్ఠోఽపి నైర్గుణ్యే హ్యుత్తమశ్లోకలీలయా,
గృహీతచేతా రాజర్షఆఖ్యానం యదధీతవాన్.
తదహం తేఽభిధాస్యామి మహాపౌరుషికో భవాన్,
యత్ర శ్రద్ధధతామాశు స్యాన్ముకుందే మతిస్సతీ.
ఏతన్నిర్విద్యమానానా మిచ్ఛతామకుతోభయమ్,
యోగినాం నృపనిర్ణీతం హరేర్నామానుకీర్తనమ్,
కిం ప్రమత్తస్య బహుభిః పరోక్షైర్హాయనైరిహ,
వరం ముహూర్తం విదితం ఘటతే శ్రేయసే యతః.

ఉంటారు. ద్వాపరాంతలో వేదరూపమైన భాగవతతత్వం కృష్ణద్వైపాయనునివల్ల నేను విన్నాను. నేను బ్రహ్మనిష్ఠుడనైకూడా కృష్ణలీలా రూపమైన భాగవతాధ్యయనం చేశానంటే ఆగ్రంథమంటెంత ఆనందం ఉన్నదో ఆలోచించు. బ్రహ్మనిష్ఠుల హృదయాల నాకర్షించే భాగవతం వినిపిస్తాను విను. దానివల్ల సర్వమానవ ధర్మాలూ అర్థమై నిరతిశయానందం పొందకలుగుతావు. మోక్షమార్గం విడచి పశుపక్ష్యాదులవలె చిరకాలం జీవించడం కంటె భాగవతకథాశ్రవణంచేస్తూ శ్రీకృష్ణ నామాన్ని సంకీర్తనం చేసుకుంటూ క్షణం బ్రతికినా చాలు. రాజర్షియైన ఖట్వాంగుడు మృత్యువు సమీపించిదని తెలిసికొని రెండు గడియలలో సర్వసంగాలనూ త్యజించి మోక్షాన్ని పొందాడు. నీకు ఆయుర్దాయం ఉన్నప్పుడు మోక్షం పొందడానికి సందేహం లేదు. మరణకాలం సమీపించి నప్పుడేంచెయ్యాలో అన్నీ చెపుతాను చెయ్యి. నీకు తప్పక మోక్షం లభిస్తుంది. వైరాగ్యమనేకత్తితో అహంకార మమకారాలు నరికెయ్యాలి. ధైర్యంతో గృహాన్నివదలి పవిత్రతీర్థంచేరి స్నానంచేసి ఏకాంత ప్రదేశంలో ఆశీనుడై "అ" కార "మ" కార "ఉ" కారాత్మక

ఖట్వాంగో నామ రాజర్షిర్జ్ఞాత్వేయత్తామిహాయుషః,
ముహూర్తాత్సర్వముత్సృజ్య గతవానభయం హరిమ్.
తవాప్యేతర్హి కౌరవ్య సప్తాహం జీవితావధిః,
ఉపకల్పయ తత్సర్వం యత్తావత్సాంపరాయికమ్,
అంతకాలే తు పురుష ఆగతే గతసాధ్వసః,
ఛింద్యాదసంగశస్త్రేణ స్పృహాం దేహే చ యేఽను తం.
గృహాత్ప్రవ్రజితో ధీరః పుణ్యతీర్థజలాప్లుతః
శుచౌ వివిక్త ఆసీనో విధివత్కల్పితాసనే.
అభ్యసేన్మనసా శుద్ధం త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్,
మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజమవిస్మరన్.
నియచ్ఛేద్విషయేభ్యోఽక్షాన్మనసా బుద్ధిసారథిః,
మనః కర్మభిరాక్షిప్తం శుభార్థే ధారయేద్ధియా.
తత్రైకావయవం ధ్యాయేదవ్యుచ్ఛిన్నేన చేతసా,
మనో నిర్విషయం యుక్త్వా తతః కించన న స్మరేత్.

ఓంకార ప్రణవం జపించాలి. ప్రాణవాయువును బంధించి మనస్సును వశంలో ఉంచుకొని మనోబుద్ధులను ఏకంచేసి ఇంద్రియాలను అంతర్ముఖం చేసికొని వాసనాజనితములైన విషయములందు విముఖుడై శ్రీహరియొక్క శ్రీవిగ్రహాన్ని మనస్సులో బంధించి ధ్యానించాలి. ధ్యానసమయంలో రజోగుణం చేత విక్షిప్తంగానీ తమోగుణంచేత మూఢత్వంగానీ కలిగితే అధైర్యపడకూడదు. యోగధారణచే ఆ రెండు గుణాలూ నశించిపోతాయి. ధారణ స్థిరమైనప్పుడు భగవంతుని దర్శనం కలుగుతుంది. దానివల్ల భక్తిస్థిరమైపోతుంది – అని చెప్పుతూంటే పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రా! ఏసాధనంచే ధారణ సిద్ధిస్తుంది. ఏవస్తువునందు ధారణ ఉంచాలి. శీఘ్రంగా మనోమాలిన్యం నశించిపోవడానికి మార్గమేమిటి? సవిస్తరంగా చెప్పండి – అని అడిగాడు.

మహారాజా! ఆసనం శ్వాస ఆసక్తి ఇంద్రియాలను జయించడం బుద్ధిద్వారా మనస్సును భగవంతుని స్థూల రూపంలో ప్రవేశపెట్టడం ప్రధాన సాధనాలు. కార్యరూపమైన విశ్వమూ ఆవిశ్వంలో యిప్పుడు కన్పించే ముందు రాబోయేవి అన్నీకూడా భగవంతుని స్థూలరూపమే.

పదం తత్పరమం విష్ణోర్మనో యత్ర ప్రసీదతి,
రజస్తమోభ్యామాక్షిప్తం విమూఢం మన ఆత్మనః.
యచ్ఛేద్ధారణయా ధీరో హంతి యా తత్కృతం మలమ్,
యస్యాం సంధార్యమాణాయాం యోగినో భక్తిలక్షణః,
ఆశు సంపద్యతే యోగ ఆశ్రయం భద్రమీక్షతః.
యథా సంధార్యతే బ్రహ్మన్ ధారణా యత్ర సంమతా,
యాదృశీ వా హరేదాశు పురుషస్య మనోమలమ్.
జితాసనో జితశ్వాసో జితసంగో జితేంద్రియః,
స్థూలే భగవతో రూపేమన స్సంధారయేద్ధియా.
విషయస్తస్య దేహోఽయం స్థవిష్ఠస్య స్థవీయసామ్,
యత్రేదం దృశ్యతే విశ్వం భూతం భవ్యం భవచ్చ సత్.
అండకోశే శరీరేఽస్మిన్ సప్తావరణసంయుతే,
వైరాజః పురుషోయోఽసౌ భగవాన్‌ధారణాశ్రయః.
పాతాళమేతస్య హి పాదమూలం పఠంతి పార్ష్ణిప్రపదే రసాతలమ్,

అదే విరాట్స్వరూపము. జల అగ్ని వాయురాకాశములూ ప్రకృతీ మహత్తత్త్వమూ అహంకారమూ యీ ఏడు ఆవరణలచే వ్యాప్తమైన బ్రహ్మాండ శరీరమందున్నవాడే విరాట్పురుషుడు. ఆతడే ధారణకు యోగ్యుడు. తత్త్వవేత్తలు ఆపురుషుని రూపం యిలావర్ణిస్తారు. పాతాళం పాదతలం. రసాతలం పార్ష్ణిభాగం. రెండుగుల్ఫములు మహాతలమే. జంఘలు తలాతలం. సుతలం జానుభాగం. అతల వితలాలు ఊరుభాగాలు. మహీతలం పొత్తికడుపు. ఆకాశమే నాభి. స్వర్గలోకం వక్షస్థలం. కంఠం మహర్లోకం. జనోలోకం ముఖం. తపోలోకం లలాటం. సహస్రశిరస్సులుగల భగవానుని శిరోభాగమే సత్యలోకం. దేవతలే భుజాలు. దిక్కులే చెవులూ శబ్దమూ శ్రవణేంద్రియమూ కూడా. అశ్వినీకుమారులే నాసికలు. గంధమే ఘ్రాణేంద్రియము. అగ్నిహోత్రుడే ముఖం. ద్యులోకం నేత్రాలు. సూర్యుడే చూచేశక్తి. రాత్రింబవళ్లు రెప్పలు. భ్రూవిలాసమే బ్రహ్మలోకం. జలమే తాలుభాగం. రసమే జిహ్వేంద్రియం. వేదములే బ్రహ్మరంధ్రం. యముడు కోరలు. స్నేహకళలు పలువరస. భగవానుని మహామాయ చిరునవ్వు.

మహాతలం విశ్వసృజోఽథ గుల్ఫౌ తలాతలం వై పురుషస్య జంఘే.
ద్వే జానునీ సుతలం విశ్వమూర్తేరూరుద్వయం వితలం చాతలం చ,
మహీతలం తజ్జఘనం మహీపతే నభస్తలం నాభిసరో గృణంతి.
ఉరస్స్థలం జ్యోతిరనీక మస్యగ్రీవా మహర్వదనం వైజనోఽస్య,
తపో లలాటం విదురాదిపుంసస్సత్యంతు శీర్షాణిసహస్ర శీర్ష్ణః.
ఇంద్రాదయో బాహవ ఆహురుస్రాఃకర్ణౌ దిశః శ్రోత్రమముష్యశబ్దః,
నాసత్యదస్రౌపరమస్యనాసే ఘ్రాణోఽస్యగంధో ముఖమగ్నిరిద్ధః.
ద్యౌరక్షిణీ చక్షురభూత్పతంగః పక్ష్మాణివిష్ణోరహనీ ఉభేచ,
తద్భ్రూవిజృంభః పరమేష్ఠిధిష్ణ్యమాపోఽస్య తాలూరస ఏవజిహ్వా.
ఛందాంస్యనంతస్య శిరోగృణంతిదంష్ట్రా యమస్స్నేహకళా ద్విజాని,
హాసో జనోన్మాదకరీ చ మాయా దురంతసర్గో యదపాంగమోక్షః.
వ్రీడోత్తరోష్ఠోఽధర ఏవ లోభో ధర్మస్తనోఽధర్మపథశ్చపృష్ఠః,
కస్తస్య మేఢ్రం వృషణౌచమిత్రౌ కుక్షిస్సముద్రాగిరయోఽస్థిసంఘాః.
నద్యోఽస్య నాడ్యోఽథ తనూరుహాణి మహీరుహా విశ్వతనోర్నృపేంద్ర,
అనంతవీర్య శ్శ్వసితం మాతరిశ్వా గతిర్వయః కర్మ గుణప్రవాహః.
ఈశస్య కేశాన్విదురంబు వాహాన్వాసస్తుసంధ్యాం కురువర్యభూమ్నః,
అవ్యక్తమాహుర్హృదయం మనశ్చ సచంద్రమాస్సర్వవికారకోశః.

ఈ అనంతమైన సృష్టిఅంతా ఆమహామాయా కటాక్షవిక్షేపమే. లజ్జ పై పెదవి. లోభం క్రింద పెదవి. ధర్మం స్తనభాగం. అధర్మం వెనుక భాగం. ప్రజాపతి మూత్రేంద్రియం. మిత్రా వరుణులు అండకోశాలు. సముద్రం కుక్షి. పర్వతాలు అస్థులు. నదులు నాడీసమూహం. వృక్షములు రోమాలు. మహావాయువు శ్వాస. కాలము గమనము. గుణ రూపమైన చక్రమును త్రిప్పుచుండుటే విరాట్పురుషుని కర్మ. మేఘములే కేశములు. సంధ్య అనంతుని వస్త్రం. అవ్యక్తము (మూలప్రకృతి) భగవానుని హృదయ మన్నారుపెద్దలు. సమస్త వికారములకు స్థానం విరాట్పురుషుని మనోరూపమైన చంద్రుడు. మహత్తత్త్వమే చిత్తం. రుద్రుడే అహంకారం. గుర్రములూ కంచరగాడిదలూ ఒంటెలూ ఏనుగులూ గోళ్లూ అరణ్యమృగాలూ పశువులూ కంటిభాగంలో ఉంటాయి. రకరకాల పక్షులు ఆతని రచనా కౌశలాన్ని తెలుపుతాయి. స్వాయంభువ మనువు బుద్ధి. మనుసంతానమైన మనుష్యులే విరాట్పు

విజ్ఞానశక్తిం మహిమామనంతి సర్వాత్మనోఽంతఃకరణం గిరిత్రం,
అశ్వాశ్వతర్యుష్ట్రగజా నఖాని సర్వే మృగాః పశవః శ్రోణిదేశే.
వయాంసి తద్వ్యాకరణం విచిత్రం మనుర్మనీషా మనుజో నివాసః,
గంధర్వవిద్యాధరచారణాప్సరస్స్వరస్మృతీరసురానీకవీర్యః.
బ్రహ్మాననం క్షత్రభుజో మహాత్మా విడూరురంఘ్రిశ్రితకృష్ణవర్ణః,
నానాభిధాభిజ్యగణోపపన్నో ద్రవ్యాత్మకః కర్మవితానయోగః,
ఇయానసావీశ్వరవిగ్రహస్య యస్సంనివేశః కథితో మయా తే,
సంధార్యతేఽస్మిన్ వపుషి స్థవిష్ఠే మనస్స్వబుద్ధ్యా న యతోఽస్తి కించిత్,
స సర్వధీవృత్త్యనుభూత సర్వ ఆత్మా యథా స్వప్నజనేక్షితైకః.
తం సత్యమానందనిధిం భజేత నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః.

మనుష్యుడు నివాసస్థానం. గంధర్వ విద్యాధర చారణ అప్సరసలు షడ్జమాదిస్వరాలస్మృతి. దైత్యులే భగవానుని వీర్యం. బ్రాహ్మణులు ముఖం. క్షత్రియులు భుజాలు. వైశ్యులు ఊరువులు. శూద్రులే పాదములు. చాతుర్వర్ణ్యవ్యవస్థయే భగవానుని పూర్ణరూపం. దేవతల నామములతో చేయబడే ద్రవ్యమయ యజ్ఞాలే ఆతనికర్మ. భగవంతుని స్థూలమయశరీరం నీకు చెప్పాను. ఈరూపాన్నే ముముక్షువు లుపాసిస్తారు. ఇంతకంటె భిన్నమైన వస్తువులేదు. స్వప్నావస్థలో తన్ను తానే అనేకరూపాల్లో చూస్తాడు. అలాగే బుద్ధివృత్తులద్వారా సర్వానుభవాలనూ గుర్తించేవాడు సర్వాంతర్యామియైన భగవానుడొక్కడే. ఆభగవంతునే ధ్యానించడంచేత మానవుడు పతనం గాకుండా మోక్షం పొందగలుగుతాడు.

## 1 అధ్యాయం

ఏవం పురా ధారణయాత్మయోనిర్నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య తుష్టాత్,
తథా ససర్జేదమమోఘదృష్టిర్యథాప్యయాత్ప్రాగ్వ్యవసాయబుద్ధిః.

మహారాజా! సృష్ట్యారంభంలో బ్రహ్మ యీ ధారణచేతనే భగవంతుని ప్రసన్నుని చేసికొని ప్రళయకాలంలో నశించిన సృష్టి

శాబ్దస్య హి బ్రహ్మణ ఏష పంథా యన్నామభిర్ధ్యాయతి ధీరపార్థైః,
పరిభ్రమంస్తత్ర న విందతేఽర్థాన్మాయామయే వాసనయా శయానః.
అతః కవిర్నామసు యావదర్థః స్యాదప్రమత్తో వ్యవసాయబుద్ధిః,
సిద్ధేఽన్యథార్థే న యతేత తత్ర పరిశ్రమం తత్ర సమీక్షమాణః.
సత్యాం క్షితౌ కిం కశిపోః ప్రయాసైర్బాహౌ స్వసిద్ధే హ్యుపబర్హణైః కిమ్,
సత్యంజలౌ కిం పురుధాన్నపాత్ర్యా దిగ్వల్కలాదౌ సతి కిం దుకూలైః.
చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం నైవాంఘ్రిపాః పరభృతః సరితోఽప్యశుష్యన్
రుద్ధా గుహాః కిమజితోఽవతి నోపసన్నాన్కస్మాద్భజంతి కవయో ధన దుర్మదాంధాన్.
ఏవం స్వచిత్తే స్వత ఏవ సిద్ధ ఆత్మా ప్రియోఽర్థో భగవాననంతః,
తన్నిర్వృతో నియతార్థో భజేత సంసారహేతూపరమశ్చ యత్ర.
కస్తాం త్వనాదృత్య పరానుచింతామృతే పశూనసతీం నామ యుంజ్యాత్,
పశ్యన్ జనం పతితం వైతరణ్యాం స్వకర్మజాన్ పరితాపాన్ జుషాణమ్.
కేచిత్స్వదేహాంతర్హృదయావకాశే ప్రాదేశమాత్రం పురుషం వసంతమ్,
చతుర్భుజం కంజరథాంగశంఖగదాధరం ధారణయా స్మరంతి.
ప్రసన్నవక్త్రం నలినాయతేక్షణం కదంబకింజల్కపిశంగవాసనమ్,
లసన్మహారత్నహిరణ్మయాంగదం స్ఫురన్మహారత్నకిరీటకుండలమ్.

రూపమైన స్మృతిపొంది యథాపూర్వంగా సృష్టిచేశాడు. మానవుల బుద్ధి స్వర్గాది లోకప్రాప్తి హేతువులైన కర్మలయందు ప్రవర్తించే విధంగానే వేదంలో వర్ణనలుంటాయి. స్వర్గాది భోగాలూ స్వప్న సుఖమూ మొదలయిన వానియందు యథార్థమైన సుఖం కనిపించదు. కనుక యీ ప్రపంచంలోగల పదార్థాలతో యెంతవరకూ అవసరమో అంతవరకే వ్యవహరించాలి. ప్రపంచవస్తువులయందుండే నిస్సారం గ్రహించి ప్రారబ్ధవశంవల్ల లభించినదానితో తృప్తిచెందాలి. అధిక ప్రయత్నం చెయ్యకూడదు. విశాలమైన భూమి ఉంటే పడకకు హంస తూలికా తల్పాలెందుకు? తలక్రిందుకు చెయ్యి ఉండగా తలదిండ్లకై ప్రయత్నించడం దేనికి? పానానికి దోసిలి ఉండగా పాత్రలేల. ధరించడానికి దిక్కులున్నాయి, ఆకులూ పట్టలూకూడా ఉన్నాయి. దుకూలాల పనేముంది. ఆకలివేసేసరికి ఫలమూలాదులున్నాయి. నదులు పానీయానికి స్వాదుజలానిస్తున్నాయి. ఇంకా ఆహార పానీయాలకు తాపత్రయ

ఉన్నిద్రహృత్పంకజకర్ణికాలయే యోగేశ్వరస్థాపితపాదపల్లవమ్,
శ్రీలక్ష్మణం కౌస్తుభరత్నకంధరమమ్లానలక్ష్మ్యా వనమాలయాచితం.
విభూషితం మేఖలయాంగుళీయకై ర్మహాధనైర్నూపురకంకణాదిభిః,
స్నిగ్ధామలైః కుంచితనీలకుంతలై ర్విరోచమానాననహాసపేశలమ్.
అదీనలీలాహసితేక్షణోల్లసద్భ్రూభంగసంసూచితభూర్యనుగ్రహమ్,
ఈక్షేత చింతామయ మేవమీశ్వరం యావన్మనో ధారణయా వతిష్ఠతే.
ఏకైకశోఽంగాని ధియా నుభావయేత్పాదాదియావద్ధసితం గదాభృతః,
జితం జితం స్థానమపోహ్య ధారయేత్పరం పరం శుధ్యతి ధీర్యథా తథా.
యావన్న జాయేతపరావరేఽస్మిన్విశ్వేశ్వరే ద్రష్టరి భక్తియోగః,
తావత్ స్థవీయః పురుషస్య రూపం క్రియావసానే ప్రయతః స్మరేత.
స్థిరం సుఖం చాసన మాశ్రితో యతిర్యదా జిహాసురిమ మంగలోకమ్,
కాలేచదేశే చమనోన సజ్జేత్ప్రాణాన్నియచ్ఛే న్మనసా జితాసుః.
మనస్స్వబుద్ధ్యామలయా నియమ్య క్షేత్రజ్ఞ ఏతాం నినయేత్తమాత్మని॰
ఆత్మానమాత్మన్యవరుధ్య ధీరో లబ్ధోపశాంతిర్విరమేత కృత్యాత్.
న యత్ర కాలో నిమిషాం పరః ప్రభుః కుతో ను దేవా జగతాం య ఈశిరే,
న యత్ర సత్త్వం న రజస్తమశ్చ న వై వికారో న మహాన్ ప్రధానమ్.

మెందుకు. నివసించడానికి పర్వతగుహాలులేవా? శరణాగతులను రక్షించడానికి భగవంతుడు లేడా. ఇన్ని అవకాశాలు ప్రపంచంలోఉంటే ధనమదాంధులైన వారిని సేవించడం అజ్ఞానంకాదా. ఈవిధంగా ఆలోచించి విరక్తుడై హృదయంలో విరాజిల్లే ఆత్మస్వరూపుడు ప్రియమైన వాడూ సత్యమైనవాడూ అయిన భగవంతుని ప్రేమించి ఆనందంతో దృఢనిశ్చయుడై భజిస్తే జనన మరణ రూపమైన కాలచక్రంలో త్రిప్పే అజ్ఞానం నశించిపోతుంది. పశువుల సంగతి అలాఉంచితే మానవుడై జన్మించికూడా సంసారరూపమైన వైతరిణీ నదియందుపడి దుఃఖాలు అనుభవిస్తూ ఇంకాదుఃఖానుభవమే కలిగించే విషయభోగాలను జ్ఞానియైనవాడెవడు కోరతాడు!

కొందరు హృదయాకాశమందున్న శంఖ చక్ర గదా లక్షణ లక్షితుడైన శ్రీహరినే ధ్యానిస్తారు. వారి దృష్టిలో శ్రీహరి అనంత కల్యాణగుణుడు. సగుణ నిర్గుణాలు రెండూకూడా అతని స్వరూపమే —

పరం పదం వైష్ణవమామనంతి తద్యన్నేతి నేతీత్యతదుత్సిసృక్షవః,
విసృజ్య దౌరాత్మ్యమనన్యసౌహృదా హృదోపగుహ్యార్హపదం పదే పదే.
ఇత్థం మునిస్తూపరమేద్వ్యవస్థితో విజ్ఞానదృగ్వీర్యసురంధితాశయః,
స్వపార్ష్ణినాపీడ్య గుదం తతోఽనిలం స్థానేషు షట్సూన్నమయేజ్జితక్లమః.
నాభ్యాం స్థితం హృద్యధిరోప్య తస్మాదుదానగత్యోరసి తం నయేన్మునిః,
తతోఽనుసంధాయ ధియా మనస్వీ స్వతాలుమూలం శనకైర్నయేత.
తస్మాద్భ్రువోరంతరమున్నయేత నిరుద్ధసప్తాయతనోఽనపేక్షః,
స్థిత్వా ముహూర్తార్ధమకుంఠదృష్టిర్నిర్భిద్య మూర్ధన్విసృజేత్పరం గతః.

అని భావిస్తారు. భగవానుడు ద్రష్టయేగాని దృశ్యంకాడు. అలాంటి భగవంతుని యందనన్య ప్రేమ కలిగే వరకూ నిత్యనైమిత్తిక కర్మలు ఆచరిస్తూ పైని చెప్పిన స్థూలరూపాన్ని ధ్యానిస్తూ ఉండాలి

మానవలోకాన్ని విడిచివేయదలచినపుడు యోగి దేశ కాలాదులనుండి దృష్టి మరల్చి సుఖాసీనుడై ప్రాణవాయువును జయించి ఇంద్రియసంయమనంతో నిర్మలమైన బుద్ధియందు మనస్సునూ బుద్ధిని క్షేత్రజ్ఞుడందూ క్షేత్రజ్ఞుని అంతరాత్మయందూ అంతరాత్మను పరమాత్మ యందు లీనంచేసి పరమశాంతి పొందుతాడు. అట్టి పురుషునికి చేయవలసిన కార్యాలుండవు. ఆఅవస్థయందు సత్వగుణమే వుండనపుడు రజస్తమోగుణాలకు అవకాశమ్కడిది, అహంకార మహత్తత్త్వ ప్రకృతులు కూడాపరమాత్మయందు లీనమవుతాయి. దేవతలనుకూడా నియమించగల కాలం అట్టిపురుషుణ్ణి నియమించలేదు. అలాంటప్పుడు దేవతలు వారి అధీనములో ఉండే ఇతరప్రాణులూ వారియందుఎలా ఉండగలుగుతాయి. యోగులు ఇదిలేదు అదిలేదు 'అని ప్రపంచ సంబంధమైన సర్వవస్తువులనూ నిషేధించి భగవంతునియందే దృష్టినిలిపి ధ్యానిస్తూ అఖండానందం పొందగలుగుతారు. అదే పరమపదమని సర్వమతాలు ఏకగ్రీవంగా అంగీకరిస్తాయి.

జ్ఞానబలంచేత సమస్తవాసనలూ నశించిన పరమయోగి మడమల చేత గుదస్థానాన్ని అణచిపట్టి ప్రాణవాయువును షట్చక్రభేదనవిధితో

యది ప్రయాస్యన్నృపపారమేష్ఠ్యం వైహాయసానా ముత యద్విహారం,
అష్టాధిపత్యం గుణసన్నిపాతే సహైవ గచ్ఛేన్మనసేంద్రియైశ్చ.
యోగేశ్వరాణాం గతిమాహురంతర్బహిస్త్రిలోక్యాః పవనాంతరాత్మనాం,
నకర్మభిస్తాంగతిమాప్నువంతి విద్యాతపోయోగసమాధిభాజాం.
వైశ్వానరం యాతి విహాయసా గతస్సుషుమ్నయా బ్రహ్మపథేనశోచిషా,
విధూతకల్కోఽథ హరేరుదస్తాత్ప్రయాతి చక్రం నృపశైంశుమారం.
తద్విశ్వనాభిం త్వతివర్త్యవిష్ణోరణీయసా విరజేనాత్మనైకః,
నమస్కృతం బ్రహ్మవిదా ముపైతి కల్పాయుషో యద్విబుధా రమంతే.

బాధలేకుండా బైటకు తీసుకొనిపోవాలి. నాభిచక్రమగు మణిపూ మందలి వాయువును అనాహతమందూ అక్కడనుండి ఉదానవాయు ద్వారా విశుద్ధచక్రమందూ అక్కడనుండి మెల్లమెల్లగా తాలును మందూ ప్రవేశపెట్టి కనులు నాసికారంధ్రాలూ చెవులూ ముఖ యీ ఏడురంధ్రాలూమూసి తాలుమూలమందున్న వాయువు భ్రూమధ్యమందున్న ఆజ్ఞాచక్రమందు ప్రవేశపెట్టి ఏలోకానికీ వెళ్లా వాంఛలేనప్పుడు ఆవాయువును అక్కడే రెండుఘడియలు సహస్రారమందు ప్రవేశింపజేసి పరమాత్మయందుంచిన లక్ష్యం పరమాత్మయందుండి బ్రహ్మరంధ్రాన్ని భిన్నంచేసుకొని శరీర ఇంద్రియాలనూ వదలివేస్తాడు.

మహారాజా! పరమయోగి బ్రహ్మలోకానికి వెళ్లాలనే కో కలవాడైతే అష్టసిద్ధులూ పొంది ఆకాశచారులైనవారితో తిరగ త్రిగుణరూపమైన బ్రహ్మాండంలో ఎక్కడకైనా పోవాలనుకు మనస్సునూ ఇంద్రియాలనూ కూడా తీసుకునే ప్రయాణం సాగించు ఉపాసన తపస్సు యోగము జ్ఞానము సాధించిన యోగి త్రిలోకవ లోనూ చరించగలడు. యోగి శరీరం వాయువువలె సూక్ష్మ సూక్ష్మంగా ఉంటుంది. ఈసూక్ష్మత్వం, సర్వలోకసంచారం మొ నవి కర్మలద్వారా సాధించడానికి అవకాశంలేదు. యోగి జ్యోతిర్మ మైన సుషుమ్నామార్గం గుండా బ్రహ్మలోకానికెప్పుడైతే ప్రయా

తేనాత్మ నాత్మానముపైతి శాంతమానందమానందమయోవసానే,
ఏతాం గతిం భాగవతీం గతో య స్స వైపునర్నేహవిషజ్జతేఽంగ.
ఏతే సృతీ నృప వేద గీతే త్వయాభిపృష్టే చ సనాతనే చ,
యే వైపురా బ్రహ్మణ ఆహ పృష్టఆరాధితో భగవాన్వాసుదేవః.
నహ్యతోఽన్యశ్శివః పంథా విశతస్సంసృతావిహ,
వాసుదేవే భగవతి భక్తియోగో యతో భవేత్.
భగవాన్ బ్రహ్మకార్త్స్న్యేన త్రిరన్వీక్ష్య మనీషయా,
తదధ్యవస్యత్కూటస్థోరతిరాత్మన్యతోభవేత్.
భగవాన్ సర్వభూతేషు లక్షితస్స్వాత్మనా హరిః,
దృశ్యైర్బుద్ధ్యాదిభిర్ద్రష్టా లక్షణైరనుమాపకైః.

అంటే ఘ్రాణేంద్రియం గంధతన్మాత్రయందూ రసనేంద్రియం రసనతన్మా త్రయందూ నేత్రేంద్రియం రూపతన్మాత్రయందూ త్వగింద్రియం స్పర్శ తన్మాత్రయందూ శ్రోత్రేంద్రియం శబ్దతన్మాత్రయందూ కర్మేంద్రియాలు వాటి వాటి క్రియా శక్తులందూ ప్రవేశించి సూక్ష్మరూపాలను పొందు తాయి. పరమయోగి యీవిధంగా స్థూల సూక్ష్మావరణలు దాటి అహంకారమందు ప్రవేశించి అక్కడ సూక్ష్మభూతాలను తామ సాహంకారమందూ ఇంద్రియాలను రాజసాహంకారమందూ ఇంద్రి యాధిష్ఠాన దేవతలను సాత్వికాహంకారమందూ లయంచేసి మహత్త త్త్వాన్ని పొంది అంతమందు సమస్తగుణాల్నీ లయస్థానమైన ప్రకృతి యందు ప్రవేశపెట్టి మహాప్రళయకాలంలో ప్రకృతి రూపమైన ఆవర ణనుకూడా లయింపజేసి ఆనందరూపుడై పరమాత్మ యందైక్యం పొందు తాడు. అట్టివాడు తిరిగీ యీప్రపంచంలో జన్మించడు. నీప్రశ్నలకు సమాధానంగా క్రమముక్తీ సద్యోముక్తి రూపములైన వేదోక్త మార్గాలురెండు చెప్పాను. ఈరెండూ ఆదియందు వాసుదేవునివల్ల బ్రహ్మ గ్రహించాడు.

ఈసంసార చక్రమందు తిరుగులాడే జీవికి భక్తిమార్గం కంటే మోక్షసాధనం వేరులేదు. కనకనే బ్రహ్మ ఏకాగ్రచిత్తంతో వేద త్రయాన్ని విచారణచేసి శ్రీకృష్ణునియందనన్యప్రేమజనింపజేసే భక్తియే

తస్మాత్సర్వాత్మనా రాజన్ హరిస్సర్వత్ర సర్వదా
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యో భగవాన్ నృణామ్.
పిబంతి యే భగవత ఆత్మనస్సతాం కథామృతం శ్రవణపుటేషు సంభృతమ్,
పునంతి తే విషయవిదూషితాశయం వ్రజంతి తచ్చరణసరోరుహాంతికమ్.

పరమధర్మం అని నిర్ణయించారు. కనుక మానవుడు నిరంతరం భక్తితో కృష్ణకథా సంకీర్తన శ్రవణములతో జీవయాత్ర సాగిస్తే తప్పక మోక్షం పొందుతాడు.

## 2 అధ్యాయం

ఏవమేతన్నిగదితం పృష్టవాన్ యద్భవాన్మమ,
నృణాం యన్మ్రియమాణానాం మనుష్యేషు మనీషిణామ్,
బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిమ్,
ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతీన్.
అన్నాద్యకామస్త్వదితిం స్వర్గకామో ఽదితేస్సుతాన్,
విశ్వాన్ దేవాన్ రాజ్యకామస్సాధ్యాన్ సంసాధకో విశామ్.
దేవీం తు మాయాం శ్రీకామస్తేజస్కామో విభావసుమ్,
వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామస్తు వీర్యవాన్.
ఆయుష్కామోఽశ్వినౌ దేవౌ పుష్టికామ ఇలాం యజేత్,
ప్రతిష్ఠాకామఃపురుషో రోదసీ లోకమాతరౌ.
రూపాభికామో గంధర్వాంస్త్రీకామోఽప్సర ఉర్వశీమ్,
ఆధిపత్యకామస్సర్వేషాం యజేత పరమేష్ఠినం.

బ్రహ్మతేజం సాధించాలనే ఇచ్ఛకలవాడు బృహస్పతినీ ఇంద్రియశక్తి కావాలనేవాడు ఇంద్రునీ, సంతానవాంఛకలవాడు ప్రజాపతినీ ఉపాసించాలి. లక్ష్మిని కోరేవాడూ మాయాశక్తినీ తేజస్సువాంఛించు వాడు అగ్నినీ, ధనాన్ని కోరువాడు వసువులనూ వీరత్వాన్ని కోరేవాడూ రుద్రునీ ఉపాసించాలి. అన్నార్థి అదితినీ, స్వర్గ కాముడు అదితిపుత్రులైన దేవతలనూ, రాజ్యాభిలాష కలవాడు విశ్వే దేవులనూ, ప్రజావశ్యం కోరువాడు సాధ్యదేవతలనూ ఆరాధించాలి.

యజ్ఞం యజేద్యశస్కామః కోశకామః ప్రచేతసం,
విద్యాకామస్తు గిరిశం దాంపత్యార్థ ఉమాం సతీం.
ధర్మార్థ ఉత్తమశ్లోకం తంతుత న్వన్పితౄాన్ యజేత్,
రక్షాకామః పుణ్యజనానోజస్కామో మరుద్గణాన్.
రాజ్యకామో మనూన్ దేవాన్నిర్‌ఋతిం త్వభిచరన్ యజేత్,
కామకామోయజేత్సోమమకామః పురుషం పరం.
అకామస్సర్వకామోవా మోక్షకామ ఉదారధీః,
తీవ్రేణ భక్తియోగేన యజేత పురుషం పరం,
ఏతావానేవ యజతామిహ నిశ్శ్రేయసో దయః,
భగవత్యచలో భావో యద్భాగవతసంగతః.
జ్ఞానం యతః ప్రతినివృత్త గుణోర్మిచక్రమాత్మప్రసాదఉభయత్ర గుణేష్వసంగః
కైవల్య సమ్మతపథస్త్వథ భక్తియోగః కో నిర్వృతో హరికథాసు రతిం న కుర్యాత్.
ఇత్యభివ్యాహృతం రాజా నిశమ్య భరతర్షభః,
కిమన్యత్పృష్టవాన్ భూయో వైయాసకిమృషిం కవిం.
ఏతచ్ఛుశ్రూషతాం విద్వాన్ సూత నోఽర్హసిభాషితుం,
కథాహరికథోదర్కాస్సతాం స్యుస్సదసి ధ్రువం.
సవై భాగవతో రాజా పాండవేయో మహారథః,

ఆయుష్కామయవృద్ధికి అశ్వనీదేవతలనూ పుష్టికి భూదేవినీ ప్రతిష్ఠ కావా లంటే పృథివ్యాకాశాలనూ సేవించాలి. సౌందర్యం కొరకు గంధర్వు లనూ పత్నీప్రాప్తికి ఊర్వశినీ స్వర్గానికి ప్రభువు కావాలంటే బ్రహ్మనూ ఆరాధించాలి. కీర్తికొరకు యజ్ఞపురుషునీ కోశాధిపత్యానికి వరుణ దేవతనూ విద్యకు శంకరునీ భార్యాభర్తల అనురాగానికి పార్వతినీ ధర్మవృద్ధికి విష్ణువునూ వంశవృద్ధికి పితృదేవతలనూ బాధానివారణకు యక్షులనూ బలానికి మరుద్గణాన్నీ రాజ్యం కొరకు మన్వంతరాధిపతు లైన దేవతలనూ అభిచారం కొరకు నిర్‌ఋతినీ భోగాలకొరకు చంద్రునీ నిష్కామత్వానికి నారాయణునీ ఉపాసించాలి. సర్వసంగవిముక్తులై మోక్షాసక్తులైనవారు కేవలం పురుషోత్తమునే ఆరాధించాలి. ఉపాసకు లకు అన్నిటికంటే భక్తసహవాసంవల్ల భగవంతునియందు అవిచలమైన ప్రేమప్రాప్తిస్తుంది. భక్తసంఘంలో భగవంతుని లీలలతోకూడిన కథలు వినడం వల్ల దుర్లభమైన జ్ఞానం కలుగుతుంది. అట్టిజ్ఞానంచేత సంసార

బాలక్రీడనకైః క్రీడన్ కృష్ణ క్రీడాం య ఆదదే.
వైయాసకిశ్చ భగవాన్ వాసుదేవపరాయణః,
ఉరుగాయగుణోదారాః సతాం స్యుర్హి సమాగమే.
ఆయుర్హరతి వై పుంసాముద్యన్నస్తంచ యన్నసౌ.
తస్యర్తే యత్ క్షణోనీత ఉత్తమశ్లోకవార్తయా.
తరవః కిం న జీవంతి భస్త్రాః కిం న శ్వసంత్యుత ?
న ఖాదంతి న మేహంతి కిం గ్రామ్యాః పశవో పరే ?
శ్వ విడ్వరాహోష్ట్రఖరైస్సంస్తుతః పురుషః పశుః,
నయత్కర్ణపథో పేతం జాతు నామగదాభృతః,
బిలే బతోరుక్రమవిక్రమాన్ యే న శృణ్వతః కర్ణపుటే నరస్య.
జిహ్వా సతీ దార్దురికేవ సూత న చోపగాయత్యురుగాయగాథాః.
భారః పరం పట్టకిరీట జుష్టమప్యుత్తమాంగం న నమేన్ముకుందమ్,
శావౌ కరౌ నో కురుతే సపర్యాం హరేర్లసత్కాంచనకంకణౌ వా.
బర్హాయితే తే నయనే నరాణాం లింగాని విష్ణోర్న నిరీక్షతో యే,
పాదౌ నృణాం తౌ ద్రుమజన్మభాజౌ క్షేత్రాణి నానువ్రజతో హరేర్యౌ.
జీవన్ శవో భాగవతాంఘ్రిరేణుం న జాతు మర్త్యోభిలభేత యస్తు,
శ్రీవిష్ణుపద్యా మనుజస్తులస్యాః శ్వసన్ శవో యస్తు న వేద గంధమ్.

సముద్రాన్నుంచి తరించగలుగుతాడు. ఆ భక్తుడు శాశ్వత అఖండానందం పొందుతాడు. – అని శుకుడు పరీక్షిన్మహారాజుకు చెప్పినట్లు సూతుడు చెప్పిన వాక్యాలువిని శౌనకుడు: సూతా! కృష్ణకథామృతం గ్రోలనివాని జన్మ వృథా. పశుపక్ష్యాదులవలె ఆహార నిద్రాదులందుండే కాలాన్ని వ్యయంచేసేవాడు పశుప్రా. ఎవనిచెవులలో కృష్ణకథామృతం ప్రవేశించదో అట్టి నరపశువు కుక్క పంది ఒంటె గాడిదలతో సమానంగా ఆయువు వ్యయంచేసుకుంటున్నాడన్నమాట.

కృష్ణకథలు విననిచెవులు సర్పాలు వసించే బిలాలతో సమానం. భగవంతునికి తలవంచని శిరస్సు సర్వాలంకారశోభితమైనదైనా బరువుకి చేటు. భగవంతుని పూజించని చేతులు స్వర్ణకంకణాలతో అలంకరింపబడినా మృతహస్తాలే. భగవంతుని క్షేత్రములనూ చూడని నేత్రాలు నెమలికన్నులు. భగవద్దర్శనానికి వెళ్లని పాదాలు చెట్లతో సమానాలు

తదశ్మసారం హృదయం బతేదం యద్గృహ్యమాణైర్హరినామధేయైః,
న విక్రియేతాథ యదా వికారో నేత్రే జలం గాత్రరుహేషు హర్షః.
అథాభిధేహ్యంగ మనోనుకూలం ప్రభాషసే భాగవతప్రధానః,
యదాహ వైయాసకిరాత్మవిద్యావిశారదో నృపతిం సాధు పృష్టః.

సత్పురుషుల పాదధూళి శిరమున ధరించని మానవుడు బ్రతికీ చచ్చిన వానితో సమానుడు. భగవంతుని పాదములందున్న తులసీమాలికా గంధాన్ని ఆఘ్రాణించని వాని శ్వాస ఉండీనూడా శ్వాసరహితమైన శరీరంతో సమానం. అందువల్ల శుకపరీక్షిత్సంవాదరూపమైన హరి లీలలతోకూడిన కథలను వినిపింపుమని అడిగాడు.

## 3 అ ధ్యా య ం

వైయాసకేరితి వచస్తత్త్వనిశ్చయమాత్మనః,
ఉపధార్య మతిం కృష్ణౌత్తరేయస్సతీం వ్యధాత్.
ఆత్మజాయాసుతాగారపశుద్రవిణబంధుషు,
రాజ్యే చావికలే నిత్యం విరూఢాం మమతాం జహౌ.
పప్రచ్ఛ చేమమేవార్థం యన్మాం పృచ్ఛథ సత్తమాః,
కృష్ణానుభావశ్రవణే శ్రద్ధధానో మహామనాః.
సంస్థాం విజ్ఞాయ సన్న్యస్య కర్మ త్రైవర్గికం చ యత్,
వాసుదేవే భగవతి హ్యాత్మభావం పరం గతః.
సమీచీనం వచో బ్రహ్మన్ సర్వజ్ఞస్య తవానఘ,
తమో విశీర్యతే మహ్యం హరేః కథయతః కథాః.

శౌనకా! శుకుని ఉపదేశం గ్రహించిన పరీక్షిన్మహారాజు పుత్ర మిత్ర కళత్రాదులయందు ధన, పశు, గృహాలందూ మమకారం వదలి ధర్మార్థ కామసంబంధమైన వాసనలు పూర్తిగా త్యజించి సర్వ కర్మసన్యాసియై శ్రీకృష్ణునియందే మనస్సుంచి మీరు నన్నడిగినట్లే శుకమహర్షిని అడిగాడు.

శుకయోగీంద్రా! మీరు సర్వజ్ఞులు. మీరు చెప్పినదంతా సత్యం. మీరు చెప్పుతున్న వాక్యాలు వింటూంటే నా అజ్ఞానం నశించిపోతుంది.

భూయ ఏవ వివిత్సామి భగవానాత్మమాయయా,
యథావదిష్ఠే భగవాన్ వివక్షతి సత్యవాక్.
యథేదం సృజతే విశ్వం దుర్విభావ్యమధీశ్వరైః.
యథా గోపాయతి విభుర్యథా సంయచ్ఛతే పునః,
యాం యాం శక్తిముపాశ్రిత్య పురుశక్తిః పరః పుమాన్.
ఆత్మానం క్రీడయన్ క్రీడన్ కరోతి వికరోతి చ,
నూనం భగవతో బ్రహ్మన్ హరేరద్భుతకర్మణః,
దుర్విభావ్యమివాభాతి కవిభిశ్చాపి చేష్టితమ్.
యథా గుణాంస్తు ప్రకృతేర్యుగపత్క్రమశోఽపి వా,
బిభర్తి భూరిశస్త్వేకః కుర్వన్కర్మాణి జన్మభిః.
విచికిత్సితమేతన్మే బ్రవీతు భగవాన్ యథా,
శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః పరస్మింశ్చ భవాన్ ఖలు.
ఇత్యుపామంత్రితో రాజ్ఞా గుణానుకథనే హరేః.
హృషీకేశమనుస్మృత్య ప్రతివక్తుం ప్రచక్రమే.
నమః పరస్మై పురుషాయ భూయసే సదుద్భవస్థాననిరోధలీలయా,
గృహీతశక్తిత్రితయాయ దేహినామంతర్భవాయానుపలక్ష్యవర్త్మనే.

బ్రహ్మాదులుకూడా గ్రహింప నవకాశంలేని యీ సృష్టి స్థితి లయాలు పరమాత్మ యెలా చేశాడు. అనంతశక్తికల పరమాత్మ యేయే శక్తుల నాధారంగా తీసుకుని యీనాటకం ఆడుతున్నాడు? ఈ ఆశ్చర్యజనకమైన బ్రహ్మాండాది నిర్మాణకార్యక్రమమూ భగవంతుని లీలలూ, వాటి రహస్యాలూ మహావిద్వాంసులకే తెలియడంలేదంటే సామాన్యుల విషయమెక్కడ? భగవానుడు ఒక్కడేకదా! అనేక కర్మలకొరకై మాయాగుణాలతో అనేకరూపాలు ఏకకాలంలో ధరిస్తున్నాడా, లేక క్రమంగా ధరిస్తున్నాడా? వేద బ్రహ్మలను గ్రహించిన మీరు నాకీ భగవంతునిలీలలు సవిస్తరంగా చెప్పండి – అని అడిగిన మహారాజుకు శ్రీశుకుడు భగవత్తత్త్వం చెప్తున్నాడు.

పరీక్షిన్మహారాజా! – పురుషోత్తముని పదపద్మాలకు కోటికోటి నమస్కారాలు. సృష్టి స్థితి లయాలకొరకు సత్వ, రజ. స్తమోగుణాల యందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపాలు ఎవడు ధరిస్తున్నాడో;

భూయో నమస్సద్వృజినచ్ఛిదే సతామసంభవాయాఖిలసత్వమూర్తయే.
పుంసాం పునః పారమహంస్యఆశ్రమే వ్యవస్థితానామనుమృగ్యదాశుషే.
నమోనమస్తేస్త్వృషభాయ సాత్వతాం విదూరకాష్ఠాయ ముహుః కుయోగినామ్,
నిరస్తసా మ్యాతిశయేన రాధసా స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః.
యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్,
లోకస్య సద్యో విధునోతి కల్మషం తస్మై సుభద్రశ్రవసే నమోనమః.
విచక్షణా యచ్చరణో పసాదనాత్సంగం వ్యుదస్యోభయతోంతరాత్మనః,
విందంతి హి బ్రహ్మగతిం గతక్లమాస్తస్మై సుభద్రశ్రవసే నమోనమః.
తపస్వినో దానపరా యశస్వినో మనస్వినో మంత్రవిదస్సుమంగళాః,
క్షేమంన విందంతి వినా యదర్పణం తస్మై సుభద్రశ్రవసే నమోనమః.
కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా ఆభీరకంకాయవనాః కసాదయః,
యేஉన్యే చ పాపాయదుపాశ్రయాశ్శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః.
స ఏష ఆత్మాత్మవతామధీశ్వరస్త్రయీమయో ధర్మమయ స్తపోమయః,
గతవ్యళీకైరజశంకరాదిభిర్వితర్క్యలింగో భగవాన్ ప్రసీదతు,
శ్రియః పతిర్యజ్ఞపతిః ప్రజాపతిర్ధియాం పతిర్లోకపతిర్ధరాపతిః,
పతిర్గతిశ్చాంధకవృష్ణిసాత్వతాం ప్రసీదతాం మే భగవాన్ సతాం గతిః.

ఎవడు చరాచర జీవులందు సర్వాంతర్యామిగా ఉంటున్నాడో; ఎవని రూపగుణాలు బుద్ధికూడా గ్రహించలేదో, ఎవడు అనంతుడో, అనంత శక్తికలవాడో, సత్పురుషుల దుఃఖాన్ని నశింపజేసి పరమహంసలకు అభీష్టవస్తువును ఎవడు ప్రసాదిస్తాడో, చరాచర ప్రపంచం యెవని రూపమో, భక్తిహీను లెవనిని గ్రహింపలేరో, శ్రవణ కీర్తన నమస్కార పూజాదులచే ఎవనిచరిత్ర సమస్తపాపాల్నీ నశింపజేస్తుందో, ఆపుణ్యశాలియగు భగవంతునకు నమస్కరిస్తున్నాను. వివేకి శ్రీకృష్ణునియందు భక్తికలవాడై హృదయపూర్వకంగా ఇహపరసౌఖ్యాలను వదలి పరమపదాన్ని పొందకలుగుతాడు. తపో దాన యజ్ఞాదులను శ్రీహరికి సమర్పించనిచో ఫలవంతములు కావు. కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసాదులు కూడా యెవనిభక్తుల నాశ్రయించినమాత్రాన తరిస్తున్నారో అట్టి మాధవునకు నమస్కారము. జ్ఞానులకు ఆత్మస్వరూపుడు. భక్తులకు సగుణమూర్తి. కర్మవాదులకు వేదమూర్తి. ధార్మి

యదంఘ్ర్యభిధ్యాన సమాధిధౌతయా ధియా నుపశ్యంతి హి తత్త్వమాత్మనః,
వదంతి చైతత్కవయో యథారుచం స మే ముకుందో భగవాన్ ప్రసీదతామ్.
ప్రచోదితా యేన పురా సరస్వతీ వితన్వతాజస్య సతీం స్మృతిం హృది,
స్వలక్షణా ప్రాదుర భూత్కిలాస్యతస్సమే ఋషీణామృషభః ప్రసీదతామ్.
భూతైర్మహద్భిః య ఇమాః పురో విభుర్నిర్మాయ శేతే యదమూషు పూరుషః,
భుంక్తేగుణాన్ షోడశ షోడ శాత్మకస్సోలంకృషీష్ట భగవాన్ వచాంసి మే.
నమస్తస్మై భగవతే వేదవ్యాసాయ వేధసే,
పపుఃజ్ఞానమయం సౌమ్యా యన్ముఖాంబురుహాసవమ్.
ఏతదేవాత్మభూరాజన్నారదాయానుపృచ్ఛతే.
వేదగర్భోఽభ్యధాత్సాక్షాత్ యదాహ హరిరాత్మనః.

కులకు ధర్మమూర్తి. తపస్వులకు తపోమూర్తి. బ్రహ్మ శంకరుడూ దేవేంద్రాదులూ ధ్యానించుటకు యోగ్యుడైన పరబ్రహ్మ నన్ననుగ్రహించుగాక. ఎవడు సృష్ట్యారంభమందు బ్రహ్మకు పూర్వకల్పస్మృతి కలగడానికి జ్ఞానాధిష్ఠానమగు వేదాన్ని ప్రసాదించాడో; సాంగవేదమును బ్రహ్మకిచ్చిన ఆభగవానుడే నాహృదయంలో ప్రకటితమౌగాక. భగవానుడే పంచమహాభూతాలవల్ల యీ శరీరం సృష్టించి తానే యీ శరీరంలో జీవరూపంతో ప్రవేశిస్తున్నాడు దశ ఇంద్రియాలూ పంచ ప్రాణాలూ మనస్సూ కలసి షోడశ కళలు. ఈషోడశ కళలతోకూడి పదహారు విషయాలయందూ భోగిస్తూ ఉంటాడు. అట్టి సర్వభూతమయుడైన భగవానుడు నా వాక్కును తన గుణములచే అలంకరించుగాక. సత్పురుష వందితుడైన వేదవ్యాసునకు నమస్కరిస్తున్నాను. స్వాయంభూ బ్రహ్మ నారదునకు చెప్పినదే నీకు నేను చెప్పాను. ఇంకా చెప్తాను విను.

## 4 అధ్యాయం

దేవదేవ నమస్తేఽస్తు భూతభావన పూర్వజ,
తద్విజానీహి యజ్జ్ఞానమాత్మతత్త్వనిదర్శనమ్.
యద్రూపం యదధిష్ఠానం యతస్సృష్టమిదంప్రభో,
యత్సంస్థం యత్పరం యచ్చ తత్తత్త్వం వద తత్త్వతః.
సర్వం హ్యేతద్భవాన్ వేద భూతభవ్యభవత్ప్రభుః,
కరామలకవద్విశ్వం విజ్ఞానావసితంతవ.
యద్విజ్ఞానో యదాధారోయత్పరస్త్వంయదాత్మకః,
ఏకస్సృజసి భూతాని భూతై రేవాత్మమాయయా.
ఆత్మన్ భావయసే తాని న పరాభావయన్ స్వయమ్,
ఆత్మశక్తిమవష్టభ్య ఊర్ణనాభిరివాక్లమః.
నాహం వేపపరం త్వస్మిన్నాపరం న సమం విభో,
నామరూపగుణైర్భావ్యం సద సత్కించిదన్యతః.
సభవానాచరద్ఘోరం యత్తపస్సుసమాహితః,
తేన ఖేదయసే నస్త్వంపరాం శంకాం ప్రయచ్ఛసి,
ఏతన్మే పృచ్ఛతస్సర్వం సర్వజ్ఞ సకలేశ్వర
విజానీహి తథై వాహం త్వయా బుద్ధ్యేఽనుశాసితః.

నారదుడు బ్రహ్మదగ్గరకువెళ్ళి, తండ్రీ! మీరు నాకేగాక లోకానికంతకూ జనకులే. దేవతలందరికంటే శ్రేష్ఠమైన సృష్టికర్తలు. మీకు నమస్కరిస్తున్నాను. నాకు ఆత్మజ్ఞానం ఉపదేశించండి. ఈసంసారలక్షణ మెటువంటిది. దీని కాధార మేది. నిర్మాత యెవరు. ఈప్రపంచం ఎవరియందు లయమవుతుంది. ఎవరి అధీనంలో ఉంది. యీవస్తువు నిజస్వరూప మేమిటి ? మీకు తెలియని దేదీలేదు, భూత భవిష్యద్వర్తమానాలు తెలిసినవారు మీరు. హస్తామలకం వలె మీజ్ఞానదృష్టిలో ఉన్నదేకాని లేనిదేదీ లేదు. మీకీజ్ఞానం యెలా కలిగింది. మీరు ఎవరి ఆధారంమీద నిలబడి ఉన్నారు. మీకు ప్రభు వెవరు. మీ సత్యస్వరూప మేమిటి ? మీరు ఒక్కరూ పంచభూతాలనుండీ అనంతమైన సృష్టిచేస్తున్నారు. ఇది ఎంతఅద్భుతంగా ఉంది! సాలిపురుగు తననుండి దారాన్ని సృష్టించి దానియందెలాగైతే ఆడుతూ ఉంటుందో అలానే మీరు మీశక్తి నాశ్రయించి

సమ్యక్కారుణికస్యేదం వత్స తే విచికిత్సితమ్,
యదహం చోదితో ఛర్మే భగవద్వీర్యదర్శనే.
నాత్యంతమనృతం తస్య యథా మాం ప్రబ్రవీషి భో,
అవిజ్ఞాయ పరం మత్త ఏతావత్త్వం యతోఽస్తి మే.
యేన స్వరోచిషా విశ్వం రోచితం రోచయామ్యహం,
యథార్కోఽగ్నిర్యథా సోమో యథర్క్షగ్రహతారకాః.
తస్మై నమో భగవతే వాసుదేవాయ ధీమహి,
యన్మాయయా దుర్జయయా మాం వదంతి జగద్గురుమ్.
విలజ్జమానయా యస్య స్థాతుమీక్షాపథే ముయా,
విమోహితా వికత్థంతే మమాహమితి దుర్ధియః.
ద్రవ్యం కర్మ చ కాలశ్చ స్వభావో జీవ ఏవ చ,
వాసుదేవాత్పరో బ్రహ్మన్నత్వాన్యోఽర్థోఽస్తి తత్త్వతః.
నారాయణపరా వేదా దేవా నారాయణాంగజాః,
నారాయణపరాలోకా నారాయణ పరా మఖాః.
నారాయణపరో యోగో నారాయణపరం తపః,
నారాయణపరం జ్ఞానం నారాయణపరా గతిః.

శ్రమలేకుండా యీ జీవ రాసిని సృష్టిస్తున్నారు. మీరెందు మాత్రం ఏవికారమూ కలుగదు. జగత్తులో నామరూప గుణాలతో కనుపించే వస్తుజాలంలో సత్తు అసత్తు ఉత్తమ మధ్యమ అధమ భేదాలేమీ కనుపించడంలేదు. నాకంతా సమానంగానే కనుపిస్తూన్నది. ఈజగత్తంతా నీస్వరూపమే. నీ వీజగత్తుకి అధినాథుడవైయుండీ తపస్సు చేశావంటే నీకంటె పెద్దవారెవరా అని నాకు సందేహంగా ఉంది. మీరు సర్వజ్ఞులూ సర్వేశ్వరులూ కూడా. మీరు అనుగ్రహించి నా సంశయం నివారించండి – అని అడిగాడు.

కుమారా! నీ వీప్రశ్న జీవులయం దుండే ప్రేమచేత అడిగావు. లోకకల్యాణదాయకమైన నీప్రశ్న నాకు చాలా ఆనందాన్ని కలిగించింది ఇందులో భగవంతుని గుణగానం యిమిడి ఉంది. నువ్వు నావిషయంలో చెప్పిందికూడా సత్యమే. నాకంటే పరమైన వస్తువును గుర్తించేటంతవరకూ నాయందీప్రశ్న భావమంతా కనబడుతూంటుంది

తస్యాపి ద్రష్టురీశస్య కూటస్థస్యాఖిలాత్మనః,
సృజ్యం సృజామి సృష్టోఽహమీక్షయైనాభి చోదితః.
సత్త్వంరజస్తమ ఇతి నిర్గుణస్య గుణా స్త్రతః,
స్థితిసర్గనిరోధేమ గృహీతా మాయయా విభోః.
కార్య కారణకర్తృత్వే ద్రవ్యజ్ఞాన క్రియాశ్రయాః,
బధ్నంతి నిత్యదా ముక్తం మాయినం పురుషం గుణాః,
సఏష భగవాన్ లింగైస్త్రిభిరేభిరధోక్షజ,
స్వలక్షితగతిర్బ్రహ్మాన్ సర్వేషాం మమ చేశ్వరః,
కాలం కర్మ స్వభావం చ మాయేశో మాయయా స్వయా,
యదృచ్ఛయాత్మని ప్రాప్తం విబుభూషురుపాదదే.
కాలాద్గుణవ్యతికరః పరిణామస్స్వభావతః,
కర్మణో జన్మ మహతః పురుషాధిష్ఠితాదభూత్.
మహతస్తు వికుర్వాణాద్రజస్సత్త్వోపబృంహితాత్,
తమఃప్రధాన స్త్వభవద్ద్రవ్యజ్ఞానక్రియాత్మకః.
సోఽహంకార ఇతి ప్రోక్తోవికుర్వన్ సమభూత్త్రిధా,
వైకారిక స్తైజసశ్చ తామసశ్చేతి యద్భిదా,

టుంది. సూర్య చంద్ర అగ్ని గ్రహ నక్షత్రాదులు స్వయంప్రకాశ స్వరూపులైన భగవానుని ప్రకాశంవల్ల లోకాన్ని ప్రకాశింపచేస్తూ న్నట్లే నేనుకూడా చిన్మయుడైన భగవంతుని ప్రకాశంవల్ల ప్రకాశిస్తూ లోకాన్ని ప్రకాశింప చేస్తున్నాను. నాకుగాని సూర్యచంద్రాగ్న్యాదు లకుగాని స్వయంప్రకాశశక్తి లేదు, స్వయంప్రకాశస్వరూపుడొక్క భగవానుడే. అట్టి వాసుదేవునకు నమస్కరిస్తున్నాను. మాయామో హితులైన మానవు లదిగ్రహించలేక నన్నే జగద్గురు వనుకుంటు న్నారు. ఈమాయ వారికనులయెదుట ఉండదు. దూరంగా పోతూం టుంది. ఐనా అజ్ఞానులు మాయామోహితులై " నేను, నాది " అను కుంటూ ఉంటారు. నారదా! ద్రవ్య కాల కర్మ స్వభావ జీవాదులు వాస్తవంచేత భగవంతునికంటె భిన్నమైనవికావు. వేదం నారాయణ పరాయణము. దేవతలంతా నారాయణుని అంగము లందే కల్పింప బడ్డారు. సమస్తయజ్ఞాలూ నారాయణుని ప్రసన్నతకొరకే. యజ్ఞాల

ద్రవ్యశక్తిః క్రియాశక్తిః జ్ఞానశక్తిరితిప్రభో.
తామసాదపి భూతాదేర్వికుర్వాణాదభూన్నభః,
తస్యమాత్రా గుణశ్శబ్దోలింగంయద్ద్రష్టృదృశ్యయోః.
నభసోఽథ వికుర్వాణాదభూత్స్పర్శ గుణోఽనిలః,
పరాన్వయాచ్ఛబ్దవాంశ్చ ప్రాణఓజస్సహో బలమ్.
వాయోరపి వికుర్వాణాత్కాలకర్మస్వభావతః,
ఉదపద్యత తేజో వై రూపవత్స్పర్శశబ్దవత్.
తేజసస్తు వికుర్వాణాదాసీదంభోరసాత్మకమ్,
రూపవత్స్పర్శవచ్చాంభో ఘోషవచ్చ పరాన్వయాత్.
విశేషస్తు వికుర్వాణాదంభసో గంధవానభూత్,
పరాన్వయా ద్రసస్పర్శశబ్దరూపగుణాన్వితః.
వైకారికాన్మనో జజ్ఞే దేవా వైకారికా దశ,
దిగ్వాతార్కప్రచేతోశ్వివహ్నీంద్రోపేంద్రమిత్రకాః,
తైజసాత్తు వికుర్వాణాదింద్రియాణి దశాభవన్,
జ్ఞానశక్తిఃక్రియాశక్తిర్బుద్ధిః ప్రాణశ్చ తైజసౌ,
శ్రోత్రత్వగ్ఘ్రాణదృగ్జిహ్వావాగ్దోర్మేఢ్రాంఘ్రిపాయవః,

వల్ల కలిగే లోకాలుకూడా నారాయణునియందు కల్పింపబడినవే. యోగ తపస్స్వాధ్యాయాది సత్కర్మలన్నీ నారాయణునియందే పర్యవసిస్తాయి, ఆతడు ద్రష్టయై ఉండీ యీశ్వరుడూ స్వామీ నిర్వికారుడైఉండీకూడా సర్వస్వరూపుడు. ఆభగవానుడే నన్ను సృష్టించాడు. నారాయణుని ప్రేరణచేతనే నేను సృష్టించగలుగుతున్నాను. గుణాతీతుడైనా సృష్టి స్థితి లయాలకొరకై రజోగుణ సత్వగుణ తమోగుణాలు మాయద్వారా ఆభగవంతుని యందుంచబడ్డాయి ఈమూడుగుణాలే ద్రవ్య జ్ఞాన క్రియాల నాశ్రయించి నిత్యముక్తుడైన పురుషుడే మాయయందున్నప్పుడు కార్య కారణ కర్తృత్వాభిమానంచేత బద్ధుడౌతున్నాడు.

ఇంద్రియాతీతుడైన భగవానుడు సత్వరజస్తమోగుణరూపమైన ఆవరణలచే తనరూపాన్ని మరుగు పరచడంవల్ల మానవులు భగవంతుని గ్రహించలేక పోతున్నారు. ఈప్రపంచానికీ నాకూ ఆతడే ప్రభువు.

యదైతే సంగతా భావా భూతేంద్రియమనోగుణాః.
యదాయతననిర్మాణే న శేకుర్బ్రహ్మవిత్తమ.
తదా సంహత్య చాన్యోన్యం భగవచ్ఛక్తిచోదితాః.
సదసత్త్వము పాదాయ చోభయం ససృజుర్హ్యదః,
వర్షాయుతసహస్రాంతే తదండముద కేశయమ్,
కాలకర్మస్వభావస్థో జీవో జీవమజీవయత్,
స ఏవ పురుషస్తస్మాదండం నిర్భిద్య నిర్గతః,
సహస్రోర్వంఘ్రి బాహ్వక్షస్సహస్రాననశీర్ష వాన్,
యస్యేహా వయ వైర్లోకాన్కల్పయంతి మనీషిణః,
కట్యాదిభిరధస్సప్త సప్తోర్ధ్వంజఘనాదిభిః.
పురుషస్య ముఖం బ్రహ్మ క్షత్త్ర మేతస్య బాహవః,
ఊర్వోర్వైశో భగవతః పద్భ్యాం శూద్రో వ్యజాయత.
భూర్లోకః కల్పితః పద్భ్యాం భువర్లోకశ్చ నాభితః.
హృదా స్వర్లోక ఉరసా మహర్లోకో మహాత్మనః.
గ్రీవాయాంజన లోకస్తు తపోలోకస్తనద్వయాత్,
మూర్ధత స్సత్యలోకస్తు బ్రహలోక స్సనాతనః,

మాయాపతియగు భగవానునికి సృష్టించాలనే సంకల్పం కలిగినమాత్రాన తనమాయచే తనయందే స్వయంప్రాప్తమైన కాల కర్మ స్వభావాలను స్వీకరించాడు. భగవంతుని శక్తిచేతనే కాల త్రిగుణములయందు క్షోభను కలిగించాడు. స్వభావం వానియందు రూపాంతరాన్ని కలిగించింది. కర్మ మహత్తత్త్వాన్ని ప్రభవించింది. రజస్తమోగుణాల వృద్ధిచేత మహత్తత్త్వమందు ఏవికారం కలిగిందో ఆవైకారాన్నుండే తమోగుణప్రధానములైన ద్రవ్య జ్ఞాన క్రియ లుద్భవించాయి. వానినే వైకారిక తైజస తామసము లున్నారు. అదే జ్ఞానశక్తి క్రియాశక్తి ద్రవ్యశక్తి అనబడతాయి. ఎప్పుడైతే మహాభూతకారణమైన తామసాహంకారం వికారావస్థను పొందుతుందో అప్పుడు ఆకాశం ఉద్భవించింది. ఆకాశతన్మాత్రగుణం శబ్దం. ఈశబ్దం వల్ల ద్రష్టా దృశ్యం తెలుస్తుంది. ఆకాశమందు కలిగిన వికారంనుండి వాయువు జనించింది. వాయువు శబ్దం స్పర్శ గుణాలు ప్రధానంగా

తత్కట్యాం చాతలం క్లృప్తమూరుభ్యాం వితలం విభోః,
జానుభ్యాం సుతలం శుద్ధం జంఘాభ్యాంతు తలాతలమ్,
మహాతలంతు గుల్ఫాభ్యాం ప్రపదాభ్యాం రసాతలం,
పాతాళం పాదతలత ఇతి లోకమయః పుమాన్.

కలది. వాయువునుండి తేజస్సు పుట్టింది. తేజస్సుకు రూపం ప్రధానం. గుణ కారణ గుణాలు కార్యాల యందు కూడా సంక్రమించడంచేత శబ్ద స్పర్శ గుణాలు దీనియందున్నాయి. తేజస్సువల్ల ఉదకం వచ్చింది. దాని ప్రధానగుణం రసమైనా శబ్ద స్పర్శ రూపాలు కూడా దాని యందున్నాయి. జలవికారంవల్ల భూమి జనించింది. భూమియందు గంధం ప్రధానంగా ఉంటుంది. శబ్ద స్పర్శ రూప రసాదులు కూడా ఉన్నాయి. వైకారికాహంకారంవల్ల మనస్సు ఇంద్రియాధిష్ఠాన దేవతలు పదిమంది ఆవిర్భవించారు – దిక్కూ వాయువూ సూర్య వరుణ అశ్వినీదేవతలూ అగ్ని ఇంద్ర విష్ణు మిత్ర ప్రజాపతులే వారు. తైజసాహంకారంవల్ల త్వక్ శ్రోత్ర జిహ్వా ఘ్రాణ నేత్రాది జ్ఞానేంద్రియ పంచకమూ వాక్ పాణి పాద వాయూపస్థలనే కర్మేంద్రియ పంచకమూ కలసి దశేంద్రియాలు ఉత్పన్నమైనాయి. తైజసాహంకారంనుండి జ్ఞానశక్తిరూపమైన బుద్ధి క్రియాశక్తి రూపమైన ప్రాణాలూ ఆవిర్భవించాయి.

నారదా! ఈపంచభూతాలూ దశేంద్రియాలూ మనస్సూ సత్వ రజస్తమోగుణాలూ కలియకపోతే భోగసాధనమైన శరీర నిర్మాణం జరగదు. భగవానుని ప్రేరణచే ఈతత్త్వాలన్నీ ఒకదానియందొకటి కలసి కార్య కారణభావాలను స్వీకరించి పిండాండ బ్రహ్మాండాలను వ్యష్టి సమష్టి రూపంగా నిర్మించాయి. బ్రహ్మాండరూపమైన ఆ అండం వేయిసంవత్సరాలు నిర్జీవంగా జలంలో ఉంది. కాల కర్మ స్వభావాలను స్వీకరించిన భగవానుడు ఆ అండాన్ని జీవింపచేశాడు. ఆ అండాన్ని భేదించుకుని విరాట్పురుషుడావిర్భవించాడు. ఆపురుషుడు వేలశిరస్సులూ

భూర్లోకః కల్పితః పద్భ్యాం భువర్లోకస్తు నాభితః,
స్వర్లోకః కల్పితో మూర్ధ్నా ఇతి వా లోకకల్పనా

పాదములూ నేత్రాలూ కర్ణములూ భుజములూ కలిగి ప్రకాశించాడు విద్యాకసులు ఆవిరాట్పురుషునే ఉపాసిస్తారు. నాభికి క్రింద యేడు లోకాలు ఊర్ధ్వభాగంలూ యేడులోకాలూ కల్పింప బడుతున్నాయి విరాట్పురుషుని ముఖం బ్రాహ్మణులు, భుజాలు క్షత్రియులూ ఊరు భాగం వైశ్యులు. పదభాగం శూద్రులని చెప్పబడ్డారు. విరాట్పురుషుడు సర్వలోకమయుడు, సమస్తలోకాలూ సమస్తజీవులూ విరాట్పురుషుని యందే ఉంటారు.

## 5 అధ్యాయం

వాచాం వహ్నేర్ముఖం క్షేత్రం ఛందసాం సప్తధాతవః,
హవ్యకవ్యామృతాన్నానాం జిహ్వా సర్వరసస్య చ.
సర్వాసూనాం చ వాయోశ్చతన్నాసే పరమాయనే,
అశ్వినోరోషధీనాం చ ఘ్రాణో మోదప్రమోదయోః.
రూపాణాం తేజసాం చక్షుర్దివస్సూర్యస్య చాక్షిణీ,
కర్ణౌ దిశాం చ తీర్థానాం శ్రోత్ర మాకాశశబ్దయోః.
తద్గాత్రం వస్తుసారాణాం సౌభాగ్యస్య చ భాజనమ్,
త్వగస్య స్పర్శవాయోశ్చ సర్వమేధస్య చైవ హి.
రోమాణ్యుద్భిజ్జజాతీనాం యైర్వా యజ్ఞస్తు సంభృతః,
కేశశ్మశ్రునఖాన్యస్య శిలాలోహాభ్రవిద్యుతామ్.

విరాట్పురుషుని ముఖంనుండి వాణీ, దాని అధిష్ఠాన దేవత అగ్ని ఆవిర్భవించాయి. త్రిష్టుపు అనుష్టుపు ఉష్ణిక్ బృహతీ పంక్తి జగతి అనే ఏడుఛందస్సులూ ధాతువులతో ఉద్భవించాయి. దేవ పితృ మనుష్యులకు భుజింప యోగ్యమైన అమృతాహారం సమస్తరసాలూ రసనేంద్రియం రసాధిష్ఠాన దేవతయగు వరుణుడూ కూడా విరాట్పురుషుని జిహ్వనుండి జనించారు. విరాటుని నాసికారంధ్రాల నుండి

బాహవో లోకపాలానాం ప్రాయశః క్షేమకర్మణామ్,
విక్రమో భూర్భువస్స్వశ్చ క్షేమస్య శరణస్య చ.
సర్వకామవరస్యాపి హరేశ్చరణ ఆస్పదమ్.
అపాం వీర్యస్య సర్గస్య పర్జన్యస్య ప్రజాపతేః,
పుంసశ్శిశ్న ఉపస్థస్తు ప్రజాత్యానందనిర్వృతేః.
పాయుర్యమస్య మిత్రస్య పరిమోక్షస్య నారద,
హింసాయా నిరృతేర్మృత్యోర్నిరయస్య గుదః స్మృతః.
పరాభూతేరధర్మస్య తమసశ్చాపి పశ్చిమః,
నాడ్యో నదనదీనాం తు గోత్రాణామస్థిసంహతిః.
అవ్యక్తరససింధూనాం భూతానాం నిధనస్య చ,
ఉదరం విదితం పుంసో హృదయం మనసః పదమ్.
ధర్మస్య మమ తుభ్యం చ కుమారాణాం భవస్య చ,

ప్రాణాపానవ్యానోదానసమానములనే పంచప్రాణాలుగా వాయువ్రాఘ్రాణేంద్రియంనుండి అశ్వినీకుమారులుగా సమస్తఓషధులుగా నానావ్యానిశేషగంధాలుగా ఉత్పన్నమయినాయి. విరాట్పురుషుని నేత్రేంద్రియం రూపానికీ తేజస్సుకీ నేత్రగోళం. స్వర్గ సూర్యాదులకూ జన్మస్థానం సమస్తదేవతలూ పవిత్రమైన తీర్థాలూ విరాట్పురుషుని కర్ణములనుండి ఆకాశశబ్దాలు శ్రోత్రేంద్రియంనుండి ఆవిర్భవించాయి. విరాట్పురుషుని శరీరం ప్రపంచంలోవున్న సమస్తవస్తువులకూ సార సౌందర్యాలకు ఆటపట్టు. యజ్ఞాలూ స్పర్శ వాయువులూ ఆయన త్వక్కునుండి ఆవిర్భవించాయి. ఆయన రోమాలే ఉద్భిజాలకు జన్మస్థానం. కేశ శ్మశ్రు నఖాదులనుండి మేఘములూ మెరుపు పాషాణాలూ లోహాదులూ ధాతువులూ పుట్టాయి. భుజాలనుండి లోకరక్షకులైన లోకపాలురు ఆవిర్భవించారు. విశ్వమూర్తియొక్క విక్రమమే భూలోక భువర్లోక స్వర్లోకాల కాశ్రయం. ఆయన చరణములే యోగక్షేమాదుల కాస్పదం. అభయానికి పుట్టినిల్లు. సమస్తకోర్కెలూ ప్రసాదిస్తాయి. విరాట్పురుషుని లింగమే జల వీర్య సృష్టి మేఘ ప్రజాపతులకు ఆశ్రయం. అతని జననేంద్రియమే రతిజనితానందానికి నిలయం. యమ

విజ్ఞానస్య చ తత్త్వస్య పరస్యాత్మా పరాయణమ్.
అహం భవాన్ భవశ్చైవ త ఇమే మునయోఽగ్రజాః,
సురాసురా నరా నాగాః ఖగా మృగసరీసృపాః.
గంధర్వాప్సరసో యక్షా రక్షో భూతగణోరగాః,
పశవః పితరస్సిద్ధా విద్యాధరాశ్చారణా ద్రుమాః.
అన్యే చ వివిధా జీవా జలస్థలనభౌకసః,
గ్రహర్క్ష కేతవస్తారాస్తటిత స్స్తనయిత్నవః.
సర్వం పురుష ఏవేదం భూతం భవ్యం భవచ్చయత్,
తేనేతమావృతం విశ్వం వితస్తిమధితిష్ఠతా.
స్వధిష్ణ్యం ప్రతపన్ప్రాణో బహిశ్చ ప్రతపత్యసౌ.
ఏవం విరాజం ప్రతపం స్తపత్యంత ర్బహిఃపుమాణ్.
సోఽమృతస్యాభయస్యేశో మర్త్యమన్నం యదత్యగాత్,
మహిమైష తతో బ్రహ్మన్పురుషస్య దురత్యయః.
పాదేషు సర్వభూతాని పుంసః స్థితిపదో విదుః,

నిర్ఋతి మిత్ర హింసా మృత్యు నరక మల త్యాగాదులకు ఉత్పత్తి స్థానం వెన్ను. నాడులనుండి నద నదీసమూహం, ఎముకలనుండి పర్వతములూ, నిర్మింప బడ్డాయి. ఆపురుషుని హృదయమే మనస్సు నకు జన్మభూమి. నేనూ నువ్వూ ధర్మువూ సనకాదులూ శంకరుడూ విజ్ఞానమూ అంతఃకరణ మొదలైనవన్నీ ఆదిపురుషుని చిత్తాన్ని ఆశ్రయించి ఉంటాయి. దేవ దానవ మనుష్య నాగ యక్ష రాక్షస గరుడ గంధర్వ పిశాచ పితృగణాలూ అప్సరసలూ పశుపక్షి మృగాదులూ వృక్షాలూ సమస్తజీవులూ ఆకాశ జల స్థలముల యందుండే సమస్తప్రాణికోటీ గ్రహ నక్షత్ర తారలూ విద్యుత్తులూ మేఘాలూ అన్నీ విరాట్పురుషుని రూపమే. ఇప్పుడున్నవీ ముందు రాబోయేవీ విరాట్పురుషునియందే ఉంటాయి. ఆపురుషునియందీవిశ్వమంతా దశాంగుళపరిమాణంలో యిమిడివుంది. – (దశాంగుళన్యాయం వేదాంత శాస్త్రంలో ఈక్రిందివిధంగా చెప్పబడింది. భూమికంటే పదిరెట్లు జలమూ జలముకంటే అగ్నీ అగ్నినిమించి వాయువూ వాయునతిక్రమించి ఆకాశమూ దానికంటె అహంకారమూ మహత్తత్వమూ

అమృతం క్షేమమభయం త్రిమూర్ధ్నోఽధాయి మూర్ధసు.
పాదాస్త్రయో బహిస్త్వాసన్న ప్రజానాం య ఆశ్రమాః,
అంతస్త్రిలోక్యాస్త్వపరో గృహమేధో బృహద్వ్రతః.
సృతీ విచక్రమే విష్వఙ్ఙాశనానశనే ఉభే,
యదవిద్యా చ విద్యా చ పురుషస్తూభయాశ్రయః.
యస్మాదండంవిరాడ్జజ్ఞే భూతేంద్రియ గుణాత్మకః.
తద్ద్రవ్యమత్యగాద్విశ్వం గోభిః సూర్య ఇవాతపన్.
యదాస్య నాభ్యాం నళినాదహమాసం మహాత్మనః,
నావిందం యజ్ఞసంభారాన్పురుషావయవాదృతే.
తేషు యజ్ఞస్య పశవః సవనస్పతయః కుశాః,
ఇదం చ దేవయజనం కాలో బహుగుణాన్వితః.
వస్తూన్యోషధయోఽస్నేహా రసలోహమృదో జలమ్,

మూలప్రకృతి ఒకదానికంటె ఒకటి పదింతలుంటే యివన్నీకలిపి భగవానునియం దొకేపాదమాత్రంగా ఉన్నాయి.) సూర్యుడు తనమండలాన్ని ప్రకాశింపజేస్తూ సమస్తలోకాల్నీ ప్రకాశింపజేస్తున్నట్లు పురాణపురుషుడు విరాట్పురుషునకు లోపలా బైటా ప్రకాశాన్నిస్తున్నాడు. మానవుడు సంకల్ప క్రియాదులచే నిర్మించే వానికంటె పరమైనవాడు. అమృత అభయప్రదరూపమైన మోక్షానికి అధినాథుడు. కనుకనే భగవంతుని మహిమ వర్ణనాతీతమైంది. సమస్తలోకాలూ భగవానుని ఒకేపాదమాత్రం. అందులోనే సమస్తజీవులూ ఉంటాయి. భూలోక భువర్లోక స్వర్గలోకాలకు పైన మహర్లోకం వుంది. దానిపైన జన, తపోలోకాలూ యింకాపైన సత్యలోకం ఉన్నాయి. అది అమృత క్షేమ అభయాలకు నిత్యనివాసస్థానం.

జన, తప, సత్యలోకాల్లో బ్రహ్మచారులూ, వానప్రస్థులు, సన్యాసులూ నివసిస్తారు. దీర్ఘకాలం బ్రహ్మచర్యం అవలంబించలేని గృహస్థులు భూలోక భువర్లోక స్వర్గలోకాల్లోనే వుంటారు. శాస్త్రాల్లో రెండుమార్గాలు చెప్పబడ్డాయి. ఒకటి కర్మమార్గం. రెండవది ఉపాసనా మార్గం. అవిద్యారూపమైన కర్మమార్గం కోర్కెలు కలవారికి

ఋచో యజూంషి సామాని చాతుర్హోత్రం చ సత్తమ.
నామధేయాని మంత్రాశ్చ దక్షిణాశ్చ వ్రతాని చ,
దేవతానుక్రమః కల్పః సంకల్పస్తంత్రమేవ చ.
గతయో మతయశ్చైవ ప్రాయశ్చిత్తం సమర్పణం,
పురుషావయవైరేతే సంభారాస్సంభృతా మయా.
ఇతి సంభృతసంభారః పురుషావయవైరహం,
తమేవ పురుషం యజ్ఞం తేనైవాయజమీశ్వరం.
తతస్తే భ్రాతర ఇమే ప్రజానాం పతయో నవ,
అయజన్వ్యక్తమవ్యక్తం పురుషం సుసమాహితాః.
తతశ్చ మనవః కాలే ఈజిరే మునయో పరే,
పితరో విబుధా దైత్యామనుష్యాః క్రతుభిర్విభుం.
నారాయణే భగవతి తదిదం విశ్వమాహితమ్,

విరాగులకూ నిష్కామమైన ఉపాసనా మార్గం. వీనిలో ఏదో ఒకదానిని ఆశ్రయిస్తే భోగప్రాప్తి సాధనమైన దక్షిణాయనగతి లేక మోక్ష ప్రాప్తిరూపమైన ఉత్తరాయణగతిని పొందుతారు. పురుషోత్తముడే యీ రెండు మార్గాలకూ ఆధారం. సూర్యుడు తనకిరణాలచేత సర్వాన్నీ ప్రకాశింపజేస్తూ యేలాగైతే వేడినీ అంటడో, అలానే పరమాత్మకూడా అండమునూ భూతపంచకాన్నీ ఏకాదశేంద్రియములనూ గుణమయుడైన విరాట్పురుషునీ సృష్టించి తాను వీటన్నిటి యందూ నిండివుండీ వీటన్నిటికంటే అతీతుడుగా ఉన్నాడు.

ఏ సమయంలో విరాట్పురుషుని నాభి నుండి నేనావిర్భవించానో ఆ సమయంలో విరాట్పురుషుని అంగాలు వినా నా కేవిధమైన యజ్ఞసామగ్రీ లభించలేదు. అప్పుడు నేనా దివ్యపురుషుని అవయవములయందే పశు యూప కుశాదులూ యజ్ఞభూమీ యజ్ఞకాలాన్నీ యజ్ఞానికి కావలసిన పాత్రలూ ధాన్యాలూ ఓషధులూ ఘృతాదులూ లోహ మృణ్మయ జలాదులూ ఋగ్యజుస్సామాది చాతుర్హోత్రవిధులూ యజ్ఞముల పేర్లూ సంకల్పాదులూ తంత్రం గతి శ్రద్ధా ప్రాయశ్చిత్తం సమర్పణ మొదలైనవన్నీ గ్రహించి వానితోనే ఆయజ్ఞ

గృహీతమాయోరుగుణస్సర్గాదావగుణ స్స్వతః.
సృజామి తన్నియుక్తోఽహం హరో హరతి తద్వశః,
విశ్వం పురుషరూపేణ పరిపాతి త్రిశక్తిధృక్.
ఇతి తేఽభిహితం తాత యథేదమనుపృచ్ఛసి,
నాన్యద్భగవతః కించిద్భావ్యం సదసదాత్మకమ్.
న భారతీ మేఽంగ మృషోపలక్ష్యతే న కర్హిచిన్మే మనసో మృషా గతిః,
న మే హృషీకాణి పతంత్యసత్పథే యన్మే హృదౌత్కంఠ్యవతా ధృతో హరిః.
సోఽహం సమామ్నాయమయస్తపోమయః ప్రజాపతీనామభివందితః పతిః,
ఆస్థాయ యోగం నిపుణం సమాహితస్తం నాధ్యగచ్ఛం యత ఆత్మసంభవః.
నతోఽస్మ్యహం తచ్చరణం సమీయుషాం భవచ్ఛిదం స్వస్త్యయనం సుమంగళం
యో హ్యాత్మమాయావిభవం స్మ పర్యగాద్యథా నభస్స్వాంతమథాపరే కుతః.
నాహం న యూయం యదృతాం గతిం విదుర్న వామదేవః కిముతాపరే సురాః,
తన్మాయయా మోహితబుద్ధయస్త్విదం వినిర్మితం చాత్మసమం విచక్ష్మహే.

పురుషుడైన పరమాత్మను యజ్ఞంద్వారా సేవించాను. తరువాత నీ అన్నలైన సనకాదులూ దక్షాది నవప్రజాపతులూ అంతర్యామి రూపుడైన విరాట్పురుషుని ఆరాధించారు. క్రమంగా మనువులూ దేవతలూ ఋషులూ పితరులూ మనుష్యులూ యజ్ఞాలుచేసి విరాట్పురుషుని సేవించారు. ఈ విశ్వమంతా నారాయణునియందే ఉన్నది. తాను స్వయంగా ప్రకృతిగుణరహితుడు. కాని సృష్ట్యారంభంలో మాయాగుణాల్ని గ్రహిస్తూంటాడు. ఆమహాపురుషుని ప్రేరణచేతనే నేనీ సృష్టి చేస్తూ వుంటాను. ఆయన అధీనంలోవుండే రుద్రుడే లయింపజేస్తూంటాడు. ఆయనే స్వయంగా విష్ణురూపంతో పాలిస్తూ ఉంటాడు. ఆపురుషుడు సత్త్వరజస్తమోగుణాలను స్వీకరించి ఉంటాడు. నీ ప్రశ్నకు సమాధానం చెప్పాను. భావాభావాలూ కార్యకారణాలూ అన్నీ విశ్వరూపుడైన భగవానుని రూపమే, భగవంతునికంటె భిన్నమైన వస్తువేదీ లేదు.

నేను ప్రేమపూరిత హృదయంతో నిరంతరం భగవంతుని స్మరిస్తూ ఉంటాను. అందువల్ల నావాక్కునుండి అసత్యం వెలువడదు. నామనస్సు అసత్యసంకల్పం చేయదు. నా ఇంద్రియాలూ ఎప్పుడూ

యస్యావతారకర్మాణి గాయంతి హ్యస్మదాదయః,
న యం విదంతి తత్త్వేన తస్మైభగవతే నమః.
స ఏష ఆద్యః పురుషః కల్పేకల్పేసృజత్యజః,
ఆత్మాత్మన్యాత్మనాత్మానం సంయచ్ఛతి చ పాతి చ.
విశుద్ధం కేవల జ్ఞానం ప్రత్యక్సమ్యగవస్థితమ్,
సత్యం పూర్ణమనాద్యంతం నిర్గుణంనిత్యమద్వయమ్.
ఋషేవిందంతిమునయః ప్రశాంతాత్మేంద్రియాశయాః,
యదాతదేవాసత్తర్కైస్తిరోధీయేతవిప్లుతమ్.
ఆద్యోవతారః పురుషః పరస్యకాలస్స్వభావస్సదసన్మనశ్చ,
ద్రవ్యంవికారో గుణఇంద్రియాణివిరాట్స్వరాట్ స్థాస్నుచరిష్ణు భూమ్నః.
అహంభవో యజ్ఞఇమేప్రజేశా దక్షాదయోయేభవదాదయశ్చ,
స్వర్లోకపాలాః ఖగలోకపాలాన్నృలోకపాలా స్తలలోకపాలాః,
గంధర్వవిద్యాధరచారణేశాయేయక్షరక్షోరగనాగనాథాః,
యే వా ఋషీణామృషభాః పితౄణాందైత్యేంద్రసిద్ధేశ్వరదానవేంద్రాః.

మర్యాద నుల్లంఘించి దుర్మార్గంలో ప్రవేశించవు. నేను వేదమూర్తిని. నా జీవితం తపోమయం. ప్రజాపతులుకూడా నాకు నమస్కరిస్తాంటారు. నేను వారందరికీ అధిపతిని. అయినా నేను అష్టాంగములతో కూడిన యోగసాధనానిష్ఠ అనుష్ఠించాను, కానీ నాకు మూలకారణమైన పరమాత్మను గ్రహించలేకపోయాను. అతడు భక్తికి కాని లభించడు. మంగళమయుడూ శరణన్నవారిని జన్మ మరణరూపమైన కాలచక్రంనుండి ఉద్ధరించేవాడూ ఐన పరమేశ్వరుని చరణాలకే నమస్కరిస్తున్నాను. ఆకాశం సర్వవ్యాప్తమయినా తన అంతు తాను తెలుసుకోనట్లే తన మహిమయొక్క అంతాన్ని తానే గ్రహించలేకపోతూంటే యితరులా విరాట్పురుషుని మహిమ ఎలా గ్రహించగలరు? నేను నాబిడ్డలైన మీరూ శంకరుడూ కూడా ఆపరమాత్మని సత్యస్వరూపం గ్రహించలేకపోతే సామాన్యులే విధంగా తెలుసుకోగలరు. భగవంతునిమాయామోహితులమై మనం ఈసృష్టిలోని జగత్తునే గ్రహించలేక స్వబుద్ధ్యానుసారం నిర్ణయించుకొంటున్నాము!

అన్యే చ యే ప్రేతపిశాచభూతకూష్మాండయాదోమృగపక్ష్యధీశాః,
యత్కించ లోకే భగవన్మహస్వదోజస్సహస్వద్బలవత్క్షమావత్.
శ్రీహ్రీవిభూత్యాత్మవదద్భుతార్ణం తత్త్వం పరం రూపవదస్వరూపమ్,

మనమింతవరకు ఏ భగవంతుని అవతారలీలలను గానంచేస్తూ పురుషోత్తముని తత్త్వం గ్రహించలేకపోతున్నామో ఆపరమాత్మకు నా నమస్కారం. అప్రమేయాత్ముడు ప్రతికల్పమందూ తనయందే సృష్టి చేస్తూ పాలిస్తూ ఉపసంహరిస్తూ ఉంటాడు. అతడు నామరూపరహితుడు. జ్ఞానస్వరూపుడు. అంతరాత్మరూపంలో ఏకరసస్వరూపుడుగా ఉంటాడు. భూత భవిష్యద్వర్తమానాల్లో జాగ్రత్స్వప్నసుషుప్తుల్లో పరిపూర్ణుడుగా ఉంటాడు. భగవానునికి ఆద్యంతాలు లేవు. గుణరహితుడుగా సనాతనుడుగా అద్వితీయుడుగా ఉంటాడు. అంతఃకరణా ఇంద్రియాలూ శరీరం కూడా శాంతింపజేసి తననే ధ్యానించే వారికి సాక్షాత్కరిస్తాడు. వితర్కాలు సాగించేవారికి ఆయన దర్శనం అలభ్యము.

పరమాత్మయొక్క ప్రథమావతారం విరాట్పురుషావతారం. అంతేకాక కాలం స్వభావం కార్య కారణాలూ మనస్సూ పంచభూతాలూ అహంకారం త్రిగుణాలూ ఇంద్రియాలు బ్రహ్మాండశరీరం ఆశరీరాభిమాన దేవత స్థావర జంగమజీవులూ ఆపరమాత్మ స్వరూపమే. నేను శంకరుడు విష్ణువు దక్షాది ప్రజాపతులు నువ్వూ భక్తులు స్వర్గలోకాధిపతులు పక్షిరాజు మనుష్యులకు ప్రభువు అధోలోకప్రభువులు విద్యాధర గంధర్వ చారణ యక్ష రాక్షస సర్ప ఋషి పితృ దైత్య దానవ సిద్ధ భూత ప్రేత పిశాచ కూష్మాండ జలచర వనచరాది సమస్తజీవగణాధిపతులూ ఐశ్వర్య తేజో బలాదులుకల వస్తుజాలం ఉందో అదంతా భగవత్స్వరూపమే. ఇదికాక భగవంతుని ప్రధానమైన లీలావతారాలున్నాయి. అవన్నీ క్రమంగా చెప్పుతాను. లీలావతారచరిత్ర విన్నందు

ప్రాధాన్యతో యాన్నృపఅమనఃతి లీలావతారాన్పురుష భూమ్నః.
అపీయతాం కర్ణకపాయశోషానను క్రమిష్యేత ఇమాన్ సుపేశాః.

వల్ల సమస్తపాపాలూ నశిస్తాయి. గనుక సావధానంగా వినమని బ్రహ్మ చెపుతున్నాడు.

## 6 అ ధ్యా య ం

యత్రోద్యతః క్షితితలోద్ధరణాయ బిభ్రత్క్రోడిం తనుం సకలయజ్ఞమయీమనంతః
అంతర్మహార్ణవముపాగతమాదిదైత్యం తం దంష్ట్రయాద్రిమివ వజ్రధరో దదార.
జాతో రుచేరజనయత్సుయమాన్ సుయజ్ఞ ఆకూతిసూనుర సురానథ దక్షిణాయాం.
లోకత్రయస్య మహతీమహరద్యదార్తిం స్వాయంభువేన మనునాహ రిత్యనూక్తః.
జజ్ఞే చ కర్దమగృహే ద్విజదేవహూత్యాంస్త్రీభిస్సమం నవభిరాత్మగతిం స్వమాత్రే,
ఊచే యమాత్మశమలం గుణసంగపంకం సాస్మిన్ విధూయ కపిలస్య గతిం ప్రపేదే.
అత్రేరపత్యమభికాంక్షత ఆహతుష్టో దత్తో మయాహమితి యద్భగవాన్ స దత్తః,
యత్పాదపంకజపరాగపవిత్రదేహా యోగర్ధిమాపురుభయీంయదుహైహయాద్యాః.
తప్తంతపోవివిధలోకసి సృక్షయామే ఆదౌ సనాత్స్వతపసస్స చతుస్సనోఽభూత్,
ప్రాక్కల్ప సంప్లవవినష్టమహాత్మతత్త్వం సమ్యగ్జగాద మునయో యదచక్షతాత్మన్.
ధర్మస్యదక్షదుహితర్యజనిష్టమూర్త్యాం నారాయణో నర ఇతి స్వతపః ప్రభావః.
దృష్ట్వాత్మనో భగవతో నియమావలోపం దేవ్య స్త్వనంగపృతనా ఘటితుం నశేకుః.
కామందహంతి కృతినో న నురోషదృష్ట్యా రోషం దహంత మపితేన దహంత్యసహ్యాం,
సోయం యదంతరమలం ప్రవిశ౯ బిభేతి కామః కథం ను పునరస్య మనశ్శ్రయేత.

నారదా! అనంతుడైన భగవానుడు ప్రళయజలంలో మునిగిన భూమిని ఉద్ధరించడానికి వరాహశరీరం ధరించి ఆదిదైత్యుడైన హిరణ్యాక్షుని తనకోరలతో సంహరించి భూమిని ఉద్ధరించాడు. రుచినామకుడైన ప్రజాపతిభార్య ఆకూతియందు సుయజ్ఞుడనే పేరుతో అవతరించి దక్షిణానామంతో ప్రశిద్ధమైన భార్యయందు సుయములనే పేర్లుగల దేవతలను కని త్రిలోకాల క్లేశాలనూ హరించాడు. కనుకనే ఆసమయంలో స్వాయంభువు ఆభగవానుని "హరి" యని సంబోధించాడు.

కర్దమప్రజాపతికి దేవహూతియందు తొమ్మండుగురు అక్కచెల్లెండ్రతో కపిలుడై అవతరించి తల్లికి సాంఖ్యయోగం ఉపదేశించాడు.

విద్ధస్సపత్న్యుదితపత్రిభి రంతి రాజ్ఞో బాలోఽపి సన్నుపగతస్తపసే వనాని,
తస్మా అదాద్ధ్రువగతిం గృణతే ప్రసన్నో దివ్యాః స్తువంతి మునయో యదుపర్యధస్తాత్.
యద్వేనముత్పథగతం ద్విజవాక్యవజ్రనిష్ప్లుష్టపౌరుషభగం నిరయే పతంతమ్,
త్రాత్వార్థితో జగతి పుత్రపదం చ లేభే దుగ్ధా వసూని వసుధా సకలాని యేన.
నాభేరసావృషభ ఆస సుదేవిసూనుర్యో వై చచార సమదృగ్జడ యోగచర్యామ్,
యత్పారమహంస్యమృషయః పదమామనంతి స్వస్థః ప్రశాంతకరణః పరిముక్తసంగః.
సత్రే మమాస భగవాన్ హయశీర్షశ సాక్షాత్స యజ్ఞపురుష స్తపనీయవర్ణః,
ఛందోమయో మఖమయోఽఖిలదేవతాత్మా వాచో బభూవురుశతీః శ్వసతోఽస్య నస్తః.
మత్స్యో యుగాంతసమయే మనునోపలబ్ధః క్షోణీమయో నిఖిలజీవనికాయ కేతః,
విస్రంసితానురుభయే సలిలే ముఖాన్మే ఆదాయ తత్ర విజహార హ వేదమార్గాన్.
క్షీరోదధావమరదానవయూథపానా మున్మథ్నతామమృతలబ్ధయ ఆదిదేవః,
పృష్ఠేన కచ్ఛపవపుర్విదధార గోత్రం నిద్రాక్షణోఽద్రిపరివర్తకషాణకండూః.
త్రైవిష్టపోరుభయహాసనృసింహరూపం కృత్వాభ్రమద్భ్రుకుటిదంష్ట్రకరాలవక్త్రమ్,
దైత్యేంద్రమాశు గదయాభిపతంతమారాదూరౌ నిపాత్య విదదార నఖైస్స్ఫురంతమ్.

అనసూయా దేవికి అత్రివల్ల దత్తాత్రేయుడై అవతరించి యదు కార్తవీర్యార్జున అలర్కాదులకు యోగ మోక్షమార్గాలు ఉపదేశించాడు

సృష్ట్యారంభంలో నేను అఖండమైన తపస్సుచేయగా ప్రసన్నుడై "తప" శబ్దార్థంకల సన నామకమైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతులనే పేర్లతో అవతరించి పూర్వకల్పమందు మరచిపోయిన ఆత్మజ్ఞానం ఋషులకు బోధించడంవల్ల అదేసమయంలో వారు తత్వజ్ఞానులయారు. ధర్ముని పత్ని దక్షునికూతురూ అయిన మూర్తి గర్భం నుండి నర - నారాయణరూపాలతో అవతరించి బదరికావనంలో తపస్సుచేస్తూంటే ఇంద్రునిచే పంపబడిన అప్సరస్త్రీలు ఆతపోభూమిని చేరి నర - నారాయణులను చూచినమాత్రాన తమస్వభావం మరచిపోయారు. వారితపస్సును భగ్నం చేయలేకపోయారు. శంకరాదులు క్రోధంచే మన్మథాదులను దగ్ధంచేశారేకాని క్రోధాన్ని దరిచేరనీయలేదు. సవతితల్లిదగ్గర తండ్రిచే అవమానింపబడ్డ బాలుడు ధృవుడు ఘోరతపస్సుచేస్తే చతుర్భుజరూపంతో దర్శనమిచ్చి వానికి ధృవపదం ప్రసాదించాడు. ఆ ధృవునికి మహాత్ములే ప్రదక్షిణలుచేస్తూ పురుషోత్తముని

సర్గే తపోఽహ మృషయో నవ యే ప్రజేశాః స్థానేఽథ ధర్మమఖమన్వమరావనీశాః,
అంతే త్వధర్మహరమన్యువశాసురాద్యా మాయావిభూతయ ఇమాః పురుశక్తిభాజః.
విష్ణోర్నువీర్యగణనాం కతమోఽర్హతీహ యః పార్థివాన్యపి కవిర్విమమే రజాంసి,
చస్కంభ యస్స్వరభసా స్ఖలతా త్రిపృష్ఠం యస్మాత్త్రిసామ్యసదనాదురుకంపయానం.
నాంతం విదామ్యహమమీమునయోఽగ్రజాస్తే మాయా బలస్య పురుషస్య కుతోఽపరే యే,
గాయన్ గుణాన్ దశశతానన ఆదిదేవశ్శేషోఽధునాపి సమవస్యతి నాస్య పారమ్.
యేషాం స ఏష భగవాన్ దయయేదనంతస్సర్వాత్మనాశ్రితపదో యది నిర్వ్యళీకమ్,
తే దుస్తరామతితరంతి చ దేవమాయాం నైషాం మమాహమితి ధీశ్శ్వసృగాలభక్ష్యే.
వేదాహమంగ పరమస్య హి యోగమాయాం యూయం భవశ్చ భగవానథ దైత్యవర్యః.
పత్నీ మనోస్స చ మనుశ్చ తదాత్మజాశ్చ ప్రాచీనబర్హి ఋభురంగ ఉత ధ్రువశ్చ.
ఇక్ష్వాకురైళ ముచుకుంద విదేహ గాధి రఘ్వంబరీషసగరా గయ నాహుషాద్యాః,
మాంధాత్రలర్కశతధన్వనురంతిదేవా దేవవ్రతోబలిరమూర్త్తరయో దిలీపః.
సౌభర్యుతంకశిబిదేవలపిప్పలాదసారస్వతోద్ధవపరాశరభూరిషేణాః,
యేఽన్యే విభీషణ హనూమదుపేంద్ర దత్తపార్థార్ష్టిషేణవిదురశ్రుతదేవవర్యాః.
తే వై విదంత్యతితరంతి చ దేవమాయాం స్త్రీశూద్రహూణశబరా అపి పాపజీవాః,
యద్యద్భుతక్రమపరాయణశీలశిక్షాస్తిర్యగ్జనా అపి కిము శ్రుత ధారణా యే.

యందు గుంపులుగుంపులుగా రాక్షసులు జన్మించినప్పుడు శ్వేత కృష్ణ కేశాలనుండి బలరామ కృష్ణ రూపాలతో అవతరించి అనేకలీలలు ప్రదర్శించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేశాడు. ప్రతిద్వాపరాంతమందూ కలియుగమానవులు అల్పాయుష్కులనీ అల్పబుద్ధులనీ వారిని తరింపజేయటానికి వ్యాసుడై అవతరించి వేదాన్ని శాఖలుగా విభజించి శిష్యపరంపరకూ బోధించడమేగాక పురాణేతిహాసాలను రచించి లోకాన్ని రక్షిస్తూ ఉంటాడు. రాక్షసులు మయనిర్మితమైన మాయానగరాల్లో ఉండి సత్యాన్ని నశింపచేస్తూంటే బుద్ధరూపుడై అవతరించి అనేక ధర్మాలనుబోధించి త్రిపురాసురసంహారానికి సహకరించాడు. కలియుగాంతంలో సత్పురుషులగృహాల్లోకూడా భగవత్కథామృతపానానికి అవకాశంలేని స్థితి ఏర్పడినప్పుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వేదబాహ్యులైపోయినప్పుడు శూద్రప్రభుత్వం వృద్ధిచెందినకాలంలో స్వాహాకార స్వధాకార వషట్కారాలు వినిపించనప్పుడు దేవ పితృ

శశ్వత్ప్రశాంతమభయం ప్రతిబోధమాత్రం శుద్ధం సమం సదసతః పరమాత్మతత్త్వమ్,
శబ్దో న యత్ర పురుకారకవాన్ క్రియార్థో మాయాపరైత్యభిముఖే చ విలజ్జమానా.
తద్వై పదం భగవతః పరమస్య పుంసో బ్రహ్మేతి యద్విదురజస్రసుఖం విశోకమ్,
సధ్ర్యఙ్నియమ్య యతయో యమకర్తహేతిం జహ్యుస్స్వరాడివ నిపానఖనిత్రమింద్రః.
స శ్రేయసామపి విభుర్భగవాన్ యతోఽస్య భావస్వభావవిహితస్య సతః ప్రసిద్ధిః,
దేహే స్వధాతువిగమేఽనువిశీర్యమాణే వ్యోమేవ తత్ర పురుషో న విశీర్యతేఽజః.

సోఽయం తేఽభిహితస్తాత భగవాన్ విశ్వభావనః,
సమాసేన హరేర్నాన్యదన్యస్మాత్సదసచ్చ యత్.
ఇదం భాగవతం నామ యన్మే భగవతోదితమ్,
సంగ్రహోఽయం విభూతీనాం త్వమేతద్విపులీకురు.
యథా హరౌ భగవతి నృణాం భక్తిర్భవిష్యతి,
సర్వాత్మన్యఖిలాధార ఇతి సంకల్ప్య వర్ణయ.
నృజన్మని నతుష్యేత కిం కాయమనునస్త్రైః,
కృష్ణే యద్యపవర్గేశే భక్తిస్స్యాదనపాయనీ.
కింస్వాధ్యాయాశ్రమాచారైః కిం దానైఃకిం తపశ్శ్రుతైః,
సర్వాసుయోన్యుత్తమశ్లోకే నచేద్భక్తిరధోక్షజే

యజ్ఞాలు పూర్ణంగా మానివేసినప్పుడు కలికిమూర్తియై అవతరించి దురాత్ములను సంహరించి కృతయుగధర్మం స్థాపిస్తాడు.

సృష్ట్యారంభంలో తపస్సురూపుడై నవబ్రహ్మరూపుడై మరీచ్యాది ఋషిరూపుడై నానారూపంకూడా ధరించి అవతరిస్తాడు. రక్షాసమయంలో ధర్మ విష్ణు మను దేవతా రాజరూపాలలో సంహారసమయానికి అధర్మ రుద్ర క్రోధ సర్ప దైత్యాది రూపాలలో భగవంతుని మాయావిభూతులే అవతరిస్తాయి. భగవానుని అనంతకళ్యాణగుణాల నెవడు లెక్కింప గలడు? త్రివిక్రమావతారంలో మానదండంవలె కొలతకై బయలు దేరిన పాదచలనంవల్ల అంతిమావరణమగు ప్రకృతికూడా చలించింది. వేయిశిరస్సులుకల ఆదిశేషుడు భగవంతునిగుణగానంలో ఉత్తీర్ణుడు కాలేకపోతున్నాడు. ఇతరులమాట చెప్పేదేముంది. పరమపురుషుని యోగమాయ నేనెరుగుదును. నువ్వూ, శంకరుడూ, ప్రహ్లాదుడూ, శతరూపా, మనువూ, ప్రియవ్రతుడూ, ప్రాచీనబర్హీ, ఋభు, ధ్రువాదులూ

లీలాం వర్ణయతోఽముష్య ఈశ్వరస్యానుమోదితః,
శృణ్వతః శ్రద్ధయా నిత్యం మాయయాత్మా న ముహ్యతి.

[illegible]. ఇక్ష్వాకు ప్రభృతి [illegible] రాజర్షులూ [illegible] [illegible]. భగవంతుని యందు భక్తి కలిగితే స్త్రీ [illegible] [illegible]. [illegible] కూడా భగవద్భక్తిచే తరించారంటే [illegible] భక్తులైతే వేరే చెప్పేదేముంది. భగవద్భక్తులు పొందలేనిదేదీ లేదు. షడ్గుణైశ్వర్యసంపన్నుడైన పరమేశ్వరుని స్వరూపం సంగ్రహంగా చెప్పాను. ఇదే భాగవత స్వరూపం. దీనిని నువ్వు విస్తరించి ప్రచారంచేస్తే సమస్త మానవులూ భక్తులై మాయను దాటి తరిస్తారని బ్రహ్మ నారదునకుపదేశించాడని పరీక్షిన్మహారాజుకు శుకయోగి చెప్పినట్లు సూతమహర్షి శౌనకాదులకుపదేశించాడు.

7 అధ్యాయం

బ్రహ్మణా చోదితో బ్రహ్మన్ గుణాఖ్యానే గుణస్య చ,
యస్మై యస్మై యథా ప్రాహ నారదో దేవదర్శనః.
ఏతద్వేదితుమిచ్ఛామి తత్త్వం తత్త్వవిదాం వర,
హరేరద్భుతవీర్యస్య కథాలోకసుమంగళాః.
కథయస్వ మహాభాగ యథాహమఖిలాత్మని,
కృష్ణే నివేశ్య నిస్సంగం మనస్త్యక్ష్యే కళేబరమ్.

శుకయోగీంద్రా! భగవద్గుణ గానం చెయ్యమని బ్రహ్మ ఆదేశించాడు కదా! నారదుడెవరెవరికి యేరూపంగా భగద్గుణాలు చెప్పాడు. సర్వమానవకళ్యాణదాయకమైన భగవత్కథాశ్రవణంవల్ల నిరతిశయానందం కలిగించే భగవత్కథ చెప్పి నన్ను కృతార్థుని చెయ్యండి. శ్రీకృష్ణలీలామృతపానం వల్ల హృదయంలో భగవద్దర్శనమవుతుంది. శరదృతువులో నదులు నిర్మలమైనట్లే కృష్ణసందర్శనంవల్లా కథాశ్రవణంవల్లా మానవునిహృదయం పరిశుద్ధమౌతుంది. మార్గాయాసక్లేశంఅనుభ[illegible]

శృణ్వతః శ్రద్ధయా నిత్యం గృణతశ్చస్వచేష్టితమ్,
కాలేన నాతి దీర్ఘేణ భగవాన్ విశతే హృది.
ప్రవిష్టః కర్ణరంధ్రేణ స్వానాం భావ సరోరుహమ్,
ధునోతి శమలం కృష్ణస్సలిలస్య యథా శరత్.
ధౌతాత్మా పురుషః కృష్ణపాదమూలం న ముంచతి,
ముక్తసర్వపరిక్లేశః పాంథస్స్వశరణం యథా.
యదధాతుమతో బ్రహ్మన్ దేహారంభోఽస్యధాతుభిః,
యదృచ్ఛయా హేతునా వా భవంతో జానతే యథా.
ఆసీద్యదుదరాత్పద్మం లోకసంస్థానలక్షణమ్,
యావానయం వై పురుషఇయత్తావయవైః పృథక్,
తావానసావితి ప్రోక్తస్సంస్థావయవవానివ.
అజస్సృజతి భూతాని భూతాత్మా యదనుగ్రహాత్,
దదృశే యేన తద్రూపం నాభిపద్మసముద్భవః.
స చాపి యత్ర పురుషో విశ్వస్థిత్యుద్భవాప్యయః,
ముక్త్వాత్మ మాయాం మాయేశశ్శేతే సర్వగుణాశ్రయః.
పురుషావయవైర్లోకస్సపాలాః పూర్వకల్పితాః,

గృహం చేరిన గృహస్థు గృహాన్ని విడవలేనట్లే శ్రీకృష్ణకథామృత పానానుభవం కలవాడు శ్రీకృష్ణచరణధ్యానం విడువలేడు.

జీవునకు పంచభూతసంబంధమేమీ లేదు. శరీరం పంచభూతాలతో నిర్మింప బడుతూన్నది. దాని స్వభావం వల్లనే యిలా జరుగుతూన్నదా దీనికి వేరే కారణమేమైనా ఉన్నదా?

భగవానుని నాభినుండి సర్వలోక రచనా హేతువైన కమలం ఆవిర్భవించింది. ఈ జీవుడు అవయవాలచే ఎలా పరిచ్ఛిన్నుడయాడో అలానే పరమాత్మ కూడా సీమితమైన అవయవాదులచే పరిచ్ఛిన్నుడైనట్లు మీరు చెప్పారు. ఏ అనుగ్రహం వల్ల బ్రహ్మ సృష్టిస్తున్నాడో ఏ నాభికమలంనుండి పుట్టి ఆ పరమపురుషుణ్ణి చూడలేకపోయాడో సృష్టిస్థితి లయకారుడూ సర్వాంతర్యామీ మాయకు అధినాథుడూ అయిన పరమేశ్వరుడు మాయను పరిత్యజించి దేనియందే రూపంలో శయనిస్తాడో ఆ విరాట్పురుషుని అంగములనుండి లోకాలూ లోకపాలురూ

లోకైరముష్యావయవాః సపాలైరితి శుశ్రుమ.
యావాన్ కల్పో వికల్పో వా యథా కాలోఽనుమీయతే,
భూతభవ్యభవచ్ఛబ్ద ఆయుర్మానం చ యత్సతః.
కాలస్యానుగతిర్యా తు లక్ష్యతేఽణ్వీ బృహత్యపి,
యావత్యః కర్మగతయో యాదృశీ ర్ద్విజసత్తమ.
యస్మిన్ కర్మసమావాయో యథా యేనోపగృహ్యతే,
గుణానాం గుణినాం చైవ పరిణామమభీప్సతామ్.
భూపాతాలకకుబ్వ్యోమగ్రహనక్షత్రభూభృతామ్,
సరిత్సముద్ర ద్వీపానాం సంభవశ్చైతదోకసాం,
ప్రమాణ మండకోశస్య బాహ్యాభ్యంతరభేదతః,
మహతాం చానుచరితం వర్ణాశ్రమవినిశ్చయః.
అవతారానుచరితం యదాశ్చర్యతమం హరేః,
యుగాని యుగమానం చ ధర్మో యశ్చ యుగే యుగే.
నృణాం సాధారణో ధర్మస్స విశేషశ్చ యాదృశః,
శ్రేణీనాం రాజర్షీణాం చ ధర్మః కృచ్ఛ్రేషు జీవతామ్.
తత్త్వానాం పరిసంఖ్యానం లక్షణం హేతులక్షణమ్,

జన్మించారనీ వారే ఆ పురుషుని అవయవాలనీ అన్నారు. ఈ రెండు వాక్యాలయందు గల అంతరార్థ మేమిటి?

మహాకల్పాలూ అవాంతరకల్పాలు మెన్ని? భూతభవిష్యద్వర్త మానకాలాలను ఎలా నిర్ణయించాలి. స్థూలదేహాభిమానులైన జీవుల ఆయుర్దాయం కూడా నిబంధింపబడిందికదా! కాలంయొక్క సూక్ష్మ గతినీస్థూలగతినీ మెలా గ్రహించాలి? ఏ కర్మలవల్ల జీవులకు ఏ గతులు కలుగుతాయి? సత్వ రజస్తమోగుణాల వల్ల దేవమనుష్యాది యోను లలో జన్మలు కలగటానికి యెవరెవరు ఏ ఏ కర్మలు చేస్తూంటారు. బ్రహ్మాండం యొక్క పరిమాణం లోపల యెంత ఉంటుంది? పైభా గంలో ఎంతవుంటుంది? పృథివీ పాతాళ దిశా ఆకాశాదులూ గ్రహ నక్షత్ర పర్వత నదీ సముద్ర ద్వీపాలూ వాటియందు జనించే జీవులూ దేనినుండి జనిస్తాయి? యుగభేదాలూ, వాటి పరిమాణం వేరు వేరుగా యుగధర్మాలూ, విభిన్నమైన అవతారాలూ వాటి

పురుషారాధనవిధిర్యోగస్యాధ్యాత్మికస్య చ.
యోగేశ్వరైశ్వర్యగతిర్లింగభంగస్తు యోగినామ్,
వేదోపవేదధర్మాణామితిహాసపురాణయోః.
సంప్లవస్సర్వభూతానాం విక్రమః ప్రతిసంక్రమః,
ఇష్టాపూర్తస్యకామ్యానాం త్రివర్గస్య చ యో విధిః.
యశ్చానుశాయినాం సర్గః పాషండస్య చ సంభవః,
ఆత్మనో బంధమోక్షౌ చ వ్యవస్థానాం స్వరూపతః.
యథాత్మతంత్రో భగవాన్ విక్రీడ త్యాత్మమాయయా,
విసృజ్య వా యథా మాయాముదాస్తే సాక్షివద్విభుః.
సర్వమేతచ్చ భగవాన్ పృచ్ఛతే మేఽనుపూర్వశః,
తత్త్వతోఽర్హస్యుదాహర్తుం ప్రపన్నాయ మహామునే.
అత్ర ప్రమాణం హి భవాన్పరమేష్ఠి యథాత్మభూః,
అపరేచానుతిష్ఠంతి పూర్వేషాం పూర్వజైః కృతమ్.
న మేఽసవః పరాయంతి బ్రహ్మన్ననశనాదమీ,
పిబతోఽచ్యుతపీయూషంత్వన్ముఖాబ్జవినిస్సృతమ్.
న ఉపామంత్రితో రాజ్ఞా కథయామీతి సత్పతేః,
బ్రహ్మరాతో భృశంప్రీతో విష్ణురాతేన సంసది.

చరిత్రలూ మహాపురుషుల చరిత్రలూ వర్ణాశ్రమధర్మాలూ తత్వసంఖ్యా వానిస్వరూపమూ లక్షణాలూ భగవదారాధనాక్రమం అధ్యాత్మయోగ విధీ వివరించి చెప్పండి. అంతేకాకుండా విభిన్నవృత్తులు కలవారు రాజర్షులూ మహాపురుషులూ వారిచరిత్రలూ విపత్తులందున్నవారిధర్మాలూ వివరించండి. యోగీశ్వరులకు యే యే ఐశ్వర్యాలు ప్రాప్తిస్తాయి? వారే గతిని పొందుతారు? యోగులయొక్క లింగశరీరం యెలా భగ్నమౌతుంది? వేద ఉపవేద ధర్మశాస్త్ర ఇతిహాసాదుల స్వరూపతాత్పర్యమూ విస్తరించి చెప్పండి. సమస్తప్రాణుల ఉత్పత్తి స్థితిలయాలూ యెలా జరుగుతాయి? నూతులూ చెరువులూ తోటలూ నిర్మించడం స్మార్త కర్మలూ యజ్ఞయాగాది శ్రౌతకర్మలూ కామ్యకర్మలూ ధర్మార్థ కామాలూ వాటిసాధన విధి ప్రళయసమయంలో జీవులన్నీ ప్రకృతిలో లయమై తిరిగి యెలా ఉద్భవించేదీ పాషండులెలా పుట్టేదీ చెప్పండి. బంధమోక్షాలు ఎలా ఉంటాయిఆత్మజ్ఞాని ఎలా ఉంటాడు. సర్వ

ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్,
బ్రహ్మణే భగవత్ప్రోక్తం బ్రహ్మకల్ప ఉపాగతే.
యద్యత్పరీక్షిదృషభః పాండూనామనుపృచ్ఛతి,
ఆనుపూర్వ్యేణ తత్సర్వమాఖ్యాతు ముపచక్రమే.

స్వతంత్రుడైన భగవంతుడు తనమాయతో ఎలా క్రీడిస్తూ ఉంటాడు? మాయను విడచి సాక్షివలె ఉదాసీనుడుగా ఎలా ఉంటాడు?

నాకు ఆకలి దప్పుల బాధలు లేవు. మరణ భయం లేదు. బ్రాహ్మణ శాపం వల్ల నాకు మరణం నిశ్చయమయింది. అందువల్ల ఆవిచారం అక్కరలేదు. మీ ముఖారవిందంనుంచి వెలువడే అమృతమయమైన సత్కథా రసం ఆస్వాదిస్తున్నాను. నాకు మోక్షసాధనం ప్రసాదించండి అని అడిగాడు పరీక్షిన్మహారాజు.

## 8 అధ్యాయం

ఆత్మమాయామృతే రాజన్ పరస్యానుభవాత్మనః,
న ఘటేతార్థసంబంధః స్వప్నద్రష్టురివాంజసా.
బహురూప ఇవాభాతి మాయయా బహురూపయా,
రమమాణో గుణేష్వస్యా మమాహమితి మన్యతే.
యర్హి వావ మహిమ్ని స్వే పరస్మిన్ కాలమాయయోః,
రమేత గతసంమోహస్త్యక్త్వోదాస్తే తదోభయం.

పరీక్షిన్మహారాజా! స్వప్నమందు చూసిన వస్తుసముదాయంతో ఆమానవునికి సంబంధంలేనట్లే ఆత్మానుభవం కల జ్ఞానికి దృశ్యపదార్థాలతో సంబంధంలేదు. మాయకారణంగా ఆత్మ వివిధ రూపాలతో గోచరిస్తుంది. మాయాగుణములందు రమిస్తున్నప్పుడు "నేను, నాది" అనేభావం కలుగుతుంది. ఈగుణాలను సంక్షుభితంచేసే కాలాన్నీ మోహాన్నీ జనింపజేసేమాయనూ అతిక్రమించి నిత్యానందం పొందే వాడు "నేను, నాది" అనేభావాలనువదలి ఉదాసీనుడై గుణాతీతుడౌతాడు.

ఆత్మతత్త్వవిశుద్ధ్యర్థం యదాహ భగవానృతం,
బ్రహ్మణే దర్శయన్ రూపమవ్యలీక వ్రతాదృతః.
స ఆదిదేవో జగతాం పరో గురుస్స్వధిష్ణ్యమాస్థాయ సిసృక్షయైక్షత,
తాం నాధ్యగచ్ఛద్దృశమత్రసమ్మతాం ప్రపంచనిర్మాణవిధిర్యయా భవేత్.
స చింతయన్ ద్వ్యక్షరమేకదాంభస్యుపాశృణోద్ద్విర్గదితం వచో విభుః,
స్పర్శేషు యత్షోడశమేకవింశం నిష్కించనానాం నృపయద్ధనం విదుః.
నిశమ్య తద్వక్తృదిదృక్షయా దిశో విలోక్య తత్రాన్యదపశ్యమానః,
స్వధిష్ణ్యమాస్థాయ విమృశ్య తద్ధితం తపస్యుపాదిష్ట ఇవాదధే మనః.
దివ్యం సహస్రాబ్దమమోఘదర్శనో జితానిలాత్మా విజితోభయేంద్రియః,
అతప్యత స్మాఖిలలోకతాపనం తపస్తపీయాంస్తపతాం సమాహితః.
తస్మై స్వలోకం భగవాన్సభాజితస్సందర్శయామాస పరం న యత్పరమ్,
వ్యపేతసంక్లేశవిమోహసాధ్వసం స్వదృష్టవద్భిర్పురుషైరభిష్టుతమ్.
ప్రవర్తతే యత్ర రజస్తమస్తయో స్సత్త్వం చ మిశ్రం న చ కాలవిక్రమః,
న యత్ర మాయా కిముతాపరే హరేరనువ్రతా యత్ర సురా సురార్చితాః,
శ్యామావదాతాః శతపత్రలోచనాః పిశంగవస్త్రాస్సురుచస్సుపేశసః,
సర్వే చతుర్బాహవ ఉన్మిషన్మణి ప్రవేకనిష్కాభరణా స్సువర్చసః.
ప్రవాలవైడూర్య మృణాళవర్చసః పరిస్ఫురత్కుండల మౌలిమాలినః,
భ్రాజిష్ణుభిర్యః పరితో విరాజతే లసద్విమానావలిభిర్మహాత్మనామ్.

బ్రహ్మతపస్సుకు ప్రసన్నుడై భగవానుడు దర్శనం యిచ్చి పరమాత్మ తత్త్వం ఉపదేశించాడు. అదే నీకు తా చెపుతాను విను.

త్రిలోకాలకూ గురువైన చతురాననుడు జన్మస్థానమైన కమలం మీదకూర్చుని సృష్టిని గురించి ఆలోచించసాగాడు. కానీ సృష్టి రూపమైన జ్ఞానం కలుగలేదు. అలా ఆలోచిస్తూండగా ఒకనాడు తపస్సుచెయ్యి-తపస్సుచెయ్యి అని వినిపించింది. అది భగవాదాదేశంగా గ్రహించి తపస్సుచెయ్యడం ఆరంభించాడు. వెయ్యిదివ్యసంవత్సరాలు ఏకాగ్రచిత్తంతో తపస్సు చేశాడు. బ్రహ్మ తపస్సుకు ప్రసన్నుడై శ్రీహరి చతుర్ముఖునకు తనదివ్యలోకం చూపాడు. శ్రేష్ఠమైనదీ క్లేశ మోహ భయరహితమైనదీ ఐన ఆలోకంలో దేవతలు శ్రీహరిని స్తుతిస్తున్నారు. రజోగుణ తమోగుణాలేగాక వీటిసంబంధ కల సత్త్వ గుణానికికూడా అక్కడ స్థానంలేదు. అక్కడ మాయకు స్థానంలేదు

విద్యోతమానః ప్రమదోత్తమాద్యుభిస్సవిద్యుదభ్రావలిభిర్యథా నభః,
శ్రీర్యత్ర రూపిణ్యురుగాయ పాదయోః కరోతి మానం బహుధా విభూతిభిః.
ప్రేంఖశ్రితాయా కుసుమాకరానుగైర్విగీయమానా ప్రియకర్మ గాయతీ,
దదర్శ తత్రాఖిలసాత్వతాం పతిం శ్రియఃపతిం యజ్ఞపతిం జగత్పతిమ్.
సునందనంద ప్రబలార్హణాదిభిస్స్వపార్షద ముఖ్యైః పరిసేవితం విభుం,
భృత్యప్రసాదాభిముఖం దృగాసవం ప్రసన్నహాసారుణలోచనాననమ్.
కిరీటినం కుండలినం చతుర్భుజం పీతాంబరం వక్షసి లక్షితం శ్రియా,
అధ్యర్హణీయాసన మాస్థితం పరం వృతం చతుష్షోడశపంచశక్తిభిః.
యుక్తం భగైస్స్వైరితరత్రచాధ్రువైస్స్వఏవధామన్ రమమాణమీశ్వరమ్.
తద్దర్శనాహ్లాదపరిప్లుతాంతరో హృష్యత్తనుః ప్రేమభరాశ్రులోచనః,
ననామ పాదాంబుజమస్య విశ్వసృగ్యత్పారమ హంస్యేన పథాధిగమ్యతే.
తం ప్రీయమాణం సముపస్థితం కవిం ప్రజావిసర్గే నిజశాసనార్హణమ్,
బభాష ఈషత్స్మితశోచిషా గిరాప్రియః ప్రియం ప్రీతమనాః కరే స్పృశన్.
త్వయాహం తోషితస్సమ్యగ్వేదగర్భసిసృక్షయా,
చిరం భృతేన తపసా దుస్తోషఃకూటయోగినామ్,

కాలానికే చోటులేదు. కోటిసూర్యప్రకాశంతో శ్యామవర్ణంకల శ్రీహరి పీతాంబరధారియై శంఖ చక్ర గదా శార్ఙ్గములు ధరించి ప్రకాశిస్తున్నాడు. ఆదిలక్ష్మి వివిధభూతులతో ఆ పాదాలను సేవిస్తూన్నది. సునంద నంద ప్రబల అర్హణ మొదలుగాగల విష్ణుపార్షదులు శ్రీహరిని సేవిస్తున్నారు. పురుషుడూ ప్రకృతీ మహత్తత్త్వం అహంకారం మనస్సూ దశేంద్రియాలూ, శబ్దాదిపంచతన్మాత్రలూ పంచమహాభూతాలూ (యీ ఇరవైఅయిదుతత్త్వాలూ) రూపాలతో శ్రీహరిని పరివేష్టించి ఉన్నాయి. ఐశ్వర్యమూ ధర్మమూ కీర్తి శ్రీ జ్ఞానమూ వైరాగ్యమూ స్వస్వరూపశక్తులతో ఉన్నాయి. బ్రహ్మ ఆత్మానందంతో శ్రీహరి సమీపంలో నిలచాడు. హరి బ్రహ్మను దగ్గరగా తీసుకొని – వత్సా! నీహృదయంలో సర్వవేదవిజ్ఞానం ఉంది. సృష్టిసామర్థ్యంకోసం తపస్సుచేసి నన్ను దర్శించగలిగావు. కపటబుద్ధితో ఉపాసించేవాడు నన్ను చూడలేడు. నీమనస్సులోని కోరిక కోరుకో. నువ్వు కోరిన వరమిస్తాను. నువ్వు నన్ను చూడకుండా శబ్దం విని తపస్సుచేశావు. కనుక నీకు నాదర్శనమే

వరం వరయ భద్రం తే వరేశం మాభివాంఛితమ్,
బ్రహ్మన్ శ్రేయః పరిశ్రామః పుంసాం మద్దర్శనావధిః.
మనీషితానుభావోఽయం మమ లోకావలోకనమ్,
యదుపశ్రుత్య రహసి చకర్థ పరమం తపః.
ప్రత్యాదిష్టం మయా తత్ర త్వయి కర్మవిమోహితే,
తపో మే హృదయం సాక్షా దాత్మాహం తపసోఽనఘ.
సృజామి తపసైవేదం గ్రసామి తపసా పునః,
బిభర్మి తపసా విశ్వం వీర్యం మే దుశ్చరం తపః.
భగవన్ సర్వభూతానామధ్యక్షోఽవస్థితో గుహామ్,
వేదహ్యప్రతిరుద్ధేన ప్రజ్ఞానేన చికీర్షితమ్.
తథాపి నాథమానస్య నాథ నాథయ నాథితం,
పరావరే యథారూపే జానీయాం తేత్వరూపిణః.
యథాత్మమాయా యోగేన నానాశక్త్యుపబృంహితం,
విలుంపన్విసృజన్ గృహ్ణన్ బిభ్రదాత్మాన మాత్మనా.
క్రీడస్య మోఘసంకల్ప ఊర్ణనాభిర్యథోర్ణుతే,
తథా తద్విషయాం దేహి మనీషాం మయి మాధవ.
భగవచ్ఛిక్షితమహం కరవాణిహ్యతంద్రితః.
నేహమానః ప్రజాసర్గం బధ్యేయంయదనుగ్రహాత్.

కాక నాలోకాన్ని కూడా దర్శించేభాగ్యం కలిగింది నీమీాద నాకు పరిపూర్ణానుగ్రహంకలిగింది.

తపస్సు నా హృదయం. నేను తపస్సుకు ఆత్మస్వరూపుడను. నేను తపస్సువల్లనే సృష్టి స్థితి లయాలు చేస్తూఉంటాను. తపస్సు దుర్లంఘ్యమైన నాశక్తి - అన్నాడు భగవానుడు.

ఆమాటలు విని బ్రహ్మ - శ్రీహరీ! మీారు సమస్త ప్రాణుల యందూ సాక్షీభూతులుగా ప్రకాశిస్తున్నారు. నా ఆలోచన మీా రెరుగనిది కాదు. సగుణ నిర్గుణరూపాలు గ్రహించే జ్ఞానం నాకు ప్రసాదించండి. మాయాధినాథులైన మీాసంకల్పం యెన్నడూ వ్యర్థం కాదు. సాలిపురుగు జాలానిర్మించి అందులో తనే క్రీడిస్తుంది. అదే విధంగా మీారు మీా మాయనే ఆశ్రయంగా తీసికొని అనేకరూపాలు నిర్మించి పాలించి లయింపచేస్తూక్రీడిస్తూఉంటారు. మీాకంటె భిన్నమైన

యావత్సఖాసఖ్యురి వేశతే కృతః ప్రజావిసర్గే విభజామిభోజనం,
అవిక్లబస్తే పరికర్మణిస్థితో మామేనమున్నద్ధమదోఽజమానినః
జ్ఞానం పరమగుహ్యం మే యద్విజ్ఞానసమన్వితం,
సరహస్యం తదంగం చ గృహాణ గదితం మయా.
యావానహం యథాభావో యద్రూపగుణకర్మకః,
తథైవ తత్త్వవిజ్ఞానమస్తు తే మదనుగ్రహాత్.
అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరం,
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహం.
ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేతచాత్మని,
తద్విద్యాదాత్మనో మాయాం యథాభాసో యథా తమః.
యథామహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను,
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహం.
ఏతావదేవజిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాత్మనః,
అన్వయవ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా.
ఏతన్మతం సమాతిష్ఠ పరమేణసమాధినా,
భవాన్ కల్పవికల్పేషు న విముహ్యతికర్హిచిత్.

స్మైన వస్తువేదీ లేదు. ఈ కార్య మర్మం తెలిసికోవాలని వుంది. సృష్టి రచనలో కర్తృత్వాధికారగర్వం నాకులేకుండా ఉండేటట్లూ పూర్వ కల్పసృష్టిక్రమం నాకుచెప్పండి. కల్పాంతరజీవుల గుణకర్మల ననుసరించి వారికి జన్మలు ఇచ్చేటట్లూ నేను సర్వస్వతంత్రుడనసే అభిమానం లేకుండా ఉండేటట్లూ అనుగ్రహిస్తే నేను సృష్టిక్రమం ఆరంభిస్తాను — అన్నాడు పితామహుడు.

వత్సా! అత్యంతగోప్యమైన ఆత్మజ్ఞానం ఉపదేశిస్తాను, విను. నాలక్షణాలూ నాగుణ రూప లీలలూ నాఅనుగ్రహంచేత పూర్ణంగా గ్రహించు. సృష్టికి పూర్వంలో నేనొక్కడనే వున్నాను. నన్ను మించిన స్థూల సూక్ష్మవస్తువు లేదు. యీ రెంటికీ కారణమైన అజ్ఞానమూ లేదు. సృష్టిలేనిస్థానంలో నేనున్నాను. సృష్టిలో ఉన్నాను. శేషించిన వస్తుజాతం నేనే. వాస్తవంగా లేనివీ అనిర్వచనీయమైన వస్తుజాలమూ పరమాత్మనైన నాయందు ఇద్దరు చంద్రులవలె గోచరిస్తూవుంటాయి.

సంప్రదిశ్యైవ మజనో జనానాం పరమేష్ఠినం,
పశ్యతస్తస్య తద్రూప మాత్మనో న్యరుణద్ధరిః.
అంతర్హితేంద్రియార్థాయ హరయే విహితాంజలిః,
సర్వభూతమయో విశ్వం ససర్జేదం స పూర్వవత్.
ప్రజాపతిర్ధర్మపతి రేకదానియమాన్ యమాన్,
భద్రం ప్రజానామన్విచ్ఛన్నాతిష్ఠత్స్వార్థకామ్యయా.
తం నారదః ప్రియతమోరిక్థాదానామనువ్రతః,
శుశ్రూషమాణశ్శీలేనప్రశ్రయేణ దమేన చ.
మాయాం వివిదిషుర్విష్ణోర్మాయేశస్య మహామునిః,
మహాభాగవతో రాజన్ పితరం పర్యతోషయత్.
తుష్టం నిశామ్య పితరం లోకానాం ప్రపితామహం,
దేవర్షిః పరిపప్రచ్ఛ భవాన్ యన్మా మనుపృచ్ఛతి.

నక్షత్రమండలంలో రాహువువలె వాస్తవంగావున్నా నేనుకూడా గోచరించను. ఇదే నా మాయ అని గ్రహించు. పంచభూతసముదాయంతో నిర్మింపబడ్డ చిన్న పెద్ద శరీరాలు పంచమహాభూతకార్యస్వరూపాలవటంచేత భూతపంచకం ఆశరీరాల్లో ప్రవేశిస్తూంటుంది. అదియందే ఆశరీరాలకు కారణభూతంగా ఉండడంవల్ల ప్రవేశమూ లేదు. అదేరీతిగా ప్రాణుల దృష్టిలో నేను ఆత్మరూపంలో ప్రవేశిస్తూ ఉంటాను. ఆత్మదృష్టితో చూస్తే నాకంటే భిన్నమైన వస్తువేలేకపోవడంవల్ల నేను ప్రవేశించడమూ లేదు. ఇదిబ్రహ్మకాదు. ఇదిబ్రహ్మకాదని నిషేధపద్ధతిచేతనూ, ఇదిబ్రహ్మ ఇదిబ్రహ్మ అను అన్వయపద్ధతిచేతనూ సర్వాతీత సర్వస్వరూప సర్వత్రస్థితమైనదే పరమాత్మస్వరూపమని తెలుస్తుంది. పరమాత్మ తత్త్వం గ్రహించడానికిదేమార్గం. నువ్వూ అచలమైనభక్తితో సమాధిద్వారా నాసిద్ధాంతంలో పరిపూర్ణనిష్ఠతో ఉంటే కల్ప కల్పాలలో సృష్టిక్రమం సాగిస్తున్నా నీకు మోహం కలగదు. నిరతిశయమై అఖండమైన ఆనందానుభూతిని పొందగలవు – అని ఆత్మజ్ఞానం ఉపదేశించి అంతర్హితుడయాడు. బ్రహ్మ పూర్వకల్పరీతిని సృష్టి ఆరంభించాడు.

తస్మా దిదం భాగవతం పురాణం దశలక్షణమ్,
ప్రోక్తం భగవతా ప్రాహ ప్రీతః పుత్రాయ భూతకృత్.
నారదః ప్రాహ మునయే సరస్వత్యాస్తటే నృప,
ధ్యాయతే బ్రహ్మపరమం వ్యాసాయామితతేజసే.
యదుతాఽహం త్వయాపృష్టో వైరాజా త్పురుషాదిదం,
యథాసీత్తదుపాఖ్యాస్యే ప్రశ్నా నన్యాంశ్చ కృత్స్నశః.

ధర్మాధిష్ఠాతయైన ప్రజాపతి ప్రజాకళ్యాణవాంఛతో యమ నియమాదులు ధరించిఉన్న సమయంలో మాయాతత్త్వం గ్రహించాలని నారదుడు అక్కడకువచ్చి బ్రహ్మను సేవించి ప్రసన్నుని చేసికొన్నాడు. బ్రహ్మప్రసన్నుడైనట్లు నారదమహర్షి గుర్తించి తన సందేహం తెలిపాడు. ఆ ప్రశ్నలోని అతని సంకల్పం గ్రహించి బ్రహ్మ దశలక్షణాలతోకూడిన భాగవతం చెప్పాడు. ఆభాగవతన్నే నారదమహర్షి నా తండ్రియగు వేదవ్యాసునకు సరస్వతీ నదీతీరంలో వినిపించాడు. ఆభాగవతం వింటే నీసందేహాలన్నీ తీరతాయి. మాతండ్రివల్ల నేనువిన్న భాగవతం చెప్తాను విను.

## 9 అధ్యాయం

అత్రసర్గో విసర్గశ్చ స్థానం పోషణమూతయః,
మన్వంతరేశానుకథానిరోధో ముక్తిరాశ్రయః.
దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణం,
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థేన చాంజసా.
భూతమాత్రేంద్రియధియాం జన్మ సర్గ ఉదాహృతః,
బ్రహ్మణో గుణవైషమ్యా ద్విసర్గః పౌరుషస్మృతః.

ఈమహాభాగవతంలో సర్గ విసర్గ స్థాన పోషణ ఊతి మన్వంతరాలూ ఈశానుకథా నిరోధమూ ముక్తీ ఆశ్రియమూ అనే పది లక్షణాలూ వర్ణించబడ్డాయి. ఈ ఆశ్రియలక్షణం శ్రుతిచేతనూ తాత్పర్యంచేతనూ వీని అనుభవంచేతనూ నిర్ణయింపబడింది. కొందరు మహాత్ములు అన్యమైన తొమ్మిదివిషయాలనూ చాలాసుగమంగా నిర్ణ

స్థితిర్వైకుంఠవిజయః పోషణం తదనుగ్రహః,
మన్వంతరాణి సద్ధర్మ ఊతయః కర్మవాసనాః.
అవతారానుచరితం హరేరస్యానువర్తినాం,
పుంసాం చ సత్కథాః ప్రోక్తా నానాఖ్యానోపబృంహితాః.
నిరోధోఽస్యానుశయనమాత్మనస్సహ శక్తిభిః,
ముక్తిర్హిత్వాన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః.
ఆభాసశ్చ నిరోధశ్చ యతస్త్యధ్యవసీయతే,
స ఆశ్రయః పరం బ్రహ్మ పరమాత్మేతి శబ్ద్యతే.
యోఽధ్యాత్మికోఽయం పురుషస్సోఽసావేవాధిదైవికః,
యస్తత్రోభయవిచ్ఛేదస్సస్మృతోహ్యాధిభౌతికః.
ఏకమేకతరాభావే యదా నోపలభామహే,
త్రితయం తత్ర యో వేద స ఆత్మా స్వాశ్రయాశ్రయః.
పురుషోఽండం వినిర్భిద్య యదాసౌ స వినిర్గతః,
ఆత్మనోఽయనమన్విచ్ఛన్నపోఽస్రాక్షీచ్ఛుచిశ్శుచీః.

యించారు. ఈశ్వర ప్రేరణచే గుణములందు క్షోభకలిగి రూపాంతరం పొందడంచేత ఆకాశాది పంచభూతాలూ శబ్దాదిపంచతన్మాత్రలూ ఇంద్రియాలూ అహంకార మహత్తత్త్వాలూ ఉత్పన్నమౌతున్నాయి. దీనినే సర్గమన్నారు. ఆ విరాట్పురుషునివల్ల జన్మించిన బ్రహ్మద్వారా జరిగే చరాచరరూపమైన సృష్టి నిర్మాణమే విసర్గమనబడుతుంది. నాశనమే లక్షణంగాగల సృష్టిని ఒకమర్యాదలో స్థిరంగా ఉంచడంలో సిద్ధించిన శ్రేష్ఠత్వాన్ని స్థానమన్నారు. తనచే రక్షింపబడే సృష్టిలో భక్తులయందు ఆభగవానునికి కలిగే కృపనే "పోషణ" అన్నారు. మన్వంతరాధిపతుల భగవద్భక్తీ ప్రజాపాలనరూపమైన ధర్మానుష్ఠానమూ "మన్వంతర" మనబడుతుంది. జన్మాంతరవాసనలుజీవులనుకర్మ బద్ధులుగా చేస్తూంటాయి. వానినే "ఊతి" శబ్దంతో నిర్వచించారు. అవతారచరిత్రలూ భక్తులకథలూ "ఈశానుకథా" అన్నారు. భగవంతుడు యోగనిద్రాపరవశుడైనప్పుడు జీవరాశి ఉపాధులతో ఆయనయందు లీనంకావటమే "నిరోధము". అజ్ఞానకల్పితములైన భోక్తృత్వాదులను త్యజించి పరమాత్మయందు ఆనందానుభూతి పొందుటే

తాన్వవాత్సీత్స్వసృష్టాసు సహస్రపరివత్సరాన్,
తేన నారాయణో నామ యదాపః పురుషోద్భవాః.
ద్రవ్యం కర్మ చ కాలశ్చ స్వభావో జీవ ఏవ చ,
యదనుగ్రహతస్సంతి న సంతి యదుపేక్షయా.
ఏకో నానాత్వమన్విచ్ఛన్ యోగతల్పాత్స ముత్థితః,
వీర్యం హిరణ్మయం దేహం మాయయా వ్యసృజత్త్రిధా.
అధిదైవ మథాధ్యాత్మ మధిభూ తమితి ప్రభుః,
యదేకం పౌరుషం వీర్యం త్రిధాఽభిద్యత తచ్ఛృణు.
అంతశ్శరీర ఆకాశా త్పురుషస్య విచేష్టతః,
ఓజస్సహోబలం జజ్ఞే తతః ప్రాణో మహానసుః.
అనుప్రాణంతి యం ప్రాణాః ప్రాణంతం సర్వజంతుషు,
అపానం తమపానంతి నరదేవమివానుగాః.

"ముక్తి" అనబడుతుంది. ఈప్రపంచం ఎవనియందు ఉత్పత్తి ప్రళయ రూపాలలో ప్రకాశిస్తుందో ఆపరబ్రహ్మమే "ఆశ్రయం". శాస్త్రములు పరబ్రహ్మానే పరమాత్మ అని అంటాయి. ఇంద్రియాభిమానీ ద్రష్టా ఐన జీవుడే ఇంద్రియాధిష్టాన దేవతలైన సూర్యాదిరూపాలలోఉంటాడు. నేత్రగోళాదులతో కూడిన దేహమే యీ రెండింటినీ వేరు చేస్తూఉంటుంది. ఈమూడింటిలో ఒకటి అభావమైతే మిగిలిన రెండూ ఉపలబ్ధంకావు. ఈమూడూ తెలిసినవాడే పరమాత్మ. ఆ పరమాత్మేఆశ్రయం. పరమాత్మకు వేరే ఆశ్రయంలేదు. ఆయనకాయనే ఆశ్రయం.

విరాట్పురుషుడు బ్రహ్మాండాన్ని భిన్నంచేసుకుని తాను ఉండడానికి ఉదకాన్ని నిర్మించాడు. విరాట్పురుషరూపమైన నరునిచే ఉత్పన్నం కావడంచేత ఉదకం "నార" అనబడింది. ఆనారమునందు శయనించడంవల్ల ఆయన నారాయణుడయాడు. నారాయణుని కృపచేతనే ద్రవ్య కాల స్వభావ జీవాదులకు సత్తా కలుగుతుంది. ఆనారాయణుడే యోగనిద్రనుండిలేచి అనేకత్వేచ్ఛతో అఖిలబ్రహ్మాండ బీజ రూపమైన తన సువర్ణవీర్యాన్ని ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతిక రూపాలతో మూడుభాగాలు చేశాడు. విరాట్పురుషునియందలి

ప్రాణేన క్షిపతా క్షుత్తృడంతరా జాయతే విభోః,
పిపాసతో జక్షతశ్చ ప్రాఙ్ముఖం నిరభిద్యత.
ముఖతస్తాలునిర్భిన్నం జిహ్వా తత్రోపజాయతే,
తతో నానారసో జజ్ఞే జిహ్వయా యోఽధిగమ్యతే.
వివక్షోర్ముఖతో భూమ్నో వహ్నిర్వాగ్వ్యాహృతం తయోః,
జలే వై తస్య సుచిరం నిరోధస్సమజాయత.
నాసికే నిరభిద్యేతాం దోధూయతి నభస్వతి,
తత్ర వాయుర్గంధవహో ఘ్రాణో నసి జిఘృక్షతః.
యదాత్మని నిరాలోక మాత్మానం చ దిదృక్షతః,
నిర్భిన్నే అక్షిణీ తస్య జ్యోతిశ్చక్షుర్గుణ గ్రహః.
బోధ్యమానస్య ఋషిభిరాత్మనస్తం జిఘృక్షతః,
కర్ణౌ చ నిరభిద్యేతాం దిశశ్శ్రోత్రం గుణగ్రహః.

ఆకాశంవల్ల ఇంద్రియబలం మనోబలం శరీరబలం పుట్టాయి. వానినుం వీటన్నిటికీ రాజైన ప్రాణం ఉత్పన్నమైయింది. రాజువెనుక సేవకుల వెడుతూన్నట్లే సమస్తశరీరాలలోనూ ప్రాణబలం ఉన్నప్పుడె ఇందిరియాలు బలవంతములౌతాయి. ప్రాణబలం తగ్గితే ఇందిరియ బలం కూడా తగ్గుతుంది. ప్రాణవాయువు వేగంగాచరిస్తూంటే విరాట్పురుషునకు ఆకలిదప్పికలు బయలుదేరతాయి. తినుట, త్రాగుట మొదలైన వాటియందు ఇచ్ఛ కలిగినప్పుడు విరాట్పురుషునియందు ముఖం ఆవిర్భవించింది. ముఖంనుండి తాలుభాగమూ తాలువునుండి రసనేంద్రియమూ రసాలూ ఆవిర్భవించాయి. ఆ విరాటునియందు మాట్లాడలనే వాంఛకలగడంతో వాగింద్రియమూ ఆ యింద్రియాధిష్ఠానదేవత అగ్ని దానికి మాట్లాడే శక్తీ జన్మించాయి. అనంతరం శ్వాస వేగంచేత నాసికాఛిద్రం వాసనచూడాలనే ఇచ్ఛకలగటంతో ఘ్రాణేంద్రియమూ అధిష్ఠానదేవతా గంధవ్యాప్తికికారణమైన వాయువూ ఆవిర్భవించాయి. చూడాలనే ఇచ్ఛతో నేత్రఛిద్రాలూ అధిష్ఠానదేవత సూర్యుడూ నేత్రేందిరియమూ ఉత్పన్నమయాయి. వాటివల్ల రూపగ్రహణ మారంభమైంది.

వస్తునో మృదుకాఠిన్యలఘుగుర్వోష్ణశీతతాం,
జిఘృక్షతస్త్వఙ్నిర్భిన్నా తస్యాం రోమమహీరుహాః.
తత్ర చాంతర్బహిర్వాతస్త్వచాలబ్ధగుణోవృతః,
హస్తౌ రురుహతుస్తస్య నానాకర్మ చికీర్షతః.
తయోస్తు బలవానింద్ర ఆదానముభయాశ్రయం,
గతింజిగమిషతః పాదౌ రురుహాతేభికామికాం.
పద్భ్యాం యజ్ఞస్స్వయం హవ్యం కర్మభిః క్రియతే నృభిః,
నిరభిద్యత శిశ్నో వై ప్రజానందామృతార్థినః.
ఉపస్థఆసీత్కామానాం ప్రియం తదుభయాశ్రయం,
ఉత్సిసృక్షోర్ధాతుమలం నిరభిద్యత వై గుదం.
తతః పాయుస్తతో మిత్ర ఉత్సర్గ ఉభయాశ్రయః,
ఆసిసృప్సోః పురః పుర్యా నాభిద్వారమపానతః.
తత్రాపాన స్తతో మృత్యుః పృథక్త్వ ముభయాశ్రయమ్,
ఆదిత్సో రన్నపానానా మాసన్కుక్ష్యంత్రనాడయః.

వేదరూపులైన ఋషులు విరాట్పురుషుని మేల్కొల్పడానికి ప్రారంభించినవెంటనే వినాలనే ఇచ్ఛా, దానితో చెవులూ శ్రవణేంద్రియాధిష్ఠానదేవతా దిక్కులూ శ్రవణేంద్రియమూ పుట్టాయి. వస్తువు యొక్క తత్త్వాన్ని గ్రహించాలనే వాంఛకలిగిన క్షణంలో త్వక్కు (చర్మము) జనించింది. దానియందు రోమములూ లోపలా బైటా విహరించేవాయువూ ఆవిర్భవించి త్వగింద్రియం సర్వశరీరవ్యాప్తమైంది. దానివల్ల స్పర్శజ్ఞానం కలిగింది. అనేకతరగతులకర్మలు చెయ్యాలనే యిచ్ఛతో హస్తాలూ అధిష్ఠానదేవతయైన ఇంద్రుడూ యీ రెండింటి యొక్క కర్మరూపమైన గ్రహణ సామర్థ్యం కలిగాయి. గమనేచ్ఛతో పాదములూ అధిష్ఠానదేవతారూపంలో విష్ణువూ వానికర్మరూపమైన గమనక్రియ జనించాయి. సంతానం రతితో సర్వభోగాలయందిచ్ఛ లింగోత్పత్తి ఉపస్థేంద్రియమూ అధిష్ఠాన మగు ప్రజాపతి యీ రెండింటికీ ఆశ్రయమైన కామసుఖం ఆవిర్భవించాయి. మలత్యాగేచ్ఛతో గుదద్వార పాయ్వింద్రియాధిష్ఠానదేవతా (మిత్ర) మలత్యాగక్రియా ఏర్పడ్డాయి. అపానద్వారంనుండి యీశరీరంవదలి మరొకశరీరాన్ని

నద్యస్సముద్రాశ్చ తయో స్తుష్టిః పుష్టిస్తదాశ్రయే,
నిదిధ్యాసోరాత్మమాయాం హృదయం నిరభిద్యత,
తతో మన శ్చంద్ర ఇతి సంకల్పః కామ ఏవ చ,
త్వక్చర్మమాంసరుధిరమేదోమజ్జాస్థిధాతవః,
భూమ్యప్తేజో మయాస్సప్త ప్రాణో వ్యోమాంబువాయుభిః.
గుణాత్మకానీంద్రియాణి భూతాదిప్రభవా గుణాః,
మనస్సర్వ వికారాత్మా బుద్ధిర్విజ్ఞానరూపిణీ.
ఏతద్భగవతో రూపం స్థూలం తే వ్యాహృతం మయా,
మహ్యాదిభిశ్చావరణైరష్టభిర్బహిరావృతం.
అతః పరం సూక్ష్మతమమవ్యక్తం నిర్విశేషణం,
అనాదిమధ్యనిధనం నిత్యం వాఙ్మనసః పరం.
అము ని భగవద్రూపే మయా తే హ్యనువర్ణితే,
ఉభే అపి నగృహ్ణంతి మాయాసృష్టే విపశ్చితః.
స వాచ్యవాచకతయా భగవాన్ బ్రహ్మరూపధృత్,

పొందాలనే వాంఛవల్ల నాభిద్వారం ఏర్పడింది. దానివల్ల అపానమూ మృత్యువూ జనించాయి. అన్న పానాదులు గ్రహించాలనే వాంఛవల్ల కుక్షీ ఆంత్రములూ నాడులూ ఉత్పన్నమయాయి. వానితో కూడ కుక్షికి అధిష్ఠాన దేవతగా సముద్రమూ నాడులకధిష్ఠాన దేవతలుగా నదులూ తుష్టీ పుష్టీ వీటికాశ్రయమైన విషయాలూ ఉత్పన్నమయాయి. మాయయందు విచారణ సాగించాలనే కోర్కెలు పుట్టడంతో హృదయం మనోరూపమైన ఇంద్రియంతో ఆవిర్భవించింది. అధిష్ఠాన దేవతయగు చంద్రుడూ కామసంకల్పాలూ జనించాయి. విరాట్పురుషుని శరీరమందు తేజో జల భూతములవల్ల త్వక్ చర్మ మాంస రుధిర మేదో మజ్జాస్థులూ ఆకాశ జల వాయువులనుండి ప్రాణాలూ ఉత్పన్నమయ్యాయి. శ్రోత్రాది ఇంద్రియాలు శబ్దాదివిషయాలను గ్రహిస్తాయి. విషయాలు అహంకారంనుండి జనిస్తాయి. మనస్సు సమస్తవికారాలకూ ఉత్పత్తిస్థానం. బుద్ధి పదార్థబోధ కలిగిస్తుంది. నీకు విరాట్పురుషుని స్థూలరూపం చెప్పాను. ఇదిపైనుండి పృథివ్యాపస్తేజోవాయురాకాశములూ అహంకార మహత్తత్త్వ ప్రకృ

నామరూప క్రియా ధత్తే సకర్మా కర్మకః పరః.
ప్రజాపతీన్ మనూన్ దేవానృషీన్ పితృగణాన్ పృథక్,
సిద్ధచారణగంధర్వా న్విద్యాధ్రా నసురగుహ్యకాన్.
కిన్నరాప్సరసో నాగాన్ సర్పాన్ కింపురుష పూరుషాన్,
మాతౄరక్షః పిశాచాంశ్చ ప్రేతభూతవినాయకాన్.
కూష్మాండోన్మాదవేతాళాన్ యాతుధానాన్ గ్రహానపి,
ఖగాన్మృగాన్ పశూన్ వృక్షాన్ గిరీన్నృపసరీసృపాన్.
ద్వివిధాశ్చతుర్విధా యేఽన్యేజలస్థలనభౌకసః,
కుశలాకుశలామిశ్రాః కర్మణాం గతయస్త్విమాః.
సత్త్వం రజస్తమ ఇతి తిస్రస్సురనృనారకాః,
తత్రాప్యేకైకశో రాజన్ భిద్యంతే గతయస్త్రిధా,
యదైకైకతరోఽన్యాభ్యాం స్వభావ ఉపహన్యతే.

తులూ అను ఎనిమిదింటిచేతనూ ఆవరింపబడి ఉంటుంది. దీనికి పరమైన భగవంతుని సూక్ష్మశరీరం అవ్యక్తమై నిర్విశేషమై ఆదిమధ్యాంతరహితమై నిత్యమై ఉంటుంది. అదిమనస్సుచేత ఊహించడానికి కానీ వాక్కుచేత చెప్పడానికికానీ అవకాశంలేని రూపమని వేదప్రమాణం.

స్థూల సూక్ష్మ వ్యక్త అవ్యక్తములైన ఈరెండురూపాలూ కూడా మాయాకల్పితములే కనుక విద్వాంసులీ రెండు రూపాలనూ గ్రహించరు. వాస్తవంచేత భగవానుడు క్రియారహితుడు. తనమాయా శక్తిచేతనే క్రియలుకలవాడౌతున్నాడు. ఆపరమాత్మ బ్రహ్మరూపమూ విరాట్పురుషరూపమూ ధరించి వాచ్య వాచక శబ్దార్థరూపాల్లో ప్రకటితమై అనేక నామరూపాలతో క్రియలనుస్వీకరిస్తాడు. ప్రజాపతులూ మనువులూ ఋషులూ పితృ సిద్ధ చారణ గంధర్వ విద్యాధర అసురయక్ష కిన్నర అప్సరలూ నాగసర్ప కింపురుష ఉరగులూ మాతృకలూ రాక్షస పిశాచ ప్రేత భూత వినాయక కూష్మాండ ఉన్మాద భేతాళ యాతుధానులూ గ్రహాలూ పక్షి మృగ పశు వృక్ష పర్వత సరీసృపాలూ అన్నీ భగవంతుని రూపాలే. ప్రపంచంలో చరాచర భేదంతో రెండు

స ఏవేదం జగద్ధాతా భగవాన్ ధర్మరూపధృత్,
పుష్ణాతిస్థాపయన్ విశ్వం తిర్యఙ్నరసురాదిభిః.
తతః కాలాగ్నిరుద్రాత్మాయత్సృష్టమిదమాత్మనః,
సన్నియచ్ఛతి తత్కాలేమనానీకమివానిలః,
ఇత్థంభావేన కథితో భగవాన్ భగవత్తమః,
నేత్థం భావేన హి పరం ద్రష్టుమర్హంతి సూరయః.
నాస్య కర్మణి జన్మాదౌ పరస్యాను విధీయతే,
కర్తృత్వప్రతిషేధార్థం మాయయారోపితం హితత్.
అయం తు బ్రహ్మణః కల్ప స్సవికల్ప ఉదాహృతః,
విధిస్సాధారణోయత్ర సర్గాః ప్రాకృతవైకృతాః.
పరిమాణంచ కాలస్యకల్పలక్షణవిగ్రహం,
యథాపురస్తాద్వ్యాఖ్యాస్యేపాద్మంకల్పమథోశృణు.

తరగతులనూ జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజ భేదంతో నాలుగు విధములుగానూ ఉండే జీవజాలమూ జలచర భూచర ఆకాశచారులైన ప్రాణికోటీ శుభాశుభ మిశ్రిత కర్మఫలంగా స్వరూపాలూ సత్వప్రధానంగా దేవతలూ రజోగుణ ప్రధానంగా మనుష్యులూ తమోగుణ ప్రధానంగా నరకవాసులూ పుడతారు. ఇందులో ఒక్కొక్క గుణం మిగిలిన వానితో కలసినప్పుడు ఒక్కొక్కటి మూడు మూడుగా పరిణమిస్తూ అనేకత్వసిద్ధి కలుగుతుంది. ఆ భగవానుడే విష్ణురూపంతో యీ విశ్వాన్ని పాలిస్తూ పోషిస్తూ లయకాలంలో ప్రళయరుద్ర రూపంతో యీవిశ్వాన్ని తనయందే లయింపచేసుకుంటూ ఉంటాడు.

మహాత్ములు అచింత్యైశ్వర్యంకల భగవంతుని యిలా వర్ణిస్తారు. తత్త్వజ్ఞానులుమాత్రం సృష్టి స్థితి లయకారుడుగా భగవంతునిధ్యానించి దర్శించారు. వారి సంసారాన్ని అతిక్రమించినవారు. సంసారరచనాదులు భగవంతునియందున్నా మహాత్ములదృష్టిలో ప్రపంచంకంటె పరమైన వాడు భగవానుడు. ఆయనయందు కర్తృత్వభోక్తృత్వాదులు లేవు. కల్ప కల్పాంతరాలలో సృష్టిక్రమమంతా ఒకేరీతిగా జరుగుతూ ఉంటుంది. ఇందులో నూతనవిధానం లేదు. మహాకల్పారంభంలో ప్రకృతి నుండి

యథాసాభగవాక సూతక్షత్తాభాగవతోత్తమః,
చచారతీర్థానిభువస్త్యక్త్వాబంధూన్ సుదుస్త్యజాన్.
కుత్రకౌషారవేస్తస్యసంవాదోఽధ్యాత్మ సంశ్రితః,
యుద్వానభగవాంస్తస్మైపృష్టస్తత్త్వమువాచహ.
బ్రూహినస్తదిదంసౌ మ్యవిదురస్యవిచేష్టితమ్,
బంధుత్యాగనిమిత్తంచయథైవాగతవాన్ పునః.
రాజ్ఞాపరీక్షితాపృష్టోయదవోచన్మహామునిః,
తద్వోఽభిధాస్యేశృణుతరాజ ప్రశ్నానుసారతః.

క్రమంగా మహత్తత్త్వాదులు ఉత్పన్నమౌతాయి. కల్పారంభాలలో ప్రాకృతసృష్టి ఒకేరీతిగా జరుగుతూ ఉంటుంది. చరాచరరూపమైన వైకృతసృష్టిమాత్రం నూతనరూపంగా జరుగుతుంది. కాల పరిమాణం కల్పం మన్వంతరాలూ ముందు ముందు చెపుతాను. ఇప్పుడు పద్మ కల్పంయొక్క వర్ణన చేస్తాను. సావధానంగా విను - అన్నాడు.

సూతా! విదురుడు కుటుంబాన్ని వదలి తీర్థయాత్రలకు వెళ్ళా డనిచెప్పావు. ఆయాత్రాకాలంలో విదురునకు మైత్రేయుని దర్శనం అవడం మైత్రేయునివల్ల విదురుడాత్మజ్ఞానం ఆర్జించడం జరిగిందని చెప్పావు. విదుర మైత్రేయ సంవాదరూపమైన ఆధ్యాత్మవిద్యతో విదురుని చరిత్ర పూర్ణంగా వివరించు అని కోరగా శుకుడు పరీక్షిత్తుకు చెప్పిన విషయమే బోధిస్తానని ముందుకు సాగుతున్నాడు. - సూత మహర్షి.

వేదవ్యాస మహర్షి ప్రోక్తమైన మహాభాగవతానికి
ఆంధ్ర వ్యాఖ్యానాను వాదంతో ద్వితీయస్కంధము.



# శ్రీమద్భాగవతం

## తృతీయస్కంధము



ఏవమేతత్పురాపృష్టో మైత్రేయో భగవాన్ కిల,
క్షత్త్రా వనం ప్రవిష్టేన త్యక్త్వా స్వగృహ మృద్ధిమత్.
యద్వా అయం మంత్రకృద్వో భగవానఖిలేశ్వరః,
పౌరవేంద్రగృహం హిత్వా ప్రవివేశాత్మసాత్కృతమ్.
కుత్రక్షత్తు ర్భగవతా మైత్రేయేణాససంగమః,
కదా వా సహసంవాదః ఏతద్వర్ణయనః ప్రభో.
నహ్యల్పార్థోదయస్తస్య విదురస్యామలాత్మనః,
తస్మిన్వరీయసి ప్రశ్నస్సాధువాదోపబృంహితః.
సఏవమృషివర్యోఽథ రాజ్ఞా పృష్టః పరీక్షితా,
ప్రత్యాహతం స బహువిత్ప్రీతాత్మా శ్రూయతామితి.
యదాతు రాజా స్వసుతానసాధూన్ పుష్ణన్నధర్మేణవినష్టదృష్టిః,
భ్రాతుర్యవిష్ఠస్య సుతాన్విబంధూ న్ప్రవేశ్య లాక్షాభవనే దదాహ.

శ్రీకృష్ణుడు ఉపప్లావ్యంనుంచి హాస్తినాపురం రాయబారిగా వెళ్ళినప్పుడు దుర్యోధనుని ఆతిథ్యం తోసిపుచ్చి మహాభాగవతశిరోమణియైన విదురుని ఇంటికి ఆహ్వానం లేకుండానే వెళ్ళి ఆతిథ్యం స్వీకరించాడు. అటువంటి శుద్ధహృదయుడైన విదురుడు సుఖసమృద్ధమైన గృహంవదలి అరణ్యానికివెళ్ళి మహామతియైన మైత్రేయుని దర్శించి యేమిఅడిగాడో అడిగినదే నువ్వునన్నుఅడిగావు. దానికి సమాధానం కొంతచెప్పాను. మిగిలినది విను అన్నాడు శుకుడు. శుకయోగీంద్రా! విదురమైత్రేయులకు సమాగమం ఎలాకలిగింది, వారు ఏసమయంలో యెక్కడ కలుసుకున్నారు. మహామతి విదురుడు సామాన్యప్రశ్నలు అడుగడుగదా? మైత్రేయుడు కూడా సామాన్యులకు కనుపించడే! సామాన్యవిషయాలు బోధించడే! మహత్తరమయిన విషయమే చెప్పి

యదా సభాయాం కురుదేవదేవ్యాః కేశాభిమర్శం సుతకర్మగర్హ్యమ్,
న వారయామాస నృపస్స్నుషాయాః స్వాస్రైర్హ రంత్యాః కుచకుంకుమాని.
ద్యూతేత్వధర్మేణ జితస్య సాధోస్సత్యావలంబస్య వనాగతస్య,
నయాచతోఽదాత్సమయే నదాయం తమోజుషాణో యదజాతశత్రోః.
యదా చ పార్థ ప్రహిత స్సభాయాం జగద్గురుర్యాని జగాద కృష్ణః,
న తాని పుంసామమృతాయనాని రాజోరుమేనే క్షతపుణ్యలేశః.
యదోపహూతో భవనం ప్రవిష్టో మంత్రాయ పృష్టః కిల పూర్వజేన,
అథాహతం మంత్ర దృశాం వరీయాన్ యన్మంత్రిణో వైదురికం వదంతి.
అజాతశత్రోః ప్రతియచ్ఛదాయంతి తీక్షతో దుర్విషహం తవాగః,
సహానుజోయత్రవృకోదరాహిః శ్వసన్రుషాయత్త్వమలంబిభేషి.
పార్థాంస్తుదేవోభగవాన్ముకుందోగృహీతవాన్ సః క్షితిదేవదేవః,
ఆస్తే స్వపుర్యాం యదుదేవదేవో వినిర్జితాశేషనృదేవదేవః.
సఏషదోషః పురుషద్విడాస్తే గృహాన్ ప్రవిష్టోఽయమపత్యమత్యా,
పుష్ణాసి కృష్ణాద్విముఖోగతశ్రీస్త్యజాశ్వశైవం కులకౌశలాయ.
ఇత్యూచివాంస్తత్ర సుయోధనేన ప్రవృద్ధకోపస్ఫురితాధరేణ,
అసత్కృతస్సత్స్పృహణీయశీలః క్షత్తా సకర్ణానుజసౌబలేన.
కఏనమత్రోపజుహావ జింహ్మం దాస్యాస్సుతం యద్బలినైవ పుష్టః,
తస్మిన్ ప్రతీపః పరకృత్యఆస్తే నిర్వాస్యతామాశు పురాచ్ఛ్వసానః.
సఇత్థమత్యుల్బణకర్ణబాణైర్భ్రాతుః పురో మర్మసు తాడితోఽపి,
స్వయం ధనుర్ద్వారి నిధాయ మాయాం గతవ్యథోఽయాదురుమానయానః.

ఉంటాడు. కనుక మోక్షసాధనమైన విదురమైత్రేయ సంవాదం వినుపించు అనగా శ్రీశుకుడు చెప్పడం ఆరంభించాడు.

పరీక్షిన్మహారాజా! ధృతరాష్ట్రమహారాజు అన్యాయంగా దుర్యోధనాదులయందుడే పుత్రప్రేమ చేత ధర్మరాజాదులను అనేక రీతులుగా బాధించాడు లాక్షాగృహదహనం, దుష్టద్యూతం, ద్రౌపదీ పరాభవం, ఆదిగాగల అనేక క్లేశాలు కలిగించి అరణ్య అజ్ఞాత వాసాదులు పూర్తిచేసినతరువాత కూడా రాజ్యమివ్వక బాధిస్తూంటే శ్రీకృష్ణుడే స్వయంగా రాయబారిగా వచ్చినపుడు, పరశురామాది మహర్షులూ, కృష్ణుడూ యెంత హితబోధ చేసినా వినక కృష్ణునే బంధించడానికి ప్రయత్నించాడు. శ్రీకృష్ణుని నిందించడంవల్ల కౌరవుల పుణ్య

సనిర్గతః కౌరవపుణ్యలబ్ధో గజాహ్వయాత్తీర్థపదః పదాని,
అన్వాక్రమత్పుణ్యచికీర్షయోర్వ్యామధిష్ఠితో యాని సహస్రమూర్తిః.
పురేషు పుణ్యోపవనాద్రి కుంజేష్వపంకతోయేషు సరిత్సరస్సు,
అనంతలింగైస్సమలంకృతేషు చచార తీర్థాయతనేష్వనన్యః.
గాం పర్యటన్ మేధ్యవివిక్తవృత్తిస్సదా ప్లుతోఽధశ్శయనోఽవధూతః,
అలక్షితస్స్వైరవధూతవేషో వ్రతాని చేరే హరితోషణాని.
ఇత్థం వ్రజన్భారతమేవ వర్షం కాలేన యావద్గతవాన్ ప్రభాసమ్.
తావచ్ఛశాస క్షితిమేక చక్రామేకాతపత్రామజితేన పార్థః.
తత్రైవ శుశ్రావ సుహృద్వినష్టిం వనం యథా వేణుజవహ్నిసంశ్రయమ్,
సంస్పర్ధయా దగ్ధమథానుశోచన్ సరస్వతీం ప్రత్యగియాయ తూష్ణీమ్.
తస్యాం త్రితస్యోశనసో మనోశ్చ పృథోరథాగ్నేరసితస్య వాయోః,
తీర్థం సుదాసస్య గవాం గుహస్య యచ్ఛ్రాద్ధదేవస్య స ఆసిషేవే.
అన్యాని చైవ ద్విజదేవ దేవైః కృతాని నానాయతనాని విష్ణోః,
ప్రత్యంగముఖ్యాంకితమందిరాణి యద్దర్శనాత్కృష్ణమనుస్మరంతి.
తతస్త్వతివ్రజ్యసురాష్ట్రమృద్ధం సౌవీరమత్స్యాన్ కురుజాంగలాంశ్చ,
కాలేన తావద్యమునాముపేత్య తత్రోద్ధవం భాగవతం దదర్శ.
స వాసుదేవానుచరం ప్రశాంతం బృహస్పతేః ప్రాక్తనయం ప్రతీతమ్,
ఆలింగ్య గాఢం ప్రణయేన భద్రం స్వానామపృచ్ఛద్భగవత్ప్రజానామ్.
కచ్చిత్పురాణౌ పురుషౌ స్వనాభ్య పాద్మానువృత్త్యేహకిలావతీర్ణౌ,
ఆసాత ఉర్వ్యాః కుశలం విధాయకృత క్షణౌ కుశలం శూరగేహే.

లేశం నశించిపోయింది. కృష్ణుడు తిరిగివెళ్లిపోయాడు. ధృతరాష్ట్రుడు విదురుని పిలిచి సమాలోచనసాగించడంలో విదురుడు కౌరవుల అన్యాయాన్ని పూర్తిగా ఖండించాడు. పాండవుల ధర్మగుణం కౌరవుల దౌర్మార్గ్యం నిశితంగా విమర్శించాడు. కర్ణ శకుని దుర్యోధనాదులు విదురుని నిందించి ఆఖరికి సంహరించాలనే ప్రయత్నంకూడా చేసి దుర్భాషలు పలికారు. సత్త్వగుణప్రధానుడయిన విదురుడు ఇదంతా మాయాకల్పితమయినదిగా భావించి ధనస్సును సింహద్వారమున దుంచి అరణ్యానికిపోయి తీర్థయాత్రలు ఆరంభించాడు. అనేక పుణ్యక్షేత్రాలు సేవిస్తూ దేవతామూర్తులను దర్శిస్తూ నగరాలూ, పర్వతాలూ, చూస్తూ నదనదీసముద్రాలను సేవించుకుంటూ ఏకైకంగా

కచ్చిత్కురూణాం పరమస్సుహృన్నోభావస్స ఆస్తే సుఖమంగ శౌరిః,
యో వై స్వస్రూణాం పితృవద్దదాతి వరాన్ వదాన్యోవర తర్పణేన.
కచ్చిద్వరూథాధిపతిర్యదూనాం ప్రద్యుమ్న ఆస్తే సుఖమంగవీరః.
యం రుక్మిణీభగవత్తోఽభిలేభఆరాధ్య విప్రాన్ స్మరమాదిసర్గే.
కచ్చిత్సుఖంసా త్వతవృష్ణిభోజదశార్హకాణామధిపస్స ఆస్తే,
యమభ్యషించచ్ఛతపత్రనేత్రో నృపాసనాశాం పరిహృత్యదూరాత్.
కచ్చిద్ధరేస్సౌమ్య సుతాస్సదృక్ష ఆస్తేఽగ్రణీ రథినాం సాధుసాంబః,
అసూత యం జాంబవతీవ్రతాఢ్యా దేవం గుహం యోఽంబికయా ధృతోఽగ్రే.
క్షేమం స కచ్చిద్యుయుధాన ఆస్తే యః ఫల్గునా ల్లబ్ధధనూరహస్యః,
లేభేఽంజసాఽ ధోక్షజసేవయైవ గతిం తదీయాం యదుభిర్దురాపాం.
కచ్చిద్బుధస్స్వస్త్యనమీవఆస్తే శ్వఫల్గుపుత్రో భగవత్ప్రపన్నః,
యః కృష్ణపాదాంకితమార్గ పాంసుష్వచేష్టత ప్రేమవిభిన్నధైర్యః.
కచ్చిచ్ఛివం దేవకభోజపుత్ర్యా విష్ణుప్రజాయా ఇవ దేవమాతుః,
యావై స్వగర్భేణ బభార దేవం త్రయీ యథా యజ్ఞవితానమర్థం.
అపి స్విదాస్తే భగవాన్ సుఖం వో యస్సాత్వతాం కామదుఘోఽనిరుద్ధః,
యమామనంతి స్మహి శబ్దయోనిం మనోమయం స త్వతురీయ తత్త్వం.
అపిస్విదన్యేచ నిజాత్మదైవమనన్యవృత్త్యా స మనువ్రతాయే,
హృదీకసత్యాత్మజచారుదేష్ణగదాదయస్స్వస్తి చరంతి సౌమ్య.
అపి స్వదోర్భ్యాం విజయాచ్యుతాభ్యాం ధర్మేణ ధర్మః పరిపాతి సేతుమ్,
దుర్యోధనోఽతప్యత యత్సభాయాం సామ్రాజ్యలక్ష్మ్యా విజయానువృత్త్యా.

చరించసాగాడు. అవధూతవేషంలో, తన సెవరూ గుర్తించడానికిల్లే కుండా, సంచరిస్తూ పరిపూర్ణమైన విరాగంతో శుద్ధహృదయుడై దేహ ధారణార్థం స్వాతికాహారం తీసుకుంటూ నియమవ్రతుడై భగవధ్యానం చేసుకుంటున్నాడు.

విదురుడు ప్రభాసక్షేత్రం చేరేసమయానికి శ్రీకృష్ణసహాయం వల్ల ధర్మరాజు కౌరవులను జయించి భూమండలానికి యేకచ్ఛత్రాధి పత్యం వహించాడనీ కౌరవులంతా నశించిపోయారనీ విని శోకసంతప్త హృదయంతో సరస్వతీనదీతీరంచేరి అక్కడ త్రిత, ఉశన, మను, పృథు, అగ్ని, అసిత, వాయు, సుదాస, గో, గుహ, తీర్థాలేకాక శ్రాద్ధదేవుని నామంతో ఉన్నపన్నెండుతీర్థాలు సేవించాడు. బ్రాహ్మణులచేతనూ

కిం వా కృతాఘేష్వఘమత్యమర్షీ భీమోఽహివద్దీర్ఘతమం వ్యముంచత్,
యస్యాంఘ్రిపాతం రణభూర్న సేహే మార్గం గదాయశ్చరతో విచిత్రమ్.
కచ్చిద్యశోధా రథయూథపానాం గాండీవధన్వోపరతారిరాస్తే,
అలక్షితో యచ్ఛరకూటగూఢో మాయా కిరాతో గిరిశస్తుతోష.
యమావుత స్విత్ స్తనయౌ పృథాయాః పార్థైర్వృతౌ పక్ష్మభిరక్షిణీవ,
రేమాత ఉద్దాయ్య మృధే స్వరిక్థం సుధాం సుపర్ణా వివ వజ్రివక్త్రాత్.
అహో పృథాపి ధ్రియతేఽర్భ కార్థే రాజర్షివర్యేణ వినాపి తేన,
యస్త్వేకవీరోఽధిరథో విజిగ్యే ధనుర్ద్వితీయః కకుభశ్చతస్రః.
సౌమ్యానుశోచే తమధః పతంతం భ్రాత్రే పరేతాయ విదుద్రుహే యః,
నిర్యాపితో యేన సుహృత్స్వపుర్యా అహం స్వపుత్రాన్ సమనువ్రతేన.
సోఽహం హరేర్మర్త్యవిడంబనేన దృశో నృణాం చాలయతో విధాతుః,
నాన్యోపలక్ష్యః పదవీం ప్రసాదాచ్చరామి పశ్యన్ గతవిస్మయోఽత్ర.
నూనం నృపాణాం త్రిమదోత్పథానాం మహీం ముహుశ్చాలయతాం చమూభిః,
వధాత్ప్రపన్నార్తిజిహీర్షయేశోఽప్యుపైక్షతాఘం భగవాన్ కురూణామ్.
అజస్య జన్మోత్పథనాశనాయ కర్మాణ్యకర్తుర్గ్రహణాయ పుంసాం,
నన్వన్యథా కోఽర్హతి దేహయోగం పరోఽగుణానాముత కర్మతంత్రమ్.
తస్య ప్రపన్నాఖిలలోకపానామవస్థితానామనుశాసనే స్వే,
అర్థాయ జాతస్య యదుష్వజస్య వార్తాం సఖీ కీర్తయతీర్థకీర్తేః.

దేవతలచేతనూ, ప్రతిష్ఠింపబడ్డ అనేక దేవతామూర్తులను దర్శించి చక్రచిహ్నాంకితమైన పర్వతశిఖరాదులు దర్శిస్తూ శ్రీకృష్ణుని స్మరించుకుంటూ క్రమంగా సౌరాష్ట్ర సౌవీర మత్స్య కురు జాంగలదేశాలు చూచి కొలదిరోజులలో యమునాతీరంచేరి మహాభక్తుడు బృహస్పతి శిష్యుడూ అయిన ఉద్ధవునిచూచి పరమప్రేమతో గాఢాలింగనంచేసుకుని శ్రీకృష్ణుడు కుశలంగా ఉన్నాడా? యాదవులంతా క్షేమంగా ఉన్నారా? అని వరుసగా అందరియోగక్షేమాలూ అడుగుతూ క్రమంగా ధర్మజ, భీమార్జున, నకుల, సహదేవ, ద్రౌపదీ సుభద్ర కుంతి మొదలయినవారి యోగక్షేమాలుగూడా ప్రశ్నిస్తూ జన్మకర్మరహితుడయిన శ్రీకృష్ణుని పవిత్రగాథనుకూడా వినుపించమని అడిగాడు.

## 1 అధ్యాయం

ఇతి భాగవతః పృష్టః క్షత్త్రా వార్తాం ప్రియాశ్రయామ్,
ప్రతివక్తుం నచోత్సేహ ఔత్కంఠ్యాత్ స్మారితేశ్వరః,
యః పంచహాయనో మాత్రా ప్రాతరాశాయ యాచితః,
తన్నైచ్ఛద్రచయన్ యస్య సపర్యాం బాలలీలయా.
స కథం సేవయా తస్య కాలేన జరసంగతః,
పృష్టో వార్తాం ప్రతిబ్రూయాద్భర్తుః పాదావనుస్మరన్.
సముహూర్తమభూత్తూష్ణీం కృష్ణాంఘ్రిసుధయా భృశమ్,
తీవ్రేణ భక్తియోగేన నిమగ్నస్సాధునిర్వృతః.
పులకోద్భిన్నసర్వాంగో ముంచన్మీలద్దృశా శుచః,
పూర్ణార్థో లక్షితస్తేన స్నేహప్రసరసంప్లుతః.
శనకైర్భగవల్లోకా న్నృలోకం పునరాగతః,
విమృజ్య నేత్రే విదురం ప్రత్యాహోద్ధవ ఉత్స్మయన్.
కృష్ణద్యుమణి నిమ్లోచే గీర్ణేష్వజగరేణ హ,
కిన్నునఃకుశలం బ్రూయాం గతశ్రీషు గృహేష్వహమ్.
దుర్భగో బత లోకోఽయం యదవో నితరామపి,
యే సంవసంతో న విదుర్హరిం మీనా ఇవోడుపమ్.

ఉద్ధవునికి శ్రీకృష్ణుని స్మరణకలిగి, ఆమూర్తినే, మనసాధ్యానిస్తూ దేహానికి గగుర్పాటూ, కంఠంలో గాద్గద్యం ఏర్పడి, ఆనందాబాష్పాల వల్ల నోటమాటరాక కొంతవరకూ అలాగే ఉండిపోయి రెండుగడియలకు తెప్పరిల్లి విదురునికి చెప్పడం ఆరంభించాడు.

విదురా! శ్రీకృష్ణరూపమైన సూర్యుడస్తమించడంచేత మాగృహాలను కొండచిలువ మ్రింగివేసింది. ఇప్పుడు నేను నీకు కుశలవార్తలేమి చెప్పను? ఈమనుష్యలోకమంతా అభాగ్యమైపోయింది. సముద్రంలో ఉండే మీనాలే అమయుడైన చంద్రునిగ్రహించలేనట్లు యాదవులు నిరంతరం శ్రీకృష్ణునితో ఉండికూడా కృష్ణస్వరూపం గ్రహించలేక పూర్ణంగా అభాగ్యులైపోయారు. మిగిలినవారు ఆ అకారణకలహానికి కాలుదువ్వి నిందించిన శిశుపాలాదుల వాక్యాలయందు మహానుభావుల విజ్ఞాన బుద్ధిమాత్రం భ్రమించలేదు. తపస్సుచెయ్యనివారికికూడా యింతవరకూ దర్శనమిచ్చి, వారికి తృప్తికలుగకుండానే అంతర్ధానమై

ఇంగితజ్ఞాః పురుప్రౌఢా ఏకారామాశ్చ సాత్వతాః,
సాత్వతా మృషభంసర్వే భూతావాసమమంసత.
దేవస్య మాయయా స్పృష్టా యేచాన్యేహ్యసదాశ్రితాః,
భ్రామ్యతేధీర్నతద్వాక్యైరాత్మన్యుప్తాత్మనో హరౌ.
ప్రదర్శ్యాతప్త తపసామవితృప్తదృశాం నృణామ్,
ఆదాయాంతరధాద్యస్తు స్వబింబం లోకలోచనమ్.

యన్మర్త్యలీలౌపయికం స్వయోగమాయా బలం దర్శయతా గృహీతమ్,
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః పరం పదం భూషణభూషణాంగమ్.
యద్ధర్మసూనో ర్బత రాజసూయే నిరీక్ష్య దృక్స్వస్త్యయనం త్రిలోకః,
కార్త్స్న్యేన చాద్యేహగతం విధాతురర్వాక్సృతౌ కౌశలమిత్యమన్యత.
యస్యానురాగప్లుతహాస రాసలీలావలోక ప్రతిలబ్ధమానాః,
వ్రజస్త్రియో దృగ్భిరను ప్రవృత్తధియోఽవతస్థుఃకిలకృత్యశేషాః.
స్వశాంతరూపేష్వితరైస్స్వరూపై రభ్యర్ద్యమానేష్వనుకంపితాత్మా,
పరావరేశో మహదంశయుక్తోహ్యజోఽపి జాతో భగవాన్ యథాగ్నిః.

పోయాడు. శ్రీహరి తన యోగ మాయాప్రభావం చేత త్రిభువనమోహనుడై అవతరించి తనరూపం తనకే ఆశ్చర్యం కలిగేలాగ తానుధరించిన భూషణములు తన దేహకాంతిచే భాసించేటట్లు అపూర్వమైన శ్రీవిగ్రహరూపంలో నటించాడు. ధర్మరాజు రాజసూయయాగం చేసినప్పుడు నయనాభిరాముడై శ్రీకృష్ణునిచూచి అక్కడున్న మానవులందరూ జగన్నిర్మాణంలో యీకృష్ణవిగ్రహాన్ని చిత్రించడంవల్లనే చతుర్ముఖుని సామర్థ్యం పూర్ణంగా వ్యక్తమైందనుకున్నారు. భగవానుని హాస్యమయ విలోకన మాత్రంచేత గోపికలదృష్టి మనస్సూ ఆయనయందే లగ్నమయ్యేవి! ఆస్థితిలో గోపికలు గృహకృత్యాలు విడచి చిత్రప్రతిమలవలె నిలచిపోయేవారు. చరాచరనాథుడూ, ప్రకృతికి స్వామీ, ఐన [illegible]డు మహాత్ములకు శాంతరూపంలోనూ రాక్షసులకు ఘోరరూపంలోనూ కనుపిస్తూంటే నిగ్రహానుగ్రహరూపమైన ఆలీలలు, వారి హృదయాలను ద్రవింపజేస్తూండేవి. జననాదిశూన్యుడైకూడా కర్రలో అగ్నివలెనే, బలరామునితోకూడా వసుదేవునింట అవతరించడం, [illegible] అభయమిచ్చేవాడైనా! కంసాదులభయంచేత వ్రజమండలిలో

మాం ఖేదయత్యేతదజస్య జన్మవిడంబనం యద్వసు దేవగేహే,
వ్రజే చ వాసోఽరిభయాదివ స్వయం పురాద్వ్యవాత్సీద్యదనంతవీర్యః.
దునోతి చేతస్స్మరతో మమైతద్యదాహ పాదావభివంద్య పిత్రోః,
తాతాంబ కంసాదురుశంకితానాం ప్రసీదతాం నో కృతనిష్కృతీనామ్.
కోవా అముష్యాంఘ్రిసరోజరేణుం విస్మర్తుమీశేత పుమాన్విజిఘ్రన్,
యో విస్ఫురద్భ్రూవిటపేన భూమేర్భారం కృతాంతేన తిరశ్చకార.
దృష్టా భవద్భిర్నను రాజసూయే చైద్యస్యకృష్ణాద్విషతోపి సిద్ధిః,
యాం యోగినస్సంస్పృహయంతి సమ్యగ్యోగేన కస్తద్విరహం సహేత.
తదైవచాన్యే నరలోకపాలాయ ఆహవే కృష్ణముఖారవిందమ్,
నేత్రైః పిబంతో నయనాభిరామం పార్థాస్త్రపూతాః పదమాపురస్య.
స్వయం త్వసామ్యాతిశయస్త్ర్యధీశస్స్వారాజ్యలక్ష్మ్యాప్తసమస్తకామః.
బలిం హరద్భిశ్చిరలోకపాలైః కిరీటకోట్యేడితపాదపీఠః.
తత్తస్య కైంకర్యమలం భృతాన్నో విగ్లాపయత్యంగ యదుగ్రసేనే,
తిష్ఠన్నిషణ్ణం పరమేష్ఠి ధిష్ణ్యేన్యబోధయద్దేవ నిధారయేతి.

ఉండటం అనంతపరాక్రముడై కూడా కాలయవనునికి భయంచెందిన వానివలె మధురానగరాన్ని విడిచి పారిపోవడం తలచుకుంటే నేను చిత్రప్రతిమనైపోతున్నాను. శ్రీకృష్ణుడు దేవకీవసుదేవులను దర్శించి సాష్టాంగనమస్కారం చేసి మాతాపితరులారా! కంసునిభయం వల్ల మిమ్ములను సేవించలేకపోయినందులకు క్షమించమన్న శ్రీకృష్ణుని వాక్యం, జ్ఞాపకంవస్తే. హృదయంబాధపడుతున్నది. భ్రుకుటీవిలాస మాత్రంచేత సమస్తభూభారాన్నీ హరించే కృష్ణచరణారవిందధ్యానం అలవడ్డ యేపురుషుడూ శ్రీహరిని మరచిపోలేడు, రాజసూయాధ్వర కాలంలో శ్రీకృష్ణుని ద్వేషంచే నిందించిన శిశుపాలునకు కలిగిన గతి కూడా పరమయోగి దుర్లభమైనదని మీరంతాఎరుగుదురు. శిశుపాలుని వలెనే మహాభారతయుద్ధంలో శ్రీకృష్ణునిచూస్తూ అర్జునునిబాణాగ్ని జ్వాలలకాహుతియైన వీరులెందరూ, పరమపదాన్నే పొందారు. శ్రీకృష్ణుడే సర్వలోకాలకూ అధిపతి. ఆయనతో సమానుడింకొకడు లేడు. ఇంద్రాదిదేవతలుకూడా శిరస్సులువంచి నమస్కరిస్తూంటారు. అలాంటిసర్వేశ్వరుడు వాసుదేవుడు. ఉగ్రసేనమహారాజు సింహాసనా

అహోబకీయం స్తనకాలకూటంజిఘాంసయాపాయయదప్యసాధ్వీ,
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోన్యంకం వాదయాళుం శరణం భజేమ.
మన్యేసురాన్ భాగవతాంస్త్ర్యధీశేసంరంభమార్గాభినివిష్టచిత్తాన్,
యే సంయుగేఒచక్షత తార్క్ష్యపుత్రమంసే సునాభాయుధమాపతంతమ్.
వసుదేవస్య దేవక్యాం జాతో భోజేంద్రబంధనే,
చికీర్షుర్భగవానస్యాశ్శమజే నాభియాచితః.
తతో నందవ్రజమితః పిత్రాకంసాద్విబిభ్యతా,
ఏకాదశ సమాస్తత్ర గూఢార్చిస్సబలోఒవసత్.
పరితోవత్సపైర్వత్సాంశ్చారయన్ వ్యహరద్విభుః,
యమునోపవనే కూజద్ద్విజసంకులితాంఘ్రిపే.
కౌమారీం దర్శయం శ్చేష్టాం ప్రేక్షణీయాం వ్రజౌకసామ్,
రుదన్నివ హసన్ముగ్ధబాలసింహావలోకనః.
సఏవాధివయో లక్ష్మ్యా నికేతం సితగోవృషమ్,
చారయన్నను గాన్గోపాన్రణ ద్వేణురరీరమత్.
ప్రయుక్తాన్ భోజరాజేన మాయినః కామరూపిణః,
లీలయా వ్యనుదత్తాంస్తాన్ బాలః క్రీడనకానివ.

సీనుపై ఉన్నప్పుడు యెదుట నిలచి మహారాజా! మాప్రార్థనవినండి. అనిపలుకుతూ సేవాభావాన్ని ప్రకటించే చర్య స్మృతిపథంలో పడితే నావంటి సేవకులహృదయాలు వ్యథనుపొందుతూంటాయి. పూతిన స్తనములకు విషంపూసుకుని కృష్ణుని సంహరించాలనివచ్చి కృష్ణసందర్శనంవల్ల పరమపదాన్ని పొందిందంటే శ్రీకృష్ణుని శరణాగతుడైనవ్వాడు ఆపురుషుని అనుగ్రహాన్ని పొందడు ? యుద్ధరంగలో గరుడవాహనారూఢుడైన చక్రధారినిచూడడంవల్ల రాక్షసులుగూడా నాదృష్టిలో భక్తులుగా నేతోస్తున్నారు.

బ్రహ్మాదులప్రార్థనమీద కంసునికారాగారంలో దేవకీవసుదేవుల తపఃఫలంగా అవతరించి నందగృహంచేరి పదకొండుసంవత్సరాలవయస్సు వచ్చేవరకూ గోకులవాసులకు వినా తనసంగతి యెవరికీ తెలియకుండా ఉండిపోయ్యాడు. యమునాతీరంలో దివ్యవనాంతరాలలో గోవులను మేపుతూ గో, గోపికలను ముగ్ధులనుచేస్తూ లీలామయశరీరుడై నటించాడు,

విపన్నాన్విషతోయేన నిగృహ్య భుజగాధిపమ్,
ఉత్థాప్యాపాయయద్గావ స్తత్తోయం ప్రకృతిస్థితమ్.
అయాజయద్గోసవేన గోపరాజం ద్విజోత్తమైః,
విత్తస్య చోరుభారస్య చికీర్షన్సద్వ్యయం ప్రభుః.
వర్షతీంద్రే వ్రజః కోపాద్భగ్నమానేఽతివిహ్వలః,
గోత్రలీలాతపత్రేణ త్రాతో భద్రానుగృహ్ణతా.
శరచ్ఛశికరైర్మృష్టం మానయన్ రజనీముఖమ్,
గాయన్ కలపదం రేమే స్త్రీణాం మండలమండనః.

లీలాగృహీతశరీరుడైన శ్రీకృష్ణుని గ్రహించలేక జననమరణశూన్యుడైన ఆవాసుదేవుని సంహరించాలని కామరూపులైన అనేక రాక్షసులను పంపితే బాలరూపంలో ఉన్న శ్రీహరి ఆటబొమ్మలను భిన్నం చేసినట్లు వారి సంహర్ని రూపుమాపాడు. కాళీయుని మర్దించి విషజల పానంచే మరణించిన గోవులనూ, గోపాలురనూ, జీవింపజేసి కాళీయునిచే విషపూరితం చేయబడ్డ జలాన్ని పానయోగ్యంగా చేశాడు. నందగోకులంలో వృద్ధిచెందిన ధనం సద్వ్యయం చేయించుటకు గోవర్ధనపర్వతానికీ గోవులకూ పూజ చేయించి గోయజ్ఞరూపంగా సద్వ్యయం చేయించాడు. దీనివల్ల తన అభిమానం భంగమైందని ఇంద్రుడు కోపగించి రాళ్లవాన కురిపిస్తే ఛత్రింవలె గోవర్ధనపర్వతం ఎత్తి గో గోపగణాలను రక్షించాడు. శరద్రాత్రిలో మురళీమ్రోయించి గోపికల నాకర్షించి రాసక్రీడా రూపంలో వారిననుగ్రహించాడు.

## 2 అధ్యాయం

తతస్స ఆగత్య పురీం స్వపిత్రోశ్చికీర్షయా శం బలదేవసంయుతః,
నిపాత్య తుంగాద్రిపుయూథనాథం హతం వ్యకర్షద్వ్యసుమోజసోర్వ్యామ్.
సాందీపనేః సకృత్ప్రోక్తం బ్రహ్మాధీత్య సవిస్తరమ్,
తస్మై ప్రాదాద్వరం పుత్రం మృతం పంచజనోదరాత్.

మధుర వెళ్లి కంసుని సంహరించి తలిదండ్రులను బంధవిముక్తులను చేశాడు. సాందీపముని దగ్గర చతుర్వేదాలనూ, వేదవేదాంగాలనూ

సమాహుతా భీష్మకకన్యయా యే శ్రియస్సవర్ణేన బుభూషయైషామ్,
గాంధర్వవృత్త్యా మిషతాం స్వభాగం జహ్రే పదం మూర్ధ్ని దధత్సుపర్ణః.
కకుద్మినోఽవిద్ధనసో దమిత్వా స్వయంవరే నాగ్నజితీమువాహ,
తద్భగ్నమానానపి గృధ్యతోఽజ్ఞాన్ జఘ్నేఽక్షతశ్శస్త్రభృతస్స్వపక్షైః.
ప్రియం ప్రభుర్గ్రామ్య ఇవ ప్రియాయా విధిత్సురార్చ్ఛద్ద్యుతరుం యదర్థే,
వజ్ర్యాద్రవత్తం సగణో రుషాంధః క్రీడామృగో నూనమయం వధూనాం.
సుతం మృధే ఖం వపుషా గ్రసంతం దృష్ట్వా సునాభోన్మథితం ధరిత్ర్యా,
ఆమంత్రితస్తత్తనయాయ శేషం దత్త్వా తదంతః పురమావివేశ.
తత్రాహృతాస్తా నరదేవకన్యాః కుజేన దృష్ట్వా హరిమార్తబంధుం,
ఉత్థాయ సద్యో జగృహుః ప్రహర్షవ్రీడానురాగప్రహితావలోకైః.
ఆసాం ముహూర్త ఏకస్మిన్నానాగారేషు యోషితాం,
సవిధం జగృహే పాణీన్ పురురూపస్స్వమాయయా.
తాస్వపత్యాన్యజనయదాత్మతుల్యాని సర్వశః,
ఏకైకస్యాం దశ దశ ప్రకృతేర్విబుభూషయా.
కాలమాగధసాల్వాదీనసైకైరుంధతః పురం,
అజీఘనత్స్వయం కీర్తిం స్వపుంసాం తేజ ఆదిశత్.
శంబరం ద్వివిదం బాణం మురం బల్వలమేవ చ,
అన్యాంశ్చ దంతవక్త్రాదీనవధీత్కాంశ్చ ఘాతయన్.
అథ తే భ్రాతృపుత్రాణాం పక్షయోః పతితాన్నృపాన్,
చచాల భూః కురుక్షేత్రం యేషామాపతతాం బలైః.

గ్రహించాడు. తాను జగద్గురువై లోకవిడంబనార్థం గురుశుశ్రూష చేసి
మరణించిన సాందీపుని కుమారులను యమలోకంనుండి తీసుకువచ్చి
యిచ్చాడు. రుక్మిణీస్వయంవరంలో శిశుపాలజరాసంధాదులను జయించి
రుక్మిణిని అనుగ్రహించి వివాహమాడాడు. స్వయంవరంలో ఏడువృష
భాలను మర్దించి నాగ్నజితిని వివాహమైనాడు. విషయలో[illegible]న
సామాన్యులవలె సత్యభామను ఆనందింపజేయటానికి స్వర్గంనుం దేవ
పారిజాతం తెచ్చి యిచ్చాడు. విశాలకాయుడైన నరకాసురుని సంహరించి
భూదేవిప్రార్థనమీద నరకపుత్రుడైన భగదత్తునకు రాజ్యమిచ్చి నర
కునిచే బంధింపబడిన పదహారువేల రాజకన్యలనూ అనుగ్రహించి పరి
ణయమై యోగమాయచేత అన్నిరూపాలూ ధరించి వారినానందింప

సకర్ణదుశ్శాసన సౌబలానాం కుమంత్ర పాకేన హతశ్రియాయుషం,
సుయోధనం సానుచరంశయానం భగ్నోరుముర్వ్యాం నననంద పశ్యన్.
కియాన్ భువోఽయం క్షపితోరుభారో యద్ద్రోణభీష్మార్జున భీమమూలైః,
అష్టాదశాక్షౌహిణికో మదంశైరాస్తే బలందుర్విషహంయదూనాం.
మిథో యదైషాం భవితా వివాదో మధ్వామదా తామ్రవిలోచనానాం,
నైషాం వధోపాయ ఇయానతోఽన్యో మయ్యుద్యతేఽంతర్దధతే స్వయంస్మ.
ఏవం సంచింత్యభగవాన్ స్వరాజ్యే స్థాప్య ధర్మజం,
నందయామాస సుహృదస్సాధూనాం వర్మ దర్శయన్.
ఉత్తరాయాంధృతః పూరోర్వంశస్సాధ్వభిమన్యునా,
సవైద్రౌణ్యస్త్రసంఛిన్నః పునర్భగవతా ధృతః.
అయాజయద్ధర్మసుతమశ్వమేధైస్త్రిభిర్విభుః,
సోఽపి క్ష్మామనుజైరక్షన్ రేమే కృష్ణమనువ్రతః,
భగవానపి విశ్వాత్మాలోక వేదపథానుగః,
కామాన్ సిషేవే ద్వార్వత్యామసక్తస్సాంఖ్యమాస్థితః.
స్నిగ్ధస్మితావలోకేన వాచా పీయూషకల్పయా,
చారిత్రేణానవద్యేన శ్రీనికేతన చాత్మనా.
ఇమంలోక మముం చైవరమయన్ సుతరాం యదూన్,
రేమే క్షణదయాదత్తక్షణస్త్రీక్షణసౌహృదః.
తస్యైవంరమమాణస్య సంవత్సరగణాన్ బహూన్,
గృహమేధేషు యోగేషు విరాగస్సమజాయత.
దైవాధీనేషు కామేషుదైవాధీనస్స్వయం పుమాన్,
కో విస్రంభేత యోగేన యోగేశ్వరమనువ్రతః.

చేసి పదేసిమంది పుత్రులనుకన్నాడు. కాలయవన జరాసంధ, సాళ్వాదులనూ, శంబర, ద్వివిద, బాణాసుర, ముర, బల్వల, దంతవక్త్రాదులనూ, స్వయంగా కొందరిని, ప్రద్యుమ్నాదులచే కొందరినీ సంహరించి, సంహరింపజేసినాడు. పాండవపక్షం వహించి కౌరవసైన్యాన్ని సంహరించి భూభారహరణం పూర్తికాలేదని, యాదవుల, బుద్ధులను భ్రమింపజేసి ముసలం కారణంగా మధుపానమత్తులైన యాదవులనన్యోన్యకలహాలతో నశించేట్లుచేసే ఉద్దేశంతో ధర్మరాజును రాజ్యసింహాసనంపై కూర్చుండబెట్టి కురువంశానికిబీజంగా ఉత్తరాగర్భస్థుడైన పరీక్షిత్తును రక్షించి ధర్మరాజుచేత మూడశ్వమేధయాగాలుచేయించి

పుర్యాం కదాచిత్క్రీడద్భిర్యదుభోజకుమారకైః,
కోపితా మునయశ్శేపు ర్భగవన్మతకోవిదాః.
తతః కతిపయైర్మాసైర్వృష్ణిభోజాంధకాదయః,
యయుః ప్రభాసంసంహృష్టారథైర్దేవవిమోహితాః.
తత్ర స్నాత్వా పితౄన్ దేవానృషీంశ్చైవ తదంభసా,
తర్పయిత్వాథ విప్రేభ్యో గావో బహుగుణాదదుః.
హిరణ్యం రజతం శయ్యాం వాసాంస్యజినకంబళాన్,
హయాన్రథానిభాన్కన్యా ధరాం వృత్తి కరీమపి.
అన్నం చోరురసం తేభ్యో దత్త్వా భగవదర్పణమ్,
గోవిప్రార్థాసవశ్శూరాః ప్రణేము ర్భువి మూర్ధభిః.

విశ్వాత్ముడైన నందనందనుడు ద్వారకలో ఉండి వేదమర్యాదను స్థాపించి భక్తిని వృద్ధిజేశాడు. శ్రీకృష్ణానుగ్రహంవల్ల యాదవులందరూ విరాగాన్ని పొందగల్గారు. యాదవ కులం నశించాలనే భగవత్సంకల్పం సత్యం కావడానికి బ్రాహ్మణశాపం, కారణంగా ముసలం జన్మించింది. ఒకనాడు యదు,వృష్ణి భోజ అంధకవంశీయులైన వీరులంతా ప్రభాస తీర్థం చేరి స్నానసంధ్యాతర్పణాదులచే దేవ,పితృ,ఋషులను తృప్తిపరచి, గో, భూ, సువర్ణ, వస్త్రదానాలు, చేశారు. బ్రాహ్మణ సమారాధనకూడా పూర్తిచేసినతరువాత వారికి సాష్టాంగ నమస్కారంచేశారు.

## 4 అధ్యాయం

అథ తే తదనుజ్ఞాతాభుక్త్వా పీత్వా చ వారుణీమ్,
తయా విభ్రంశితజ్ఞానాదురుక్తైర్మర్మపస్పృశుః.
తేషాం మైరేయదోషేణ విషమీకృతచేతసామ్,
నిమ్లోచతి రవావాసీద్వేణూనామివ మర్దనమ్.

బ్రాహ్మణాశీర్వాదములూ, అనుజ్ఞాపొంది, యాదవులుకూడా భుజించి మదిరాపానంచేసి ప్రమత్తులై ఒకరినొకరు నిందించుకుంటూ, సూర్యాస్తమయానికి, యుద్ధం ఆరంభించి ఒకరినొకరు సంహరించుకుంటున్నారు. వాసుదేవుడు తన మాయనూ దాని విచిత్రగతినీ

భగవాన్ స్వాత్మమాయాయా గతిం తామవలోక్య నః,
సరస్వతీముపస్పృశ్య వృక్షమూలముపావిశత్.
అహం చోక్తో భగవతా ప్రపన్నార్తిహరేణహ,
బదరీం త్వం ప్రయాహీతి స్వకులంసంజి హీర్షుణా.
అథాపి తదభిప్రేతం జానన్నహమతం ద్రితః,
పృష్ఠతోఽన్వగమంభర్తుః పాదవిశ్లేషణాక్షమః
అద్రాక్షమేకమాసీనం విచిన్వన్ దయితం పతిమ్,
శ్రీనికేతం సరస్వత్యాం కృతకేతమకేతనమ్.
శ్యామావదాతం విరజం ప్రశాంతం చారులోచనమ్,
దోర్భిశ్చతుర్భిర్విధితం పీతకౌశాంబరేణ చ.
వామఊరావధిశ్రిత్యదక్షిణాంఘ్రిసరోరుహమ్,
అపాశ్రితార్భకాశ్వత్థమకృశం త్యక్తపిప్పలం.
తస్మిన్మహాభాగవతో ద్వైపాయనసుహృత్సఖా,
లోకాననుచరన్ సిద్ధఆససాద యదృచ్ఛయా.
తస్యానురక్తస్య మునే ర్ముకుందః ప్రమోదభావానతకంధరస్య,
అశృణ్వతో మామనురాగహాసనమీక్షయా విశ్రమయన్నువాచ.

స్వయంగా చూస్తూ సరస్వతీ నది యందు స్నానంచేసి ఆచమించి అశ్వత్థవృక్షమూలమందు కూర్చున్నాడు. అంతకుపూర్వమందే యదు కుల సంహార వృత్తాంతం భగవానుడు నాకు చెప్పి బదరికావనానికి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. భగవానుని ఆశయం గ్రహించి నేను దేవదేవుని వియోగాన్ని భరించలేక వెన్నంటి ప్రభాసక్షేత్రానికి వెళ్ళాను. సరస్వతీ తీరంలో అశ్వత్థ వృక్షమూలమందు చతుర్భుజ రూపంలో పీతాంబరధారియై యెడమతొడయందు కుడికాలువైచి కూర్చున్న శ్రీహరిని చూచాను.

వ్యాసునకు పరమమిత్రుడైన మైత్రేయమహర్షి ఆసమీపానికి వచ్చాడు. మైత్రేయుడు శ్రీకృష్ణునకు పరమభక్తుడు. నేనాసమీపంలో ఉండగానే నందనందనుడు. శ్రీహరి మైత్రేయుని సన్నిధానంలోనే నన్నానందింపజేస్తూ చిరునవ్వుతో ఉద్ధవా! నీ అంతరంగికాభిప్రాయం నాకు తెలుసు. నీకు ఆసాధనం యిస్తున్నాను, అది యితరుల కసాధ్య

వేదాహమంతర్మనసీప్సితం తే దదామి యత్తద్దురవాపమన్యైః,
సత్రే పురా విశ్వసృజాం వసూనాం మత్సిద్ధికామేన వసోత్వయేష్టః.
స ఏష సాధో చరమోభవా నామాసాదితస్తే మదనుగ్రహోయత్,
యన్మాం నృలోకాన్రహ ఉత్సృజంతం దిష్ట్యా దదృశ్వాన్విశతామనువృత్త్యా.
పురామయా ప్రోక్తమజాయ నాభ్యే పద్మే నిషణ్ణాయ మమాదిసర్గే,
జ్ఞానం పరం మన్మహిమావభాసం యత్సూరయో భాగవతం వదంతి.
ఇత్యాదృతో క్తః పరమస్య పుంసః ప్రతిక్షణానుగ్రహభాజనోఽహం,
స్నేహోత్థరోమాస్ఖలితాక్షరస్తం ముంచన్ శుచః ప్రాంజలిరాబభాషే.
కోన్వీశతే పాదసరోజభాజాం సుదుర్లభోఽర్థేషు చతుర్ష్వపీహ,
తథాపి నాహం ప్రవృణోమి భూమ న్భవత్పదాంభోజనిషేవణోత్సుకః.
కర్మాణ్యనీహస్య భవో భవస్య తే దుర్గాశ్రయోఽథారిభయాత్పలాయనమ్,
కాలాత్మనోయత్ప్రమదాయు తాశ్రయస్స్వాత్మరతేః ఖిద్యంతి ధీర్విదామిహ.
మంత్రేషు మాం వా ఉపహూయ యత్త్వమకుంఠితాఖండసదాత్మబోధః,
పృచ్ఛేరహాముగ్ధవదప్రమత్తస్తన్నో మనో మోహయతీవ దేవ,
జ్ఞానం పరం స్వాత్మరహఃప్రకాశం ప్రోవాచకస్మై భగవాన్ సమగ్రమ్,
అపిక్షమం నో గ్రహణాయ భర్త ర్వదాంజసా యద్వృజినం తరేమ.

మైనది. నీవు జన్మాంతరంలో విశ్వస్రష్టలైన ప్రజాపతుల యజ్ఞాలలో నన్ను పొందాలని ఆరాధించావు. నీకిదే ఆఖరిజన్మ. నా అనుగ్రహం పొందగలిగావు. నేను మర్త్యలోకం వదలి పరమధామం చేరాలనే నిశ్చయంలో ఉన్నాను. పద్మకల్పంలో నా నాభికమలమందున్న బ్రహ్మకు ఉపదేశించిన భాగవతధర్మం నీకు బోధిస్తాను. అని చెప్ప డంతో నాహృదయం ఆనందంతో నిండింది. రోమాలు గగుర్పొడిచి ఆనందబాష్పాలు జలజలరాలుతూ ఉంటే రుద్ధమైన కంఠంతో చేతులు జోడించి,

కృష్ణా! నీ చరణకమలసేవ చేసేవాడికి ధర్మార్థకామమోక్షాలు కలగడంలో సందేహంలేదు. నాకు వానియందు కోరికలేదు. నీవు నిస్పృహుడవై కూడా కర్మలుచేస్తూండడం జననరహితుడవై జనించిన వారివలె గోచరించడం స్వయంగా కాలుడవై శత్రువులకు భయపడిన వానివలె ద్వారకలో దాగడం ఆత్మారాముడవై పదహారు వేలమందిని వివాహంచేసుకోవడం, ఇవి చూసి విద్వాంసులు కూడా భ్రమిస్తున్నారు.

ఇత్యావేదితహార్దాయ మహ్యం స భగవాన్ గురుః,
అదిదేశారవిందాక్ష ఆత్మనః పరమాం గతిమ్,
స ఏవమారాధితపాదతీర్థాదధీతతత్త్వాత్మవిబోధమార్గః,
ప్రణమ్య పాదౌ పరివృత్యదేవ మిహాగతోఽహం విరహాతు రాత్మా.
సోఽహం తద్దర్శనాహ్లాదవియోగార్తియుతః ప్రభోః,
గమిష్యేదయితం తస్య బదర్యాశ్రమమండలం,
యత్ర నారాయణో దేవో నరశ్చ భగవా నృషిః,
మృదు తీవ్రంతపో దీర్ఘం తేపాతే లోకభావనౌ.
ఇత్యుద్ధవాదుపాకర్ణ్య సుహృదాం దుస్సహం వధం,
జ్ఞానేనాశమయత్క్షత్తా శోకముత్పతితం బుధః.
సతం మహాభాగవతం వ్రజంతం కౌరవర్షభః,
విస్రంభాదభ్యధత్తేదం ముఖ్యం కృష్ణపరిగ్రహే.
జ్ఞానం పరం స్వాత్మరహః ప్రకాశం యదాహయోగేశ్వర ఈశ్వరస్తే,
వక్తుం భవాన్నోఽర్హతి యద్ధివిష్ణోర్భృత్యా స్వభృత్యార్థకృతశ్చరంతి.
నను తే తత్వసంరాధ్య ఋషిః కౌషారవోఽంతిమే,
సాక్షాద్భగవతాదిష్టో మర్త్యలోకం జిహాసతా.

దేవదేవా? అబాధకమైన అఖండమైన నీ స్వరూపజ్ఞానంలేని నన్ను పిలచి నాతో సలహా చేస్తూంటావు. అజ్ఞానులు ఇదంతా సామాన్య మానవ కృత్యంగానే భావిస్తారు. అనాధనాధా! నీవు బ్రహ్మకుబోధించిన భాగవతధర్మం నాకు బోధించు. అని వినమ్రశీర్షంతో అడిగాను.

అప్పుడే నాకా భగవానుడు భాగవతరూపమైన ఆత్మజ్ఞానం బోధించాడు. నేనా జ్ఞానంపొంది శ్రీకృష్ణునకు నమస్కరించి యిలా వచ్చాను. కృష్ణదర్శనంవల్ల ఆనందంకలిగింది, కానీ యిప్పుడు శ్రీకృష్ణ వియోగంచేత నాహృదయం చాలాపరితపిస్తూంది. నేనిప్పుడు నరనారాయణుల నివసస్థానమైన బదరికాశ్రమం వెడుతున్నాను. అక్కడ మనశ్శాంతికై తపస్సుచేసి మనశ్శాంతి పొందుతానన్న ఉద్ధవునివల్ల బంధునాశనం విని విదురుడనేకరీతుల దుఃఖిస్తూంటే ఉద్ధవుడాత్మజ్ఞానం బోధిచి దుఃఖాన్ని శాంతింప జేశాడు. తరువాత బదరికాశ్రమానికి పోనున్న ఉద్ధవునిచూచి విదురుడిలా అడిగాడు.

ఇతి సహ విదురేణ విశ్వమూర్తే ర్గుణకథయా సుధయా ప్లావితోరుతాపః,
క్షణమివ పులినే యమస్వసుస్తాం సముషిత ఔపగవి ర్నిశాం తతోఽగాత్.
నిధనముపగతేషు వృష్ణిభోజేష్వతిరథయూథపయూథపేషు ముఖ్యః,
స తు కథమవశిష్ట ఉద్ధవో యద్ధరిరపి తత్యజ ఆకృతిం త్ర్యధీశః.
బ్రహ్మశాపాపదేశేన కాలేనామోఘవాంఛితః,
సంహృత్య స్వకులం స్ఫీతం త్యక్ష్యన్ దేహ మచింతయత్.
అస్మా ల్లోకాదుపరతే మయి జ్ఞానం మదాశ్రయమ్,
అర్హత్యుద్ధవఏవాద్ధానం ప్రత్యాత్మవతాం వరః.
నోద్ధవోఽణ్వపి మన్న్యూనో యద్గుణైర్నార్దితః ప్రభుః,
అతో మద్వయునం లోకం గ్రాహయన్నిహ తిష్ఠతు.
ఏవం త్రిలోకగురుణా సందిష్టశ్శబ్దయోనినా,
బదర్యాశ్రమమాసాద్య హరిమీజే సమాధినా.
విదురోఽప్యుద్ధవాచ్ఛ్రుత్వా కృష్ణస్య పరమాత్మనః,
క్రీడయోపాత్తదేహస్య కర్మాణి శ్లాఘితాని చ.
దేహన్యాసంచ తస్యైవ ధీరాణాం ధైర్యవర్ధనమ్,
అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లబాత్మనామ్.

భక్తశ్రేష్ఠా! యోగీశ్వరుడైనశ్రీకృష్ణుడు యేఆత్మజ్ఞానం బోధించాడో ఆ జ్ఞానం నాకు బోధించు అనగా మహామంత్రీ! శ్రీహరి తన అవతారసమాప్తి కాలంలో మైత్రేయుని పిలచి విదురునకు జ్ఞానోపదేశం చేయమని ఆదేశించాడు. కనుక నువ్వు మైత్రేయుని సేవించి జ్ఞానం పొందుమని చెప్పి ఉద్ధవుడా రాత్రి విదురునితో కృష్ణలీలామృతపానంచేస్తూ గడపి ఉదయం లేచి వెళ్లిపోయాడు. అని చెప్పిన శుకుని వాక్యాలు విన్న పరీక్షిత్తు శుకయోగీంద్రా! యాదవవీరులంతా సంకులమరణంపొందితే త్రిలోకనాథుడైన శ్రీకృష్ణుడుకూడా అవతారం చాలిస్తే ఉద్ధవుడొక్కడూ యెలా జీవించివున్నాడు? అన్నాడు. వ్యర్థసంకల్పుడుకాని వాసుదేవుడు తన సంకల్ప మాత్రంచేతనే యాదవకులాన్నంతరింపజేసి తానుకూడా అంతర్హితుడయ్యేసమయంలో ఉద్ధవుడు తనతో సమానుడనీ ఆత్మజ్ఞానం కలవాడనీ నిశ్చయించి ఉద్ధవుని ద్వారా భాగవతధర్మం ప్రపంచంలో వ్యాప్తికావాలనే సంకల్పంతో ఉద్ధవునకు తనస్వరూపం చెప్పి భూమండలంలో ఉండి యీజ్ఞానం అధి

ఆత్మానంచ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితమ్,
ధ్యాయన్ గతే భాగవతే రురోద ప్రేమవిహ్వలః.
కాళింద్యాః కతిభిస్సిద్ధ అహోభిః భరతర్షభః,
ప్రాపద్యత స్వస్సరితం యత్ర మిత్రాసుతో మునిః.

కాపులకు బోధించమని ఆజ్ఞాపించడంవల్ల ఉద్ధవుడా భగవదాదేశాన్ని అనుసరించి యీలోకంలో ఉండి విదురునకు కౌరవపాండవ యాదవ నాశనం భగవంతుని ఆదేశం అందించి బదరికాశ్రమం వెళ్లాడు. విదురుడు ప్రేమవిహ్వలుడై విచారించి యమునాతీరాన పయనంసాగించి గంగాతీరంలో వున్న, మైత్రేయుని దగ్గరకు వెళ్లాడు.

4 అధ్యాయం

ద్వారి ద్యునద్యా ఋషభః కురూణాం మైత్రేయమాసీనమగాధబోధమ్,
క్షత్తోపసృత్యాచ్యుతభావశుద్ధం పప్రచ్ఛ సౌశీల్యగుణాభితృప్తమ్.
సుఖాయ కర్మాణి కరోతి లోకో న తైస్సుఖంవాన్యదుపారమం వా,
విందేత భూయ స్తతఏవ దుఃఖం యదత్ర యుక్తం తు భవాన్ వదేన్నః.
జనస్య కృష్ణా ద్విముఖస్య దైవా దధర్మశీలస్య సుదుఃఖితస్య,
అనుగ్రహాయేహ చరంతి నూనం భూతాని భవ్యాని జనార్దనస్య.
తత్సాధువర్యాదిశవర్త్మశం న స్సంరాధితో భగవాన్ యేన పుంసామ్,
హృది స్థితో యచ్ఛతిభక్తిపూతే జ్ఞానం సతత్త్వాధిగమం పురాణమ్.
కరోతి కర్మాణి కృతావతారో యాన్యాత్మతంత్రో భగవాంస్త్ర్యధీశః,
యథా ససర్జాగ్రఇదంనిరీహస్సంస్థాప్య వృత్తిం జగతో విధత్తే.

పరీక్షిన్మహారాజా! శుద్ధహృదయుడైన విదురుడు మైత్రేయుని సమీపించి నమస్కరించి అనుజ్ఞనుపొంది, ఆసీనుడై ఇలా అడిగాడు!

మైత్రేయా! లోకంలోవున్న ప్రతివ్యక్తీ సుఖంకొరకే కర్మ చేస్తాడు. కాని వాడు కేవలం సుఖమే పొందలేక పోతున్నాడు. దుఃఖం నశించడమూలేదు. వానికి కూడా దుఃఖమే వృద్ధి అవుతున్నది. దీనికి పరిష్కారమార్గమేమిటి? దుర్భాగ్యవశం చేత కృష్ణభక్తి విముఖులై వుంటే అజ్ఞానులను తరింపజేయడానికే మీవంటి మహాపురుషులు

యథా పునస్స్వఖ ఇదం నివేశ్య శేతే గుహాయాం స నివృత్తవృత్తిః.
యోగేశ్వరాధీశ్వర ఏక ఏతదనుప్రవిష్టో బహుధా యథాసీత్.
క్రీడన్విధత్తే ద్విజగోసురాణాం క్షేమాయ కర్మాణ్యవతారభేదైః,
మనో న తృప్య త్యనుశృణ్వతాం న స్సుశ్లోకమౌళేశ్చరితామృతాని.
యైస్తత్త్వభేదై రధిలోకనాథో లోకానలోకాన సహలోకపాలాన్,
అచిక్లృపద్యత్రహిసర్వసత్త్వనికాయభేదోఽధికృతః ప్రతీతః.
యేన ప్రజానాముత ఆత్మకర్మ రూపాభిధానాం తు భిదాం వ్యధత్త,
నారాయణో విశ్వసృడాత్మయోనిరేతచ్చ నో వర్ణయ విప్రవర్య.
పరావరేషాం భగవన్ వ్రతాని శ్రుతాని మే వ్యాసముఖాదభీక్ష్ణమ్,
అతృప్నుమః క్షుద్రసుఖావహానాం తేషామృతే కృష్ణకథామృతౌఘాత్.
కస్తృప్నుయాత్తీర్థపదాభిధానాత్సత్రేషు వస్సూరిభిరీడ్యమానాత్,
యః కర్ణనాడీం పురుషస్య యాతో భవప్రదాం గేహరతిం ఛినత్తి
మునిర్వివక్షుర్భగవద్గుణానాం సఖాపితే భారతమాహ కృష్ణః,
యస్మిన్నృణాం గ్రామ్యసుఖానువాదైర్మతిర్గృహీతాను హరేః కథాయామ్.
సా శ్రద్ధధానస్య వివర్ధమానా విరక్తిమన్యత్ర కరోతి పుంసామ్,
హరేః కథానుస్మృతినిర్వృతస్య సమస్తదుఃఖాప్యయమాశు ధత్తే.

లోకంలో కలుగుతూంటాయి. ఏవిధంగా ఆరాధిస్తే శాంతిచేకూరుతుందో, భగవత్సాక్షాత్కారం పొందగల్గుతాడో, అట్టి జ్ఞానాన్ని ఉపదేశించండి. త్రిలోకనాథుడైన శ్రీహరి అవతరించి నటిస్తున్నాడు. అకర్తయై ఉండి కల్పారంభంలో సృష్టించి పాలించికల్పాంతమందు లయింప జేసి, యోగనిద్రయందెలా ప్రవేశిస్తున్నాడు? తానొక్కడే బ్రహ్మాండమందనేకరూపాల్లో యెలా గోచరిస్తున్నాడు? గోబ్రాహ్మణదేవతాహితార్థియై అనేక అవతారాలు ధరించి అలౌకిక కర్మ లెలా చేస్తున్నాడు? సవిస్తరంగా నాకర్థమయ్యేటట్లు చెప్పి నాకానందం కల్గించండి.

ఋషిపుంగవా! సమస్తలోకాధినాథుడైన శ్రీహరి లోకములనూ, లోకపాలురనూ, లోకాలోకపర్వతానికి, బయటా, లోపలా, ఉండేభాగాలనూ, భిన్నభిన్నరూపాలతో ఉండే, అధికారజీవులనూ యే, యే, తత్త్వాలనుండి సృజించాడు? శ్రీనారాయణుడు తన ప్రజా

తాన్ శోచ్యశోచ్యానవిదోఽనుశోచే హరేః కథాయాం విముఖానఘేన,
క్షిణోతి దేవోఽనిమిషస్తు తేషా మాయుర్వృథా వాదగతిస్మృతీనామ్,
తదస్య కౌషారవశర్మదాతు ర్హరేః కథామేవ కథానుసారామ్,
ఉద్ధృత్య పుష్పేభ్య ఇవార్తబంధో శ్శివాయ నః కీర్తయతీర్థకీర్తేః.
సవిశ్వజన్మస్థితిసంయమార్థే కృతావతారః ప్రగృహీతశక్తిః,
చకారకర్మా ణ్యతిపూరుషాణి యానీశ్వరః కీర్తయ తాని మహ్యమ్.
ఏవం సభగవాన్ పృష్టః క్షత్త్రా కౌషారవోమునిః,
పుంసా నిశ్శ్రేయ సా ర్థాయతమాహ బహుమానయన్.
సాధు పృష్టం త్వయాసాధో లోకాన్ సాధ్వనుగృహ్ణతా,
కీర్తిం వితన్వతాలోకే హ్యాత్మనోఽధోక్షజాత్మనః.
నైతచ్చిత్రంత్వయిక్షత్తర్బాదరాయణ వీర్యజే,
గృహీతోఽనన్యభావేనయ త్త్వయాహరిరీశ్వరః.
మాండవ్యశాపాద్భగవాన్ప్రజాసంయమనోయమః,
భ్రాతుః క్షేత్రే భుజిష్యాయాం జాతస్సత్యవతీసుతాత్.
భవాన్ భగవతో నిత్యం సమ్మతస్యానుగస్య చ,
యజ్ఞానాదేశాయ చ మాయాదిశ్య భగవాన్వ్రజన్.

సముదాయంయొక్క, స్వభావ, కర్మ, రూపనామాదులలో ఉండే భేదాన్ని ఎలా రచించాడు ?

వేదవ్యాసునివల్ల వర్ణాశ్రమధర్మం అనేక సార్లు విన్నాను. ఎన్ని మార్లు విన్నా తృప్తి కలుగనిదల్లా భగవత్కథామృతమే ! నారదాది మహర్షులు మీ వంటి సత్పురుషులమధ్య అనేకసార్లు హరికథా గానం చేస్తూంటారు. విన్న మాత్రంచేత బంధముక్తుని చేసేదే హరికథ. మునిసత్తమా ! మీ మిత్రుడైన వేదవ్యాసుడు హరి గుణ గానం చెయ్యడానికే మహాభారతం రచించాడు. అందులో అనేకచోట్ల విషయసుఖాలను గురించి చెబుతూ మానవ హృదయాలు భగవంతుని వైపు త్రిప్పడానికి ప్రయత్నించాడు. భగవత్కథయందు రుచి కలిగితే అన్యవిషయాలు వాని నంటవు. భగవంతునియందు విముఖులై అనేక క్లేశముల పాలయే మానవులను గురించి నాకు విచారం కలుగుతూం టుంది. వారి జీవితం వృథావ్యయమై పోతోంది. మీరు దీనులయందు

అథ తే భగవల్లీలా యోగమాయోపబృంహితాః,
విశ్వస్థిత్యుద్భవాంతార్థా వర్ణయామ్యనుపూర్వశః,
భగవానేక ఆసేదమగ్ర ఆత్మాత్మనాం విభుః,
ఆత్మేచ్ఛానుగతావాత్మా నానామత్యుపలక్షితః.
స వా ఏష తదా ద్రష్టా నాపశ్యద్దృశ్యమేకరాట్,
మేనేసంతమివాత్మానం సుప్తశక్తిరసుప్తదృక్,
సా వా ఏతస్య సంద్రష్టుశ్శక్తిస్సదసదాత్మికా,
మాయానామ మహాభాగయయేదం నిర్మమే విభుః.
కాలవృత్త్యాతు మాయయాం గుణమయ్యామధోక్షజః,
పురుషేణాత్మభూతేన వీర్యామాధత్త వీర్యవాన్.
తతోఽభవన్మహత్తత్త్వమవ్యక్తాత్కాలచోదితాత్.
విజ్ఞానాత్మాత్మదేహస్థం విశ్వంవ్యంజంస్తమోనుదః.
సోఽప్యంశగుణకాలాత్మభగవద్దృష్టిగోచరః,
ఆత్మానం వ్యాకరోదాత్మావిశ్వస్యాస్య సిసృక్షయా.
మహత్తత్త్వాద్వికుర్వాణాదహం తత్త్వమజాయత,
కార్యకారణకర్త్రాత్మా భూతేంద్రియమనోమయః.

దయయుంచి పుష్పాలనుండి మధురరసాన్ని తుమ్మెదలాగైతే గ్రహిస్తాయో అలాగే సర్వవిద్యాసారభూతమైన హరికథామృతం ప్రసాదించండి. ఆ సర్వేశ్వరుడు సృష్టిస్థితిలయాలకోసం మాయ నాశ్రయించి రామకృష్ణాది రూపములలో, అవతరించి చూపిన అలౌకిక లీలా రహస్యం, మాకు వినిపించండి. అని అడిగిన విదురునితో ఆదరాభిమానాలు చూపి, మైత్రేయమహర్షి చెప్పడం ఆరంభించాడు. విదురా! సమస్తజీవులందూ గల కరుణచేత నువ్వు యిది అడిగావు నీ చిత్తం సర్వదా హరియందే లగ్నమై ఉంటుంది. నీకీర్తి లోకవ్యాప్తమైనది. నీవు వ్యాసునకి ఔరసపుత్రుడవు. జీవులను దండించే సాక్షాద్యముడవు. మాండవ్య శాపం వల్ల దాసీయోనియందు వ్యాసునకు జన్మించావు. భగవద్భక్తుడవు. కనుకనే అవతారసమాప్తి కాలంలో నీకు జ్ఞానోపదేశం చెయ్యమని నాకాజ్ఞాపించాడు. సృష్టి స్థితి లయముల కొరకై యోగమాయద్వారా విస్తరింపబడిన భగవంతుని లీలలు క్రమంగా చెప్తాను విను.

వైకారిక స్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రిధా,
అహం తత్త్వాద్వికుర్వాణాన్మనో వైకారికాదభూత్.
వైకారికాశ్చ దేవా వై అర్థాభివ్యంజనం యతః,
తైజసానీంద్రియాణ్యేవ జ్ఞానకర్మమయాని చ.
తామసో భూతసూక్ష్మాదిర్యతః ఖం లింగమాత్మనః।
కాలమాయాంశయోగేన భగవద్వీక్షితం నభః.
నభసోఽనుసృతం స్పర్శం వికుర్వన్నిర్మమేఽనిలమ్,
అనిలోఽపి వికుర్వాణో నభసోరుబలాన్వితః.
ససర్జ రూపతన్మాత్రం జ్యోతిర్లోకస్య లోచనమ్,
అనిలేనాన్వితం జ్యోతిర్వికుర్వ త్పరమేక్షితమ్,

సృష్టికి పూర్వం పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. చూచేవాడు చూచేది అనే భేదమే లేదు. సృష్టికాలంలో అనేక వృత్తులతో కూడిన అనేకత్వం కూడా ఆపరమాత్మయే భగవానుడు, ఒక్కడుగా ఉండాలనే యిచ్ఛచేతనే సర్వాత్మానా ఒక్కడుగానే ఉంటాడు. ఆతడే దృష్టిచూస్తే చూసేదేమీ లేకపోయింది. ఆసమయంలో అద్వితీయమైన పరమాత్మ ఒక్కడుగానే ప్రకాశిస్తున్నాడు. ఆసమయంలో తనను అసత్తుగా భావించసాగాడు. తత్త్వదృష్టితో చూస్తే తానెన్నడూ అసత్పదార్థంకాదు. ఆ భగవానుని శక్తులు నిద్రిస్తున్నాయి. కాని ఆయన నిదురించడంలేదు. భగవానుని యందెప్పుడూ జ్ఞానం లోపించలేదు. చూచేవాడూ చూడబడేదీ యీ రెండింటికి అనుసంధానం కలిగించేదే కార్యకారణరూపమైన మహామాయ. ఈ భావాభావరూపమైన అనిర్వచనీయమైన మాయద్వారా యీవిశ్వ నిర్మాణం చేస్తాడు. కాలశక్తిచేత ఎప్పుడైతే త్రిగుణాత్మకమైన మాయ క్షోభింపబడుతుందో అప్పుడే ఇంద్రియాతీతుడైన పరమాత్మ తన అంశయగు పురుషరూపంతో దానియందు చిదాభాసమైన బీజాన్ని స్థాపించాడు. అప్పుడు కాలప్రేరితమైన అవ్యక్తంనుండి మహత్తత్త్వం జన్మించింది. మహత్తత్త్వం అజ్ఞాననాశహేతువు గనక విజ్ఞానస్వరూపమైన తనయందే యీవిశ్వాన్ని అభివ్యక్తం చేసేదైంది. తిరిగి చిదాభాసగుణకాలాధీనమైన మహత్త

అథత్తాంభోదనమయం కాలమాయాంశయోగతః,
జ్యోతిషాంభోఽనుసంసృష్టం వికుర్వద్బ్రహ్మవీక్షితమ్.
మహీం గంధగుణా మాధాత్కాలమాయాంశయోగతః,
భూతానాం నభఆదీనాం యద్యద్భవ్యం పరాపరమ్.
తేషాం పరానుసంసర్గాద్యథానంఖ్యం గుణాన్ విదుః,
ఏతే దేవాః కలా విష్ణోః కాలమాయాంశలింగినః.
నానాత్వాత్స్వ క్రియానీశాః ప్రోచుః ప్రాంజలయో విభుమ్.
నమామి తే దేవపదారవిందం ప్రపన్నతాపోపశమాతపత్రమ్,
యన్మూల కేతాయతయోఽంజసోరుసంసారదుఃఖం బహిరుత్ క్షిపంతి.
ధాతర్యదస్మిన్ భవఈశజీవాస్తాపత్రయేణాభిహతా నశర్మ,

త్త్వం మీద భగవంతుని దృష్టి ప్రసరించడంతో మహాతత్త్వంయొక్క వికృతావస్థనుండి అహంకారం పుట్టింది. కార్యకారణకర్తృరూపమైన దవటంచేత భూతములకూ ఇంద్రియాలకూ మనస్సుకూ అహంకారమే కారణం. ఆ అహంకారం సాత్విక రాజస తామసములని మూడు విధాలుగా ఉంటుంది. అహంతత్త్వంలో వికారం కలిసినవెంటనే వైకారికాహంకారం నుండి విషయజ్ఞాన సాధన మయిన మనస్సూ ఇంద్రియాధిష్ఠాన దేవతలూ జనించారు. తైజసాహంకారం వల్ల పశేంద్రియాలూ ఆవిర్భవించాయి. తామసాహంకారంనుండి శబ్ద తన్మాత్ర శబ్ద తన్మాత్రి నుండి దృష్టాంతంగా ఆత్మబోధ చేయడాని కనువైన ఆకాశం జనించింది. భగవంతుని దృష్టి ఆకాశం మీదపడిన మాత్రంచేత కాల, మాయా, చిదాభాసల సంయోగంవల్ల స్పర్శ తన్మాత్ర స్పర్శతన్మాత్రి నుండి వాయువూ జనించాయి. బలవత్తర మయిన వాయువు ఆకాశంతో కలిసి రూపతన్మాత్రను సృజించింది. రూపతన్మాత్రనుండి సర్వ లోక ప్రకాశకమైన తేజస్సు పుట్టింది. పరమాత్మ వీక్షణ పడటంచేత వాయుయుతమైన తేజస్సు కాలమాయ చిదంశల సంపర్కంచేత రస తన్మాత్రనూ, రసతన్మాత్రి కారణంగా కార్యరూపమైన జలాన్నీ ఉత్పత్తిచేసింది. అనంతరం తేజోయుక్తమైన జలం బ్రహ్మయొక్క దృష్టి పాతంవల్ల కాలమాయా చిదంశలతో కూడి పృథివిని పుట్టించింది.

ఆత్మజ లభంతే భగవంస్తవాంఘ్రిచ్ఛాయాం సవిద్యామత ఆశ్రయేమ.
మార్గంతి యత్తే ముఖ పద్మనీడైశ్ఛందస్సు పర్ణైస్సుధియో వివిక్తే
యచ్చాఘమర్షోదసరిద్వరాయాః పదం పదం తీర్థపదః ప్రపన్నాః.
యచ్ఛ్రద్ధయా శ్రుతవత్యా చ భక్త్యా సంమృజ్యమానే హృదయేఽవధార్య,
జ్ఞానేన వైరాగ్యబలేన ధీరావ్రజంతి తత్తేంఘ్రిసరోజపీఠమ్.
విశ్వస్య సర్గస్థితిసంయమార్థే కృతావతారస్య పదాంబుజం శే,
వ్రజేమ సర్వే శరణం యదీశ స్మృతం ప్రయచ్ఛత్యభయం స్వపుంసామ్,
యత్సానుబంధే సతిదేవ దేహే మమాహమిత్యూఢ దురాగ్రహాణామ్,

ఆకాశాదులవల్ల క్రమంగా పుట్టిన భూతములందు పూర్వభూతములందున్న గుణాలుకూడా ఉన్నట్లు గ్రహించాలి. అనగా ఆకాశం శబ్దం శబ్దగుణం కలది. వాయువునందు శబ్ద స్పర్శ గుణాలు తేజమందు శబ్ద స్పర్శరూపాలూ జలమందు శబ్దస్పర్శరూపరసాలు భూమియందు శబ్ద స్పర్శ రూప రస గంధాలూ ఉన్నట్లు గ్రహించాలి. ఈమహత్తత్త్వాల యొక్క అభిమానులైన దేవతలు భగవంతుని అంశాలే అయినా వేరు వేరుగా ఉండడం వల్ల విశ్వసృష్టియందు సమర్థత లేక చేతులు జోడించి భగవంతునితో యిలా అన్నారు.

పరమాత్మా! మీపదారవిందాలకు నమస్కారం. మిమ్ములను శరణన్నజీవుల తాపాన్ని దూరంచేయటానికిఛత్రసమానుడవు. మిమ్ముల నాశ్రయించిన యతీశ్వరుల దుఃఖాన్ని దూరంచేశేవాడవు. జగన్నాథా! ఈ సంసారమందు తాపత్రియపడే జీవులకు కొంచం కూడా సుఖశాంతులు కలుగవు గనుకనే జ్ఞానమయమైన నీ పాదచ్ఛాయ నాశ్రయిస్తున్నాము. మునిజనులు యేకాంత స్థానమందుండి వేదమంత్ర రూపములైన పక్షులద్వారా యెవనియొక్క అనుసంధానం చేస్తున్నారో సమస్త పాపనాశనహేతువైన గంగకు జన్మస్థానమేదో అట్టి నీ పదపద్మాల నాశ్రయిస్తున్నాము. శ్రవణకీర్తనాదులద్వారా పరిశుద్ధమైన హృదయంతో నిన్ను ధ్యానించి విరాగులై ధీరులవుతున్నారు. ఈశ్వరా! సృష్టి స్థితి లయాల కొరకే నీవు రూపాంతరాలతో అవతరిస్తూంటావు. కనుకనే

పుంసాం సుమూరం వసతోఽపి పుర్యా వ్రజేమ తత్తే భగవత్పదాబ్జమ్.
తాన్వా అసద్వృత్తిభిరక్షిభిర్యే పరాహృతాంతర్మనసః పరేశ,
అథో న పశ్యం త్యురుగాయ నూనం యేత్వత్పదన్యాస విలాసలక్ష్మ్యాః.
పానేన తే దేవకథాసుధాయాః ప్రవృద్ధభక్త్యా విశదాశయా యే,
వైరాగ్యసారం ప్రతిలభ్య బోధం యథాంజసాన్వీయు రకుంఠధిష్ణ్యం.
అథాపరే చాత్మసమాధియోగబలేస జిత్వా ప్రకృతిం బలిష్ఠాం,
త్వామేవ ధీరాః పురుషం విశంతి తేషాం శ్రమస్స్యాన్నతు సేవయాతే.
తత్తే వయం లోకసిసృక్షయాద్య త్వయాఽనుసృష్టా స్త్రిభిరాత్మభిర్యత్,
సర్వేవియుక్తాః స్వవిహారతంత్రం న శక్నుమస్తత్ప్రతిహర్తవేతే.
యావద్బలిం తేఽజ హరామ కాలే యథావయం చాన్నమదామయత్ర,

నీచరణ కమలాల నాశ్రియిస్తున్నాము. దేహ గేహాదులయందు అహం మమతా కలవారి హృదయాలలో అంతర్యామి రూపుడవుగా ఉన్నా వారికి చాలా దూరమైపోతావు. అట్టి నీపాదాలను ఆశ్రయిస్తున్నాము. ఇంద్రియలోలురై విషయాసక్తులైన అజ్ఞానుల మనస్సు బాహ్యప్రపంచ మందే చరిస్తూండడంచేత విలాసపూర్ణమైన నీపాదవిన్యాసరహస్య గ్రాహులైన భక్తుల్ని దర్శించరు అట్టివారు. నీపాదాలకు చాలాదూరంగా ఉంటారు. నీకథామృతపాన ప్రమత్తులైనవారు భక్తికారణంగా అంతశ్శుద్ధిని పొంది వైరాగ్యసారమయిన ఆత్మజ్ఞానం పొంది వైకుంఠం చేరుతారు. ధీరపురుషులు సమాధిబలంచేత నీమాయను జయించి నీయందే లీనమౌతున్నారు. కాని వారీసాధనలో చాలాశ్రమపొందుతారు. భక్తి రూపమైన నీసేవలో యేవిధమైన శ్రమకూడాలేదు. సృష్టిచెయ్యాలనే ఇచ్ఛతో మమ్మలను త్రిగుణమయులుగా సృష్టించావు. మేము భిన్న స్వభావాలతో ఉండడంవల్ల మాలో మేము కలియలేక పోతున్నాము. అందుచేతనే మీక్రీడాస్థానమైన బ్రహ్మాండ రచనచేసి మీకుసమర్పింప లేక పోయాము. దేనివల్ల మేము బహ్మాండాన్ని సృష్టించి నీకు సమర్పించ గలమో మేము యెక్కడ ఉండి మాయోగ్యతల ననుసరించి అన్నాదులను గ్రహించగలుగుతామో సమస్త జీవులూ విఘ్నభాధలులేకుండా మాకూ మీకూ భోగాలుసమర్పిస్తూ వారివారి అన్నాదులను గ్రహించ

యథోభయేషాంతఇమే హి లోకా బలింహరంతోఒన్నమదంత్యనూహాః.
త్వంనస్సురాణామసిసాన్వయానాం కూటస్థ ఆద్యః పురుషః పురాణః,
త్వం దేవశక్త్యాం గుణకర్మయోనౌ రేతస్త్వజాయాం కవిమాధధేజః.
తతో వయం సత్ప్రముఖాయదర్థే బభూవిమాత్మన్ కరవామ కిం తే,
త్వం నస్స్వచక్షుః పరిదేహి శక్త్యా దేవక్రియార్థేత్వదనుగ్రహాణాం.

గలరో అట్టి ఉపాయం చూడండి నిర్వికారుడవైన నీవే అన్యమైన కార్య వర్గంతో కూడి మాకందరకూ ఆదికారణుడవు. జననాదిరహితుడవైన నీ వాదిలో సత్వగుణాలయొక్కయు కర్మజన్మాదుల యొక్కయు కారణ భూతమైన మాయాశక్తియందు చిదాభాసరూపమైన వీర్యాన్ని స్థాపించావు. పరమేశ్వరా! మహత్తత్వాది రూపులమైన దేవగణాన్ని యెందులకు సృష్టించావు? మేమేమిచెయ్యాలి? మాయందనుగ్రహముంచి బ్రహ్మాండ రచనారూపమైన క్రియాశక్తితో మాకు జ్ఞానశక్తిని ప్రసాదించు అని మహత్తత్వాది దేవతలు పరమాత్మను ప్రార్థించారు.

## 5 అధ్యాయం

ఇతి తాసాం స్వశక్తీనాం సతీనామసమేత్య సః,
ప్రసుప్తలోకతంత్రాణాం నిశామ్య గతిమీశ్వరః.
కాలసంజ్ఞాం తదా దేవీం బిభ్రచ్ఛక్తిమురుక్రమః,
త్రయోవింశతి తత్త్వానాం గణం యుగపదావిశత్,
సోఽనుప్రవిష్టో భగవాంశ్చేష్టారూపేణ తం గణం,
భిన్నం సంయోజయామాస సుప్తం కర్మ ప్రబోధయన్.

సర్వశక్తియుతుడైన భగవానుడెప్పుడైతే మహత్తత్వాదులు సృష్టిరచనయందు అసమర్థములైనట్లు చూశాడో ఆక్షణంలోనే కాలశక్తిని స్వీకరించి మహత్తూ అహంకారమూ పంచతన్మాత్రలూ పంచమహాభూతములూ మనస్సూ, ఏకాదశ ఇంద్రియాలూ, యీ యిరవైమూడింటి యందూ తాను ప్రవిష్టుడై నిద్రావస్థలో ఉన్న జీవుల అదృష్టాన్ని మేలుకొల్పి వేరువేరుగా ఉన్న తత్వసమూహాన్ని క్రియాశక్తి

ప్రబుద్ధకర్మాదేవేన త్రయోవింశతికోగణః,
ప్రేరితోఽజనయత్స్వాభిర్మాత్రాభిరధిపూరుషం.
పరేణావిశతాస్వస్మిన్మాత్రయా విశ్వసృగ్గణః,
చుక్షోభాన్యోన్యమాసాద్య యస్మిన్ లోకాశ్చరాచరాః.
హిరణ్మయస్సపురుషస్సహస్రపరివత్సరాన్,
అండకోశఉవాసాప్సు సర్వసత్త్వోపబృంహితః.
స వై విశ్వసృజాం గర్భో దైవకర్మాత్మ శక్తిమాన్,
విబభాజాత్మ నాత్మానమేకధా దశధా త్రిధా.
ఏషహ్యశేషసత్త్వానామాత్మాంశః పరమాత్మనః,
ఆద్యోవతారో యత్రాసౌ భూతగ్రామో విభావ్యతే.
సాధ్యాత్మస్స్వాధిభూతశ్చ సాధిదైవ ఇతి త్రిధా,
విరాట్ప్రాణో దశవిధ ఏకధా హృదయేన చ.
స్మరన్ విశ్వసృజామీశో విజ్ఞాపితమధోక్షజః,
విరాజమతపత్స్వేన తేజసైషాం వివృత్తయే.
అథ తస్యాభితప్తస్య కతిచాయతనానిహ,
నిరభిద్యంత దేవానాం తాని మే గదతశ్శృణు,
తస్యాగ్నిరాస్యం నిర్భిన్నం లోకపాలోఽవిశత్పదం,
వాచాస్వాంశేన వక్తవ్యం యయాసౌ ప్రతిపద్యతే

ద్వారా కలిపాడు. ఈవిధంగా భగవానుడు అదృష్టాన్ని కార్యోన్ముఖం చేసిన క్షణంలో యిరువైమూడు తత్త్వాలతో కూడిన సమూహం భగవంతుని ప్రేరణ చేతను అంశలద్వారా విరాట్పురుషుని సృష్టించింది. భగవానుడుతన అంశతో ఆశరీరంలో ప్రవేశించగానే సృష్టి హేతువులైన మహత్తత్త్వాదులొకదానితో ఒకటి కలసి పరిణామాన్ని పొందాయి. ఈతత్వపరిణామమే విరాట్పురుషుడు ఈయనయందే చరాచర విశ్వమంతా ఉంది. సర్వజీవాశ్రయరూపమైన అండం జలాంతర్భాగంలో ఉంది. విరాట్పురుషుడా అండమందే సర్వజీవములతో కూడా వేయి దివ్యసంవత్సరాలు ఉండిపోయాడు. అతడు విశ్వరచన హేతువులైన తత్త్వములకు గర్భరూపుడు. కారణములైనవి తత్త్వాలూ కార్యరూపుడైన వాడు విరాట్పురుషుడూ అన్నమాట. ఈయనయందు జ్ఞాన క్రియా శక్తులూ ఆత్మశక్తీకూడా ఉన్నాయి. ఈతడు యీశక్తులవల్ల తన యందు

నిర్భిన్నం తాలువరుణో లోకపాలోఒవిశత్పదం,
జిహ్వయాంశేన చరసా స్వయాసౌ ప్రతిపద్యతే.
నిర్భిన్నే అశ్వినౌ నాసే హరేరావిశతాం పరం,
ఘ్రాణేనాంశేన గంధస్య ప్రతిపత్తిర్యతో భవేత్.
నిర్భిన్నే అక్షిణీ త్వష్టా లోకపాలో విశత్పదం,
చక్షుషాం శేన రూపాణాం ప్రతిపత్తిర్యతో భవేత్,
నిర్భిన్నాన్యస్య చర్మాణి లోకపాలోఒనిలోఒవిశత్,
ప్రాణేనాంశేన సంస్పర్శం యేనాసౌ ప్రతిపద్యతే,
కర్ణావస్యవినిర్భిన్నౌ ధిష్ణ్యం స్వం వివిశుర్దిశః,
శ్రోత్రేణాంశేన శబ్దస్య సిద్ధిం యేన ప్రపద్యతే,
త్వచమస్య వినిర్భిన్నాం వివిశుర్ధిష్ణ్యం మోషధీః,
అంశేన రోమభిః కండూం యైరసౌ ప్రతిపద్యతే.
మేఢ్రం తస్య వినిర్భిన్నం స్వధిష్ణ్యం క ఉపావిశత్,
రేతసాంశేన యేనాసౌ హానందం ప్రతిపద్యతే.

ఒకటీ పదీ మూడువిభాగాలుచేశాడు. హృదయరూపమైన విభాగమే ఒకటి ప్రాణాపాన వ్యానోదాన సమానములూ దేవ దత్త నాగ కూర్మ కృకల ధనంజయములూ యీవాయువులయొక్క విభాగమే. పది ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతిక విభాగమే మూడు. ఈవిధంగా విభజించి సృష్టికి ప్రథమజీవిగ పరిణమించినవాడే విరాట్పురుషుడు, ఇతడే సర్వజీవులకూ ఆత్మస్వరూపుడు. జీవరూపుడు. పరమాత్మ. ఈభూతసముదాయమీపురుషునియందే ప్రకాశిస్తూ ఉంటుంది. సృష్టికారణములకు అధినాథుడైన భగవానుడు మహత్తత్త్వాదుల ప్రార్థనను స్మరించి వాని వాని వృత్తులను మేలుకొల్పుటకు చేతనా రూపమైన తన తేజస్సుచే విరాట్పురుషుని ప్రకాశింప జేశాడు. విరాట్పురుషుడు ఆ ప్రకాశంవల్ల జాగ్రదావస్థను పొందాడు. విరాట్పురుషునియందు ప్రథమంలో ముఖం ఆముఖంనుండి లోకపాలురూ, అగ్నీ, వాగింద్రియమూ, ప్రభవించాయి. వాగింద్రియముతో మానవులు మాట్లాడుతారు. తరువాత విరాట్పురుషునకు తాలుభాగం ఏర్పడింది. దానియందు వరుణుడు, వరుణాంశమైన రసనేంద్రియమూ జన్మించాయి! దీనివల్లనే

గుదం పుంసో వినిర్భిన్నం మిత్రో ధిష్ణ్యం న్యపావిశత్,
పాయునాంశేన యేనాసౌ విసర్గం ప్రతిపద్యతే.
హస్తావస్య వినిర్భిన్నా విన్ద్రః స్వః పతిరావిశత్,
వార్తయాంశేన పురుషో యయా వృత్తిం ప్రపద్యతే.
పాదావస్యవినిర్భిన్నౌ స్వధిష్ణ్యం విష్ణురావిశత్,
గత్యా స్వాంశేన గంతవ్యం యయాసౌ ప్రతిపద్యతే.
హృదయం చాస్య నిర్భిన్నం చంద్రమాధిష్ణ్యమావిశత్,
మనసాంశేన యేనాసౌ విక్రియాం ప్రతిపద్యతే.
బుద్ధిశ్చాస్య వినిర్భిన్నా వాగీశో ధిష్ణ్యమావిశత్,
బోధేనాంశేన బోద్ధవ్యప్రతిపత్తిర్యతో భవేత్.
ఆత్మానం చాస్య నిర్భిన్నమభిమానోవిశత్పదం,
కర్మణాంశేన యే నాసౌ కర్తవ్యం ప్రతిపద్యతే,
సత్త్వం చాస్య వినిర్భిన్నం మహాన్ ధిష్ణ్యముపావిశత్,
చిత్తేనాంశేన యేనాసౌ విజ్ఞానం ప్రతిపద్యతే.
శీర్ష్ణోఽస్య ద్యౌర్ధరాపద్భ్యాం ఖం నాభేరుదపద్యత,
గుణానాం వృత్తయో యేషు ప్రతీయంతే సురాదయః.

అనంతరంనాసిక, అశ్వనీ దేవతలూ, ఘ్రాణేంద్రియమూ జనించాయి. జీవులకు గంధ గ్రహణ సామర్థ్యం దీనివల్ల ఏర్పడింది. క్రమంగా నేత్రాలు, సూర్యుడూ, నేత్రేంద్రియము. దీనివల్ల రూపగ్రహణ సామర్థ్యము త్వగింద్రియమూ, వాయువు జనించడంవల్ల స్పర్శజ్ఞానం యేర్పడింది. కర్ణఛిద్రములూ, శ్రవణేంద్రియమూ, దిక్కులూ ప్రవేశించడంతో శబ్దజ్ఞానంకలిగింది. చర్మమూ, రోమాలూ, ఔషధులూ, జనించాయి. దీనివల్ల కండూతిని గ్రహించగల్గుతాడు. జీవుడు అనంతరం లింగము, తదధిష్ఠాన దేవత, ప్రజాపతీ, ఆయన అంశరూపమైన వీర్యమూ పుట్టాయి, దీనివల్ల జీవులు ఆనందాన్ని పొందుతారు. గుదము, మిత్రుడు, పాయ్వింద్రియమూ ఆవిర్భవించడం వల్ల మలవిసర్జనం యేర్పడింది. తరువాత చేతులూ, గ్రహణత్యాగ రూపమైన శక్తి సమేతంగా ఇంద్రుడు, అధిష్ఠానంగా ప్రవేశించడంవల్ల జీవుడు తన జీవికను నడుపుకోగలుగుతున్నాడు. తరువాత పాదాలు వాని అధిష్ఠాన దేవతగా విష్ణువు, గతిశక్తితో ప్రవేశించడంవల్ల గమనశక్తి కలిగింది. తరువాత

ఆత్యంతికేనసత్త్వేనదివం దేవాః ప్రపేదిరే,
ధరాంరజస్స్వభావేన పణయో యేచతానను.
తార్తీయేన స్వభావేన భగవన్నాభిమాశ్రితాః,
ఉభయోరంతరం వ్యోమరుద్ర పారిషదాం గణాః.
ముఖతో వర్తత బ్రహ్మపురుషస్య కురుద్వహ,
యస్తూన్ముఖత్వా ద్వర్ణానాం ముఖ్యోఽభూద్బ్రాహ్మణోగురుః.
బాహుభ్యోఽవర్తత క్షత్త్రం క్షత్రి యస్త దనువ్రతః,
యోజాతస్త్రాయతే వర్ణాన్ పౌరుషాన్కంటకక్షతాత్.
విశోఽవర్తంత తస్యో ర్వోర్లోకవృత్తికరీ ర్విభోః,
వైశ్యస్తదుద్భవో వార్తాం నృణాం యస్సమవర్తయత్.

బుద్ధీ, బుద్ధిశక్తితో కూడా వాక్పతియగు బ్రహ్మ ప్రవేశించాడు. బుద్ధి శక్తిచేత జీవులు తెలుసుకోవలసిన విషయాలు తెలుసుకుంటారు. తరువాత హృదయం మనశ్శక్తితో కూడిన చంద్రుడూ ఆవిర్భవించారు. అందువల్ల సంకల్ప వికల్పాదులరూపమైన వికారములు ప్రాప్తిస్తాయి. అనంతరం విరాట్పురుషునియందహంకారం అంహాకారాభిమాన దేవత యగు శంకరుడూ క్రియాశక్తీ ఏర్పడి జీవికి కర్తవ్యం నిర్దేశించాయి. తరువాత చిత్తము, చిత్త తత్త్వముతో కూడిన బ్రహ్మ వెలువడి జీవికి చైతన్యం ఇచ్చాయి. విరాట్పురుషుని శిరస్సునుండి స్వర్గలోకమూ, నాభి నుండి అంతరిక్షమూ, పాదములనుండి భూలోకమూ ఉత్పన్నమయ్యాయి. వీనియందు సత్త్వ రజస్తమోగుణ పరిణామరూపులైన దేవతలూ, మనుష్యులూ, ప్రేతాలూ ఉద్భవించాయి. దేవతలుసత్త్వ గుణ ప్రధానులవడంచేత స్వర్గం ఆక్రమించారు. రజోగుణులైన మానవులుభూమిని ఆశ్రయించారు. తమోగుణ ప్రధానులైన భూత ప్రేతాలు రుద్రపార్షదులై భూలోక స్వర్గలోకాలమధ్య అంతరిక్షంలో ఉంటున్నారు.

బ్రాహ్మణులు పరమేశ్వరుని ముఖాన్నుండి జనించడంచేత సర్వ వర్ణాలకూ గురువులైనారు. క్షత్రియులు బాహువులనుండి జనించి చోరుల వల్లా,దుర్మార్గులవల్లాఎవరికీబాధలేకుండా రక్షిస్తూంటారు. వైశ్యులుభగ

పద్భ్యాం భగవతో జజ్ఞేశుశ్రూషాకర్మ సిద్ధయే,
తస్యాంజాతః పురా శూద్రో యద్వృత్త్యా తుష్యతే హరిః,
ఏతేవర్ణాస్స్వధర్మేణ యజంతి స్వగురుం హరిమ్,
శ్రద్ధయాత్మవిశుధ్యర్థం యజ్జాతాస్సహ వృత్తిభిః.
ఏతత్క్షత్తర్భగవతో దైవకర్మాత్మరూపిణః,
కశ్శ్రద్దధ్యాదుపాకర్తుం యోగమాయాబలోదితం.
అథాపికీర్తయామ్యంగయథామతి యథాశ్రుతం,
కీర్తిం హరేస్స్వాం సత్కర్తుం గిరమన్యాభిధానతీం.
ఏకాంతలాభం వచసోనుపుంసాం సుశ్లోక మౌళేర్గుణవాద మాహుః,
శ్రుతేశ్చ విద్వద్భిరుపాకృతాయాం కథాసుధాయా ముపసంప్రయోగం.
ఆత్మనోఽప్యాదికవినా మహిమా వసితోఽపికిం,
సంవత్సర సహస్రాంతే ధియా యోగవిపక్వయా.

వానుని ఊరువులనుండి జనించడంవల్ల సర్వజీవులకు పోషకులై ఉంటారు. సర్వధర్మసిద్ధికై భగవచ్చరణాలనుండి సేవావృత్తితో శూద్రులు ఆవిర్భవించి సర్వధర్మసిద్ధిమూలమైన సేవాధర్మాన్ని అనుష్ఠిస్తూ ఉంటారు. సేవాధర్మంచేతనే శ్రీహరిప్రసన్నుడౌతాడు. ఈనాలుగువర్ణాలవారూ వారివారి వృత్తులలో వుండి వారివారి ధర్మాలు అనుష్ఠిస్తూ చిత్తశుద్ధితో శ్రీహరిని పూజిస్తున్నారు. ఇది విరాట్పురుష కాలకర్మ స్వభావాలతో కూడిన భగవానుని యోగమాయా ప్రభావం. దీన్ని సమగ్రంగా చెప్పడానికెవడూ సాహసించలేడు. లోకసంభంధమైన చర్చలతో అపవిత్రమైన వాణి పవిత్రమగుటకై గురువువల్ల తెలుసుకున్నంతవరకూ శ్రీహరి కీర్తిని గానం చేశాను. భగవద్గుణ గానమే మానవుని వాణికి ఫలం. శ్రవణేంద్రియానికి హరికథా శ్రవణమే ఫలం మనమేకాదు ఆదికవి చతుర్ముఖుడే. వెయ్యిసంవత్సరాలు ఆలోచించి మహాపురుషుడైన భగంతుని మహిమను పూర్తిగా గ్రహించలేక పోయాడు. మహామాయావులనుకూడా మోహింపచేసేది భగవన్మాయ. మహామాయకుడగు భగవంతునికూడా మోహింపజేయగల మాయాశక్తిని యెవడు దాటగలడు ? మనస్సుతో కూడిన వాక్కు ఏ భగవంతుని గ్రహించి, లేక, వెనుదిరిగిందో అహంకారాభిదేవతయైన రుద్రుడూ, ఇంద్రియాధిష్ఠాన

అహో భాగవతీ మాయామాయి నామపి మోహినీ,
యత్స్వయం చాత్మ వర్త్మాత్మాన వేద కిముతాపరే.
యతో ప్రాప్యన్యవర్తంత వాచశ్చమనసా సహ,
అహం చాన్యఇమే దేవాస్తస్మైభగవతే నమః.

దేవతలూ కూడా మాయనుదాటి భగవంతుని మహిమను గుర్తించ లేక పోయూరో అట్టి శ్రీహరికి మనము నమస్కరిస్తున్నాము.

6 అధ్యాయం

ఏవం బ్రువాణం మైత్రేయం ద్వైపాయనసుతో బుధః,
ప్రీణయన్నివ భారత్యా విదురః ప్రత్యభాషత.
బ్రహ్మన్ కథం భగవతశ్చిన్మాత్రస్యావికారిణః,
లీలయావాపి యుజ్యేరన్నిర్గుణస్య గుణాః క్రియాః.
క్రీడాయాముద్యమోర్భస్య కామశ్చిక్రీడిషాన్యతః,
స్వతస్తృప్తస్య చ కథం నివృత్తస్యసదాన్యతః.
అస్రాక్షీ ద్భగవాన్ విశ్వం గుణమ య్యాత్మమాయయా,
తయాసంస్థాపయత్యేతద్భూయః ప్రత్యభిధాస్యతి.
దేశతఃకాలతో యోసావవస్థాతస్స్వతోఽన్యతః,
అవిలుప్తావబోధాత్మా సయుజ్యేతా జయాకథం.

మైత్రేయుని పలుకు లాలకించిన విదురుడు మైత్రేయునకు నమస్కరించి మైత్రేయా ! శుద్ధబోధస్వరూపుడూ, నిర్గుణుడూ, ఐన భగవంతునితో లీలామాత్రం చేతనైనా గుణక్రియాదులతో సంబంధం ఎలా కలుగుతుంది, తోడిబాలురతో ఆడాలనే కోరికతో ఆడుతాడు. నిత్యతృప్తుడైన శ్రీహరి క్రీడార్థమై యీ సంకల్పం యెందుకుచేశాడు. భగవానుడు గుణమైన తనమాయచేతనే సృష్టిస్థితిలయాలు చేస్తూంటాడు. దేశకాలావస్థలచేత, తనంతతానై. ఇతరనిమిత్తకారణాలచేత కూడా లోపం లేని పరిపూర్ణుడు. మాయతో కలిశాడు. ఏకమాత్రుడైన పరమేశ్వరుడే, సమస్తక్షేత్రములందూ, సాక్షిరూపుడుగా ఉన్నప్పుడు, జీవులకు దౌర్భాగ్యం, క్లేశం, ఎలాకలుగుతాయి? నాకీసందేహం

భగవానేక ఏవైష స్సర్వక్షేత్రేష్వవస్థితః,
అముష్య దుర్భగత్వం వాక్లేశో వాకర్మభిః కుతః.
ఏతస్మిన్మే మనో విద్వన్ ఖిద్యతే జ్ఞానసంకటే,
తన్నః పరాణుద విభో కశ్మలం మానసం మహత్.
స ఇత్థం చోదితః క్షత్త్రా తద్విజిజ్ఞాసునా మునిః,
ప్రత్యాహ భగవచ్చిత్తః స్మయన్నివ గతస్మయః.
సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే,
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత బంధనం.
యదర్థేన వినా పుంసో మృషైవాత్మ విపర్యయః,
ప్రతీయత ఉపద్రష్టుః స్వశిరశ్ఛేదనాదినా.
యథా జలే చంద్రమసః కంపాదిస్త త్కృతో గుణః,
దృశ్యతే సన్నపి ద్రష్టురాత్మనో నాత్మనో గుణః.

నివారించు. అని కోరిన విదురునికి అహంకారశూన్యుడైన మైత్రేయుడు చిరునవ్వు నవ్వుతూ – విదురా ! ఆత్మ సమస్తజీవులకూ, స్వాముక్త రూపము, అయినప్పుడు దీనత్వమూ, బంధనమూ దానియందు ఆరోపించడం కేవలం మూర్ఖలక్షణం, యుక్తివిరుద్ధం, కాని ఇదే భగవంతునిమాయ, స్వప్నావస్థలో తనశిరస్సు నరికినట్లు కలగన్నవానికి అది అసత్యమైనా, సత్యంగా, ఆభాసిస్తూన్నట్లే, బంధనాదులు లేకపోయినా అజ్ఞానవశంచేత జీవుడు బద్ధుడైనట్లు భాసిస్తాడు, జలంలో ప్రతిబింబించే చంద్రబింబం, కదలకపోయినా నీటిలోని కదలికవల్ల బింబంకూడా కదులుతూన్నట్లు, కనబడినట్లే, దేహాభిమానియైన జీవునియందీ మిథ్యాధర్మప్రతీతి కలుగుతూంటుంది. ఆకాశమందున్న చంద్రునియందీ చలనరూపమైన ఆభాసకూడా లేనట్లే ఈశ్వరునియందీ మిథ్యాప్రతీతి కలుగదు. నిష్కామంగా ధర్మాన్నాచరించేవారికి, మెల్లమెల్లగా భగవదనుగ్రహం కలిగి అందువల్ల లభించిన భక్తియోగంచేత అజ్ఞానరూపమైన యీ ప్రతీతి నివృత్తిఅవుతుంది. మానవుని ఇంద్రియాలు, విషయవిముక్తాలు కాగానే మనస్సుతోసహా ఇంద్రియాలన్నీ నిశ్చలంగా పరమేశ్వరునియందు, లగ్నమౌతాయి. ఆసమయంలో జీవుడు గాఢనిద్రావస్థయందున్నట్లు రాగద్వేష విముక్తుడై ఆనందం పొందగలడు.

ఏవై నివృత్తిధర్మేణ వాసుదేవానుకంపయా,
భగవద్భక్తియోగేన తిరోధత్తే శనైరిహ,
యదేంద్రియోపరామోఽథ ద్రష్టాత్మని పరే హరౌ,
విలీయంతే యథాక్లేశా స్సంసుప్తస్యేవ కృత్స్నశః.
అశేషసంక్లేశశమం విధత్తే గుణానువాదశ్రవణం మురారేః,
కిం వా పునస్తచ్చరణారవిందపరాగ సేవారతిరాత్మలబ్ధా.
సంఛిన్నసంశయో మహ్యం తవ సూక్తాసినా విభో,
ఉభయత్రాపి భగవన్మనోమే సంప్రధావతి.
సాధ్వేతద్వ్యాహృతం విద్వన్నాత్మమాయాయనం హరేః,
యద్వాత్మపార్థం నిర్మూలం విశ్వమూలం సదుద్భవేః,
యశ్చ మూఢతమోలోకే యశ్చ బుద్ధేః పరంగతః,
తావుభౌ సుఖమేధేతే క్లిశ్యత్యంతరితో జనః.

శ్రీకృష్ణుని గుణగానం సమస్తదుఃఖాల్నీ నశింపజేస్తాదంటే మన హృదయాల్లో. శ్రీకృష్ణచరణరజాన్ని సేవించాలనే భక్తిరూపమైన ప్రేమ ఉద్భవించినప్పుడు చెప్పేదేముంది అన్నాడు.

మీ యుక్తియుక్తమైన మాటలనే ఖడ్గంచేత నాసందేహం ఛిన్నాభిన్నమైంది. కాని జీవునియందుండే, అస్వతంత్రతా, స్వతంత్రతా గ్రహించాలని ఉంది. నీవు చెప్పడంలో జీవునియందే క్లేశాదులు ప్రతీత మౌతాయని దానికాధారం పరమేశ్వరుని మాయయే యని అంత కంటే వేరుకారణం లేదనీ చెప్పావు. ఈ క్లేశంకూడ మిధ్య, మూల రహితం అనికూడా నువ్వే చెప్పావు. ఇదంతా సమంజసంగానేవుంది. ఈలోకంలో రెండు తెగలవారే సుఖంగా ఉన్నారు. అందులో మొదటి వారు జ్ఞానదృష్టిచేత భగవంతుని పొందినవారు, రెండవవారు మూర్ఖులు, అటుజ్ఞానులూకాక ఇటు మూఢులూగాక మధ్యలో ఉన్న వారు సంశయంతో దుఃఖిస్తున్నారు. నీ అనుగ్రహంవల్ల నేనీ నిశ్చయం చేసుకున్నాను. అనాత్మపదార్థం అసలు లేనేలేదనీ కేవలం ప్రతీతి మాత్రమే కలుగుతున్నదని గ్రహించగలిగాను. నీ చరణసేవా ప్రభావంచేత ఆ ప్రతీతినికూడా త్రోసివేయ గలుగుతాను. భగవంతుని

అర్థాభావం వినిశ్చిత్య ప్రతీతస్యాప్యనాత్మనః,
తాం చాపియుష్మచ్చ రణసేవయాహం పరాణుదే.
యత్సేవయా భగవతః కూటస్థస్య మధుద్విషః,
రతి రాసో భవేత్తీవ్రః పాదయోర్వ్యసనార్దనః.
దురాపా హ్యల్పతపసా సేవా వైకుంఠవర్త్మను,
యత్రోపగీయతే నిత్యం దేవ దేవో జనార్దనః.
సృష్ట్వాగ్రే మహదాదీని సవికారా ణ్యనుక్రమాత్,
తేభ్యో విరాజ ముద్ధృత్య తమను ప్రావిశ ద్విభుః.
యమాహురాద్యం పురుషం సహస్రాంఘ్ర్యూరుబాహుకమ్;
యత్ర విశ్వ ఇమే లోకా స్సవికాసం సమాసతే.
యస్మిన్ దశవిధః ప్రాణస్సేంద్రియార్థేంద్రియస్త్రివృత్;
త్వయేరితా యతో వర్ణాస్తద్విభూతీర్వదస్వనః.
యత్ర పుత్రైశ్చ పౌత్రైశ్చ నప్తృభిస్సహగోత్రజైః,
ప్రజావిచిత్రాకృతయ ఆసన్ యాభిరిదంతతమ్.
ప్రజాపతీనాం సపతి శ్చిక్లిపేకాన్ ప్రజాపతీన్,
సర్గాంశ్చైవానుసర్గాంశ్చ మనూన్ మన్వంతరాధిపాన్.

యందుగల ఉత్కటమైన, ప్రేమ, ఆనందాన్ని, వృద్ధిచేసి సంసారరూప మైన దుఃఖాన్ని నశింపజేస్తుంది. మీవంటి మహాత్ములు, భగవత్ప్రా ప్తికి సాక్షాత్తూ మార్గస్వరూపులు. మహాత్ముల సన్నిధిని భగవద్గుణ గానమే జరుగుతూంటుంది. అల్పమైన పుణ్యంకలవారు మహాత్ములను సేవించలేరు. వారిదర్శనమే కష్టం. అని విదురుడు ఇంకా అంటున్నాడు.

ఋషిపుంగవా? సృష్ట్యాదియందు, మహత్తత్త్వాదులనూ, వాటి వికారాలనూ, సృష్టించి వానియొక్క అంశలచేతనే విరాట్పురుషుని సృజించి, తాను స్వయంగా విరాట్పురుషునియందు భగవానుడు ప్రవే శించాడు అని చెప్పావు. విరాట్పురుషునకు వేలకొద్దీ శిరస్సులూ, చేతులూ, కాళ్ళూ, కళ్ళూ, నాసికలూ ఉన్నాయనీ, ఆతడే ఆదిపురుషు డనీ వేదం చెపుతూన్నది. ఆపురుషునియందే సమస్తలోకాలూ, ఇంద్రి యాలూ, విషయాలూ, ఇంద్రియాభిమాన దేవతలు దశప్రాణాలూ, ఇంద్రియబలం, మనోబలం, శారీరకబలం మొదలయిన సర్వవిధ

పేతేషామపి వంశ్యాంశ్చ వంశానుశచరితాని చ,
ఉపర్యధశ్చయే లోకా భూమి ర్మిత్రాత్మ జాసతే,
తేషాం సంస్థాం ప్రమాణం చ భూలోకస్య చ వర్ణయ.
తిర్యఙ్మనుష్యదేవానాం సరీసృపపతత్రిణామ్,
వదనస్సర్గ స్సంవ్యూహం గార్భాండ స్వేదజోద్భిజామ్.
గుణావతారై ర్విశ్వస్య సర్గస్థిత్యప్యయాశ్రయం,
సృజతః శ్రీనివాసస్య వ్యాచక్ష్వోదార విక్రమమ్.
వర్ణాశ్రమ విభాగాంశ్చ రూపశీలస్వభావతః,
ఋషీణాంజన్మకర్మాణి వేదస్య చ వికర్షణమ్.
యజ్ఞ స్య చ వితానాని యోగస్య చ పథః ప్రభో,
నైష్కర్మ్యస్య చ సాంఖ్యస్య తంత్రం వా భగవత్కృతమ్,
పాషండపంథవైషమ్యం ప్రతిలోమనివేశనమ్,
జీవానాంగతయో యాస్తు యావతీర్గుణకర్మజాః.
ధర్మార్థకామమోక్షాణాం నిమిత్తాన్యవిరోధతః,

యాలూ, చెప్పారు. ఇప్పుడు, ఆ ఆదిపురుషుడైన, విరాట్పురుషుని విభూతిరూపులైన బ్రహ్మాదుల వారి పుత్ర పౌత్ర, పౌత్రుల ఉత్పత్తిని వివరించండి. విరాట్పురుషుడు బ్రహ్మాదులకుకూడా ప్రభువే. ఆ ఆది మూర్తి ఏయే ప్రజాపతులను సృష్టించాడు. సర్గ, అనుసర్గ, మన్వంత రాధిపతులైన మనువులను, యేక్రమంలో సృష్టించాడు ? మనువుల వంశాలూ, వంశధరులైన రాజులచరిత్రలూ, భూమికి పైలోకాలూ, క్రిందిలోకాలూ భూలోక విస్తారస్థితీ చెప్పండి, తిర్యక్కీ, మనుష్య, దేవ తలూ, సరీసృపాదులు, పక్షులూ, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భి జాది, చతుర్విధ ప్రాణికోట్లీ, యెలా సృష్టింపబడ్డాయి. సృష్ట్యారం భంలో, శ్రీహరిగుణావతారుడుగ, బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపా లలో, అవతరించి ప్రదర్శించిన లీలలుకూడా, వివరించండి. వేషము, ఆచరణ, స్వభావముల ననుసరించి, వర్ణాశ్రమవిభాగం, ఋషుల జన్మ కర్మాదులూ, వేదవిభాగం, యజ్ఞములయొక్క విస్తారం, యోగజ్ఞాన మార్గాలూ, వాటిని సాధించేవిధి, సాంఖ్య, నారదపాంచరాత్రాది, తంత్రశాస్త్రాలు, వాటి వివరణా, పాషండమతాలూ, వాటివల్లకలిగే

వార్తాయా దండనీతేశ్చ వృత్తస్య చ విధిం పృథక్.
శ్రాద్ధస్య చ విధిఃబ్రహ్మన్పితౄణాం సర్గమేవ చ,
గ్రహనక్షత్రతారాణాం కాలావయవ సంస్థితిం.
దానస్య తపసో వాపి యచ్చేష్టాపూర్తయోః ఫలం,
ప్రవాసస్య చ యో ధర్మో యశ్చ పుంస ఉతాపది.
యేన వా భగవాంస్తుష్యే ద్ధర్మయోని ర్జనార్దనః,
సంప్రసీదతి వా యేషామేతదాఖ్యాహి మేఽనఘ.
అనువ్రతానాం శిష్యాణాం పుత్రాణాం చ ద్విజోత్తమ,
అనాపృష్ట మపి బ్రూయు ర్గురవో దీనవత్సలాః,
తత్త్వానాం భగవంస్తేషాం కతిధా సంప్రతి క్రమః,
తత్రేమం క ఉపాసీరన్క ఉస్విదను శేరతే.
పురుషస్య చ సంస్థానం స్వరూపం వా పరస్య చ,
జ్ఞానంచనైగమం యేనతయోరైక్యం తథావద.
నిమిత్తానిచ తస్యైవ ప్రోక్తాన్యనఘసూరిభిః,
స్వతో జ్ఞానం కుతః పుంసాం భక్తిర్వైరాగ్యమేవ వా.
ఏతాణ మే పృచ్ఛతః ప్రశ్నాన్ హరేః కర్మవివిత్సయా.

ప్రమాదాలూ, నీచవర్ణుడైన పురుషునకు, ఉచ్చవర్ణపు స్త్రీవల్ల కలిగిన సంతానం, వారియందుండే గుణాలూ, కర్మలననుసరించి, జీవునకు కలిగే గతులూ, యివన్నీ సవిస్తరంగా వివరించండని విదురుడింకా అడుగుతున్నాడు. ధర్మార్థ కామమోక్షాలు పొందటానికి పరస్పరవిరుద్ధం కాని సాధనములైన దండనీతీ, వాణిజ్యం, శాస్త్రశ్రవణం వీటియొక్క విధులూ శ్రాద్ధవిధీ, పితృగణంయొక్క సృష్టిక్రమం, కాలచక్రంలో గ్రహ నక్షత్ర తారగణాదుల స్థితిగతులూ, వేరువేరుగా చెప్పండి. తపోదానాలూ, ఇష్టా పూర్తములూ, మొదలైన కర్మలవల్ల కలిగే ఫలం, కూడా వివరించండి. ప్రవాసంలోనూ ఆపత్కాలంలోనూ, మనుష్యునికేవి ఎటువంటి ధర్మాలౌతాయి? ధర్మానికిమూలకారణుడైన జనార్దను డేసాధన వల్ల సంతుష్టుడౌతాడు.. వివరంగాచెప్పండి? మహత్తత్త్వాదుల ప్రళయం యెన్నివిధాలు? భగవంతుడు యోగనిద్రాపరవశుడైనప్పుడు ఎన్నితత్త్వాలాయనను సేవిస్తూంటాయి? ఏతత్త్వాలు భగవానునిలో లీనమౌతాయి? జీవతత్త్వం పరమేశ్వరుని స్వరూపం, ఉపనిషత్ప్రతిపాదితమైన జ్ఞానం

బ్రూహి మేఽంధస్య మిత్రత్వాదజయా మృష్టచక్షుషః.
సర్వే వేదాశ్చయజ్ఞాశ్చ తపోదానాని చానఘ,
జీవాభయ ప్రదానస్య న కుర్వీరన్ కళామపి.
స ఇత్థమాపృష్టపురాణకల్పః కురుప్రధానేన మునిప్రధానః,
ప్రవృద్ధహర్షో భగవత్కథాయాం సంచోదితస్తం ప్రహసన్నివాహ.

గురుశిష్యుల పరస్పర ప్రయోజనం, యేమిటి? భక్తిజ్ఞాన వైరాగ్యాలు తమంతతామై శిద్ధించవుగదా? ఏసాధనవల్ల అజ్ఞానం పాప్తిస్తుంది? వేదాలను సాంగోపాంగంగా అధ్యయనం చేసినా, తపస్సుచేసినా, యెన్నిదానాలుచేసినా సాధించలేని మహాపుణ్యం జ్ఞానోపదేశంవల్ల లభిస్తుంది. కనుక నువ్వు జన్మమృత్యువినాశకమైన జ్ఞానాన్ని నాకు ఉపదేశించమని అడిగిన విదురునకు మైత్రేయుడిలా చెబుతున్నాడు.

## 7 అ ధ్యా య ం

సత్సేవనీయో బత పూరువంశో యల్లోకపాలో భగవత్ప్రధానః
బభూవి థేహాజితకీర్తిమాలాం పదేపదే నూతనయస్యభీక్ష్ణమ్.
సోఽహం నృణాం క్షుల్లసు ఖాయ దుఃఖం మహద్గతానాం విరమాయ తస్య,
ప్రవర్తయే భాగవతం పురాణం యదాహ సాక్షాద్భగవానృషిభ్యః.
ఆసీనముర్వ్యాం భగవంతమాద్యం సంకర్షణం దేవమకుంఠసత్త్వం,
వివిత్సవస్తత్త్వమతః పరస్య కుమారముఖ్యాము వయోఽన్వపృచ్ఛన్.
స్వమేవధిష్ణ్యం బహుమానయంతం యం వాసుదేవాభిధ మామనంతి,
ప్రత్యగ్ధృతాక్షాంబుజ కోశమీష దున్మీలయంతం విబుధోదయాయ.

విదురా! నీవు భక్తుడవు లోకపాలకులలో ధర్మాన్ని శాసించగల యముడవూ, సర్వమానవ కల్యాణదాయకమైన ప్రశ్న వేశావు. దుఃఖ వినాశన హేతువూ, మోక్షదాయకమూ అయిన, మహాభాగవతం, సంకర్షణుడు సనకాదులకు చెప్పాడు అదే వినిపిస్తాను విను. అఖండజ్ఞానం కల సంకర్షణుడు పాతాళలోకంలో ఉన్నాడు. సనత్కుమారాదులు ఆ ఆదిశేషువును దర్శించే సమయానికి ఆయన తనకాశ్రయమైన పరమాత్మను మానసికంగా ఆరాధిస్తున్నాడు. సంకర్షుసుని కమల కోశం

సద్ధున్యుదార్ద్రైః స్వజటాకలాపైరుప స్పృశంతచ్చరణో పధానమ్,
పద్మం యదర్చత్యంహి రాజకన్యాస్సప్రేమ నానాబలిభిర్వరార్థాః.
ముహుస్గృణంతో వచసాను రాగాస్ఖలత్పదేనాస్య కృతాని తత్జ్ఞాః,
*కిరీటసాహస్రమణి ప్రవేక ప్రద్యోతితోద్దామ ఫణాసహస్రం.
ప్రోక్తం కిలైతద్భగవత్తమేన నివృత్తధర్మాభిరతాయ తేన,
సనత్కుమారాయ సచాహపృష్టస్సాంఖ్యాయనాయాథధృతవ్రతాయ.
సాంఖ్యాయనః పారమహంసముఖ్యో వివక్షమాణో భగవద్విభూతీః,
జగాద సోఽస్మద్గురవేఽన్వితాయ పరశరాయథ బృహస్పతేశ్చ.
ప్రోవాచ మహ్యాం సదయాలునోక్తో మునిః పులస్త్యేన పురాణమాద్యం,
సోఽహం తవైతత్కథయామివత్సశ్రద్ధాళవే నిత్య మనువ్రతాయ.
ఉదాప్లుతం విశ్వమిదం యదాసీత్తన్నిద్రయా మీలితదృఙ్న్య మీలయత్,
అహీంద్రతల్పేఽధిశయానఏకః కృతక్షణస్స్వాత్మరతౌ నిరీహః.

వంటి నేత్రాలు మూయబడి ఉన్నాయి. సనత్కుమారాదులు నమస్కరించి పురుషోత్తమ తత్త్వం చెప్పమని అడిగినప్పుడా శేషమూర్తి సనకాదుల ఆనందాన్ని అర్ధనిమీలిత దృష్టితో చూశాడు. ఆసమయంలో నాగకన్యకలు అభీష్టసిద్ధికై శేషునిపాదాలు అర్చిస్తున్నారు. సనకాదులు సంకర్షణునకు పునః పునః సాష్టాంగ నమస్కారాలు చేశారు. సనత్కుమారాదులు సంకర్షణుని లీలారహస్యములు గ్రహించిన వారగుటచే సహస్రశీర్షుడైన,ఆదిశేషుని అనేక విధాల స్తుతించారు. వారిస్తుతికానందించిన శేషభగవానుడు, వేయికిరీటములచే వేలకొలది మణులచే కనులుమిరుమిట్లుగొలిపే వేయిపడగలూ విప్పాడు. ప్రసన్నుడైన అనంతుడు సనకాదులు ప్రశ్నింప అనుగ్రహ దృష్టితో భాగవతం వినిపించాడు. ఆభాగవతాన్ని నివృత్తిపరాయణులైన సనకాదులు, సాంఖ్యాయనునకు పరాశరునకూ, బృహస్పతికీ, వినిపించారు. తరువాత పులస్త్యుని ఆదేశానుసారం పరాశరుడు నాకు చెప్పాడు. ఆభాగవతమే నీకు వినిపిస్తాను విను.

సృష్టికి పూర్వమందీ విశ్వమంతా జలగర్భంలోవుంది. ఆసమయమందు శేషశయ్యమీద ఆదినారాయణుడొక్కడే పరుండిఉన్నాడు

సోఽంతశ్శరీరేఽర్పిత భూతసూక్ష్మః కాలాత్మికాం శక్తిముదీరయాణః,
ఉవాస తస్మిన్ సలిలే పదే స్వే యథానలో దారుణి రుద్ధవీర్యః.
చతుర్యుగానాం చ సహస్రమప్సు స్వపన్ స్వయోగేరితయా స్వశక్త్యా,
కాలాఖ్యయా సాదితకర్మతంత్రో లోకాన్ ప్రలీనాన్ దదృశే స్వదేహే.
తస్యార్థసూక్ష్మాభి నివిష్టదృష్టేరంతర్గతోఽర్థో రజసా తనీయాన్,
గుణేన కాలానుగతేన విద్ధస్సూష్యం స్తదాభిద్యత నాభిదేశాత్,
సపద్మకోశస్సహసోదతిష్ఠత్కాలేన కర్మప్రతిబోధనేన,
స్వరోచిషా తత్సలిలం విశాలం విద్యోతయన్నర్క ఇవాత్మయోనిః.
తల్లోకపద్మం స ఉ ఏవ విష్ణుః ప్రావీవిశత్సర్వగుణావభాసమ్,
తస్మిన్ స్వయం వేదమయో విధాతా స్వయంభువం యం ప్రవదంతి సోఽభూత్.
తస్యాం స చాంభోరుహకర్ణికాయామవస్థితో లోకమపశ్యమానః,
పరిక్రమన్ వ్యోమ్ని వివృత్తనేత్రశ్చత్వారి లేభేఽనుదిశం ముఖాని.

తనజ్ఞానశక్తిని క్షుణ్ణం కానీకుండా యోగనిద్రలో కనులుమూసి, సృష్టి కర్మలలో విశ్రాంతి తీసుకుంటూ ఆత్మానందంలో ఉన్న భగవానుని యందే క్రియలూ మేల్కొంచిలేవు. అగ్ని తన యందుండే దాహకాది శక్తులతో కాష్ఠమందు దాగియున్నట్లే భగవానుడు సమస్తజీవుల సూక్ష్మశరీరాలను తనయందు లీనంచేసుకుని యోగనిద్రలో ఉన్నాడు. సృష్టికాలం ఆరంభం అయినప్పుడు కాలశక్తిని మేలుకొలపడం జరుగుతుంది. వేయిమహాయుగాలు యోగనిద్రావస్థలో ఉండి అనంతరం కాలశక్తిని ప్రేరేపించడంతో ఆకాలశక్తి జీవులను కర్మప్రవృత్తికొరకై ప్రేరేపిస్తుంది. ఆసమయంలో భగవానుడు తన దేహమందు లీనమైన అనంతలోకాలూ చూస్తాడు. భగవానుని దృష్టితన యందున్న లింగ శరీరాది సూక్ష్మతత్త్వాదులయందు పడ్డదో అప్పుడే కాలాశ్రితమైన రజోగుణం క్షుభితమై సృష్టిరచనా నిమిత్తంగా భగవానుని నాభిదేశం నుండి బయటికివస్తుంది. కర్మశక్తి ప్రేరకమైన కాలశక్తిద్వారా విష్ణు భగవానుని నాభినుండి ప్రకటమైన సూక్ష్మతత్త్వం కమలకోశరూపంలో బహిర్గతమై సూర్యసమతేజంతో జలరాశిని ప్రకాశింప చేసింది. సమస్త గుణాలనూ ప్రకాశింప జేసి సర్వలోకమయమైన ఆకమలకోశమందు అంతర్యామి రూపంలో విష్ణువు ప్రవేశించాడు. వెంటనేజన్మతః సమస్త

తస్మాద్యుగాంతశ్వసనావఘూర్ణమహోర్మి చక్రాత్సలిలాద్విరూఢం,
అపాశ్రితః కంజములోకతత్త్వం నాత్మానమద్ధావిదదాదిదేవః.
కఏషయోఽసావహమబ్జపృష్ఠ ఏతత్కుతో వాబ్జమనన్యదప్సు,
అస్తిహ్యధస్తాదిహ కించనైతదధిష్ఠితం యత్ర సతానుభావ్యమ్.
సఇత్థముద్వీక్ష్యతదబ్జనాళనాడీభిరంతర్జలమావివేశ,
నార్వాగ్గతస్తత్ఖరనాళనాభిం సవై విచిన్వంస్తదవిందతాజః.
తమస్యపారే విదురాత్మసర్గం విచిన్వతోఽభూత్సుమహాంస్త్రినేమిః,
యోదేహభాజాం భయమీరయానః పరిక్షిణోత్యాయురజస్య హేతిః.
తతో నివృత్త్యా ప్రతిలబ్ధకామః స్వధిష్ణ్యమాసాద్య పునస్సదేవః,
శనైర్జితశ్వాస నివృత్తచిత్తోన్యషీదదారూఢసమాధియోగః.
కాలేనసోఽజః పురుషాయుషాభి ప్రవృత్తయోగేన విరూఢబోధః,
స్వయం తదంతర్హృదయేఽవభాతమపశ్యతాపశ్యత యన్న పూర్వం.
మృణాలగౌరాయతశేషభోగపర్యంకఏకం పురుషం శయానం,
ఫణాతపత్రాయుతమూర్ధరత్నద్యుభిర్హతధ్వాంతయుగాంతతోయే,

వేదపరిజ్ఞానం కల వేదమూర్తి బ్రహ్మ ఆకమలమందు ఆవిర్భవించాడు. ఈయననే స్వాయంభువంటారు. ఆకమలకర్ణికయందాసీనుడైన బ్రహ్మకు లోకాలేమీ కనుపించలేదు. కనులు తెరచి నలుమూలలూ చూసే సమయంలోనే బ్రహ్మకు నాలుగుముఖాలు యేర్పడ్డాయి. ఆసమయంలో ప్రళయకాలీనమైన వాయువుచే ప్రేరితములైన ఉత్తుంగ తరంగాలు కారణంగా జలోపరి భాగంలోఉన్న కమలమందున్న బ్రహ్మకు తన యొక్క రహస్యం ఆకమలంయొక్క రహస్యం అర్థంకాలేదు.

ఈ కమలకర్ణికలో కూర్చున్న నేనెవరిని? ఏ ఆధారంలేకుండా ఈ జలంలో ఈ కమలం యెక్కడనుండి ఉద్భవించింది? దీనికాధార మేమో యీక్రింద వుండి తీరాలని ఆలోచించి ఆకమలాధారం గ్రహించాలని కమలనాళంయొక్క సూక్ష్మరంధ్రంలో ప్రవేశించి నారాయణుని నాభిసమీపం దాకా వెళ్లికూడా ఆకమలాధారం గ్రహించలేక పోయాడు. చతుర్ముఖుడు, ఆ, అపారమైన అంధకారంలో తన జన్మస్థానం వెతుకుతూ చాలాకాలం చరించాడు. ఆకాలమే భగవానుని చక్రం. కాలచక్రమే జీవుల ఆయుర్దాయాన్ని హరిస్తుంది. బ్రహ్మ విఫల.

ప్రేక్షాం క్షిపంతం హరితోపలాద్రేస్సంధ్యాభ్రనీ వేరురురుక్మమూర్ధ్నః,
రత్నోదధా రోపధిస్రామనస్యవనస్రజోవేణుభుజాంఘ్రిపాంఘ్రేః.
ఆయామతో విస్తరతస్స్వమానదేహేన లోకత్రయసంగ్రహేణ,
విచిత్రదివ్యాభరణాంశుకానాం కృతశ్రియోపాశ్రితవేషదేహమ్,
పుంసాం స్వకామాయ వివిక్తమార్గైరభ్యర్చతాం కామదుఘాంఘ్రిపద్మమ్,
ప్రదర్శయంతం కృపయా నఖేందుమయూఖభిన్నాంగుళి చారుపత్రమ్.
ముఖేన లోకార్తిహరస్మితేన పరిస్ఫురత్కుండలమండితేన,
శోణాయితేనాధరబింబభాసా ప్రత్యర్హయంతం సునసేన సుభ్ర్వా.
కదంబకింజల్కపిశంగవాససా స్వలంకృతం మేఖలయా నితంబే,
హారేణ చానంతధనేన వత్స శ్రీవత్సవక్షస్థలవల్లభేన.
పరార్ధ్యకేయూరమణిప్రవేకపర్యస్తదోర్దండసహస్రశాఖమ్,
అవ్యక్తమూలాంఘ్రి వనాంఘ్రిపేంద్ర మహీంద్రభోగై రధివీతవల్కమ్.
చరాచరౌకో భగవన్మహీధ్ర మహీంద్రబంధుం సలిలోపగూఢమ్,
కిరీటసాహస్రహిరణ్య శృంగమావిర్భవత్కౌస్తుభరత్నగర్భమ్.
నివీతమామ్నాయమధువ్రతశ్రియా స్వకీర్తిమయ్యావనమాలయా హరిమ్,
సూర్యేందువాయ్వగ్న్యగ మంత్రిధామభిః పరిక్రమత్ప్రాధనికైర్దురాసదమ్.

మనోరథుడై వెనుకకు మరలి కమలకర్ణికా పీఠమందాసీనుడై ప్రాణ వాయువును బంధించి సంకల్పరహితుడై నూరుదివ్యసంవత్సరాలు సమాధిలో కూర్చుండి పోయాడు. ఆ సమాధిలో పూర్ణజ్ఞానం కలిగి తను పూర్వం యెంతోకాలం వెదికికూడా గ్రహించలేని తన అధిష్ఠాన మైన ఆదిరూపాన్ని చూడగలిగాడు. వేలశిరస్సులుగల ఆదిశేషుని ఫణ ములే ఛత్రంగా ఆ శేషశయ్యయందు ఒక్కడుగా శయనించియున్న చతుర్భుజ రూపుడైన ఆదినారాయణుడే సర్వజగత్కారణంగా గ్రహించగలిగాడు. శేషునిశిరములందుగల కిరీటము లందలి మణులు సమస్త దిశలనూ ప్రకాశింపజేస్తున్నాయి. శ్యామసుందరుడై శ్రీహరి పీతాంబరధారియై శోభిస్తూంటే మరకతమణిమయ పర్వతసమీపంలో సంధ్యారాగంవలె ఆనందాన్ని చేకూరుస్తున్నాడు. ఆయన శరీరప్రమా ణం త్రిలోకాలనూ అతిక్రమించింది. వస్త్ర భూషణాదులకు వానివల్ల శోభకలుగుతూవున్నా కనకకిరీటం కేయూరహారాలూ పీతాంబరంధరించే

తస్యైవతన్నాభిసరస్సరోజ మాత్మానమంభశ్శ్వసనం వియచ్చ,
దదర్శదేవో జగతో విధాతా నాతః పరంలోక విసర్గదృష్టిః.
సకర్మబీజం రజసోపరక్తః ప్రజాస్సిసృక్షన్నియదేవ దృష్ట్వా,
అస్తౌద్విసర్గాభిముఖస్తమీడ్య మవ్యక్తవర్త్మన్యభివేశితాత్మా.

ఉన్నాడు. భిన్నభిన్నమార్గాల్లో సేవించేవారికి మనోరథాలు పూర్తి చెయ్యటానికి దర్శనంయిస్తూ ఉంటాడు. కౌస్తుభమణిని ధరించిన శ్రీవనమాలి సమీపంలో చక్రాది ఆయుధాలు తిరుగుతున్నాయి. ఆ సమయంలో బ్రహ్మ భగవంతుని నాభిసరోవరాన్నుండి జనించిన కమలం జలవాయు ఆకాశాలు తనశరీరం యీ ఐదింటినేచూశాడు. ఇంకొకవస్తువేదీ లేదు. సృష్టిచెయ్యాలనే సంకల్పంతో శ్రీహరిని స్తుతించడం ఆరంభించాడు.

## 8 అధ్యాయం

జ్ఞాతోఽసి మేఽద్య సుచిరాన్నను దేహభాజాం న జ్ఞాయతే భగవతో గతి రిత్యవద్యమ్,
నాన్యత్త్వ దస్తిభగవన్ యది తన్న శుద్ధంమాయాగుణవ్యతికరా ద్యదురుర్విభాసి.
రూపం యదేతదవబోధరసోదయేనశశ్వన్నివృత్తతమసఃసదనుగ్రహాయ,
ఆదౌ గృహీతమవతారశతైకబీజం యన్నాభిపద్మభవనా దహమావిరాసమ్.
నాతః పరం పరమయద్భవతస్స్వరూప మానందమాత్రమవికల్ప మవిద్ధవర్చః,
పశ్యామి విశ్వసృజమేక మవిశ్వమాత్మన్ భూతేంద్రియాత్మకమదస్త ఉపాశ్రితోఽస్మి.
తద్వా ఇదం భువన మంగళమంగళాయ ధ్యానే స్మనోదర్శితం త ఉపాసకానామ్,
తస్మై నమో భగవతేఽనువిధేమ తుభ్యం యోఽనాదృతోనరక భాగ్భిరసత్ప్రసంగైః.

బ్రహ్మ శ్రీహరిని ఇలాస్తుతిస్తున్నాడు. శ్రీహరీ! ఇంతకాలానికి నిన్నుచూడగలిగాను. దేహధారులైన జీవులు నిన్నుచూడలేక పోతున్నారంటే యెంతదౌర్భాగ్యం! మాయాకల్పితమైన యీ సంసారంలో నీ కంటే భిన్నమైనవస్తువేదీలేదు. నీవే మాయయందనేక రూపాల్లో ప్రకాశిస్తావు. నీయందు చిచ్ఛక్తి ప్రకాశిస్తూండడంవల్ల అజ్ఞానంలేశమాత్రం ఉండదు. నేను జనించుటకు కారణమైన నాభీసరోవరం కల నీవే అనేక అవతారాలకు మూల కారణం సత్పురుషుల ననుగ్రహించు

యేతు తదీయచరణాంబుజకోశగంధం జిఘ్రంతి కర్ణవివరైః శ్రుతివాతనీతమ్,
భక్త్యా గృహీతచరణాః పరయాచ తేషాం నాపైషినాథ హృదయాంబురుహాత్స్వపుంసాం
తావద్భయం ద్రవిణగేహసుహృన్నిమిత్తం శోకస్స్పృహాపరిభవో విపులశ్చ లోభః,
తావన్మమేత్యసదవగ్రహఆర్తిమూలం యావన్న తేఽంఘ్రిమభయం ప్రవృణీత లోకః.
దైవేన తే హత ధియో భవతః ప్రసంగాత్సర్వాశుభోపశమనాద్విముఖేంద్రియాయే,
కుర్వంతి కామసుఖలేశలవాయ దీనాలోభాభిభూతమనసో కుశలాని శశ్వత్.
క్షుత్తృట్త్రిధాతుభి రిమాముహురర్ద్యమానా శ్శీతోష్ణవాతవర్షైరితరేతరాచ్చ,
కామాగ్ని నాచ్యుతరుషా చ సుదుర్భరేణ సంపశ్యతో మన ఉరుక్రమ సీదతేమే.
యావత్పృథక్త్వమిదమాత్మనఇంద్రియార్థమాయాబలం భగవతో జన ఈశ పశ్యేత్,
తావన్నసంసృతిరసౌ ప్రతిసంక్రమేత వ్యర్థాపి దుఃఖనివహం వహతి క్రియార్థా.
అహ్న్య పృతార్తకరణానిశి నిశ్శయానా నానామనోరథధియాక్షణ భగ్ననిద్రాః,
దైవాహతార్థరచనా ఋషయోఽపి దేవయుష్మత్ప్రసంగ విముఖా ఇహ సంసరంతి.
త్వం భావయోగ పరిశోధిత హృత్సరోజ ఆస్సేశ్రుతేక్షితపథో నను నాథ పుంసామ్,
యద్యద్ధియా తఉరుగాయ విభావయంతి తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ.
నాతిప్రసీదసి తథోపచితోపహారై రారాధితస్సురగణైర్హృది బద్ధకామైః,
యత్సర్వభూతదయయా సదలభ్యయైకో నానాజనేష్వవహితస్సుహృదంతరాత్మా.

టకై తొలుత ఈరూపాన్ని ప్రకటించియున్నావు. పరమాత్మా! ఆనంద మయమై భేదరహితమై అఖండ తేజోమయమైన మీరూపాన్ని యీ రూపంకంటె భిన్నంగా నేను భావించను. నేను విశ్వాన్ని సృజించేవాడనైనా మిమ్ములను శరణంటున్నాను. అద్వితీయమైన నీరూపమే సమస్తభూతాలకూ ఇంద్రియాలకూ అధిష్ఠానమైనది. పాపాత్ముల కసాధ్యమైన నీ రూపానికి నమస్కరిస్తున్నాను. విశ్వకళ్యాణమయా! నేను మీ ఉపాసకుణ్ణి! నాహితం కొరకు యీ రూపంలో మీదర్శనం యిచ్చారు. వేదరూపమైన వాయువుచే గొనిరాబడిన నీచరణకమల గంధాన్ని కర్ణపుటములద్వారా గ్రహిస్తూ ఉంటారు. అలాంటి భక్తుల హృదయాల్లో నీవు నిరంతరం ప్రకాశిస్తూంటావు. నీయందు భక్తిలేని వాడు పత్నీ పుత్ర ధనాదులకొరకై తాపత్రయపడుతూ ఆశాపిశాచ గ్రస్తుడై నేనూ, నాదీ అనేభావంచే దుఃఖిస్తూంటాడు. పురుషోత్తమా! ఆకలిదప్పలూ వాతపిత్త శ్లేష్మములూ, శీతోష్ణములూ, వాయువర్ష ములూ, కామక్రోధాదులూ, బాధిస్తూంటే పీటినల్ల బాధపొందే

పుంసామతో వివిధకర్మభిరధ్వరాద్యైర్దానేన చోగ్రతపసా వ్రతచర్యయా చ,
ఆరాధనం భగవతస్తవ సత్క్రియార్థో ధర్మోఽర్పితః కర్హి చిన్మ్రియతే న యత్ర.
శశ్వత్స్వరూపమహసైవ నిపీతభేదమోహాయ బోధధిషణాయ నమః పరస్మై,
విశ్వోద్భవస్థితిలయేషు నిమిత్తలీలా రాసాయ తే నమ ఇదం చకృమేశ్వరాయ.
యస్యావతారగుణకర్మవిడంబనాని నామాని యేఽసువిగమే వివశా గృణంతి,
తేఽనేకజన్మశమలం సహసైవ హిత్వా సంయాంత్యపావృతమృతం తమజం ప్రపద్యే.
యో వా అహం చ గిరిశశ్చ విభుస్స్వయం చ స్థిత్యుద్భవప్రళయహేతవ ఆత్మమూలమ్,
భిత్త్వా త్రిపాద్వవృధ ఏక ఉరుప్రరోహస్తస్మై నమో భగవతే భువనద్రుమాయ.
లోకో వికర్మనిరతః కుశలే ప్రమత్తః కర్మణ్యయం త్వదుదితే భవదర్చనే స్వే,
యస్తావదస్య బలవానిహ జీవితాశాం సద్యశ్ఛినత్త్యనిమిషాయ నమోఽస్తు తస్మై.
యస్మాద్బిభేమ్యహమపి ద్విపరార్ధధిష్ణ్యమధ్యాసితస్సకలలోక నమస్కృతం యత్,
తేపే తపో బహుసవోఽవరురుత్సమానస్తస్మై నమో భగవతేఽధిమఖాయ తుభ్యమ్.
తిర్యఙ్మనుష్యవిబుధాదిషు జీవయోనిష్వాత్మేచ్ఛయాత్మకృతసేతుపరీప్సయా యః,
రేమే నిరస్తరతిరప్యవలబ్ధదేహస్తస్మై నమో భగవతే పురుషోత్తమాయ.
యోఽవిద్యయానుపహతోఽపి దశార్ధవృత్త్యా నిద్రాముహావ జఠరీకృతలోకయాత్రః,
అంతర్జలే హి కశిపుస్పర్శానుకూలాం భీమోర్మిమాలిని జనస్య సుఖం విపృణ్వన్.

జీవులనుచూచి నాకు చాలా దుఃఖం కలుగుతుంది. మానవుడు తన్ను తాను గుర్తించి విషయవాసనలనుండి విముఖుడై ఆత్మజ్ఞానం గ్రహించేటంత వరకూ దుఃఖంతప్పదు. జననమరణ రూపమైన కాల చక్రంలో పరిభ్రమిస్తూనే ఉంటాడు

నీ కథాప్రసంగం లేని మునులుకూడా మాయామోహితు లౌతారు. పగలు అనేక వ్యాపారాలతోనూ రాత్రి నిద్రతోనూ కాలంవ్యయమై పోతుంది. మనోరథాలు, ఈడేరాలని చేసే ప్రయత్నంలో నిద్రకూడా పూర్తిగారాదు. దైవ వశంచేత సర్వకార్యాలూ విఫలమైపోతాయి. నీవు ఒక్కడవూ అంతరాత్మవూ ఐ ఉంటే, అనేక సాముగ్రిలతో అనేకరూపాల్లో నిన్ను అర్చిస్తారు. నీవుభక్తసులభుడవు. భూతదయ కలవారలందరిపై అనుగ్రహ దృష్టికలవాడవు. కర్మ నియం దర్పించి సేవించువాడక్షయుడౌతాడు. జ్ఞానాధారమైన నీకు నమస్కారము. సృష్టిరచనకై మాయనాశ్రయించి బ్రహ్మ విష్ణు మహేశ్వర

యన్నాభిపద్మభవనాదహమాసమద్య లోకత్రయోపకరణో యదనుగ్రహేణ,
తస్మై నమస్తఉదరస్థభవాయ యోగనిద్రావసానవికసన్నళినేక్షణాయ.
సోఽయం సమస్తజగతాం సుహృదేక ఆత్మా సత్త్వేన యన్మృడయతే భగవాన్ భగేన,
తేనైవ మే దృశమనుస్పృశతాద్యథాహం స్రక్ష్యామిపూర్వవదిదం ప్రణతప్రియోఽసౌ.
ఏషప్రపన్నవరదో రమయాత్మశక్త్యా యద్యత్కరిష్యతి గృహీతగుణావతారః,
తస్మిన్ స్వవిక్రమమిదం సృజతోఽపి చేతో యుంజీత కర్మశమలం చ యథావిజహ్యామ్.
నాభిహ్రదా దిహసతోఽంభసి యస్య పుంసో విజ్ఞానశక్తిరహమాసమనంతశక్తేః,
రూపం విచిత్రమిదమస్య వివృణ్వతో మే మారీరిషిష్ట నిగమస్య గిరాం విసర్గః.
సోఽసౌ వదభ్రకరుణో భగవాన్ వివృద్ధ ప్రేమస్మితేన నయనాంబురుహం విజృంభన్
ఉత్థాయ విశ్వవిజయాయ చ నో విషాదం మాధ్వ్యాగిరాపనయతాత్పురుషః పురాణః.

స్వసంభవం నిశామ్యైవం తపోవిద్యాసమాధిభిః,
యావన్మనో వచఃస్తుత్వా విరరామ సఖిన్నవత్.

రూపాల్లో రామ కృష్ణాద్యవతారరూపాల్లో అవతరిస్తూంటావు. నీ ఆరాధనే మానవుల స్వధర్మం. స్వధర్మానుష్ఠాతలను రక్షించడం నీకు పరమ ధర్మం. స్వధర్మాన్ని వదలి వృథా పశుపక్ష్యాదుల వలె చరించే వారిని కాలం మ్రింగివేస్తుంది. ఆ కాలం కూడా నీ స్వరూపమే. అట్టి నీకు నమస్కారం. పరమేశ్వరా! నేను సత్యలోకాధి నాథుడనై ద్విపరార్ధ పర్యంతం సర్వలోకవందనీయుడనై యుండుటకవకాశమున్నా నీకాల రూపాన్ని చూచి భయపడుతున్నాను. దానినుండి రక్షించ బడ్డానికే చిరకాలం తపస్సుచేశాను. నీవే అధియజ్ఞరూపంలో నా తపస్సుకు సాక్షివి. నీవు పూర్ణకాముడవైయుండి కూడా పశుపక్ష్యాది శరీరాల లోనూ మనుష్య దేవతాది శరీరాలలోనూ, అవతరించి ధర్మమర్యాద లను రక్షిస్తూంటావు. అవిద్యా, అస్మితా, రాగ ద్వేష అభినివేశాదులం దైదింటిలో దేనికీ అధీనుడవుకావు. ఈ సమయంలో యీచరాచర విశ్వ మంతా నీ ఉదరంలో ఉంది. భయంకర ప్రళయకాలీనతరంగ మాలా విక్షుబ్ధమైన జలమందు శేషశయనుడవై ఉన్నావు. పూర్వ కల్పపరంపరలో శ్రమించిన జీవులకు విశ్రాంతిని ప్రసాదించుటకే యిట్లు న్నావు. నీ నాభికమలం నుండి నేనుజన్మించాను. నీ అనుగ్రహంచేతనే త్రిలోకసంబంధమైన సృష్టియందు ప్రవృత్తుడనౌతున్నాను. యోగ

అథాభిప్రేతమాలక్ష్య బ్రహ్మణో మధుసూదనః,
విషణ్ణచేత సస్తస్య కల్పవ్యతికరాంభసా.
లోకసంస్థానవిజ్ఞాన ఆత్మనః పరిఖిద్యతః,
తమాహాగాధయావాచా కశ్మలం శమయన్నివ.
మావేద గర్భగాస్తంద్రీం సర్గ ఉద్యమమావహ,
తన్మయాఽఽపాదితంహ్యగ్రే యన్మాం ప్రార్థయతే భవాన్.
భూయ స్త్వం తపఆతిష్ఠ విద్యాం చైవమతాశ్రయామ్.
తాభ్యామంతర్హృది బ్రహ్మన్ లోకాన్ ద్రక్ష్యస్యపావృతాన్,
తతమాత్మని లోకే చ భక్తియుక్త స్సమాహితః,
ద్రష్టాసి మాం పరం బ్రహ్మమయిజీవాం స్త్వమాత్మనః.
యదా తు సర్వభూతేషు దారుష్వగ్నిమివ స్థితమ్,
ప్రతిచక్షీత మాం లోకే జహ్యాత్తర్హ్యేవ కశ్మలమ్.
యదా రహితమాత్మానం భూతేంద్రియ గుణాశయైః,
స్వరూపేణ మయోపేతం పశ్యన్ స్వారాజ్యమృచ్ఛతి.

నిద్రను వీడుటచే నీ నేత్రకమలాలు వికసించాయి. సృష్టిరచనారూపమైన అభిమానం నన్నంటకుండా అనుగ్రహించు. నేను నీనుండి ఆవిర్భవించడం వల్ల నేను నీ విజ్ఞాన శక్తినే గనుక సృష్టికాలంలో వేదవాణి లుప్తం కాకుండా ఉండునట్లనుగ్రహింపు. చిరునవ్వుతో కూడిన నీముఖకమలం పైకెత్తి నేత్రములు విప్పి విశ్వరచనయందు కల నావిషాదాన్ని నీ మధుర వాణిచే హరింతువుగాక. అని ప్రార్థించిన బ్రహ్మ ప్రళయ పయోధియందు భయకంపితుడైయున్నాడని గ్రహించిన శ్రీహరి పలకడం ఆరంభించాడు.

వేదగర్భా! నీ విషాదంతో ఆలస్యం చెయ్యకు. నీవు నన్ను కోరిన వన్నీ ఆదియందే ప్రసాదించాను. నీవింకొకసారి తపస్సు చెయ్యి. భాగవతజ్ఞానాన్ని అనుష్ఠించు. దానివల్ల సమస్తలోకాలూ, నీ అంతఃకరణలో గోచరిస్తాయి. నీవు భక్తియుతుడవై సమస్తలోకాలూ నీయందు నారూపంలో వ్యాప్తమై యున్నట్లూ నాయందు సర్వలోకాలూ వ్యాప్తమై యున్నట్లూ నీయంతట నీవే చూడగలుగుతావు. కాష్ఠమందు సర్వవ్యాప్తమైన అగ్నివలె సర్వభూతములందూ వ్యాప్తమైన నన్ను గుర్తించగల వాడు అజ్ఞానమల విముక్తుడౌతాడు. భూత, ఇంద్రియ, గుణ అంతఃకరణ

నానాకర్మవితానేన ప్రజాబహ్వీస్సిసృక్షతః,
నాత్మావసీదత్యస్మిం స్తేవర్షీయాజ్ఞ మదనుగ్రహః.
ఋషిమాద్యం న బధ్నాతి పాపీయాంస్త్వాంరజోగుణః,
యన్మనో మయినిర్బంధం ప్రజాస్సంసృజతోఽపి తే.
జ్ఞాతోఽహం భవతా త్వద్యదుర్విజ్ఞేయోఽపి దేహినామ్,
యన్మాం త్వం మన్యసే యుక్తం భూతేంద్రియగుణాత్మభిః.
తుభ్యం మద్విచికిత్సాయామాత్మా మే దర్శితోబహిః,
నాళేన సలిలే మూలం పుష్కరస్య విచిన్వతః.
యచ్చకర్థాంగ మత్స్తోత్రం మత్కథాభ్యుదయాంకితమ్,
యద్వా తపసి తే నిష్ఠా సఏషమదనుగ్రహః.
ప్రీతోఽహయస్మి భద్రం తే లోకానాం విజయేచ్ఛయా,
యదస్తౌషీర్గుణమయం నిర్గుణం మానువర్ణయత్.
యఏతేన పుమాన్నిత్యం స్తుత్వాస్తోత్రేణ మాం భజేత్,
తస్యాన్వహం ప్రసీదేయం సర్వకామవరేశ్వరః.

రహితమైనవాడుగా తన్నుతాను తెలుసుకుంటాడు. ఎవడు నాకంటే భిన్నుడు కాడని తెలుసుకుంటాడో అట్టివాడు మోక్షపదాన్ని పొందుతాడు. నానావిధ కర్మసంస్కారములతో కూడిన అనేక తరగతుల జీవులను సృజించాలనే యిచ్ఛ కలిగినప్పుడు కూడా నా అనుగ్రహంచేత నీవు మాయామోహితుడవుగాకుండుగాక. నీవందరికంటె ఆదిమంత్రద్రష్టవు. ప్రజోత్పత్తి కాలంలో కూడా నీమనస్సు నాయందే లగ్నమైయుండుగాక. పాపమయమైన రజోగుణం నిన్ను బంధించకుండుగాక. భూత ఇంద్రియ గుణ అంతఃకరణరహితుడను నేనని నన్ను గుర్తింపగలిగావు. ఇది ఇతరులు ఎవరూ గ్రహించలేనిది. నాకాశ్రయమేదని కమలనాళం ప్రవేశించి జలమందున్న మూలాన్ని వెతకటం ఆరంభించినప్పుడు అనుగ్రహంతో నీ అంతఃకరణలో దర్శన మిచ్చాను. చతుర్ముఖా! నీవు నన్ను స్తుతించావు. తపో నిష్ఠలో ఉన్నావు. ఇదంతా నాకృపవల్లనే చేయ కలిగావు. లోక రచనేచ్ఛతో సగుణుడవైయుండి కూడా నిర్గుణరూపంలో నన్నుస్తుతించావు. అందువల్లనే నేను ప్రసన్నుడనయ్యాను. సమస్త కోరికలనూ నెరవేర్చ సమర్థుడనూ నీచేత నన్ను గురించి చేయబడిన

పూర్తేన తపసా యజ్ఞైర్దానై ర్యోగైస్సమాధినా,
రాద్ధం నిశ్శ్రేయసం పుంసాం మత్ప్రీతి స్తత్త్వవిన్మతమ్.
అహమాత్మాత్మనాం ధాతః ప్రేష్ఠస్సన్ప్రేయసామపి,
అతో మయి రతిం కుర్యాద్దేహాదిర్యత్కృతేప్రియః.
సర్వవేదమయే నేదమాత్మనాత్మాత్మయోనినా,
ప్రజాస్సృజ యథాపూర్వం యాశ్చ మయ్యనుశేరతే.
తస్మాఏవం జగత్స్రష్టా ప్రధాన పురుషేశ్వరః,
వ్యజ్యేదం స్వేన రూపేణ కంజనాభ స్తిరోదధే.

స్తోత్రం ప్రతినిత్యం పఠించువాడు నా అనుగ్రహం పొందగలుగుతాడు. తప, యజ్ఞ, దాన, యోగాదుల ఫలం, నా అనుగ్రహమే, అని తత్త్వ వేత్తలు చెబుతారు. నేను ఆత్మల కాత్మస్వరూపుడను. స్త్రీ పుత్రాదులకంటే ప్రియమైనవాడను. దేహాదులుకూడా నాకొరకే ప్రియమైనవి. అందుచేత నిరంతరం నన్నే ప్రేమించాలి. విధాత నాయందు లీనమైయున్న త్రిలోకాలనూ జీవులనూ కూడా పూర్వకల్పంలో వలెనే నానుండి ఉత్పన్నమైన సర్వవేదమయ స్వరూపంతో నీవే స్వయంగా రచించుమని ఉపదేశించి భగవానుడంతర్హితుడైనాడని చెప్పాడు విదురునకు మైత్రేయమహర్షి.

## 9 అ ధ్యా య ం

అన్తర్హితే భగవతి బ్రహ్మా లోకపితామహః,
ప్రజాస్సవర్జ కతిధా దైహికీర్మానసీర్విభుః.

ఋషిపుంగవా! నీవు సర్వజ్ఞుడవు. నారాయణుడంతర్ధానమైన తరువాత చతుర్ముఖుడు తన దేహం, మనస్సు, అనువానితో యెన్ని తరగతుల సృష్టి జేశాడో? చెప్పుతూ నేనింకా గతంలో అడిగిన ప్రశ్న లన్నీ వివరింపుమని అడిగిన విదురునకు మైత్రేయుడిలా వినిపిస్తున్నాడు.

విదురా! నారాయణుని ఆదేశాన్ననుసరించి చతుర్ముఖు డేకాగ్ర చిత్తంతో నారాయణుని ధ్యానిస్తూ నూరుదివ్య సంవత్సరాలు తపస్సు

యేచమే భగవఞ పృష్టాస్త్వమ్ధా బహువిత్తమః,
తాఞ వదస్వానుపూర్వ్యేణ ఛింధి నస్సర్వసంశయాన్.
ఏవం సంబోధితస్తేన క్షత్త్రా కౌషారవో మునిః,
ప్రీతః ప్రత్యాహ తాఞ ప్రశ్నాన్ హృది స్థానేవ భారత.
విరంచోఽపి తథా చక్రే దివ్యంవర్ష శతం తపః,
ఆత్మన్యాత్మాన మావేశ్య యథాహ భగవానజః.
తద్విలోక్యాబ్జసంభూతో వాయునా యదధిష్ఠితః,
పద్మమంభశ్చ తత్కాలకృత వీర్యేణ కంపితమ్.
తపసా హ్యేధమానేన విద్యయా చాత్మ సంస్థయా,
వివృద్ధవిజ్ఞానబలోన్యపాద్వాయుం సహాంభసా:
తద్విలోక్య వియద్వ్యాపి పుష్కరం యదధిష్ఠితమ్,
అనేన లోకాన్ ప్రాగ్లీనాన్ కల్పితోఽస్మీ త్యచింతయత్.
పద్మకోశం తదావిశ్య భగవత్కర్మచోదితః,
ఏకం వ్యభాంక్షీ దురుధాత్రిధాభావ్యంద్వినప్తధా.

చేశాడు. ఆ తపస్సువల్ల తానున్న కమలజలంకూడా కంపిస్తున్నాయి. తపస్సువల్ల కలిగిన ఆత్మజ్ఞానం, విజ్ఞానబలం, వృద్ధిచెందిన పితామహుడు ప్రళయకాలీనమైన జలాన్నివాయువుతో కూడా పానంచేశాడు. ఆకాశ వ్యాప్తమై తనకాశ్రయమైన యీ కమలాన్నుండే పూర్వకల్పంలో లీనమైన సృష్టిచెయ్యాలని సంకల్పించిన వెంటనే స్వాయంభువుడు కమలకోశంలో ప్రవేశించి భూర్భువ స్వర్లోకాలుగా విభాగించాడు. ఆ కమలం చతుర్దశభువనాలూ, అనంతకోటి జీవజాలం సృష్టించడానికి, యోగ్యమైనంత పెద్దదిగా ఉంది. జీవులు భోగానుభవం పొందుటకు యీ మూడులోకాలూ శాస్త్రాల్లో నిర్వచింప బడ్డాయి. నిష్కామ కర్మ చేసిన జీవులు, మహః, తపః, జనః, సత్యలోకరూపములైన బ్రహ్మలోకాన్ని పొందుతాడని చెపుతూన్న మైత్రేయుని చూచి, అద్భుతకర్ము డైన విశ్వరూపుని కాలనాయకమైనశక్తిని గురించి చెప్పమన్న విదురునకు మైత్రేయుడింకా యిలాచెబుతున్నాడు.

విషయములయొక్క రూపాంతరమే కాలంయొక్క ఆకారం. స్వయంగా అదినిర్విశేషం, అనాది, అనంతం. అట్టికాలాన్ని నిమిత్తంగా

ఏతావాన్ జీవలోకస్య సంస్థాభేదస్సమాహృతః,
ధర్మస్య హ్యనిమిత్తస్య విపాకః పరమేష్ఠ్యసౌ.
యదాత్థబహురూపస్యహరేరద్భుతకర్మణః,
కాలాఖ్యం లక్షణం బ్రహ్మన్ యథావర్ణయ నః ప్రభో.
గుణవ్యతికరః కాలో నిర్విశేషో ప్రతిష్ఠితః,
పురుషస్తదుపాదానమాత్మానం లీలయాసృజత్.
విశ్వం యద్బ్రహ్మ తన్మాత్రం సంస్థితం విష్ణుమాయయా,
ఈశ్వరేణ పరిచ్ఛిన్నం కాలేనావ్యక్తమూర్తినా.
యథేదానీం తథాగ్రే చ పశ్చాదప్యేతదీదృశమ్,
సర్గోనవవిధస్తస్య ప్రాకృతో వైకృతశ్చ యః.
కాల ద్రవ్య గుణైరస్య త్రివిధః ప్రతిసంక్రమః,
ఆద్యస్తు మహతస్సర్గో గుణవైషమ్య మాత్మనః.

చేసి భగవానుడే సృష్టిరూపంలో పరిణమిస్తూంటాడు. ఈ విశ్వం భగవంతుని మాయయందు లీనమై ఉంది. కాలం ద్వారా భగవానుడు తిరిగి పృథక్ రూపంలో ప్రకటింపజేశాడు. ఈ జగత్తు ఇప్పుడున్నట్లే పూర్వం ఉంది. ముందూ ఉంటుంది. ఈ సృష్టి తొమ్మిది తరగతులు. ప్రాకృత, వైకృత, భేదంతో పది తరగతులౌతుంది. కాల, ద్రవ్య, గుణవిభాగంతో మూడు తరగతులుగా, దీని ప్రళయమౌతుంది. భగవంతుని ప్రేరణచే సత్త్వాది గుణములందుకల వైషమ్యమే మహత్తత్త్వం. ఇదే మొదటి సృష్టి. పంచభూతములకూ, దశేంద్రియములకూ ఉత్పత్తిస్థానమైన అహంకారమే రెండవసృష్టి. మూడవది భూతసర్గం. దీనియందే పంచ మహాభూతములకు ఉత్పత్తి కారణములైన తన్మాత్రలుంటాయి. జ్ఞాన క్రియాశక్తి సంపన్నమైన ఇంద్రియ సృష్టి నాలుగవది. సాత్వికాహా రమునుండి జనించిన ఇంద్రియాధిష్ఠాన దేవతలూ, మనస్సూ, ఐదవ సృష్టి. ఆరవది అవిద్యాసృష్టి. దీనియందు తామిస్ర, అంధతామిస్ర, తమ, మోహ, మహామోహము లను, ఐదుబంధములుంటాయి. ఇది జీవులయొక్క బుద్ధులకావరణ విక్షేపాలను, కలిగిస్తూంటుంది. ఈ ఐదును ప్రాకృతసృష్టులు, చెప్పుతానువిను.

ద్వితీయస్త్వహమో యస్తు ద్రవ్యజ్ఞాన క్రియాత్మకః,
భూతసర్గ స్తృతీయస్తు తన్మాత్రద్రవ్యశక్తిమాన్.
చతుర్థఇంద్రియస్సర్గో యస్తు జ్ఞానక్రియాత్మకః,
వైకారికో దేవసర్గః పంచమో యన్మయంమనః.
షష్ఠస్తు తమసస్సర్గో యస్త్వబుద్ధికృతః ప్రభో:,
షడిమే ప్రాకృతాస్సర్గా వైకృతానపి మేశృణు.
రజోభాజో భగవతో లీలేయం హరిమేధసః.
సప్తమో ముఖ్యసర్గస్తు షడ్విధస్తస్థుషాం చయః.
వనస్పత్యోషధిలతా త్త్వక్సారా వీరుధో ద్రుమాః,
ఉత్స్రోతస స్తమః ప్రాయాఅంతస్స్పర్శా విశేషిణః.
తిరశ్చా మష్టమ స్సర్గస్సొఽష్టావింశద్విధో మతః,
అవిదోభూరితమసో ఘ్రాణజ్ఞాహృద్య వేదినః.
గౌరజో మహిషః కృష్ణస్సూకరో గవయో రురుః,
ద్విశఫాః పశవశ్చైత అవిరుష్ట్రశ్చ సత్తమ.

తన్ను చింతించే వారిని అనుగ్రహించే శ్రీహరియొక్క లీలా వినోదమే యీ సృష్టిక్రమం. ఆ భగవానుడే రజోగుణాన్ని స్వీకరించి సృష్టిచేస్తూంటాడు. షడ్విధములైన ప్రాకృతసృష్టులు చేసిన తరువాత వైకృత ప్రధానమైన సృష్టిలో స్థావరములైన వృక్షాది సృష్టియే, యేడవది. ఈ సృష్టివనస్పతి ఓషధి లతా త్వక్సార, వీరుధ, ద్రుమభేదాలతో జరుగుతుంది. పుష్పాలేకుండా ఫలించేవి వనస్పతులు. ఫలించి నశించేవి ఓషధులు, ఒకదాని నాశ్రయించి వృద్ధిచెందేవి లతలు. చర్మం కఠినంగా ఉండేవి త్వక్సారాలు. భూమియందే విస్తరిస్తూ మెత్తగా పెరుగనివి వీరుధములు. పుష్పించి ఫలించేవి ద్రుమాలు. వీటియొక్క సంచారం జడంనుండి ఊర్ధ్వంగా ఉంటుంది. వీటియందు ప్రాయికంగా జ్ఞానశక్తిఉండదు. లోపల స్పర్శ శక్తిఉంటూ ఇవిఅన్నీ ప్రత్యేకగుణాలు కలవిగా ఉంటాయి. ఎనిమిదవది ఇరువదియెనిమిది, తరగతులకు చెందిన పశుపక్ష్యాది తిర్యక్సృష్టి. వీటియందు కాలజ్ఞానం ఉండదు. తమోగుణాధిక్యతచే ఆహారనిద్రామైథునాలే వీటికి తెలుస్తాయి. వాసన చూచిన మాత్రాన వస్తువును గుర్తిస్తాయి. విచారశక్తి, దూరదృష్టి

ఖరోఽశ్వోశ్వతరో గౌర శ్శరభశ్చ మరీ తథా,
ఏతేచైకశఫాః క్షత్తఃశృణు పంచనఖాన్ పశూన్.
శ్వా సృగాలో వృకోవ్యాఘ్రో మార్జారశశశల్యకాః.
సింహః కపిర్గజః కూర్మో గోధాచ మకరాదయః.
కంకగృధ్రబకశ్యేనభాస భల్లూక బర్హిణః,
హంససారస చక్రాహ్వకాకో లూకాదయః ఖగాః.
అర్వాక్స్రోత స్తునవమన్క్షత్త ఏకవిధోనృణాం,
రజోధికాః కర్మపరా దుఃఖే చ సుఖమానినః.
వైకృతాస్త్రయ ఏవైతే దేవసర్గశ్చ సత్తమ,
వైకారికస్తు యః ప్రోక్తః కౌమారస్తూభయాత్మకః.
దేవసర్గశ్చాష్టవిధోవిబుధాఃపితరోఽసురాః,
గంధర్వాప్సరసస్సిద్ధా యక్షరక్షాంసిచారణాః.
భూతప్రేతపిశాచాశ్చ విద్యాధ్రాః కింనరాదయః,
దశైతే విదురాఖ్యాతాస్సర్గాస్తే విశ్వసృట్కృతాః.

వీనియందుండవు. తిర్యగ్జంతువులలో గోవు, మేక, మహిషం, కృష్ణ మృగం, సూకరం, గవయమృగం, రురు గొఱ్ఱె ఒంటె యివి ద్విశఫల ములనబడుతాయి. అంటే రెండుగిట్టలుగలవి. గాడిద, గుఱ్ఱం, కంచర గాడిద, గౌరమృగం, శరభ, చమరీ మృగాలూ, యివి ఏక శఫ:ములు. ఒకేగిట్టకలవి, కుక్క, నక్క, తోడేలు, పెద్దపులి, పిల్లి, కుందేలు, సింహం, కోతి, ఏనుగు. తాబేలు. ఉడుము, మొసలీ మొదలైన పశు వులూ, గ్రద్ద, డేగ, రాబందు, పావురం, భాసపక్షి, నెమలి, హంస, సారస చక్ర వాకాలూ, గుడ్లగూబ మొదలయినవీ, భల్లూ కాదులైన పశువులూ, పక్షులూ, యివన్నీ పంచనఖములు కలవని గ్రహింపుము. తొమ్మిదవది మనుష్య సృష్టి. మనుష్యులు రజోగుణ ప్రధానులూ, కర్మపరాయణులూ విషయలోలురూ దుఃఖరూపమైనవిషయ సుఖా లనే సుఖంగా భావించేవారు. వీరికి ఆహారప్రవాహం ముఖాన్నుండి క్రిందకు ప్రవహిస్తూంటుంది. ఇంతవరకూ చెప్పిన, స్థావర పశుపక్ష్యాది మనుష్య రూపమైన మూడుతరగతులసృష్టి చెప్పబోయే దైవికసృష్టీ యిన్నాలుగూ వైకారికసృష్టిసంబంధమే. దేవతా సృష్టి ఆదిలో

అతః పరం ప్రవక్ష్యామి వంశాన్ మన్వంతరాణి చ,
ఏవం రజఃప్లుతస్స్రష్టాకల్పాదిష్వాత్మభూర్హరిః.
సృజత్యమోఘసంకల్పఆత్మైవాత్మా నమాత్మనా,
గుణవ్యత్యయ ఏతిస్మిన్మాయావిత్వాదధీశితుః.
న పౌర్వాపర్యమిచ్ఛంతి నద్యాం భ్రామ్యత్ప్రమేరివ,
దేవానురాదయః క్షత్తః కల్పేఒస్మిన్ యే ప్రకీర్తితాః.
తఏవ నామరూపాభ్యాం మానస్మన్వంతరాంతరే.

చెప్పాను. దీనికంటె అతిరిక్తమైన సనత్కుమారాది కౌమారసృష్టి ప్రాకృత, వైకృతసంబంధం చేత రెండువిధాలుగా ఉంటుంది. దేవ, పితృ, అసుర, గంధర్వ అప్సర, యక్ష, రాక్షస, సిద్ధ, చారణ, విద్యాధర భూత ప్రేత, పిశాచ, కిన్నర, కింపురుషాది, భేదాలతో దేవతాసృష్టి యెనిమిదివిధాలు. విదురా! ప్రాకృత వైకృతాది, విభాగాలతో బ్రహ్మ పదితరగతులుగా, సృష్టించాడు. ఇక మన్వంతరాదులు చెపుతానువిను.

## 10 అ ధ్యా య ం

చరమస్సద్విశేషాణామనేకో సంయుతస్సదా,
పరమాణుస్సవిజ్ఞేయో నృణామైక్య భ్రమోయతః.
సతఏవ పదార్థస్య స్వరూపావస్థితస్య యత్,
కైవల్యం పరమం మహా నవిశేషో నిరంతరః.
ఏవం కాలోఒప్యనుమితస్సౌక్ష్మ్యే స్థౌల్యే చ సత్తమ,
సంస్థానభుక్తి భగవానవ్యక్తో వ్యక్త భుగ్విభుః.

మైత్రేయుడు చెబుతున్నాడు. విదురా! పృథివ్యాది కార్యవస్తం యొక్క యే సూక్ష్మాంశలున్నాయో అవి విభాగం చేయ నవకాశం లేని సూక్ష్మాంశలు. అవి కార్యరూపాన్ని పొంద నప్పుడు అన్యపర మాణుసంయోగం లేని కాలంలో ఆ సూక్ష్మాంశలకు పరమాణువులని పేరు. అనేక పరమాణువుల సంయోగమే మనుష్యులకు భ్రమవశం చేత సముదాయ రూపమైన ఒక అవయవి ప్రతీతి కల్గుతూ ఉంటుంది. ఈపరమాణువులు దేనియొక్క సూక్ష్మతమమైన అంశ ఐఉందో. అది తన

సకాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతామ్,
సతో విశేషభుగ్యస్తు సకాలః పరమో మహాన్.
అణుర్ద్వౌపరమాణూ స్యాత్త్రసరే ణుస్త్రయోఽణవః
జాలార్కరశ్మ్య గతః ఖమేవానుపతన్నగామ్.
త్రసరేణుత్రికం భుంక్తే యః కాలస్త్రుటిస్మృతః,
శతభాగస్తు వేధస్స్యాత్తైస్త్రిభిస్తులవస్మృతః.
నిమేషస్త్రిలవోయజ్ఞే ఆమ్నాతస్తే త్రయః క్షణః,
క్షణాన్ పంచ విదుః కాష్ఠాం లఘుతాం దశపంచ చ.
లఘూ ని వై సమామ్నాతా దశ పంచచ నాడికా,
తే ద్వే ముహూర్తః ప్రహరః షడ్యామస్సప్తవా నృణామ్.
ద్వాదశార్ధపలోన్మానం చతుర్భిశ్చతురంగుళైః,
స్వర్ణమాషైః కృతచ్ఛిద్రం యావత్ప్రస్థజలప్లుతమ్.

సామాన్యమైన స్వరూపమందున్న ఆ పృథివ్యాది కార్యముల ఏకత్వమే మహాన్ అని చెప్పబడుతుంది. అలా ఉన్నప్పుడు దానిలో ప్రళయాది అవస్థాభేదస్ఫూర్తి ఉండదు. నవీన ప్రాచీన కాలభేదలక్షణం ఉండదు. ఘటపటాది వస్తుభేదం కూడా ఉండదు. ఈ విధంగా సూక్ష్మతమమైన మహత్తమ స్వరూప విచారణ చేయబడ్డది. దీనియొక్క సాదృశం చేతనే పరమాణువు మొదలైన సమస్త పదార్ధములందూ వ్యాప్తి చెంది వ్యక్తపదార్ధములు భోగించువాడు సృష్ట్యాదులందు సమర్ధుడూ వ్యక్తావ్యక్త రూపుడూ ఐన భగవానుడు కాలం యొక్క సూక్ష్మ స్థూల భావాలను కూడా అనుమానం చేయగలుగుతున్నాడు. ఏ కాలం ప్రపంచంయొక్క పరమాణురూపమైన సూక్ష్మావస్థయందు వ్యాప్తమై ఉంటుందో అది అత్యంత సూక్ష్మమైంది. సృష్ట్యాది ప్రళయం వరకూ దాని సర్వావస్థలనూ భోగించేదే, మహాన్, అని చెప్పబడుతుంది.

రెండు పరమాణువులు ఒక అణువు. మూడు అణువులు ఒక త్రసరేణువు. కిటికీ గుండా సూర్యకిరణం వెలువడే టప్పు డాకిరణంలో ఎగురుతున్నట్లు కనుపించేవే త్రసరేణువులు. మూడు త్రసరేణువు

యామాశ్చత్వార శ్చత్వారో మర్త్యానామహని ఉభే,
పక్షః పక్షః పంచదశాహాని శుక్లకృష్ణశ్చ మానద.
తయోస్సముచ్చయో మాసః పితౄణాం తదహర్నిశమ్,
ద్వౌ తావృతుష్షడయనం దక్షిణం చోత్తరం దివః.
అయనే అహనీ ప్రాహుర్వత్సరో ద్వాదశ స్మృతః,
సంవత్సరశతం నృణాం పరమాయుర్నిరూపితం.
గ్రహర్క్షతారాచక్రస్థః పరమాణ్వాదినా జగత్,
సంవత్సరావసానేన పర్యేత్యనిమిషో విభుః.
సంవత్సరః పరివత్సర ఇదావత్సరఏవ చ.
అనువత్సరో వత్సరశ్చ విదురైవం ప్రభాష్యతే.

యస్సృజ్యశక్తిమురుధోచ్ఛ్వసయన్ స్వశక్త్యా పుంసో భ్రమాయదివి ధావతి భూతభేదః,
కాలాఖ్యయా గుణమయం క్రతుభిర్వితన్వంస్తస్మై బలింకురుత వత్సరపంచకాయ.

పితృదేవమనుష్యాణా మాయుర్మాన మిదం స్మృతమ్,
పరేషాం గతిమాచక్ష్వ యేస్యుః కల్పాద్బహిర్విదః.

లను దాటుటకు కలిగే సూర్యగమన కాలానికే తృటి యని పేరు. నూరు తృటులు వేధ. మూడు వేధలు లవం. మూడు లవలు నిమేషం మూడు నిమేషాలు క్షణం ఐదు క్షణాలు కాష్ఠ. పదిహేను కాష్ఠలు ఒక లఘువు. పదిహేను లఘువులు ఒకనాడి. రెండు నాడికలొక ముహూర్తం. ఆరు లేక ఏడు నాడికలు ఒక ప్రహరం. దీనినే యామ మంటారు. మానవుల దినమూ లేక రాత్రి భాగంలో నాలుగవ భాగం అవుతుంది. ఆరు పలముల రాగితో ఒక ప్రస్థం నీరు పట్టే ఒక పాత్ర చేయించి నాలుగు మాసముల ప్రమాణం గల బంగారంతో నాలుగు అంగుళముల పొడవు కల శలాకుచేత ఆపాత్రకు రంధ్రమేర్పరచి అది జలమందుంచితే ఆ పాత్ర జలముచే నిండి మునుగు కాలమే "నాడికా" అని చెప్పబడుతుంది. నాలుగు యామాలు పగలు, నాలుగు యామాలు రాత్రి. ఇది మనుష్య మానంచే ఒకరోజు. పదిహేను రోజులొక పక్షం. శుక్ల కృష్ణ భేదంచే యీ పక్షాలు రెండు తరగతులు. ఈపక్షాలు రెండైతే ఒకమాసం. రెండు మాసాలు ఋతువు ఆరుమాసాలు ఒక అయనం. దక్షిణ ఉత్తర

భగవాన్ వేద కాలస్య గతిం భగవతో నను,
విశ్వంవిచక్షతే ధీరాయోగరాద్ధేన చక్షుషా.
కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి చతుర్యుగమ్,
దివ్యైర్ద్వాదశభిర్వర్షై స్సావధానం నిరూపితమ్.
చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమమ్,
సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చ.
సంధ్యాసంధ్యాంశ యో రంతర్యత్తస్స గ్గో యతో లయః,
తమేవాహుర్యుగం తజ్జ్ఞాయత్ర ధర్మోవిధీయతే.
ధర్మశ్చతుష్పాన్మనుజాన్ కృతే సమనువర్తతే,
సఏవాన్యేష్వధర్మేణ వ్యేతి పాదేన వర్ధతా.

భేదించే అయనాలు రెండు. ఈ రెండు అయనాలు కలిస్తే దేవతల కొక రోజు. మనుష్యుల కొక సంవత్సరం. నూరుసంవత్సరాలు మానవాయుర్దాయః. చంద్రాది గ్రహాలూ, అశ్విన్యాది నక్షత్రాలూ, తారలూ, మొదలయిన వాని కధిష్ఠాత కాలస్వరూపుడు అగు సూర్యుడు పరమాణువు మొదలు సంవత్సర పర్యంతం ద్వాదశ రాశి రూపమైన భువన కోశాన్ని ప్రదక్షిణం చేస్తూంటాడు. సౌర, బార్హస్పత్య సావన, చాంద్ర నాక్షత్ర, భేదాలతో యీ సంవత్సరమే, సంవత్సర, పరివత్సర, ఇడావత్సర, అనువత్సర, వత్సరములనే నామాలతో చెప్పబడుతూ ఉంటుంది. ఈ ఐదువిధములైన వర్ష ప్రవృత్తికీ హేతువైన ఆదిత్యుని పూజించు. ఆదిత్యుడు పంచభూతాల్లో తేజోరూపుడు. తన కాలశక్తి చేత పదార్థాల నుండి బీజాంకురాలను ఉత్పత్తి చేసి అనేక తరగతులుగా కార్యోన్ముఖం చేస్తూఉంటాడు. పురుషుల మోహ నివృత్తికై వారి ఆయుర్దాయాన్ని క్షయింప జేస్తూ ఆకాశంలో తిరుగు తూంటాడు. సకామకర్మలు చేసేవారికి యజ్ఞాది కర్మవల్ల ప్రాప్తమయే స్వర్గాది మంగళమయఫలాలు విస్తరింప జేసే వాడీ సూర్యభగవానుడే అని చెప్పుతూ ఉంటే విదురుడు తిరిగి అడుగుతున్నాడు.

మైత్రేయా! మీరు, దేవ, పితృ, మానవుల పరమాయుర్దాయం చెప్పారు. కల్పాంతర జీవులైన సనకాది మునుల ఆయుఃప్రమాణం

త్రైలోక్యాద్యుగసాహస్రం బహిరాబ్రహ్మణో దినమ్,
తావత్యేవ నిశా తాత యన్నిమీలతి విశ్వసృట్.
నిశావసాన ప్రారబ్ధలోకకల్పోఽనువర్తతే,
యావద్దినం భగవతో మనూన్భుంజంశ్చతుర్దశ,
స్వం స్వంకాలం మనుర్భుంక్తే సాధికామేక సప్తతిం.
మన్వంతరేషు క్రమశః తద్వంశ్యా ఋషయస్సురాః,
భవంతి చైతే యుగపత్సురేశాశ్చానుయే చ తాః.
ఏషదైనందినస్సర్గో బ్రాహ్మస్త్రైలోక్యవర్ధనః,
తిర్యఙ్నృపితృదేవానాం సంభవో యత్ర కర్మభిః.
మన్వంతరేషు భగవాన్బిభ్రత్సత్త్వం స్వమూర్తిభిః,

కూడా చెప్పండి. మీరు యోగశక్తిచే కాలజ్ఞానం తెలిసిన వారు. కనుక చెప్పండి అని అడిగాడు.

మైత్రేయుడు చెబుతున్నాడు. విదురా! కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు నాలుగు. వీటి సంధ్యాకాలాలూ, సంధ్యాంశలూ, కలిసి పన్నెండువేల దివ్యసంవత్సరాలు. ఇందులో కృతయుగం నాలుగువేలూ, త్రేతాయుగం మూడూ, ద్వాపరం రెండూ, కలి ఒకటి దివ్యవర్షసహస్రాల ప్రమాణంలో ఉంటాయి. యుగప్రమాణం ఎన్నివేలో దానికి ద్విగుణశతం, సంధ్యా సంధ్యాంశ కాలప్రమాణం, అని గ్రహించాలి. కృతయుగ ప్రమాణం నాలుగువేల దివ్యసంవత్సరాలు గనుక ఎనిమిదివందల సంవత్సరాలు సంధ్యా సంధ్యాంశ కాలం అని వేదవేత్తలు నిర్ణయించారు. అంటే నాలుగువేల యెనిమిదివందల సత్యయుగ ప్రమాణమైతే మూడు వేల ఆరువందలు త్రేతాయుగ ప్రమాణం. రెండువేల నాలుగువందలు ద్వాపరప్రమాణం. పన్నెండువందలు కలియుగ ప్రమాణం అవుతుంది. మానవమానంచేత కలియుగ ప్రమాణం నాలుగు లక్షల ముప్పై రెండువేల సంవత్సరాలైతే దేవమానంచేత పన్నెండు వందలైంది. ఇట్లే ఇతర యుగాలు కూడా గ్రహించాలి. యుగాది యందు, సంధ్యాయుగాంతమందు, సంధ్యాంశ అని చెప్తారు - కాలవేత్తలు. ఈ కాలప్రమాణం వందలలో చెప్పబడ్డది. ఈమధ్యకాలాన్నే యుగ

మన్వాదిభిరిదం విశ్వమవత్యుదిత పౌరుషః.
తమోమాత్రముపాదాయ ప్రతిసంరుద్ధవిక్రమః,
కాలేనానుగతాశేషఆస్తే తూష్ణీం దినాత్యయే.
తమేవాన్వపి ధీయంతేలోకా భూరాదయస్త్రయః,
నిశాయామనువృత్తాయాం నిర్ముక్తశశిభాస్కరమ్.
త్రిలోక్యాం దహ్యమానాయాం శక్త్యా సంకర్షణాగ్నినా,
యాంత్యూష్మణా మహర్లోకాజ్జనమ్భృష్యాదయోర్దితాః.
తావ త్త్రిభువనం సద్యః కల్పాన్తైధితసింధవః,

మన్నారు విజ్ఞానులు. ప్రత్యేకంగా యుగభేదం చేత ధర్మంలో విశేష లక్షణాలుంటాయి. కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో ఉంటుంది. క్రమంగా అధర్మం వృద్ధి చెందడంలో ఒక్కొక్క పాదం లోపిస్తూంటుంది. అంటే త్రేతాయుగంలో ధర్మం మూడుపాదాలు గలది, ద్వాపరంలో రెండు, కలియుగంలో పాదమాత్రావశేషంతో ఉంటుం దని గ్రహించాలి. త్రిలోకాలకూ పైనున్న మహర్లోకం నుండి సత్య లోకం వరకూ ఉన్న లోకాలలో నాలుగు వేలయుగాలు ఒకదినంగా లెక్కింప బడుతుంది. అంటే మనుష్య లోకంలో నాల్గు యుగాలూ, కలిస్తే మహాయుగం. అలాంటి మహాయుగాలు వెయ్యి ఐతే ఒక పగలుగా లెక్కలోకి వస్తుంది. వేయిమహాయుగాలు రాత్రి. ఆ రాత్రికాలం అంతా బ్రహ్మకు నిద్రాకాలం. ఆరాత్రి అంతం కావడంతోటే కల్పారంభం అవుతుంది. బ్రహ్మయొక్క పగలంతా యీ కల్పం నడుస్తూంటుంది. కల్పానికి పదునలుగురు మనువులుంటారు. ఒక్కొక్క మనువు యొక్క కాలం డెబ్బైయొక్క మహాయుగంపైని కొంచం యెక్కువ కాలం ఉంటుంది. ఆ కాలం ఆ మనువు యొక్క అధికారంలో ఉంటుంది. ప్రత్యేకంగా మన్వంతరాలలో భిన్న భిన్న మనువుల యొక్క వంశాలూ, రాజులూ, సప్తర్షులూ, దేవగణాలూ, ఇంద్రాదులూ, వారి అను యాయులైన గంధర్వాదులూ, వారి వారి అధికారాలను అనుభవి స్తారు. ఇది బ్రహ్మ యొక్క దైనందిన సృష్టి. దీని యందు త్రిలోకాలకూ

ప్లావయంత్యుత్కటాటోప చండవాతేరితోర్మయః.
అంతస్సతస్మిన్ సలిల ఆస్తేఽనంతాసనో హరిః,
యోగనిద్రానిమీలితాక్షః స్తూయమానో జనాలయైః,
ఏవంవిధైరహోరాత్రైః కాలగత్యోపలక్షితైః,
అపక్షీణమివాస్యాపి పరమాయుర్వయశ్శతమ్.
యదర్ధమాయుషస్తస్య పరార్ధమభిధీయతే,
పూర్వః పరార్ధోఽతిక్రాంతోహ్యపరోఽద్య ప్రవర్తతే.
పూర్వస్యాదౌ పరార్ధస్య బ్రాహ్మో నామ మహానభూత్,
కల్పో యత్రాభవద్బ్రహ్మా శబ్దబ్రహ్మేతి యం విదుః.
తస్యైవ చాంతే కల్పోఽభూద్యం పాద్మమభిచక్షతే,

సంబంధించిన సృష్టి జరుగు తూంటుంది. ఈ త్రిలోకాలలో దేవ, పితృ, మనుష్య, పశు, పక్ష్యాది శరీరాలతో ఆయా జీవులు కర్మానుసారం పుడుతూ సుఖ దుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు. ఈమన్వంతరాలలో సత్వగుణ మూర్తియగు భగవానుడు మన్వాది రూపాల్లో అవతరించి విశ్వాన్ని పాలిస్తూంటాడు. బ్రహ్మయొక్క పగలు పూర్తి అయిన వెంటనే భగవానుడు తమోగుణాశ్రయుడై యీ విశ్వాన్ని ఉపసంహరిస్తాడు. ఆ సమయంలో విశ్వమంతా భగవానుని యందే లీనమై ఉంటుంది. సూర్యచంద్రాది రహితమైన ఆ ప్రళయరాత్రి యందు భూర్భువాది లోకాలు భగవంతుని యందే ఉంటాయి. ఆ సమయంలో శేషుని ముఖమునుండి వెలువడిన అగ్నిచే త్రిలోకాలూ భస్మమౌతూంటే చూసి వ్యాకులచిత్తులై భృగ్వాది ఋషులంతా మహర్లోకం నుండి జనలోకానికి వెడతారు. ఇంతలోనే ప్రళయవాయుక్షుభితమైన సముద్రాలేడూ త్రిలోకాలలోనూ ఆక్రమించి ఏకార్ణవమైపోతాయి. ఆసమయంలో భగవానుడా జలరాశియందు శేషశయనుడై యోగనిద్రలో ఉంటాడు. జనలోక నివాసులైన మునులప్పుడు భగవంతుని స్తుతి చేస్తూంటారు, ఈవిధంగా కాలగతిని లెక్కిస్తే, గడించే చతుర్యుగ సహస్ర పరిమితమైన దివారాత్రుల పరిగణనలో నూరుసంవత్సరముల ఆయుర్దాయం బ్రహ్మకుంటుంది. బ్రహ్మయొక్క ఆయుఃపరిమితి కూడా గడిచిపోతున్నట్లే కనపడుతుంది.

యద్ధరేర్నాభి సరసః ఆసీల్లోకసరోరుహమ్.
అయం తు ప్రథమః కల్పే ద్వితీయస్యాపి భారత,
వారాహ ఇతి విఖ్యాతో యత్రాసీత్సూకరో హరిః.
కాలోఽయం ద్విపరార్ధాఖ్యో నిమేష ఉపచర్యతే,
అవ్యాకృతస్యానంతస్య హ్యనాదేర్జగదాత్మనః.
కాలోఽయం పరమాణ్వాది ద్విపరార్ధాంతఈరితః,
నైవేశితుః ప్రభుర్భూమ్న ఈశ్వరో ధామ మానినామ్.
వికారైష్షోడశైర్యుక్తో విశేషాదిభిరావృతః,
అండకోశో బహిరయం పంచాశత్కోటివిస్తృతః.
దశోత్తరాదికైర్యత్ర ప్రవిష్టః పరమాణువత్,

బ్రహ్మయొక్క ఆయుర్దాయంలో సగభాగానికి పరార్ధం అని పేరు. ఇప్పటికొక పరార్ధం గతించింది. రెండవ పరార్ధం నడుస్తూన్నది. మొదటి పరార్ధంలో ఆదిబ్రహ్మకల్ప. ఆ కల్పాదియందే బ్రహ్మ ఆవిర్భవించాడు. పండితు లాయననే శబ్దబ్రహ్మ అంటారు. రెండవది పద్మకల్పం. ఈకల్పాది యందే శ్రీహరి నాభినుండి సర్వలోక మయమైన కమలం ఆవిర్భవించింది. ఇప్పుడు నడిచే కల్పం రెండవ పరార్ధారంభంగా తెలుస్తూంది. ఈకల్పారంభంలో శ్రీహరి వరహావతారుడైనాడు. కనుక నే దీనికి శ్వేతవరాహ కల్పమని పేరు. ఈ ద్విపరార్ధకాలం శ్రీహరికి నిమేషకాలం ఔతుంది. పరమాణువు మొదలు ద్విపరార్ధం వరకూ వ్యాప్తమైన కాలం సర్వసమర్థమైనదై కూడా సర్వేశ్వరుని యందేమీ తన ప్రభావం చూపలేదు. దేహాభిమానంకల జీవులయందే దీని ప్రభావం పనిచేస్తుంది.

ప్రకృతి మహత్తత్వం, అహంకారం, పంచతన్మాత్రలూ, ఈ ఎనిమిదీ అష్టప్రకృతులని చెప్పబడతాయి. పది ఇంద్రియాలూ, మనస్సూ పంచమహాభూతాలూ కలసి పదహారు వికారము లనబడుతాయి. యిరువదినాలుగింటి కలయికచే నిర్మాణమైన బ్రహ్మాండములో ప్రతి భాగం యాభైకోట్లయోజనాలు (5 0 0 0 0 0 0 0 0 0) మైళ్ళు. దీనికిపైభాగంలో దీనికంటే పదిరెట్లు పెద్దవిగా ఉన్న ఏడు ఆవరణములున్నాయి.

లక్ష్యంతే౽ంతర్గతాశ్చాన్యే కోటిశోహ్యండరాశయః.
తదాహురక్షరం బ్రహ్మ సర్వకారణకారణమ్,
విష్ణోర్ధామ పరం సాక్షాత్పురుషస్య మహాత్మనః,

ఈ ఆవరణలు ఒకదానిని మించి మరొకటి పదేసిరెట్లుంటాయి. ఇలాంటి బ్రహ్మాండాలు కోటాను కోట్లు ఎవనియందు అణురూపాల్లో ఉంటాయో అతడే అక్షరుడూ, అవ్యయుడూ, కారణాలన్నింటికీ కారణుడూ ఐన పరబ్రహ్మ. అతడే పురాణపురుషుడు. ఇదే శ్రేష్ఠమైన విష్ణుస్వరూపం.

## 11 అధ్యాయం

ఇతి తే వర్ణితః క్షత్తః కాలాఖ్యః పరమాత్మనః,
మహిమా వేదగర్భోథ యథా౽స్రాక్షీన్నిబోధమే.
ససర్జాగ్రే౽ంధ తామిస్రమథ తామిస్రమాదికృత్,
మహామోహం చ మోహం చ తమశ్చాజ్ఞానవృత్తయః,
దృష్ట్వా పాపీయసీం సృష్టిం నాత్మానం బహ్వమన్యత,
భగవద్ధ్యానపూతేన మనసా౽న్యాం తతో౽సృజత్.
సనకం చ సనందం చ సనాతనమథాత్మభూః,
సనత్కుమారం చ మునీ న్నిష్క్రియా నూర్ధ్వరేతసః.

మైత్రేయుడింకా యిలా చెప్తున్నాడు. విదురా! ఇంతవరకు కాలమహిమ వినిపించాను. బ్రహ్మ జగత్తునెలా సృష్టించాడో చెప్తా విను. ఆదిలో అవిద్యా, అస్మితా, రాగ, ద్వేష, అభినివేశముల, నారింటినీ సృష్టించాడు. ఈ పాపమయమైన సృష్టివల్ల బ్రహ్మకు ఆనందం కలుగలేదు. వెంటనే భగవంతుని ధ్యానించి, రెండవ తరగతి సృష్టి చేశాడు. ఆసృష్టిలో సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను, నివృత్తిమార్గనిరతులుగా సృష్టించాడు. ఊర్ధ్వరేతస్కులూ, మహానులూ ఐన సనకాదులను చూచి, బ్రహ్మసృష్టిక్రమంలో ప్రవేశించమంటే వారు నివృత్తిపరాయణులవడంవల్ల ప్రవృత్తి రూపమైన సృష్టియందు వారిబుద్ధి ప్రవేశించలేదు. సనకాదులు సృష్టియందు ప్రవృత్తులు కాకపోవడంవల్ల

తాన్ బభాషే స్వభూః పుత్రాన్ ప్రజాస్సృజత పుత్రకాః,
తే నైచ్ఛన్మోక్షధర్మాణో వాసుదేవపరాయణాః.
సోఽవధ్యాతస్సుతైరేవం ప్రత్యాఖ్యాతానుశాసనైః,
క్రోధం దుర్విషహం జాతం నియంతుముపచక్రమే.
ధియా నిగృహ్యమాణోఽపి భ్రువోర్మధ్యాత్ప్రజాపతేః,
సద్యోఽజాయత తన్మన్యుః కుమారో నీలలోహితః.
సవై రురోద దేవానాం పూర్వజో భగవాన్ భవః,
నామాని కురు మే ధాతః స్థానాని చ జగద్గురో.
ఇతి తస్య వచః పాద్మో భగవాన్ పరిపాలయన్,
అభ్యధాద్భద్రయా వాచా మారోదీస్తత్కరోమి తే.
యదరోదీస్సురశ్రేష్ఠ సోద్వేగ ఇవ బాలకః,
తతస్త్వామభిధాస్యంతి నామ్నా రుద్ర ఇతి ప్రజాః.
హృదింద్రియాణ్యసుర్వ్యోమ వాయురగ్నిర్జలం మహీ,
సూర్యశ్చంద్రస్తపశ్చైవ స్థానాన్యగ్రే కృతాని తే.
మన్యుర్మనుర్మహినసో మహాన్ శివ ఋతధ్వజః,
ఉరురేతా భవః కాలో వామదేవో ధృతవ్రతః,

బ్రహ్మకాగ్రహం కలిగి ఆ క్రోధం నిరోధించాలని చేసిన ప్రయత్నంవల్ల బ్రహ్మదేవుని భ్రూమధ్యాన్నుండి నీలలోహితుడావిర్భవించాడు. బాల రూపంలో నీలలోహితుడు రోదనం చేస్తూ, విధాతా! నా పేరేమి? నేనుండే స్థానమేది? అని అడిగాడు.

ఆపలుకులు విన్న చతుర్ముఖుడు, ఆ బాలకుని చూచి – నీకోరిక పూర్తిచేస్తాను. నువ్వు బాలుని వలె రోదనం చేస్తూ జనించావు గనుక నిన్ను రుద్రుడంటారు. హృదయం ఇంద్రియాలూ, ప్రాణ, ఆకాశ వాయువులూ, అగ్ని, జలం, పృథివి, సూర్యచంద్రులూ, తపస్సూ, అనేవి నీకు నివాసస్థానాలుగా, ఆదిలోనే సృష్టించాను. నీకు మన్యు, మను, మహినస, మహాన్, శివ, ఋతధ్వజ, ఉగ్రరేతా, భవ, కాల, వామదేవ ధృతవ్రత నామాలుకూడా ఉంటాయి. ధీ, వృత్తి, ఉశనా, ఉమా, నియుత్, సర్పి, ఇళా, అంబికా, ఇరావతీ, సుధా, దీక్షా నామాలతో యీ పదకొండు శక్తులూ రుద్రాణీశక్తులుగా, నీకు భార్యలౌతారు. నీవు పైన చెప్పిన నామ, స్థాన, స్త్రీలను స్వీకరించి అనేక తరగతులైన

ధీవృత్తిరశనో మాచ నియుత్సర్పిరిళాంబికా,
ఇరావతీ సుధా దీక్షా రుద్రాణ్యో రుద్రతే స్త్రియః.
గృహాణైతాని నామాని స్థానాని చ సయోషణః.
ఏభిస్సృజ ప్రజాబహ్వీః ప్రజానామసి యత్పతిః.
ఇత్యాదిష్టస్స గురుణా భగవాన్నీలలోహితః,
సత్త్వాకృతిస్వభావేన ససర్జాత్మసమాః ప్రజాః.
రుద్రాణాం రుద్రసృష్టానాం సమంతాద్గ్రసతాం జగత్,
నిశామ్యా సంఖ్యశో యూథాన్ ప్రజాపతిరశంకత.
అలంప్రజాభిస్సృష్టాభిరీదృశీభిస్సురోత్తమ,
మయా సహ దహంతీభిర్దిశశ్చక్షుర్భిరుల్బణైః.
తప ఆతిష్ఠ భద్రం తే సర్వభూత సుఖావహమ్,

ప్రజలను ఉత్పత్తిచెయ్యి. ప్రజాపతివి గనుక యీ కార్య భారం నీమీదే వుంటుంది.

కమలజన్ముని వాక్యాలు విని నీలలోహితుడు తనతో సమానమైన ఆకార బల స్వభావాలు గల ప్రజలను ఉత్పత్తి చెయ్యడం ఆరంభించాడు. అదంతా రుద్రునితో సమానమైన రౌద్రీసృష్టి కావడంచేత అసంఖ్యాకులైన రుద్రరూపులు, బయలుదేరి ప్రపంచాన్నే భక్షించడం ఆరంభించారు. అది చూచి, బ్రహ్మ రుద్రునిచూచి — సుర శ్రేష్ఠా, నీ రౌద్రీసృష్టి సమస్తలోకాలనూ, భస్మంచేస్తూన్నది. కనక యీ సృష్టిని ఆపి సమస్త జీవకళ్యాణం కొరకు తపస్సుచెయ్యి. తపః ప్రభావం వల్ల పునః సృష్టి ఆరంభింతువుగాక. తపస్సుచేతనే పురుషుడు, సర్వాంతర్యామీ జ్యోతిర్మయుడూ, అయిన శ్రీహరిని దర్శించ గలుగుతాడు, అని చెప్పిన బ్రహ్మ పలుకులాలించి రుద్రుడు బ్రహ్మకు ప్రదక్షిణ నమస్కారాలుచేసి తపస్సు చెయ్యడానికి అరణ్యానికి వెళ్లాడు.

భగవచ్ఛక్తి సంపన్నుడైన చతుర్ముఖుడు సృష్టిచెయ్యాలనే సంకల్పంతో మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు, భృగు, వసిష్ఠ, దక్ష, నారదులను, పదిమందినీ సృష్టించాడు. వారివల్లనే సృష్టి వృద్ధి చెందింది. ఇందులో నారదుడు ఒడినుండీ దక్షుడు అంగుష్ఠం నుండి

తవసైవ యథాపూర్వం స్రష్టా విశ్వమిదం భవాన్.
తవసైవపరం జ్యోతిర్భగవంత మధోక్షజమ్,
సర్వభూత గుహావాసమంజసా విందతే పుమాన్.
ఏవమాత్మజువాచిష్టః పరిక్రమ్యాగిరాంపతిమ్,
బాఢమిత్యముమామంత్ర్య ప్రవేశ తపసేవనమ్,
అథాభిధ్యాయతస్సర్గంవదశపుత్రాః ప్రజజ్ఞిరే,

వశిష్ఠుడు పాదంనుండి, త్వక్కునుండి భృగువూ, చేతులునుండి క్రతువూ నాభినుండి పులహుడూ, చెవులనుండి పులస్త్యుడూ, ముఖాన్నుండి అంగిరుడూ, నేత్రాలనుండి అత్రి, మనస్సునుండి మరీచీ, ఉత్పన్నమై నారు. బ్రహ్మయొక్క దక్షిణ స్తనంనుండి, ధర్ముడు, జనించారు. ఈయన భార్యనుండి నారాయణుడు స్వయంగా అవతరించాడు. స్వయంభువు యొక్క పృష్ఠభాగంనుండి అధర్మం ఆవిర్భవిస్తే అధర్మం నుండి లోకానికి భయం కలిగించు మృత్యువా విర్భవించింది. ఇదే విధంగా బ్రహ్మ హృదయాన్నుండి కామం, భ్రూమధ్యం వల్ల క్రోధం, క్రింద పెదవినుండి లోభం, ముఖాన్నుండి వాగ్దేవియైన సరస్వతి లింగంనుండి సముద్రం, గుదంనుండి నిర్భతీ, ఛాయనుండి కర్దమప్రజాపతీ, ఉత్పన్నమైనారు. ఈ సంసారమంతా బ్రహ్మనుండి ఆవిర్భవించింది.

విదురా! బ్రహ్మయొక్క కన్య సుకుమారీ, సౌందర్యశాలీ మనోహరమైనది ఒకసమయంలో బ్రహ్మ సరస్వతిని చూచి వ్యామోహం చెందాడు. ఆమె కామవాసనారహితమైనది. ఈ అధర్మ రూపమైన, బ్రహ్మ సంకల్పాన్ని గుర్తించిన మరీచ్యాదులు బ్రహ్మను సమీపించి "తండ్రీ మీరు సర్వసమర్థులై యుండికూడా అధర్మమైన పుత్రీగమన రూపమైన కామేచ్ఛను నిరోధించక పాపానికి సిద్ధమౌతున్నారు. మీకు పూర్వమందావిర్భవించిన బ్రహ్మలెవరూ, యీ పాప కార్యం చేసినట్లు ప్రమాణాలు లేవు. ముందు రాబోయే బ్రహ్మలు కూడా చెయ్యరు. మీవంటి ఆదర్శపురుషులు యిలాంటి పాపకృత్యం చెయ్యరాదు. మీరు చేసినపని లోకానికి ఆదర్శమైపోతుంది. మీరు

భగవచ్ఛక్తి యుక్తస్యలోకసంతానహేతవః,
మరీచిరత్ర్యంగిరసౌపులస్త్యః పులహః క్రతుః
భృగుర్వసిష్ఠోదక్షశ్చదశమస్తత్రనారదః.
ఉత్సంగాన్నారదోజజ్ఞేదక్షోఽంగుష్ఠాత్స్వయంభువః,
ప్రాణాద్వసిష్ఠస్సంభూతో భృగుస్త్వచికారాత్క్రతుః.
పులహోనాభితోజజ్ఞేపులస్త్యః కర్ణయోర్ఋషిః,
అంగిరాముఖతోఽక్ష్ణోఽత్రిర్మరీచిర్మనసోఽభవత్.
ధర్మఃస్తనాద్దక్షిణతో యత్రనారాయణస్స్వయమ్,
అధర్మఃపృష్ఠతో యస్మాన్మృత్యుర్లోకభయంకరః,
హృదికామోభ్రువోః క్రోధోలోభశ్చాధరదచ్ఛదాత్,
ఆస్యాద్వాక్సింధవోమేఢ్రాన్నిరృతిః పాయోరఘాశ్రయః.
ఛాయాయాఃకర్దమోజజ్ఞేదేవహూత్యాః పతిః ప్రభుః,

తమ ధర్మాచరణచేస్తే దాన్ననుసరించిన వారికి కళ్యాణం చేకూరుతుంది. ఈ సమయంలో సర్వకారణ కారణుడైన శ్రీహరి ధర్మాన్ని రక్షించుగాక యని తనకుమారులైన మరీచ్యాదులు చెప్పడంచూసి, బ్రహ్మ లజ్జతో శిరస్సువంచుకొని ఆ శరీరాన్ని వదలివేశాడు. బ్రహ్మచే వదలబడిన ఆ శరీరం ఘోరాకారంగా ఉంది. దానిని దిక్కులు గ్రహించాయి. అది పొగమంచువలె వ్యాపించింది. దానినే అంధకారమన్నారు. బ్రహ్మగారొకప్పుడిలా ఆలోచించాడు. నేను పూర్వమువలె సువ్యవస్థితమైన సృష్టి యెలాగ చెయ్యాడమని – ఆ దేసమయంలో ఆయన నాలుగు ముఖాలనుండీ నాలుగు వేదాలూ, ఉపవేదాలూ, న్యాయశాస్త్రమూ, అధ్వర్యు, బ్రహ్మ, హోత, ఉద్గాతలనే, నాలుగు తరగతుల ఋత్విగ్గణముచే చేయబడు యజ్ఞకర్మల యొక్క విస్తారము ధర్మం యొక్క నాలుగుచరణాలూ, నాలుగు ఆశ్రమాలూ, వానివానివృత్తులూ, ఇవన్నీ బ్రహ్మయొక్క ముఖాన్నుండి జనించాయి. అని చెప్తూ ఉన్న మైత్రేయుని విదురుడు అడుగుతున్నాడు. తాపసశ్రేష్ఠా! చతుర్ముఖుడు వేదాలనెప్పుడు తనముఖాన్నుండి రచించాడు? ఏ ముఖాన్నుండి యే వస్తువు సృష్టించాడు? సవిస్తరంగా చెప్పండి. అన్న విదురునకు మైత్రేయుడు చెప్తున్నాడు.

మనసోదేహతశ్చేదంజజ్ఞేవిశ్వకృతోజగత్.
వాచందుహితరంతన్వింస్వయంభూర్హరతీంమనః.
అకామాంచ కమేక్షత్తస్సకామఇతినశ్శుశ్రుతమ్.
తమధర్మేకృతమతింవిలోక్యపితరంసుతాః,
మరీచిముఖ్యామునయోవిశ్రంభాత్ప్రత్యబోధయన్.
నత్వత్పూర్వైఃకృతం త్వద్యనకరిరిష్యంతియేపరే,
యస్త్వందుహితరంగచ్ఛేదనిగృహ్యాంగజంవిభుః.
తేజీయసామపిహ్యేతన్న సుశ్లోక్యంజగద్గురో,
యద్వృత్తమనుతిష్ఠఞా వైలోక క్షేమాయ కల్పతే.
తస్మైనమోభగవతేయఇదం స్వేనరోచిషా,

విదురా! పూర్వముఖాన్నుండి ఋగ్వేదం, దక్షిణముఖంవల్ల యజుర్వేదం పశ్చిమముఖాన్నుండి సామవేదం ఉత్తరముఖంవల్ల అధర్వణవేదం సృష్టించాడు. హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ, కర్మలు, పై క్రమంలోనే సృష్టించాడు. ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వ వేద, స్థాపత్యవేదాలు చతుర్వేదాలకూ ఉపవేదాలుగా, ప్రసాదించాడు. సర్వదర్శియై భగవానుడైన, చతుర్ముఖుడు పూర్వాది ముఖాలనుండి, షోడశీ, ఉక్థ్య, చయన, అగ్నిష్టోమ, ఆప్తోర్యామ, అతిరాత్ర, వాజపేయ గోసవాదులను ఒక్కొక్కముఖానుండి రెండేసి యాగాలుగా సృష్టించి, ఇతిహాస పురాణాదులను కూడా పంచమ వేదంగా సృష్టించాడు.

విద్యా దాన తపస్సులూ, సత్యమూ, ధర్మానికి నాలుగు పాదాలు. వృత్తుల సహితంగా నాలుగు ఆశ్రమాలూ సృష్టించాడు. సావిత్రి, ప్రాజ్ఞా, పత్య, బ్రహ్మ, బృహత్, అనే నాలుగు వృత్తులూ, బ్రహ్మచారికీ, వార్తాసంచయ, శాలీన, శిలోంఛ యీ నాలుగు వృత్తులూ గృహస్థుకూ, నిర్ణయించాడు. వైఖానస, వాలఖిల్య, ఔదుంబర, ఫేనప, భేదాలతో వానప్రస్థాశ్రమవిధులూ, కుటీచక, బహూదక, హంస, పరమహంస యను చతుర్విధ సన్యాసాశ్రమాలూ, అన్వీక్షకీ, వార్తా, దండనీతీ, విద్యలూ, నాలుగు వ్యాహృతులూ, కూడా

ఆత్మస్థంవ్యంజయా మానసధర్మంపాతుమర్హతి,
నఇత్థంగృణతఃపుత్రాన్పురో దృష్ట్వాప్రజాపతీన్,
ప్రజాపతిపతి స్తన్వింతత్యాజవ్రీడితస్తదా.
తాందిశోజగృహుర్ఘోరాంనైహారం యద్విదుస్తమః,
కదాచిద్ధ్యాయతస్స్రష్టుర్వేదా అసంశ్చతుర్ముఖాత్.
కథం స్రక్ష్యామ్యహం లోకా సమవేతా యథా పురా,
చాతుర్హోత్రం కర్మతంత్ర ముపవేద నయైస్సహ,
ధర్మస్య పాదాశ్చత్వారస్తథైవా శ్రమవృత్తయః.
నవైవిశ్వస్సృజామీశో వేదాదీన్ముఖతో ఒస్సృజత్,
యద్యద్యేనాసృజద్దేవస్తన్మే బ్రూహి తపోధన.
ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదా న్పూర్వాదభిర్ముఖైః.
శస్త్రమిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం యథాక్రమాత్.

బ్రహ్మయొక్క నాలుగు ముఖాలనుండీ ఉత్పన్నమయాయి. బ్రహ్మ హృదయంనుండి ఓమ్ కారం ప్రకటమైంది.

ఉపనయన సంస్కారానంతరం, మూడురోజులవరకూ,గాయత్రీ అధ్యయనమునకు నియమింపబడిన వ్రతమే సావిత్రి బ్రహ్మచర్య మనబడుతుంది. సంవత్సర నియమంతో సాగించు బ్రహ్మచర్యవ్రతమే ప్రాజాపత్య బ్రహ్మచర్యము. వేదాధ్యయన పర్యంతం అవలంబించే వ్రతమే బ్రాహ్మబ్రహ్మచర్య వ్రతము. జీవించి ఉన్నంతవరకూ అవ లంబించే వ్రతమే బృహద్బ్రహ్మచర్య వ్రతము. ఈ నాలుగూ బ్రహ్మ చారికి విధింపబడిన వ్రతాలు. ఇందులో వానివాని అర్హతలూ, అధి కారాలూ, శక్తులూ, అనువాని ననుసరించి గ్రహింపవలెను. కృషి వాణిజ్యాది, శాస్త్రవిహితమైన, వృత్తులే, వార్తాశబ్దంచేత చెప్పబడు తాయి. యాగాదులుచేయించి ధనాన్ని ఆర్జించుటే సంచయము. అయాచితంగా లభించినదానితో తృప్తిచెందుటకే శాలీనవృత్తియని పేరు. పంటచేలు కోసివేసిన తరువాత రైతు సస్యమంతా తీసుకువెళ్ళిన పిమ్మట అక్కడ రాలిన ధాన్యాదులు గ్రహించి జీవిత నిర్వాహణ చేయు టకే శిలోంఛమని పేరు. ఈ నాలుగూ గృహస్థునకు వృత్తులు. ఇదే

ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మభూః,
స్థాపత్యం చాసృజద్వేదం క్రమాత్పూర్వాదిభిర్ముఖైః.
ఇతిహాసం పురాణం చ పంచమం వేదమీశ్వరః,
సర్వేభ్యఏవ వక్త్రేభ్య స్ససృజే సర్వదర్శనః.
షోడశ్యుక్థౌ పూర్వవక్త్రాత్పురీష్యగ్నిష్టుతావథ,
అప్తోర్యామాతిరాత్రౌ చ వాజపేయం సగోసవమ్.
విద్యాదానం తపస్సత్యం ధర్మస్యేతి పదాని చ,
ఆశ్రమాంశ్చ యథాసంఖ్యమసృజత్సహ వృత్తిభిః.
సావిత్రం ప్రాజాపత్యం చ బ్రాహ్మం చాథ బృహత్తథా,
వార్తాసంచయశాలీన శిలోంఛ ఇతి వై గృహే.

విధంగా భూమిదున్నకుండా విత్తులు చల్లకుండా ఫలించిన పదార్థాలను గ్రహించి జీవించుట వైఖానసము. నూతనపదార్థం, దొరకిన తోడనే నిలవఉన్న పదార్థం అంతా పంచిపెట్టుట వాలఖిల్యాము. ప్రాతఃకాలంలో లేచినతోడనే ముఖం ఏ వైపుకుంటుందో ఆదిక్కుకే వెళ్ళి ఫలాదులను గ్రహించి తెచ్చుకొనుటకే ఔదుంబర మని పేరు. తమంత తాము పండిరాలిన ఫలాదులను గ్రహించుటకే ఫేనప వ్రతమని పేరు. ఈ నాలుగూ వానప్రస్థాశ్రమంలోని నియమవ్రత భేదాలు. పర్ణకుటీరం నిర్మించుకొని ఆశ్రమధర్మాలు పూర్తిగా పాలించే సన్యాసి కుటీచక సన్యాసి అనబడుతాడు. కర్మయందు గౌణదృష్టి కలవాడై జ్ఞానాన్ని ప్రధానంగా చూసేవాడే బహూదక సన్యాసి. నిరంతరం జ్ఞానాన్నభ్యసించేవాడే హంస. ఆత్మవిద్యను గ్రహించి నిరంతరం ఆత్మానుభూతి నందువాడే పరమహంస. ఈనాలుగూ సన్యాసులకు విధింపబడిన ఆశ్రమభేదాలు. మోక్షాన్ని ప్రాప్తింపజేయు ఆత్మవిద్యనే "అన్వీక్షికీ" అంటారు. స్వర్గాదిభోగాలను సంప్రాప్తింపజేసే విద్యయే త్రయీ, అని చెప్పబడుతుంది. కృషి వాణిజ్యాదులకు సంబంధించినది, వార్తా, శబ్దంచేత వ్యవహరిస్తారు. రాజనీతికే దండనీతి యని పేరు. ఈ నాలుగే విద్యలనబడతాయి. భూః, భువః, స్వః, యీ మూడూ కలిసిగాని లేక మహః తోగాని నాలుగూ వ్యాహృతులని వేదవేత్తలు

వైఖానసా వాలఖిల్యోదుంబరాః ఫేనపావనే,
న్యాసే కుటీచకః పూర్వం బహూదో హంసనిష్క్రియో,
అన్వీక్షకీ త్రయీవార్తా దండనీతి స్తథైవ చ,
ఏవం వ్యాహృతయశ్చాసన్ ప్రణవోహ్యస్యదహ్రతః.
తస్యోష్ణిగాసీల్లోమభ్యో గాయత్రీచ త్వచోవిభోః,
త్రిష్టుబ్మాంసాత్స్నుతో ఉనుష్టు బ్జగత్యస్థ్నః ప్రజాపతేః.
మజ్జాయాః పంక్తిరుత్పన్నా బృహతీ ప్రాణతోఽభవత్,
స్పర్శాస్తస్యా భవజ్జీవః స్వరో దేహ ఉదాహృతః.
ఊష్మాణ ఇంద్రియాణ్యాహురంతస్థా బలమాత్మనః,
స్వరాస్సప్తవిహారేణ భవంతి స్మ ప్రజాపతేః.
శబ్దబ్రహ్మాత్మనస్తాత వ్యక్తావ్యక్తాత్మనః పరః,
బ్రహ్మ చాభాతి వితతే నానాశక్త్యుపబృంహితః.
తతో పరాముపాదాయ ససర్గాయ మనోదధే,
ఋషీణాం భూరివీర్యాణామపి సర్గమవిస్తృతమ్.

చెప్పుతారు. అశ్వలాయన గృహ్యసూత్రాల్లో, వేదాల్లో, వ్యాహృతులనుగూర్చి, విపులమైన చర్చ సాగింది. ఈ విధంగా యివన్నీ, చతుర్ముఖబ్రహ్మనుండి ఆవిర్భవించాయి.

చతుర్ముఖుని రోమాలనుండి ఉష్ణిక్కూ, త్వక్కునందు గాయత్రీ, మాంసం వల్ల త్రిష్టుప్, స్నాయువులచేత అనుష్టుప్, అస్థులనుండి జగత్, మజ్జాధాతువులనుండి పంక్తీ ప్రాణాలవల్ల బృహతీ, అనే ఛందస్సులు పుట్టాయి. ఇదేవిధంగా బ్రహ్మయొక్క జీవం కాది పంచవర్గరూపమైన వర్ణసముదాయంగానూ, దేహం అకారాది స్వరవర్ణరూపంలోనూ ఇంద్రియాలు, శ, ష, స, హ, యను ఊష్మవర్ణములుగా య, ర, ల, వ, లనే అంతస్థవర్ణములకే బలంగానూ, అంటే అకారాదులైన అక్షరసమామ్నాయమే, బ్రహ్మయొక్క జీవ దేహ ఇంద్రియ బలాదులుగా, చెప్పబడ్డాయి. చతుర్ముఖుని క్రీడవల్లనే నిషాద, ఋషభ, గాంధార, షడ్జ, మధ్యమ, ధైవత, పంచమములనే సప్తస్వరాలూ, జనించాయి. బ్రహ్మశబ్దవాచ్యుడూ, బ్రహ్మస్వరూపుడూ అతడే. ప్రణవరూపంలో అవ్యక్తంగానూ, వైఖరీ రూపంలో వ్యక్తంగానూ, ఉంటాడు. ఆయనకు

జ్ఞాత్వా తద్వ్యహృదయే భూయశ్చింతయా మాస కౌరవ,
అహో అద్భుతమేతన్మే వ్యావృతస్యాపి నిత్యదా.
నహ్యేధంతే ప్రజానూనం దైవమత్ర విఘాతుకం,
ఏవం యుక్తకృతస్తస్య దైవం చావేక్షతస్తదా.
కస్య రూపమభూద్ద్వేధా యత్కాయమభిచక్షతే,
తాభ్యాం రూపవిభాగాభ్యా మిథునం సమపద్యత.
యస్తుత్రతపుమాజా సోఽభూన్మనుస్స్వాయంభువస్స్వరాట్,
స్త్రీయాసీచ్ఛతరూపాఖ్యా మహిష్య స్యమహాత్మనః.
తదా మైథునధర్మేణ ప్రజాహ్యేధాంబభూవిరే,
స చాపి శతరూపాయాం పంచాపత్యాన్యజీజనత్.

పరమైనవాడే పరబ్రహ్మ. అనంతశక్తులుగల పరబ్రహ్మయే ఇందాద్యనేక రూపాలతో ప్రకాశిస్తూంటాడు.

చతుర్ముఖుడాదియందు శరీరం వదలి మరొక శరీరం ధరించి నట్లు విన్నావుకదా! రెండవశరీరాన్ని ధరించి విశ్వం విస్తరించాలని చూస్తే, మరీచ్యాదులవల్ల ప్రపంచం సంపూర్ణంగా విస్తరించలేదు. ఆయన మనస్సులో చింత కలిగింది. "నేనెన్నిమార్లు యెంతప్రయత్నం చేసినా, ప్రజావృద్ధి కలగడంలేదు. ఇందులో దేవుడే విఘ్నాలు కలిగిస్తూ ఉండి ఉండవచ్చును." అని యెప్పుడైతే భగవంతుని గురించి ఆలోచించసాగాడో అదేసమయంలో తన శరీరం రెండువిభాగాలైంది. బ్రహ్మకు అసలుపేరు "క". దానినుండి విభాగం కావడంవల్ల "కాయ" మైంది. ఆరెండు విభాగాలనుండి స్త్రీపురుషమిథునం యేర్పడింది. అందులో పురుషుడే ఆదిసామ్రాట్ సార్వభౌముడు. ఆదిమనువు స్వాయంభువు. ఆ స్త్రీయే మహారాణీ "శతరూప" అక్కడనుండి స్త్రీపురుష సంపర్క రూపమైన, మిథున ధర్మరూపమైన ప్రజావృద్ధి ఆరంభమైంది. శతరూపా స్వాయంభువులందు ప్రియవ్రత ఉత్తానపాదులను ఇద్దరు కుమారులూ, ఆకూతి, దేవహూతి, ప్రసూతి, అను ముగ్గురు కుమార్తెలూ, జన్మించారు. స్వాయంభువు దేవహూతిని కర్దమునకూ, ఆకూతిని రుచి ప్రజాపతికీ, ప్రసూతిని దక్షునకూ ఇచ్చి విధివిధా

ప్రియవ్రతోత్తానపాదౌ త్రినఃకన్యాశ్చ భారత,
ఆకూతిర్దే వహూతిశ్చ ప్రసూతిరితి సత్తమ.
ఆకూతిం రుచయే పాదాత్కర్దమాయ తు మధ్యమామ్,
దక్షాయాదాత్ప్రసూతిం చ యతఆపూరితం జగత్.

వంగా కన్యాదానం చేశాడు. ఈ కన్యల ముగ్గురిసంతతీ క్రమంగా ప్రపంచం అంతా నిండిపోయింది.

12 అధ్యాయం

నిశమ్య వాచం వదతో మునేః పుణ్యతమాం నృప,
భూయః పప్రచ్ఛకౌరవ్యో వాసుదేవకథాదృతః.
స వై స్వాయంభువస్సమ్రాట్ప్రియః పుత్రస్స్వయంభువః,
ప్రతిలభ్యప్రియాం పత్నీం కించకార తతో మునే.
చరితం తస్య రాజర్షేరాదిరాజస్య సత్తమ,
బ్రూహి మే శ్రద్ధధానాయ విష్వక్సేనాశ్రయోహ్యసౌ.

పరీక్షిన్మహారాజా ! మైత్రేయునివల్ల పుణ్యమయమైన ఈచరిత్ర అంతా విని విదురుడు మునిచంద్రా! స్వాయంభూ బ్రహ్మయొక్క ప్రియపుత్రుడు స్వాయంభువ మనువు. శతరూపను పత్నిగా గ్రహించిన అనంతరం, ఏమిచేశాడు ? వివరించి చెప్పండి. మీరు భక్తులు, జ్ఞానులు, సర్వజ్ఞులు. మీకంటే ఈరహస్యవిషయాలు చెప్పగలవారు లేరు. శరణాగత వత్సలుడైన శ్రీహరి కథలను వినాలని ఉంది. అని అత్యంతాసక్తితో అడిగిన విదురుని పలుకుల కానందించి దేహము గగుర్పొడువ మైత్రేయుడు ముందుకథావృత్తాంతం చెప్పడం ఆరంభించాడు.

చతుర్ముఖునివల్ల శతరూపతోకూడా ఆవిర్భవించిన స్వాయంభువమనువు చేతులుజోడించి బ్రహ్మకు నమస్కరించి – తండ్రీ! నీవొక్కడవే సమస్తలోకాలనూ జీవులనూ సృష్టించి పాలించి పోషింపగలవాడవు. మేము నీ సంతతిమి. నిన్ను సేవించడం మాకు ధర్మం. కనుక

శ్రుతస్య పుంసాం సుచిరశ్రమస్య నన్వంజసా సూరిభిరీడితోఽర్థః,
యత్తద్గుణాను శ్రవణం ముకుందపాదారవిందం హృదయేషు యేషామ్.
ఇతి బ్రువాణం విదురం వినీతం సహస్రశీర్ష్ణశ్చరణోపధానమ్,
ప్రహృష్టరోమా భగవత్కథాయాం ప్రణీయమానో ముని రభ్యచష్ట.
యదా స్వభార్యయా సాకం జాతస్స్వాయంభువో మనుః,
ప్రాంజలిః ప్రణతశ్చైనం వేదగర్భమభాషత.
త్వమేకస్సర్వభూతానాం జన్మకృద్వృత్తిదః పితా,
తథాపి నః ప్రజానాం తే శుశ్రూషా కేన వాభవేత్

మేము ఏ కార్యాచరణ రూపంగా, మిమ్ము సేవించాలో చెప్పండి అని అడుగగా బ్రహ్మ "కుమారా పృథ్వీపతీ ! నీయందు నేను ప్రసన్నుడనయ్యాను. నీవెవ్వడైతే వినయ విధేయతలతో ఆజ్ఞాపింపుడని నన్ను కోరావో ఆ క్షణంలోనే నేను ఆనందించాను. ఇతరులయందసూయా భావరహితమైన తండ్రి ఆజ్ఞను పాలించడమే కుమారుని ధర్మం. నీవు నీధర్మపత్నితో కూడా ఉత్తమసంతానం కని యజ్ఞముల ద్వారా శ్రీహరిని ఆరాధించు. ప్రజాపాలన చెయ్యి. ధర్మం నాలుగుపాదాలతో నడిచేలాగున ప్రజాపాలన సాగించడమే నన్ను సేవించడం. సక్రమ ప్రజాపరిపాలన చేత శ్రీహరి అనుగ్రహం కలుగుతుంది. శ్రీహరి అనుగ్రహం పొందలేనివాని జన్మ వృధా అవుతుంది. అట్టివా డాత్మద్రోహిగా పరిగణింప బడతాడు. అని చెప్పగా, తండ్రీ! మీయాజ్ఞ శిరసా వహిస్తున్నాను. నాకూ నా సంతానానికీ నివాసస్థానం చూపించండి. ఈ ప్రళయజలంలో మునిగిన భూమిని ఉద్ధరించి సర్వజీవులకు ఆశ్రయం చూపండి. అని అడిగాడు.

భూమి అగాధజలంలో మునిగి ఉండటంచూచి, బ్రహ్మ చాలాసేపు ఈ భూమిని ఉద్ధరించడం యెలాగ ? నేను సృష్టిరచనా దృష్టిలో ఉండగా యీభూమి రసాతలానికి పోయింది. ఇప్పుడేం చెయ్యాలి ? అని ఆలోచించిసర్వకారణ కారణుడై సర్వసత్తాయుతుడైన శ్రీహరిని ప్రార్థించానే నిశ్చయంతో యిలా ఆలోచిస్తూ ఉండగానే బ్రహ్మయొక్క

తద్విధేహి నమస్తుభ్యం కర్మస్వీడ్యాత్మశక్తిషు,
యత్కృత్వేహ యశో విష్వగముత్ర చ భవేదితి.
ప్రీతస్తుభ్యమహం తాత స్వస్తి స్తాద్వాం క్షితీశ్వర
యన్నిర్వ్యళీకేన హృదా శాధి మే త్యాత్మనార్పితమ్.
ఏతావత్యాత్మజైర్వీర కార్యా హ్యపచితిర్గురౌ,
శక్త్యాప్రమత్తైర్గృహ్యేత సాదరం గతమత్సరైః.
స త్వమస్యామపత్యాని సదృశాన్యాత్మనో గుణైః,
ఉత్పాద్య శాస ధర్మేణ గాం యజ్ఞైః పురుషం యజ.
పరం శుశ్రూషణం మహ్యం స్యాత్ప్రజారక్షయా నృప,
భగవాంస్తే ప్రజాభర్తుర్హృషీకేశోఽనుతుష్యతి.
యేషాం న తుష్టో భగవాన్యజ్ఞలింగో జనార్దనః.
తేషాం శ్రమో హ్యపార్థాయ యదాత్మా నాదృతస్స్వయమ్.

నాసికా రంధ్రాలనుండి అంగుష్ఠమాత్ర ప్రమాణంలో ఒక వరాహ మావిర్భవించి ఆలంబంలేని ఆకాశంలో బ్రహ్మ చూస్తూండగానే ఏనుగంత ఐపోయింది. ఇది అంతా చూస్తూన్న బ్రహ్మ, సనకసనందనాదులూ, మరీచ్యాది నవప్రజాపతులూ, శతరూపతో కూడా మనువూ, ఆశ్చర్యంతో నిలబడిపోయారు. ఈ వరాహమేమి? అంగుష్ఠప్రమాణంలో నాసికనుండి ఆవిర్భవించి చూస్తూండగానే యేనుగంతై ఇప్పుడు పర్వతాకార మైపోయింది. ఇది సామాన్య వరాహంకాదు. ఆదిమూర్తి యజ్ఞస్వరూపుడే యీ రూపంలో అవతరించా డనుకుంటూ ఉండగానే విశ్వరూపుడైన శ్రీహరి వరాహరూపంలో గర్జిస్తూంటే పది దిక్కులూ వ్యాపిస్తోంది. ఆ ధ్వని ఆ శబ్దం బ్రహ్మాది ప్రజాపతులకు అభయప్రదాన రూపంలో ఉంది. ఆ ఆదివరాహంయొక్క గర్జనవిన్న జనలోక, తపోలోక, సత్యలోకవాసులైన మునులు ఋగ్యజుస్సామ మంత్రములతో యజ్ఞవరాహమూర్తిని స్తుతించడం, ఆరంభించారు. భగవంతునియొక్క స్వరూపాన్నే వేదాలు విస్తరించి వర్ణిస్తాయి గనుకనే వరాహమూర్తి మహర్షుల వేదోక్తస్తుతి కానందించి ప్రసన్నుడై పునఃపునః గర్జిస్తూ ఆ ప్రళయపయోధిలో ప్రవేశించాడు. వాలభాగం

ఆదేశేఽహం భగవతో వర్తే యా మీవసూదన,
స్థానం త్విహానుజానీహి ప్రజానాం మమ చ ప్రభో,
యదోకస్సర్వ సత్త్వానాం మహీ మగ్నా మహాం భసి,
అస్యా ఉద్ధరణే యత్నోదేవ దేవ్యా విధీయతామ్.
పరమేష్ఠీ త్వపాం మధ్యే తదా సన్నామవేక్ష్య గామ్,
కథమేనాంసమున్నే ష్య ఇతి దధ్యౌ ధియా చిరమ్.
పీతంజలం మయా సర్వం పృథివీ చ నివేశితా,
ప్రజా దేవాసురపితౄన్మనుష్యాన్పశు పక్షిణః.
సరీసృపాన్నగాన్నాగాః భూతాన్యుచ్చావచాని చ,
సృజతో మే క్షితిర్వార్భిః ప్లావ్యమానా రసాం గతా,

పైకెత్తి మహావేగంతో ఆకాశంలో గంతులు వెయ్యడం, గిట్టలయొక్క ఆఘాతంచేత, కఠినమైన మెడయందలి రోమములచేత మేఘాలను చిందరవందర చెయ్యడం ఆరంభించాడు. వరాహమూర్తియొక్క శరీరం చాలా కఠినంగా ఉంది. త్వక్కునందలి రోమాలు కఠినంగా శూలములవలె ఉన్నాయి. తెల్లనికోరలూ, సూర్యసమ తేజములైన నేత్రాలూ, అపూర్వమైన శోభను కలిగిస్తున్నాయి. శ్రీహరి స్వయంగా యజ్ఞస్వరూపుడు. పైగా వరాహ రూపాన్ని ధరించడం వల్ల నాసికతో వాసనచూస్తూ గంధగుణప్రధానమైన భూమియొక్క జాడను చూస్తున్నాడు. కోరలు చాలా కఠినములై ఉన్నాయి. ఆకారం విశాలమై ఉండడం కారణంగా క్రూరాకారంలో ఉన్నాడు. ఆ వరాహమూర్తి ఐనా తన్నుస్తుతించే మరీచ్యాదులయందు అనుగ్రహ దృష్టినే ప్రసరింప జేస్తూ జలంలో ప్రవేశించిన తోడనేవజ్రమయమైన వరాహమూర్తి దేహంయొక్క తాకిడికీ సముద్రగర్భం పగిలి మేఘము ఉరిమి నట్లు భయంకరమైన శబ్దం జనించింది. ఆ సమయంలో సముద్రుడు ఉత్తాల తరంగరూపములైన భుజములనెత్తి యజ్ఞవరాహమూర్తీ! రక్షింపుము రక్షింపుమని ఘోషిస్తున్నాడా అన్నట్లుంది. అప్పుడు వరాహమూర్తి జలాంతర్భాగంలో రసాతలానికి పోయి మునిగి ఉన్న భూమిని చిన్నబంతివలె ఒకే కోరతో లేవనెత్తి ఉపరితలానికి వస్తూంటే

అథాత్రకిమనుష్ఠేయ మస్మాభి స్సర్గయోజితైః,
యస్యాహం హృదయాదానం స ఈశో విదధాతు తత్.
ఇత్యభిధ్యాయతో నాసా వివరాత్సహసానఘ,
వరాహతోకో నిరగాదంగుష్ఠపరి మాణకః.
తస్యాభిపశ్యతః ఖస్థః క్షణేన కిల భారత,
గజమాత్రః ప్రవవృధే తదద్భుతమభూన్మహత్.
మరీచిప్రముఖైర్విప్రైః కుమారైర్మనునా సహ,
దృష్ట్వా తత్సౌకరం రూపం తర్కయామాస చిత్రధా,
కిమేతత్సౌకరవ్యాజం సత్త్వం దివ్యముపస్థితమ్,
అహో బతాశ్చర్యమిదం నాసాయాం మే వి నిస్సృతమ్.

గదాపాణియైన హిరణ్యాక్షుడు అడ్డువచ్చి గదాప్రహారం ఆరంభించాడు. దానివల్ల వరాహమూర్తి చక్రంతో సమానమైన తీక్షమైన క్రోధంతో సింహం ఏనుగును సంహరించినట్లు దంతాయుధంతోనే హిరణ్యాక్షుని సంహరించి రక్తమయమైన ముఖంతో వస్తూంటే గజరాజు రక్త వర్ణంగల భూమిని దంష్ట్రలతో భిన్నంచేసి వస్తూన్నట్లుంది. గజరాజు దంతములపై తామరపుష్పాన్ని ధరించి వస్తున్నట్లు వరాహమూర్తి కమలకోశాకారమైన భూమండలాన్ని దంష్ట్రాగ్రమందు ధరించి జపలోరి భాగానికి రావడం చూసిన బ్రహ్మ మరీచ్యాదులూ చేతులుజోడించి స్తుతిస్తున్నారు.

ఓ అజితా! యజ్ఞవరాహమూర్తీ! నీకు జయమగుగాక, జయమగుగాక! యజ్ఞపతే, వేదత్రయ రూపమైన, మీ యీ వరాహరూపానికి నమస్కారము. మీ రోమకూపాల్లో యజ్ఞాలన్నీ లీనమైయున్నాయి. పృథివిని ఉద్ధరించడానికే మీరీ సూకర రూపాన్ని ధరించారు. మీకు నమస్కారము. ఈ యజ్ఞవరాహరూపం దురాచారులకు గోచరించదు. ఈ రూపంయొక్క త్వక్కునందు గాయత్ర్యాది ఛందస్సులూ రోమములందు దర్భలూ, నేత్రములందు ఘృతమూ, నాలుగుచరణములందూ హోతా, అధ్వర్యుడూ, ఉద్గాతా, బ్రహ్మలూ, వారిచేత చేయబడు కర్మలూ, ఉంటాయి. నీ ముఖాగ్రభాగమందు స్రుక్కూ నాసికా

దృష్టోంగుష్ఠశిరోమాత్రః క్షణాద్గండశిలాసమః,
అపి స్విద్భగవానేష యజ్ఞో మే వి ఖేదయన్మనః.
ఇతి మీమాంసతస్తస్య బ్రహ్మణస్సహ సూనుభిః,
భగవాన్ యజ్ఞపురుషోజగర్జాగేంద్రసన్నిభః.
బ్రహ్మాణం హర్షయామాస హరిస్తాంశ్చవిప్రోత్తమాన్,
స్వగర్జితేన కకుభః ప్రతిస్వనయతా ప్రభుః.
నిశమ్య తే ఘర్ఘరితం స్వఖేదక్షయిష్ణు మాయామయసూకరస్య,
జనస్తపస్సత్యనివాసినస్తేత్రిభిః పవిత్రైర్మునయో గృణన్తిస్మ,
తేషాం సతాం వేదవితానమూర్తిర్బ్రహ్మ వధార్యాత్మగుణానువాదమ్,
వినద్య భూయో విబుధోదయాయ గజేంద్రలీలో జలమావివేశ.
ఉత్క్షిప్తవాలః ఖచరఃకఠోరస్సటావిధున్వన్ఖరరోమశత్వక్,
ఖురాహతాభ్రస్సిత దంష్ట్రఈక్షాజ్యోతిర్బభాసే భగవాన్ మహీధ్రః.

ఛిద్రములందు స్రువమూ, ఉదరమందు యజ్ఞీయమైన భక్షణపాత్రి యగు ఇడా చెవులందు చమసం, ముఖమందు బ్రహ్మ భాగపాత్ర యగు, ప్రాశిత్రం కంఠఛిద్రమందు సోమపాత్రయగు గ్రహం ఉన్నాయి. నీవు నములుటే అగ్నిహోత్రం, మాటిమాటికీ అవతరిస్తూ ఉండడమే దాక్షిణీయేష్టి, నీ మెడభాగమే ఉపసదం, నీ కోరలే ప్రాయణీయం, అంటే దీక్షానంతరం చేసే ఇష్టి, ఉదనీయేష్టి అంటే యజ్ఞసమాప్తి కాలంలో చేసే ఇష్టి. మీ నాలుక ప్రవర్గ్యం అనగా ప్రత్యేక ఉపస దానికే పూర్వమందు చేయబడే మహావీరకర్మ. మీ శిరస్సే సభ్య, ఆవసథ్యాలు, హోమరహితమైన అగ్నిసభ్యమనీ ఔపాసనాగ్ని ఆవ సథ్యమనీ చెప్పబడతాయి. మీ ప్రాణములే చితి. అంటే ఇష్టకాచ యనము. మీ వీర్యమే సోమం. మీరు కూర్చుండుటే ప్రాతర్మాంధ్యం దిన సాయం సవనాలు. మీ సప్తధాతువులే అగ్నిష్టోమ, అత్యగ్ని ష్టోమ ఉక్థ్య, షోడశీ, వాజపేయ అతిరాత్రి, ఆప్తోర్యామాది, సప్త సంస్థలు. మీ శరీరసంధులే సమస్త సత్రియాగాలు. ఈవిధంగా మీరు సంపూర్ణమైన సోమసహిత, సోమరహిత, యజ్ఞక్రతు స్వరూపులు. యజ్ఞానుష్ఠాన రూపములైన ఇష్టులే మీ అవయవాలు. అన్నికలిపే

ఘ్రాణేన పృథ్వ్యాః పదవీం విజిఘ్రన్ క్రోడాపదేశస్స్వయమధ్వరాంగః,
కరాళదంష్ట్రోఽప్యకరాళదృగ్భ్యాముద్వీక్ష్య విప్రాన్ గృణతోఽవిశత్కమ్.
సవజ్రకూటాంగనిపాతవేగ విశీర్ణకుక్షిస్స్తనయన్నుదన్వాన్,
ఉత్సృష్టదీర్ఘోర్మిభుజైరివార్తశ్చుక్రోశ యజ్ఞేశ్వర పాహిమేతి.
ఖురైః క్షురప్రైర్దరయంస్తదాప ఉత్పారపారం త్రిపరూరసాయామ్,
దదర్శ గాం తత్రసుషుప్సురగ్రే యాం జీవధానీం స్వయమభ్యధత్త.
స్వదంష్ట్రయోద్ధృత్య మహీం నిమగ్నాం స ఉత్థితస్సంరురుచే రసాయాః,
తత్రాపిదైత్యం గదయాపతంతం సునాభసందీపితతీవ్రమన్యుః.
జఘాన రుంధానమసహ్యవిక్రమం సలీలయేభం మృగరాడివాంభసి,
తద్రక్తపంకాంకితగండతుండో యథా గజేంద్రో జగతీం విభిందన్.
తమాలనీలంసితదంతకోట్యా క్ష్మాముత్క్షిపంతం గజలీలయాంగ
ప్రజ్ఞాయ బద్ధాంజలయోఽనువాకైర్విరించి ముఖ్యాఉపతస్థురీశమ్.
జితం జితం తేఽజితయజ్ఞభావన త్రయీం తనుం స్వాం పరిధున్వతే నమః,
యద్రోమగర్తేషు నిలిల్యురధ్వరాస్తస్మై నమః కారణసూకరాయ.
రూపం తవైతన్నను దుష్కృతాత్మనాం దుర్దర్శనం దేవయదధ్వరాత్మకమ్,
ఛందాంసియస్యత్వచి బర్హి లోమ స్వాజ్యం దృశిత్వం ఘ్రిషు చాతుర్హోత్రమ్.
స్రుక్తుండ ఆసీత్స్రువఈశనాసయోరిడోదరే చమసాః కర్ణరంధ్రే.
ప్రాశిత్రమాస్యే గ్రసనే గ్రహాస్తు తే యచ్చర్వణంతే భగవన్నగ్నిహోత్రమ్.
దీక్షానుజన్మోపసదశ్శిరో ధరస్త్వం ప్రాయణీయోదయనీయదంష్ట్రః,
జిహ్వాప్రవర్గ్యస్తవశీర్ష కంక్రతోస్సభ్యావసథ్యంచితయోఽసవోహితే.

మాంసపేశీలు. సమస్తదేవతా మంత్రద్రవ్య యజ్ఞకర్మలన్నీ మీ స్వరూపాలే. సర్వయజ్ఞమయ వేదమయస్వరూపా! నమస్కారము.

అరణ్యమునుండి బయటకు వచ్చే ఏనుగుయొక్క దంతాలమీదనున్న ఆకులతో కూడిన కమలంవలె పర్వతాదులతో కూడిన యీ భూమండలం మీదంష్ట్రాగ్రమందు శోభిస్తూన్నది. చరాచర జీవుల సుఖంకొరకై మీరు మీ పత్నీరూపమైన భూమాతనుద్ధరించారు. జగద్ధాత్రియగు ఈమహామాతను జలంమీదనే స్థాపించండి. మీరు జగానికే తండ్రిగనుక అరణియందగ్ని స్థాపించినట్లు ధారణ శక్తిరూపమైన మీ తేజాన్ని ఈభూమియందు స్థాపించండి. మేము మీకూ భూమాతకూ నమస్కరిస్తున్నాము. రసాతలంనుండి భూమాతనుద్ధరించే

సోమస్తు రేతస్సవనాన్యవస్థితి స్సంస్థావిభేదాస్త వదేహధాతవః
సర్వాణి సత్త్వాణి శరీరసంధయస్త్వం సర్వయజ్ఞక్రతురిష్టిబంధనః.
నమో నమస్తేఽఖిలమంత్ర దేవతాద్రవ్యాయ సర్వక్రతవే క్రియాత్మనే,
వైరాగ్యభక్త్యాత్మజయానుభావితజ్ఞానాయ విద్యాగురవే నమోనమః
దంష్ట్రాగ్రకోట్యాభగవంస్త్వయా ధృతా విరాజతే భూధరభూస్సభూధరా,
యథావనాన్నిస్స రతో దతా ధృతామతంగజేంద్రస్య సపంకపద్మినీ.
త్రయీమయం రూపమిదం చ సౌకరం భూమండలేనాథ దతా ధృతేనతే,
చకాస్తి శృంగోఢఘనేనభూయసా కులాచలేంద్రస్య యథైవ విభ్రమః.
సంస్థాపయైనాం జగతాం సతస్థుషాం లోకాయ పత్నీమసి మాతరం పితా,
విధేమ చాస్యైనమసా సహ త్వయా యస్యాం స్వతేజోగ్నిమివారణావధాః
కశ్శ్రద్దధీతాన్యతమస్తవ ప్రభో రసాంగతాయా భువ ఉద్విబర్హణమ్,
న విస్మయోఽసౌత్వయి విశ్వవిస్మయే యోమాయయేదం ససృజేఽతివిస్మయం,
విధున్వతా వేదమయం నిజం వపుర్జనస్తపస్సత్యని వాసినో వయం,
సటా శిఖోద్ధూతశివాంబుబిందుభిర్విమృజ్యమానా భృశమీశపాలి తాః.
స వై బత భ్రష్టమతిస్తవైషతే యః కర్మణాం పారమపారకర్మణః,
య ద్యోగమాయాగుణయోగమోహితం విశ్వం సమస్తం భగవన్ విధేహిశమ్.
ఇత్యుపస్థీయమానస్తైర్మునిభిర్బ్రహ్మవాదిభిః,
సలిలే స్వఖురాక్రాంత ఉపాధత్తా వితావనిమ్.
స ఇత్థం భగవానుర్వీం విష్వక్సేనః ప్రజాపతిః,
రసాయాలీలయా న్నీతామప్సు న్యస్య యయౌ హరిః.
యఏవమేతాం హరిమేధసో హరేః కథాం సుభద్రాం కథనీయమాయినః,
శృణ్వీత భక్త్యా శ్రవయేత్తథోశతీం జనార్ద సోఽస్యాశు హృది ప్రసీదతి.

సమర్థత మీకు వినా యెవరికుంది? ఇందులో ఆశ్చర్యమేమీలేదు. మీ మాయచేత యీ విశ్వాన్ని సృజించిన మీ దేహాన్ని ఝళిపిస్తూంటే నీ మెడరొమ్ముక్క రోమంమీదనున్న జలబిందువులు మాపై పడు తున్నాయి. అందువల్ల జన, తపో, సత్య, లోకవాసులమైన మేమంతా పవిత్రులమైనాము." అనిస్తుతించే బ్రహ్మాదుల స్తోత్రానికి ఆనందించి వరాహమూర్తి జలాన్నిస్తంభింపజేసి భూమిని జలంమీద నిలిపాడు. అనం తరం శ్రీహరి అంతర్ధానమైనాడు.

విదురా! లీలామయమై, పరమ పవిత్రమై, కీర్తనీయమై, వసుంధ రోద్ధరణ హేతువైన వరహావతారచరిత్ర చదివినా విన్నా మానవుడు

తస్మిన్ప్రసన్నే సకలాశిషాం ప్రభౌ కిం దుర్లభం తాభిరలం లవాత్మభిః,
అనన్యదృష్ట్యా భజతాం గుహాశయస్స్వయం విధత్తే స్వగతిం పరఃపరామ్.
కో నామ లోకే పురుషార్థసారవిత్పురా కథానాం భగవత్కథాసుధామ్,
అపీయకర్ణాంజలిభిర్భవాపహాంకథంవిరజ్యేతవినాస చేతరమ్.

సర్వపాప విముక్తుడై ఇహమందు సర్వ సౌఖ్యాలూ అనుభవించి అంత్య మందు మోక్షమును పొందుతాడు. ఇది త్రికాలా బాధ్య మానమైన సత్యం. అని మైత్రేయుడు విదురునకు చెప్పినట్లు శ్రీశుకులుపరీక్షిత్తునకు చెప్పారు.

## 13 అధ్యాయం

నిశమ్య కౌషారవిణోపవర్ణితాం హరేః కథాం కారణసూకరాత్మనః,
పునస్స పప్రచ్ఛ తముద్యతాంజలిర్నచాతితృప్తో విదురో ధృతవ్రతః.
తేనైవ తు మునిశ్రేష్ఠ హరిణా యజ్ఞమూర్తినా,
ఆదిదైత్యోహిరణ్యాక్షోహత ఇత్యనుశుశ్రుమః.
తస్య చోద్ధరతః క్షోణీం స్వదంష్ట్రాగ్రేణ లీలయా,
దైత్యరాజస్య చ బ్రహ్మన్ కస్మాద్ధేతోరభూన్మృధః.

పరీక్షిన్న రేంద్రా! మైత్రేయునివల్ల శ్రీహరికథ ఇంతవరకూ వినికూడా తృప్తిచెందక విదురుడు మైత్రేయునకు నమస్కరించి ఋషి సత్తమా! వరాహరూపంలో శ్రీహరి భూమినుద్ధరిస్తున్నప్పుడు ఆది దైత్యుడైన హిరణ్యాక్షుని సంహరించాడని చెప్పావువినాను. ఆ హిర ణ్యాక్షుడెవడు? ఎప్పుడు జన్మించాడు? అతడెట్టి పుణ్యకార్యాచరణవల్ల శ్రీహరి చేతుల్లో మరణించాడు? సవిస్తరంగా వివరించండి. అని అడిగాడు.

విదురా! నీప్రశ్న చాలా ఉత్తమమైనది. మృత్యుపాశంనుండి రక్షింపగలది. శ్రీహరి చరిత్రమాత్రమే. ఉత్తానపాదుని కుమారుడు ధృవుడు, నారదోపదేశంవల్ల శ్రీహరిని ధ్యానించి నారాయణుని అనుగ్ర హంచేత మృత్యువును జయించాడు. పూర్వకాలంలో వరాహహిరణ్యా

శ్రద్దధానాయ భక్తాయబ్రూహి తజ్జన్మవిస్తరమ్,
ఋషే న తృప్యతి మనః పరం కౌతూహలం హి మే.
సాధు వీర త్వయా పృష్టమవతారకథాం హరేః,
యత్త్వం పృచ్ఛసి మర్త్యానాం మృత్యుపాశవిశాతనీమ్.
యయోత్తానపదః పుత్రోమునినా గీతయార్భకః,
మృత్యోః కృత్వైవ మూర్ధ్న్యంఘ్రిమారురోహ హరేః పదమ్.
అథాత్రాపీతిహాసోఽయం శ్రుతో మే వర్ణితః పురా,
బ్రహ్మణా దేవదేవేన దేవానా మను పృచ్ఛతామ్.
దితిర్దాక్షాయణీ క్షత్తర్మారీచం కాశ్యపం పతిమ్,
అపత్యకామాచకమే సంధ్యాయాం హృచ్ఛయార్దితా.
ఇష్ట్వాగ్నిజిహ్వం పయసా పురుషం యజుషాం పతిమ్,
నిమ్లోచత్యర్క ఆసీనమగ్న్యగారే సమాహితమ్.

రుల యుద్ధాన్నిగురించి అడిగితే దేవతలకు చతుర్ముఖుడు చెప్పాడు. ఆ పరంపరాగతమైన చరిత్ర నేను విన్నాను. అదే చెప్తాను విను. ఒకప్పుడు దక్షకన్య దితి కశ్యపుని సమీపించి భర్తపాదాలకు నమస్కరించి పుత్రప్రాప్తికై కామాతురరాలై సాయంకాలసమయంలో మరీచి నందనుడైన కశ్యపుని ప్రార్థించింది. పాయసంతో అగ్నికాహుతు లిచ్చి, అగ్నిజిహ్వుడైన యజ్ఞపతిని ఆరాధిస్తూ ధ్యానంలో ఉన్నాడు. కశ్యపుని దితి సమీపించి, నాథా! మదించిన ఏనుగు కదళీ వృక్షాన్ని నలిపివేసినట్లు మన్మథుడు నన్ను నలిపేస్తున్నాడు. నా సవతులు సంతానవతులు కావడం నాకు లేకపోవడం కూడా నాకు బాధగానే ఉంది. నన్ను అనుగ్రహించి పుత్రసంతానం ప్రసాదించండి. భర్త పుత్రరూపంగా తననుండి ఆవిర్భవించినప్పుడే ఆ స్త్రీ భర్తచేత సమ్మానింప బడినట్లౌతుంది. అప్పుడే కీర్తి దశదిశలా వ్యాపిస్తుంది. మా తండ్రి దక్షప్రజాపతి తన కుమార్తెల నందరనూ ప్రేమగా చూసేవాడు. ఒకనాడాయన మమ్మల నందరనూ పిలిచి వేరు వేరుగా మీకెట్టి వరుడు కావాలని అడిగితే వారి వారి అభిప్రాయాలు చెప్పారు. మాకు అభిమతమైన పురుషుల నిచ్చి మా అక్క చెల్లెండ్రకు వివాహాలు

విషమాంత్వత్కృతేవిద్వన్కామఅత్తశరాసనః,
ధునోతిదీనాం విక్రమ్య రంభామివమతంగజః.
తద్భవాన్దహ్యమానాయాంసపత్నీనాంసమృద్ధిభిః,
ప్రజావతీనాం భద్రం తే మయ్యాయుంక్తామనుగ్రహమ్:
భర్తర్యాప్తోరుమానానాం లోకానావిశతేయశః,
భవద్విధః పతిర్యాసాం ప్రజయా నుప్రజాయ తే.
పురా పితా నో భగవాన్ దక్షో దుహితృవత్సలః,
కం వృణీత వరం వత్సా ఇత్యపృచ్ఛ త్సనః పృథక్,
స విదిత్వాత్మజానాం నో భావం సంతానభావనః,
త్రయోదశా దదాత్తాసాం యాస్తే శీలమనువ్రతాః.
అథ మేకురు కల్యాణం కామం కంజ విలోచన,
ఆర్తోపసర్పణం భూమన్నమోఘం హి వయీయసి.
ఇతి తాం వీరమారిచః కృపణాం బహుభాషిణీం,
ప్రత్యాహానునయన్వాచా ప్రవృద్ధానంగకశ్మలాం.

చేశాడు. అందులో మేము పదముగ్గురం. మరీచి నందనులైన కశ్యపులను వరిస్తామంటే మమ్మ మీకిచ్చి వివాహం చేశాడు. మేము మీ అనుగ్రహపాత్రులమై చరిస్తున్నాము. నా సవతు లందరకూ సంతానం ఉంది. నాకే లేదు. ఇప్పుడు నన్ను అనుగ్రహించి నాకు సంతానం ప్రసాదించండి.

కామ పరవశయైన దితి కశ్యపునకు ధ్యానం కూడా తోచకుండా రకరకాల మాటలతో పుత్రప్రాప్తికై ప్రార్థిస్తూ ఉంటే కశ్యపుడు నీ ఇచ్ఛననుసరించి నీ కోరిక నెరవేరుస్తాను. ధర్మార్థ కామసాధనమైన అర్ధాంగి కోరిక కాదనే వాడెవడుంటాడు. నావను ఆధారంగా చేసికొని మానవుడు సముద్రం దాటినట్లే గృహస్థాశ్రమంలో ఉన్నవాడు ఇతరమైన బ్రహ్మచర్యాది ఆశ్రమాల నాశ్రయమిస్తూ తాను స్వయంగా దుఃఖసముద్రం దాటగలుగుతాడు. త్రివిధ పురుషార్థ కాముడైన పురుషునకు స్త్రీ అర్ధంగా నిర్వచింప బడుతోంది. ఆ స్త్రీ యందు గృహభారం అంతా ఉంచి పురుషుడు నిశ్చింతగా తిరుగుతూంటాడు. ఇంద్రియరూపములైన శత్రువులు బ్రహ్మచర్యాది ఆశ్రమ

ఏష తేఽహం విధాస్యామి ప్రియం భీరు యదిచ్ఛసి,
తస్యాః కామం న కః కుర్యాత్సిద్ధిస్త్రైవర్గికీ యతః.
సర్వాశ్రమానుపాదాయ స్వాశ్రమేణ కళత్రవాన్,
వ్యసనార్ణవమత్యేతి జలయానైర్యథార్ణవం.
యామాహురాత్మనో హ్యర్ధం శ్రేయస్కామస్య మానిని,
యస్యాం స్వధురమధ్యస్య పుమాంశ్చరతివిజ్వరః.
యామాశ్రిత్యేంద్రియారాతీన్ దుర్జయానితరాశ్రమైః,
వయంజయేమ హేలాభిర్దస్యూన్ దుర్గపతిర్యథా.
న వయం ప్రభవస్తాం త్వామనుకర్తుం గృహేశ్వరి,
అప్యాయుషా వా కార్త్స్న్యేన యే చాన్యే గుణగృధ్నవః.
అథాపి కామమేతత్తే ప్రజాత్యై కరవాణ్యలం,
యథామాంనా తిపోచంతీ ముహూర్తంప్రతిపాలయ,
ఏషా ఘోరతమావేళా ఘోరాణాంఘోరదర్శనా,
చరంతి యస్యాంభూతాని భూతేశానుచరాణిహి.

వాసులకు జయింప శక్యముగానివి, కాని కోటకు అధికారియగు ప్రభువు దొంగలను సుగమంగా యెలాగైతే తన అధీనం చేసుకో గలుగుతాడో అలాగే గృహస్థు భార్య నాశ్రయించి ఇంద్రియ రూప మైన శత్రువులను సహజంగా జయించ కలుగుతాడు. గృహేశ్వరి యైన భార్యయొక్క ఉపకారానికి ప్రత్యుపకారం జన్మజన్మాంత రాలలో కూడా చెయ్యలేడు. నీ మనోరథం యథాశక్తిగా నెరవేరు స్తాను. ఒక ముహూర్త కాలం ఆగు. ఈ సమయం నింద్యమైనది. లోకం నన్ను నిందిస్తుంది. ఇది రాక్షస కాలం. చూడ్డానికే చాల భయంగా ఉంటుంది. ఈ సమయంలో భూతనాథుని భూత ప్రేత పిశాచ గణాలు, తిరుగుతూంటాయి. భూతనాథుడు కూడా యీ సమయంలో శ్మశానం నుండి రావడంవల్ల ఆ భస్మం జటాజూటం మీద పడటం వల్ల సువర్ణవర్ణుడైన భవుడు భస్మోద్ధూళిత విగ్రహుడై తిరుగుతూ ఉంటాడు. సూర్య చంద్ర అగ్ని రూపములైన మూడు నేత్రాలతో చూస్తూంటాడు. ఆయనకు తనవాడూ పరాయివాడూ అని లేదు. ఆయన మాయను గ్రహించాలనే మనం అనేక వ్రత తపో దానాలు

ఏతస్యాం సాధ్వీసంధ్యాయాం భగవాన్ భూతభావనః,
పరితో భూత పార్షద్భిర్వృషేణాటతి భూతరాట్.
శ్మశాన చక్రానిలధూళిధూమ్ర వికీర్ణవిద్యోత జటాకలాపః.
భస్మావకుంఠామలరుక్మదేహో దేవస్త్రిభిః పశ్యతి దేవరస్తే.
న యస్య లోకే స్వజనః పరో వా నాత్యాదృతో నోతకశ్చిద్విగర్హ్యః,
వయం వ్రతైర్యచ్చరణాపవిద్ధామాశాస్మహేఽజాంబతభుక్తభోగామ్.
యస్యానవద్యం చరితం మనీషిణో గృణంత్యవిద్యా పటలం బిభిత్సవః,
నిరస్తసామ్యాతిశయోఽపి యత్స్వయం పిశాచచర్యా మచరద్గతిస్సతామ్.
హసంతి యస్యాచరితం హి దుర్భగాః స్వాత్మన్ రతస్యా విదుషస్సమీహితమ్.
యైర్వస్త్రమాల్యాభరణానులేపనైః శ్వభోజనం స్వాత్మతయోపలాలితమ్.
బ్రహ్మాదయో యత్కృతసేతుపాలాః యత్కారణం విశ్వమిదం చ మాయా,
ఆజ్ఞాకరీ యస్య పిశాచచర్యా అహో విభూమ్నశ్చరితం విడంబనమ్.
సైవం సంవిదితే భర్త్రా మన్మథోన్మథితేంద్రియా,
జగ్రాహవాసో బ్రహ్మర్షేర్వృషలీవ గతత్రపా.
స విదిత్వా స్వభార్యాయాస్తం నిర్బంధం వికర్మణి,
నత్వాదిష్టాయ రహసి తయాథోపవివేశహి.

చేస్తూంటాము. కుక్కలకు ఆహారమైన నరశరీరాన్ని నమ్మి అజ్ఞానిలా పరమశివ వేషభూషణాదులు చూసి అవహాసిస్తారు. శంకరుని ధర్మ మర్యాదలను బ్రహ్మాదులకే ఉల్లంఘింప వీలులేనప్పుడు మనమెంత? అందువల్ల భూతనాథుడు గణాలతో చరించే యీ ఘోరకాలం యోగ్యమైనది కాదని కశ్యపు డెన్ని విధాల బోధించినా వినక కామాతురురాలైన దితి వివశురాలై కశ్యపుని నిరోధించింది. కశ్యపుడా భగవానునకు నమస్కరించి ఆమెను భోగించాడు.

అనంతరం కశ్యపుడు స్నానంచేసి ప్రాణాయామంతో వాక్కును బంధించి ధ్యాన యోగంలో కూర్చున్నాడు. దితి కూడా యీ నిందిత కర్మకు సిగ్గుపడి, శిరస్సు వంచి, బ్రహ్మర్షియైన కశ్యపునితో యిలా పలకడం ఆరంభించింది. బ్రహ్మర్షీ! భూతనాథుడైన రుద్రునకు నేనప రాధం చేశాను. ఐనా ఆ రుద్రుడు నాగర్భాన్ని నష్టపరచకుండుగాక. దుష్టులను దండించే క్రోధమూర్తీ, శిష్టులను రక్షించే మంగళమూర్తీ,

అథోపస్పృశ్య సలిలం ప్రాణానాయమ్య వాగ్యతః,
ధ్యాయన్ జజాప విరజం బ్రహ్మజ్యోతిస్సనాతనం,
దితిస్తు వ్రీడితానేన కర్మావద్యేన భారత,
ఉపసంగమ్య విప్రర్షి మధోముఖ్యభ్యభాషత.
మామే గర్భమిమం బ్రహ్మన్ భూతానామృషభోఽవధీత్,
రుద్రః పతిర్హి భూతానాం యస్యా కరవమంహసమ్,
నమో రుద్రాయ మహతే దేవాయోగ్రాయ మీఢుషే,
శివాయ న్యస్తదండాయ ధృతదండాయ మన్యవే.
స నః ప్రసీద తాద్భావో భగవానుర్వనుగ్రహః,
వ్యాధస్యాప్యనుకంప్యానాం స్త్రీణాం దేవస్సతీపతిః.
స్వగర్భస్యాశిషం లోక్యామాశాసానాం ప్రవేపతీమ్,
నిర్వృత్తసంధ్యాని యమో భార్యామాహ ప్రజాపతిః,
అప్రాయత్యాదాత్మనస్తే దోషాన్మౌహూర్తికా దుత,
మన్నిదేశాతిచారేణ దేవానాం చాపి హేళనాత్.
భవిష్యతస్తవాభద్రావభద్రేజాతరాధమౌ,
లోకాన్ సపాలాంస్త్రీం శ్చండి ముహురాక్రందయిష్యతః.

అయిన రుద్రునకు నమస్కరిస్తున్నాను. స్త్రీలయందు కిరాతులకు కూడా దయ కలుగుతుంది. కనుక సతీపతీ, నాకు దేవుడూ, ఐన పరమదయానిధి శంకరుడు నన్ను అనుగ్రహించుగాక అని ప్రార్థిస్తూ న్నది. ఇంతలో కశ్యపుడు సాయంకాల సంధ్యావందనాదులు పూర్తి చేసి కనులు విప్పేసరికి కంపించిపోతూ, తన సంతానంయొక్క లౌకిక, పారలౌకిక ఔన్నత్యంకోసం శంకరుని ప్రార్థిస్తూ ఉన్న దితిని చూచాడు.

దితీ! నీచిత్తం కామవాసనతో దుష్టమైంది. సమయం కూడా మంచిది కాదు. పైగా నువ్వు నా మాటా వినలేదు. దేవతలను అవ మానించావు. చండీ! నీ గర్భాన్నుండి అమంగళమయులైన అధమ లక్షణాలు గల ఇద్దరు పుత్రులు జన్మిస్తారు. వారు మాటిమాటికీ లోక పాలురను హింసిస్తూ నిరపరాధులైన సాధువులను హింసిస్తూ స్త్రీలపై అత్యాచారం సాగిస్తూ ఉంటే దేవతలూ మహాత్ములూకూడా వీరి బాధ సహించలేక శ్రీహరిని ప్రార్థిస్తే ధర్మరక్షకుడైన మాధవుడు

ప్రాణినాం హన్యమానానాం దీనానామకృతాగసామ్,
స్త్రీణాం నిగృహ్యమాణానాం కోపితేషు మహాత్మసు.
తదా విశ్వేశ్వరః క్రుద్ధో భగవాన్ లోకపాలనః,
హనిష్యత్యవతీర్యాసౌ యథాద్రీన్ శతపర్వధృత్.
వధం భగవతా సాక్షాత్సునాభో దారబాహునా,
ఆశాసే పుత్రయోర్మృత్యుం మాక్రుద్ధాద్బ్రహ్మణాద్విభో.
న బ్రహ్మదండదగ్ధస్య న భూతభయదస్య చ,
నారకాశ్చానుగృహ్ణంతి యాం యాం యోనిమసౌ గతః.
కృతాపరాధతాపేన సద్యః ప్రత్యవమర్శనాత్,
భగవత్యురుమానాచ్చభవే మయ్యపిచాదరాత్.
పుత్రస్యైవ తు పుత్రాణాం భవితైకస్సతాం మతః,
గాయంతి యద్యశశ్శుద్ధం భగవద్యశసా సమమ్.
యోగైర్హేమేవ దుర్వర్ణంభావయిష్యంతి సాధవః,
నిర్వైరాదిభిరాత్మానం యచ్ఛీల మనువర్తితుం.

కుపితుడై. అవతరించి వీరిని సంహారిస్తాడు. అనే కశ్యపుని మాటలు విని దితి –నాథా! నేను కోరేది కూడా అదే. బ్రాహ్మణ శాప దగ్ధులు కాకుండా శ్రీహరి చేతుల్లో మరణిస్తే అదే తేచాలు. సమస్త ప్రాణు లకూ భయాన్ని కలిగిస్తూ బ్రాహ్మణ శాప దగ్ధులై మరణిస్తే నరక లోకానుభవంగల జీవులుకూడా వారిని మన్నించరు. నా కుమారులు శ్రీహరి చేతుల్లోనే మరణించటం శ్రేష్ఠమైనది అన్నది. అది విని కశ్యపుడానందించి దేవి! నువ్వు కామాతురురాలవై అకృత్యానికి సిద్ధ పడ్డా నీ తప్పును గ్రహించి పశ్చాత్తాపం చెందావు. కనుక, శంక రుడూ, బ్రహ్మది దేవతలూ కూడా నిన్నూ నన్నూ అనుగ్రహింతురు గాక, నీ కుమారులలో ఒకనికి కలిగిన నలుగురుపుత్రులలో ఒకడు మహాభక్తుడై దేవతల సమ్మానం కూడా పొంద గలుగుతాడు. భగవ ద్గుణగానంతో ఆ బాలుని కీర్తి వృద్ధి చెందుతుంది. బంగారం పుట ములు పెట్టిన కొద్దీ పరిశుద్ధమైనట్లు సత్పురుషులు ఆభగవంతుని పొందుటకు నిర్వైరాదుల ననుసరించి తమ అంతఃకరణాలను శుద్ధిచేసు కుంటూ ఉంటారు. దితీ! నీ పౌత్రుడు ఉదారహృదయుడూ, భగవ

యత్ప్రసాదాదిదం విశ్వం ప్రసీదతి యదాత్మకమ్,
నన్యదృగ్భవాణ్ యస్య తోష్యతేఽనన్య యాదృశా.
సవై మహాభాగవతో మహాత్మా మహానుభావో మహతాం మహిష్ఠః,
ప్రవృద్ధభక్త్యానువిభువితాశయే ప్రవేశ్య వైకుంఠమతద్విహాస్యతి.
అలం పటుశ్శీలధరో గుణాకరో హృష్టస్సమృద్ధ్యావ్యథితో దుఃఖితేషు,
అభూతశత్రుర్జగతశ్శోకహర్తా నైదాఘికం తాపమివోడురాజః.
అంతర్బహిశ్చామల మబ్జనేత్రం స్వపూరుషేచ్ఛానుగృహీతరూపమ్,
పౌత్రస్తవ శ్రీలలనాలలామంద్రష్టాస్ఫురత్కుండలమండితాస్యమ్.
శ్రుత్వా భాగవతం పౌత్రమమోదత దితిర్భృశమ్,
పుత్రయోశ్చ వధం కృష్ణాద్విదిత్వాసీన్మహామనాః,

ద్భక్తుడూ ప్రతిభావశాలీ సదాచార సంపన్నుడూ ఔతాడు. ప్రౌఢ భక్తిచేత విశుద్ధహృదయుడై దేహాభిమానాన్ని త్యజించి విషయములందనాసక్త హృదయుడై ఇతరుల సుఖాన్ని సుఖంగా, ఇతరుల దుఃఖాన్ని దుఃఖంగా భావించి శత్రురహితుడై సర్వసంగత్యాగియై చతుర్భుజ రూపుడైన శ్రీహరిని దర్శించ కలుగుతాడు. అని చెప్పిన కశ్యపుని వాక్యాలు విని శ్రీహరి చేతుల్లో పుత్రులకు మరణం, పౌత్రుడు శ్రీహరిని దర్శించే భక్తుడు కావడం కారణంగా దితి అత్యానందం పొందిందని మైత్రేయుడు విదురునకు చెప్పినట్లు పరిక్షిత్తునకు శుకుడు వినిపించాడు.

## 14 అధ్యాయం

ప్రాజాపత్యం తు తత్తేజః పరతేజో హనం దితిః,
దధార శతవర్షాణి శంకమానా సురార్దనాత్.
లోకే తేనా హతాలోకే లోకపాలాహతౌజసః,
న్యవేదయన్విశ్వసృజే ధ్వాంతవ్యతికరం దిశామ్.

దితి తనకుమారులవల్ల దేవతలకు కష్టం
ల్పంతో పరుల తేజస్సును హరింప సమర్థమైన కః
సంవత్సరముల పర్యంతం గర్భమునందే ధరించి ఉంచిపోయింది. ఆగర్భస్థ

తమ ఏ తద్విభోవేత్త సంవిగ్నాతాద్వయం భృశమ్,
నహ్యావ్యక్తం భగవతః కాలేనాస్పృష్టవర్త్మనః.
దేవదేవ జగన్నాథ లోకనాథ శిఖామణే,
పరేషామపరేషాం త్వం భూతానామపి భావవిత్,
నమో విజ్ఞానవీర్యాయ మాయయేదము పేయుషే,
గృహీతగుణభేదాయ నమస్తే వ్యక్తయోనయే.
యేత్వామనన్యభావేన భావయంత్యాత్మభావనం,
ఆత్మని ప్రోతభువనం పరం సదసదాత్మకం.
తేషాం సుపక్వయోగానాం జితశ్వాసేంద్రియాత్మనాం.
లబ్ధయుష్మత్ప్రసాదానాం న కుతశ్చిత్పరాభవః.
యస్యవాచా ప్రజాస్సర్వాగావస్తంత్ర్యేవ యంత్రితాః,
హరంతి బలిమాయత్తాస్తస్మై ముఖ్యాయ తే నమః.
సత్వం విధత్స్వశంభూమజా లోకానాం లుప్తకర్మణాం,
అదభ్రందయయా దృష్ట్యా ఆపన్నా నర్హసీక్షితుమ్,

మైన కశ్యప తేజంవల్ల సూర్యాదులు తేజోహీనులై పోతున్నారు. ఇంద్రాది లోకపాలురు కూడా తేజోహీనులై పోయారు. వారు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి తండ్రీ! లోకం అంతా అంధకారమయమైపోతూ ఉన్నది. దీనికి కారణం తెలియడంలేదు. కాలం మీ ఆజ్ఞాబద్ధమై ఉంటుంది. మీకు తెలియని దేదీలేదు. ఈ అంధకార కారణంకూడా మీకు తెలిసే ఉంటుంది. దీన్ని చూసి మేమంతా భయపడు తున్నాము. మీరు విజ్ఞానబలసంపన్నులు. మీరు మాయ నాశ్రయించి చతుర్ముఖ రూపం ధరించి రజోగుణ ప్రధానులై సృష్టిని సాగిస్తున్నారు. మీ ఉత్పత్తికారణం యెవరికీ తెలియదు. అట్టి మీకు నమస్కారములు. మీయందే యీ విశ్వమంతా ఉంది. కార్యకారణరూపమైన విశ్వమే మీకు శరీరం. మీరు ప్రపంచాని కతీతులు. ప్రాణ, మనో, బుద్ధీంద్రియాలను, జయించి మిమ్మే ధ్యానించుచు పరమయోగులు, నిరతిశ యానందం పొందగలుగుతారు. త్రాడుచే బంధింపబడ్డ వృషభం యజమానియొక్క అధీనంలో యెలాగైతే చరిస్తూంటుందో అలాగే వేదరూపమైన వాణిచే బంధింపబడి సత్కర్మానుష్ఠానం చేస్తూ

ఏష దేవ దితేర్గర్భః ఓజః కాశ్యపమర్పితమ్,
దిశస్తిమిరయన్ సర్వావర్ధతేగ్నిరివైధసి.
స్మయమానస్య మహాబాహో భగవాన్ శబ్దగోచరః,
ప్రత్యాచష్టాత్మ భూర్దేవాన్ప్రీణన్రుచిరయా గిరా.
మానసా మే సుతాయుష్మ త్పూర్వజాస్సనకాదయః,
చేరుర్విహాయసా లోకాన్ లోకేషు విగతస్పృహాః.
తఏకదా భగవతో వైకుంఠస్యామలాత్మనః,
యయుర్వైకుంఠనిలయం సర్వలోక నమస్కృతమ్.
వసంతి యత్ర పురుషాస్సర్వే వైకుంఠమూర్తయః,
యేఽనిమిత్తనిమిత్తేన ధర్మేణారాధయన్ హరిమ్.
యత్రచాద్యః పుమానాస్తే భగవాన్ శబ్దగోచరః,
సత్త్వం విష్టభ్యవిరజం స్వానాం నో మృడయన్వృషః.
యత్ర నైశ్రేయసం నామ వనం కామదుఘైర్ద్రుమైః.
సర్వర్తుశ్రీభిర్విభ్రాజత్కైవల్యమివ మూర్తిమత్.

మీ కొరకు యజ్ఞయాగాదులద్వారా మిమ్ము సేవిస్తూంటారు. మీరు ముఖ్యప్రాణులూ, నియంతలూ, కూడా. అట్టి మీకు నమస్కరిస్తున్నాము. ప్రభూ! అంధకారం కారణంగా దివారాత్రుల భేదం తెలియడంలేదు. లోకంలో సర్వకర్మలూ స్తంభించి పోయాయి. అందువల్ల సమస్తజీవులకూ దుఃఖం కలుగుతూన్నది. మీరు లోకాన్ని అనుగ్రహించి శరణాగతులను రక్షించండి. ఇంధనంయందు అగ్ని వృద్ధిచెందినట్లు దితి గర్భంలో కశ్యపవీర్యం వృద్ధిచెందడంవల్ల యీ అంధకారం పెరుగుతూ ఉందని దీనవదనులై ప్రార్థించినప్పుడు బ్రహ్మ చిరునవ్వు నవ్వుతూ చెప్రుతున్నాడు.

దేవతలారా? మీకు పూర్వజులూ, నాకు పుత్రులూ, ఐన సనకాదులు ఆకాశమందు సంచరిస్తూ శుద్ధ సత్వమయమైన వైకుంఠ లోకాలకు వెళ్ళారు. ఆలోకంలో అందరూ చతుర్భుజ రూపంలో విష్ణువుతో సమానంగా ఉంటారు. సర్వసంగ పరిత్యాగులై హరిచరణాలనే ఆరాధిస్తూంటారు. అక్కడ వేదాంత ప్రతిపాద్యుడైన ఆదినారాయణుడు శుద్ధసత్వమయుడై భక్తులను అనుగ్రహించటానికి చతుర్భుజ

వైమానికాస్సలలనాశ్చరితాని యత్ర గాయంతి లోకశమలక్షపణాని భర్తుః,
అంతర్జలేనువికసన్మధుమాధవీనాం గంధేన ఖండితధియోఽప్యనిలం క్షిపంతః.
పారావతాన్యభృతసారసచక్రవాకదాత్యూహ హంసశుకతిత్తిరిబర్హిణాంయః,
కోలాహలో విరమతే చిరమాత్రముచ్చైర్భృంగాధిపే హరికథామివ గాయమానే.
మందారకుందకురవోత్పలచంపకార్ణ పున్నాగనాగ వకుళాంబుజపారిజాతాః.
గంధేఽర్చితే తులసికాభరణేన తస్యా యస్మింస్తపస్సుమనసో బహుమానయంతి
యత్సంకులం హరిపదానతిమాత్రదృష్టైర్వైడూర్య మారకత హేమమయైర్విమానైః,
యేషాం బృహత్కటి తటస్మితశోభిముఖ్యః కృష్ణాత్మనాం న రజఆదధురుత్స్మయాద్యైః.
శ్రీరూపిణీ క్వణయతీచరణారవిందం లీలాంబుజేన హరిసద్మని ముక్తదోషా,
సంలక్ష్యతే స్ఫటికకుడ్యఉపేతహేమ్ని సంమార్జతీవ యనుగ్రహణేఽన్యయత్నః.
వాపీషు విద్రుమతటాస్వమలామృతాప్సు ప్రేష్యాన్వితా నిజవనే తులసీభిరీశం,
అభ్యర్చతీ స్వలక మున్నసమీక్ష్య వక్త్రముచ్ఛేషితం భగవతేత్యమతాంగయచ్ఛ్రీః.
యన్న వ్రజంత్యఘభిదో రచనానువాదాచ్ఛృణ్వంతి యేన విషయాః కుకథా మతిఘ్నాః,
యాస్తు శ్రుతాహతభగైర్నృభిరాత్తసారాస్తాంస్తాః క్షిపంత్యశరణేషు మహత్సహంత.

రూపంతో ప్రకాశిస్తూంటాడు. ఆ లోకంలో నిశ్శ్రేయస, మ నేవనం, రూపం ధరించిన కైవల్యంలా కనిపిస్తూ ఉంటుంది. సమస్తకోరికలూ నెరవేర్చే వృక్షాలతో నిండిఉంటుందావనం. సర్వకాలములయందూ షడ్రుతువుల ధర్మాలూ, ఆవనంలో కనుపిస్తాయి. విమానచారులైన గంధర్వులు తమ కాంతలతో కలిసి సమస్తపాపాల్నీ భస్మంచేసే విష్ణులీలలు గానంచేస్తూంటారు. ఆసమయంలో సరోవరతీరాల్లో వాసంతిక మాధవీలతలందు పుష్పాలు వికసించి మధుగంధం వ్యాప్తమై వారి హృదయాలను ఆకర్షిస్తూవున్నా వారు అటువైపు దృష్టి పోనీయరు. భ్రమర రాజం, హరిలీలారూపమైన, నినాదంచేసే సమయంలో, శుక, పిక, చక్రవాక మయూరాది పక్షిజాతం, కిలకిలరవాలు ఆపివేస్తున్నాయి. శ్రీహరిధరించిన తులసీ మాలయొక్క సుగంధం, అన్ని పుష్పాదుల గంధాన్నీ అధిగమిస్తూ ఉంటుంది. అదిచూచి, కుంద, మందార, కురవక, పున్నాగ, ఉత్పల, వకుళాదులన్నీ, మన తపస్సు కంటె తులసి తపస్సే గొప్పది. అనుకుంటున్నాయి. వైకుంఠ లోకం వజ్ర, వైడూర్య, మరకత, మాణిక్యాలతోనూ విమానలతోనూ నిండి ఉంది. విమానాలయందు

యేఽభ్యర్థితామపి చ నో నృగతిం ప్రపన్నాః జ్ఞానం చ తత్త్వవిషయం సహధర్మ యత్ర,
నారాధనం భగవతో వితరంత్యముష్య సమ్మోహితా వితతయా బత మాయయాతే,
యచ్చ వ్రజంత్యనిమిషామృషభానువృత్త్యా దూరేయమా హ్యుపరి నః స్పృహణీయశీలాః,
భర్తుర్మిథస్సుయశసః కథనానురాగవైక్లవ్యబాష్పకలయా పులకీకృతాంగాః
తద్విశ్వగుర్వధికృతం భువనైకవంద్యం దివ్యం విచిత్రవిబుధాగ్ర్యవిమానశోచిః,
ఆపుః పరాం ముదమపూర్వము పేత్య యోగమాయాబలేన మునయస్తదథో వికుంఠం.
తస్మిన్నతీత్య మునయష్షడసజ్జమానాః కక్ష్యాస్సమానవయసావథ సప్తమాయాం,
దేవావచక్షత గృహీతగదౌ పరార్ధ్య కేయూరకుండలకిరీటవిటంక వేషౌ.
మత్తద్విరేఫవనమాలికయా నివీతౌ విన్యస్తయాసిత చతుష్టయ బాహుమధ్యే,
వక్త్రం భ్రువా కుటిలయా స్ఫుటనిర్గమాభ్యాం రక్తేక్షణేన చ మనాగ్రభసం దధానౌ,
ద్వార్యేతయోర్నివివిశుర్మిషతోరపృష్ట్వా పూర్వా యథా పురటవజ్ర కవాటికాయామ్,
సర్వత్ర తేఽవిషమయా మునయస్స్వదృష్ట్యాయే సంచరంత్యవిహతా విహతాభిశంకాః.
తాన్వీక్ష్యవాతరశనాంశ్చతురః కుమారాన్వృద్ధాన్ దశార్ధవయసో విదితాత్మతత్త్వాన్,
వేత్రేణ చాస్ఖలయతామతదర్హణాంస్తౌ తేజోవిహస్య భగవత్ప్రతికూలశీలౌ,

భగవద్భక్తులనేకులు హరిరూపంలోనే ప్రకాశిస్తున్నారు. అపూర్వ సౌంద ర్యంకల దేవతాస్త్రీలుకూడా వారిచిత్తాలను ఆకర్షించలేక పోతున్నారు. సౌందర్యరాసియగు లక్ష్మీదేవి తన స్వాభావమైన చంచలత్వాన్ని వదలి శ్రీహరిని నిరంతరం సేవిస్తూంది. చరణకమలాలనుండిఘల్లుఘల్లుమనిధ్వని స్తూంటే క్రీడావనంలో తులసీదళాలతో హరిచరణాలను పూజిస్తూంటుంది. మానవులు అజ్ఞానులై పాపనాశన హేతువైన హరిలీలలు విస్మరించి అర్థ కామాలలో పడినశించిపోతారు. అలాంటి జీవులా దివ్యలోకాన్ని దర్శించ లేరు.. వారికి నరకం కనుపిస్తుంది. భగవత్ప్రాప్తికి ప్రధానమైన ధర్మ కర్మలూతత్వజ్ఞానమూ మనుష్య లోకంలోనే లభించాలి, ఇక ఏలోకం లోను లభించవు. కనకనే మనంకూడా మానవలోకంలో జన్మించాలని కోరుకుంటూ ఉంటారు. అట్టిలోకంలో పుట్టికూడా కాంతా కనకములందు ఆసక్తి కలవారవుతున్నారంటే మాయామోహితులైన దౌర్భాగ్యుల న్నమాట, శ్రీహరి నామసంకీర్తనం చేసుకుంటూ హరి లీలలతో కూడిన చరిత్రలు, చదువుతూ, వింటూ. గ్రహించిన వ్రాచణంతో, గగుర్పా టిచ్చిన శరీరంతో, ఆనంద బాష్పాలు రాల్చేవాడే ధన్యుడు. వాడే వైకుంఠం

తాభ్యామ్మిషత్స్వనిమిషేషు నిషిధ్యమానాహ్యర్హత్తమాఅపి హరేః ప్రతిహారపాభ్యామ్,
ఊచుస్సుహృత్తమదిదృక్షిత భంగఈషత్కామానుజేన సహసా త ఉపప్లుతాక్షాః,
కోవా ఇహైత్య భగవత్పరిచర్యయోచ్చైస్తద్ధర్మిణాం నివసతాం విషమస్వభావః,
తస్మిన్ ప్రశాంతపురుషే గతవిగ్రహే వాం కోవాత్మవత్కుహకయోః పరిశంకనీయః.
నహ్యంతరం భగవతీహ సమస్తకుక్షావాత్మాన మాత్మనినభో నభసీవ ధీరాః,
పశ్యంతి యత్ర యువయో స్సురలింగినోః కింవ్యుత్పాదితం హ్యుదరభేది భయం
యతోఽన్య.
తద్వా మముష్యపరమస్య వికుంఠభర్తుః కర్తుం ప్రకృష్ట మిహధీమహి మందధీభ్యామ్,
లోకానితో వ్రజతమంతర భావదృష్ట్యా పాపీయసస్త్ర యఇమే రిపవోఽస్యయత్ర.
తేషామితీరితముభావవధార్య ఘోరం తద్బ్రహ్మ దండమనివారితమస్త్రపూగైః,
సద్యోహరేరను చరావురుబిభ్యతస్తత్పాద గ్రహావపత తామతికాతరేణ.
భూయాదఘోని భగవద్భిరకారి దండో యోఽనౌ హరేతను రహేళనమప్యశేషం,
మావోనుతాపకలయా భగవత్స్మృతిఘ్నో మోహోభవేద పితునౌ వ్రజతో రధోధః.

చూడగల్గుతాడు. సనక, సనందన సనత్కుమార, సనత్సుజాతు లట్టి నివృత్తి పరాయణులు గనుకనే వైకుంఠానికి వెళ్ళగలిగారు. యోగ బలంచేత క్షణంలో సునాయాసంగా వైకుంఠం చేరిన సనకాదులు, వైకుంఠంలో, ఆరు కక్ష్యాంతరాలు దాటి, ఏడవ కక్ష్యంలో, ప్రవేశించారు. ఆ ద్వారానికి ఉభయ పార్శ్వాలయందు గదాపాణులై శ్యామ వర్ణులై వనమాలాధారులై చతుర్భుజ రూపంతో శ్రీహరి ఆకారంలో ఉన్న ఇద్దరుపురుషులు నిలిచిఉన్నారు. అదేసమయంలో సంపూర్ణతత్త్వ వేత్తలైన సనత్కుమారాదులా ద్వారాన్ని సమీపించారు. వీరు వయస్సులో అందరికంటే పెద్దవారైనా ఐదుసంవత్సరాలు వయస్సు కల వారూ దిగంబరులూ అయిన సనకాదులు నిశ్శంకగా లోపలకు వెడుతూంటే పూజార్హులను గుర్తింపలేక ద్వారపాలురు వారిని నిరోధించారు. శ్రీహరి దర్శనానికి విఘ్నం కలిగిస్తున్నారనే కోపంచేత వారి నేత్రాలు ఎర్రబడ్డాయి. వెంటనే ద్వారపాలకులారా! భగవంతుని సేవించి వైకుంఠాన్ని పొందినవారు భగవంతునితో సమానంగా సమదర్శులు కావాలి. మీరు అట్టి భక్తులైకూడా యీవిషమ భావంలో యెందుకు ప్రవేశించారు ? శ్రీహరి శాంతస్వభావం కలవాడు. ఇతరు

ఏవం తదైవ భగవానరవిందనాభః స్వానాం విబుధ్య సదతిక్రమమార్యహృద్యః,
తస్మిన్ యయౌ పరమహంస మహామునీనా మన్వేషణీయ చరణౌ చలయన్ సహ శ్రీః.
తంత్వాగతం ప్రతిహృతౌపయికం స్వపుంభిస్తేఽచక్షతాక్షవిషయం స్వసమాధి భాగ్యమ్,
హంసశ్రియోర్వ్యజనయో శ్శివవాయులోలశుభ్రాతపత్రశశికేసరశీకరాంబుమ్.
కృత్స్న ప్రసాద సుముఖం స్పృహణీయధామ స్నేహావలోక కలయా హృది సంస్పృశంతమ్,
శ్యామే పృథా పురసి శోభితయా శ్రియాస్వశ్చూడామణిం సుభగయంతమివాత్మధిష్ణ్యమ్.
పీతాంశుకే పృథునితంబని విస్ఫురంత్యా కాంచ్యాళిభిర్విరుతయా వనమాలయా చ,
వల్గుప్రకోష్ఠవలయం వినతాసుతాంసే విన్యస్తహస్తమితరేణ ధునానమబ్జమ్.
విద్యుత్క్షిపన్మకర కుండలమండ నార్హగండస్థలో న్నసముఖం మణిమత్కిరీటమ్,
దోర్దండషండవివరే హరతాపరార్థ్యహారేణ కంధరగతేన చ కౌస్తుభేన.
అత్రోపసృష్ట మితిచోత్స్మిత మిందిరాయాస్స్వానాం ధియా విరచితం బహుసౌష్ఠవాఢ్యం
మహ్యం భవస్య భవతాం చ భజంతమంగం నేముర్నిరీక్ష్య న వితృప్త దృశో ముదాకైః

లను శంకింప నవసరములేదు. మీరుకపటులుడంవల్ల మీతో సమానంగా భావించి యితరులను శంకిస్తున్నారు. భగవంతుని హృదయంలో బ్రహ్మాండాలన్నీ ఉన్నాయి. ఇక్కడున్నవారు భగవంతునికీ తమకూ భేదం లేనట్లు చూస్తారు. మహదాకాశమందు ఘటాకాశంవలె ఆ భగవంతుని అంతర్భావంలో చూస్తూంటారు. మీరు దేవతారూపులైయుండీ భగవంతునకు కూడా భేదభావరూపమైన భయాన్ని శంకిస్తున్నారు. మీరు శ్రీహరి పార్షదులు, ఐనా మీబుద్ధి చాలామందంగా ఉంది. కనుక మీకు క్షేమాన్ని ప్రసాదించటానికే మీ అపరాధానికి మీకు యోగ్యమైన దండనవిధిస్తున్నాము. మీరు మీ భేదబుద్ధి కారణంగా వైకుంఠ పదభ్రష్టులై కామక్రోధలోభాలకు నిలయమైన పాపులై జన్మింతురుగాక అనిశపించారు.

సనకాదులు కఠోరంగా శపించినతోడనే జయవిజయులు బ్రాహ్మణశాపం అమోఘమని గుర్తించారు. శ్రీహరికూడా బ్రాహ్మణశాపానికి భయపడతాడని వారెరుగుదురు. వారిద్దరూ సనకాదుల పాదాలపైబడి, రక్షింపుడని ప్రార్థిస్తూ పుణ్యపురుషులారా! మీరు మమ్మ

తస్యారవింద నయనస్య పదారవిందకింజల్క మిశ్రతులసీ మకరందవాయుః,
అంతర్గతస్స్వవివరేణ చకార తేషాం సంక్షోభమక్షరజుషా మపి చిత్తతన్వోః.
తే వా అముష్య వదనాసితపద్మకోశముద్వీక్ష్య సుందరతరాధరకుందహాసమ్,
లబ్ధాశిషః పునరవేక్ష్య తదీయమంఘ్రిద్వంద్వం నఖారుణమణి శ్రయణం నిదధ్యుః.
పుంసాంగతిం మృగయతామిహ యోగమార్గైర్ధ్యానాస్పదం బహుమతం నయనాభిరామం
పౌంస్నం వపుర్దర్శయానమనన్యసిద్ధై రౌత్పత్తికైస్సమగృణన్ యుతమష్టభోగైః.
యోఽంతర్హితో హృది గతోఽపి దురాత్మనాం త్వం సోఽద్యైవ నో నయనమూల
మనంతరాద్ధః,
యర్హ్యేవ కర్ణవివరేణ గుహాంగతో నః పిత్రానువర్ణిత రహా భవదుద్భవేన.
తం త్వావిదామభగవన్ పరమాత్మతత్త్వం సత్త్వేన సంప్రతి రతిం రచయంతమేషాం,

లను దండించడం న్యాయమే? శ్రీహరి అభిప్రాయం తెలిసికూడా మేము అధికారగర్వంతోనే ఆ ఆజ్ఞను ఉల్లంఘించాము. మీ శాపంతో ఆ గర్వంనశించిపోయింది. మీరు మాయందు అనుగ్రహముంచి మేము భూలోకంలో పాప యోనులయందు జన్మించినా భగవంతునియందు విస్మృతిని కలిగించే మోహం కలుగకుండా అనుగ్రహించండి అన్నారు.

సనకసనందనాదులు జయవిజయులను శపించడం గ్రహించాడు సర్వజ్ఞమూర్తియైన శ్రీహరి లక్ష్మీసమేతంగా ఆ ద్వారందగ్గరకు రాగా సనకాదులు శ్రీహరిని దర్శించారు. శ్వేతచ్ఛత్రచ్ఛాయలలో పార్షదులు విసరుతూ ఉండే సకలసద్గుణములకూ, ఆశ్రయుడూ కృపాసముద్రుడూ, లక్ష్మీవక్షస్థలాలయుడూ, పీతాంబరధారీ కౌస్తుభాలంకారుడూ, మకర కుండలధారీ ఐన శ్రీహరికి సాష్టాంగనమస్కారం చేశారు. సనకసనంద నాదులు, వారు నిరంతరం బ్రహ్మానందంలో ఉండేవారైనా, శ్రీహరి సందర్శనంవల్ల అధికానందం పొందారు.

అనంతరం శ్రీహరిని అనేకవిధాలస్తుతిస్తూ ప్రభూ! మీరు అంత ర్యామి రూపంలో దుష్టహృదయాల్లో కూడా ఉంటారు. ఐనా వారికి మీదర్శనం లభించదు. అవ్యాజమైన కరుణచే స్వయంగా మీరే మాకు దర్శనమిచ్చారు; ఆదిలో మీయందు ఆవిర్భవించి మాకుజనకు డైనచతుర్ముఖునివల్ల మీ రహస్యమయమైన లీలలూ మీ సగుణ

యత్తేనుతా పవిదితైర్దృఢభక్తియోగైరుద్గ్రంథ యో హృది విదుర్మునయోవిరాగాః
నాత్యంతికం విగణయంత్యపి తే ప్రసాదంకిం వాన్యదర్పితభయం భ్రువ ఉన్నయైస్తే,
యేఽంగ త్వదంఘ్రిశరణా భవతః కథాయాః కీర్తన్యతీర్థ యశసః కుశలా రసజ్ఞాః.
కామం భజన్వ వృజినైర్నిరయేషు న స్యాచ్చేతోళివద్యది నుతే పదయోరమేత.
వాచశ్చ నస్తులసి వద్యది తేం ఘ్రిశోభాః పూర్యేత తే గుణకమైర్యది కర్ణరంధ్రమ్.
ప్రాదుశ్చకర్థ యదిదం పురుహూతిరూపం తేనేశనిర్వృతిమవాపురలం దృశో నః,
తస్మాఇదం భగవతే నమ ఇద్విధేమ యోఽనాత్మనాందురుదయో భగవాన్ప్రతీతః.

నిర్గుణరూపాలూ, గ్రహించాము. ఆ నాటినుండీ మిమ్ములనే ధ్యానిస్తూన్నాము. సర్వజ్ఞుడవైన నీకు తెలియనిదేదీలేదు. నారాయణా! మీ మాయ మమ్ములను మోహింపజేయకుండుగాక. మీ దివ్యమంగళ రూపానికి అనేక వేల వందనాలు,చేస్తున్నాము. అన్నారు

## 15 అధ్యాయం

ఇతి తద్గృణతాం తేషాం మునీనాం యోగధర్మిణామ్,
ప్రతినంద్య జగాదేదం వైకుంఠనిలయో విభుః.
ఏతౌ హి పార్షదౌ మహ్యం జయో విజయ ఏవ చ,
కదర్థీకృత్య మాం యద్వో బహ్వదత్తామతిక్రమమ్,
యస్త్వేతయోర్ధృతో దండో భవద్భిర్మా మమవ్రతైః,
సఏవానుమతోఽస్మాభిర్మునయో దేవహేళనాత్.

దేవతలారా! యోగనిష్ఠులైన సనకాదులిలా స్తుతించడంతో, శ్రీహరి వారిని, ప్రశంసిస్తూ ఈ జయవిజయులు, నా పార్షదులు. వీరు గొప్ప అపరాధం చేశారు. మీరు కూడా నాకుపూర్ణమైన భక్తులు. వీరు చేసిన అపరాధానికి మీరు దండించడం నాకూ ఇష్టమే. బ్రాహ్మణులు నాకు పరమారాధ్యులు. నా అనుచరులద్వారా మీకు తిరస్కారం జరిగింది. అది నా అపరాధంగా భావిస్తున్నాను. అందువల్లనే మిమ్ములను ప్రసన్నులు కమ్మని యాచిస్తున్నాను. సేవకులు అపరాధంచేస్తే లోకం ఆతప్పు యజమానిదే అంటుంది. త్వక్కునుచర్మరోగం వేధించినట్లు సేవకుల అపరాధం యజమానుల కపయశాన్ని కలిగిస్తుంది.

తద్వః ప్రసాద యామ్యాద్య బ్రహ్మదైవం పరం హిమే,
తద్ధిహ్యాత్మకృతం మన్యే యత్స్వపుంభిరస త్కృతాః,
యన్నామాని చ గృష్ణతి లోకో భృత్యే కృతాగసి,
సోసాధువాద స్తత్కీర్తిం హంతి త్వచమివామయః.

యస్యామలామృతయశశ్శ్రవణావగాహస్సద్యః పునాతి జగదాశ్వపచాద్వికుంఠః,
సోఽహంభవద్భ్య ఉపలబ్ధసుతీర్థకీర్తిశ్ఛింద్యాం స్వబాహుమపి వః ప్రతికూలవృత్తిం.
యత్సేవయా చరణపద్మపవిత్రరేణుం సద్యః క్షతాఖిలమలం ప్రతిలబ్ధశీలం,
నశ్రీర్విరక్తమపి మాం విజహాతియస్యాః ప్రేక్షాలవార్థఇతరే నియమాన్వహంతి,
నాహం తథాద్మియజమానహవిర్వితానే శ్చ్యోతద్ఘృతప్లుతమదన్ హుతభుఙ్ముఖేన,
యద్బ్రాహ్మణస్య ముఖతశ్చరతోను ఘాసంతుష్టస్య మయ్యవహితైర్నిజకర్మపాకైః.
యేషాంబిభర్మ్యహమఖండ వికుంఠయోగమాయావిభూతి రమలాంఘ్రిరజః కిరీటైః,
విప్రాంస్తు కో న విషహేత యదర్హణాంభస్సద్యః పునాతి సహచంద్రలలామలోకాన్.
యే మే తనూర్ద్విజవరాన్ దుహతీర్మదీయా భూతాన్యలబ్ధ శరణాని చ భేదబుద్ధ్యా,
ద్రక్ష్యంత్యఘక్షత దృశోహ్యహిమన్యవస్తాన్ గృధ్రారుషామమకృషంత్యధిదండనేతుః.

నా లీలా భూయిష్ఠమైన కథలను చదువుకూ వింటూ, నామసంకీర్తనం చేసేవాడు ఛండాలుడైనా పరమపవిత్రుడౌతాడు. అందువల్లనే నన్ను "వికుంఠు" డంటారు. ఈ పవిత్రమైన కీర్తి నాకు మీ వల్లనే కలిగింది. మీ విషయంలో యెవరు అపరాధం చేసినా తుదకు నా భుజాలే తప్పు చేసినా, నరుకవలసిందే. మీవంటి సత్పురుషుల సేవచేతనే నా పద రజం సర్వ మానవ పాపహారకమైంది. నాకిట్టి శాంత స్వభావం లభిం చింది. నేను ఉదాసీనుడుగా వున్నా లక్ష్మి నన్ను క్షణం విడువకుండా ఉంటుంది. లక్ష్మియొక్క అనుగ్రహం కొరకే బ్రహ్మాదులనేక నియ మాలు, వ్రతాలు, అనుష్ఠిస్తారు. ఎవరు సంపూర్ణ కర్మఫలాన్ని నాకు సమర్పిస్తారో, అట్టి నిష్కాములైన బ్రాహ్మణులు, ప్రీతిగ్రాసమందు తృప్తిచెందుతూ ఘృతంతో కూడిన పక్వాన్నాల నెప్పుడూ భుజిస్తూ ఉంటారో అప్పుడు కలిగే సంతృప్తి యజ్ఞయాగాదులలో హవిర్భాగా లిచ్చేటప్పుడు కూడా నాకు కలుగదు. యోగమాయారూపమైన, గంగ, చంద్రశేఖరుడు మొదలు, సర్వలోకాల్ని పవిత్రం చేస్తుంది. అలాంటి పరమేశ్వరుడనై యుండీ కూడా నేను బ్రాహ్మణుల పాదరజ

యే బ్రాహ్మణాన్మయి ధియా క్షిపతోర్చయంతస్తుష్యద్హృదః స్మితసుధోక్షిత పద్మవక్త్రాః,
వాణ్యానురాగకలయాత్మజవద్గృణంత స్సంబోధయంత్యహమివాహముపాకృతస్తైః.
తస్మే స్వభర్తురవసాయమలక్ష్యమాణౌ యుష్మద్వ్యతిక్రమగతిం ప్రతిపద్య సద్యః,
భూయో మమాంతికమితాం తదనుగ్రహో మే యత్కల్ప్యతామచిరతో భృతయోర్వివాసః

అథతస్యోశతీం దేవీం ఋషికుల్యాం సరస్వతీం,
నాస్వాద్యమన్యుదష్టానాం తేషామాత్మాప్యతృప్యత.
సతీం వ్యాదాయ శృణ్వంతో లఘ్వీం గుర్వర్థగహ్వరామ్,
విగాహ్యాగాధగంభీరాం న విదుస్తచ్చికీర్షితం.
తే యోగమాయయా రబ్ధపారమేష్ఠ్యమహోదయం,
ప్రోచుః ప్రాంజలయో విప్రాః ప్రహృష్టాః క్షుభిత త్వచః.
న వయం భగవన్విద్మస్తవ దేవచికీర్షితం,
కృతో మేఽను గృహశ్చేతి యదధ్యక్షః ప్రభాషసే.
బ్రహ్మణ్యస్య పరం దైవం బ్రాహ్మణాః కిల తే ప్రభో,
విప్రాణాం దేవదేవానాం భగవానాత్మదైవతం.

స్సును శిరమునందు ధరిస్తాను. బ్రాహ్మణులూ, పాలిచ్చే గోవులూ అనాధజీవులూ, నాకుశరీరం. అజ్ఞానంచేత ఎవరైతే వీరిని నాకంటె భిన్నంగాచూచి అవమానిస్తారో, వారిని యమదూతలు, భయంకర రూపాలతో, హింసిస్తారు. బ్రాహ్మణులు కఠోరవాక్కులతో తిరస్కరిస్తున్నా చిరునవ్వుతో నేను వారి నాదరిస్తాను. నాకూ వారికీ, పితా, పుత్ర, న్యాయం ఉంది. మిమ్ములను నేనలాగే భావిస్తున్నాను. మీరు నా సేవకుల ననుగ్రహించి వారి అపరాధాన్ననుసరించి అధమగతిని పొంది అచిరకాలంలో నన్ను పొందేలా అనుగ్రహించండి. అని ప్రార్థించిన శ్రీహరి పలుకులు విన్న సనకాదులు క్రోధంతో ఉన్నా మ్మంత్రముగ్ధులైపోయారు.

స్వల్పాక్షరములతో అర్థపూర్ణమై సారయుతమైన, గంభీరమగు శ్రీహరివాక్యాలు అక్షరశః విన్నా భగవానుని అభిప్రాయంవారికి గోచరించలేదు. భగవంతునియొక్క ఔదార్యం చూసిన సనకాదుల అంగాలన్నీ పులకరించాయి. యోగమాయా పరిభావంచే తనపరమైశ్వర్యాన్ని ప్రకటించే శ్రీహరికి నమస్కరించి స్తుతిస్తున్నారంభించారు.

త్వత్తస్సనాతనో ధర్మో రక్ష్యతే తనుభిస్తవ,
ధర్మస్య పరమో గుహ్యో నిర్వికారో భవాన్మతః.
తరంతి హ్యంజసా మృత్యుం నివృత్తా యదనుగ్రహాత్,
యోగినస్సభవాన్ కిం స్విదనుగృహ్యేత యత్పరైః.
యం వై విభూతిరుపయాత్యను వేలమన్యైరర్థార్థిభిస్స్వశిరసా ధృతపాదరేణుః,
ధన్యార్పితాంఘ్రితులసీనవదామధామ్నో లోకం మధువ్రతపతేరివకామయానా.
యస్తాం వివిక్తచరితై రనువర్తమానాం నాత్యాద్రియత్పరమభాగవతప్రసంగః,
తం త్వాం ద్విజానుపథపుణ్యరజఃపునీతః శ్రీవత్సలక్ష్మకిముగాభగభాజనస్త్వమ్.
ధర్మస్య తే భగవత స్త్రియుగ త్రిభిస్స్వైః పద్భిశ్చరాచరమిదం ద్విజదేవతార్థమ్
నూనం భృతం తదభిఘాతిరజస్తమశ్చ సత్త్వేన నోవరదయాతనువా నిరస్య.
నత్వం ద్విజోత్తమకులం యదిహాత్మగోపం గోప్తా వృష స్స్వర్హణేన చ సూనృతేన,
తర్హ్యేవ నంక్ష్యతి శివస్తవ వేద పంథా లోకోఽగ్రహీష్యదృషభస్యహి తత్ప్రమాణం.

శ్రీహరీ! మీరు సర్వేశ్వరులైయుండీ యీ చెప్పినమాటలన్నీ మాయందుకల అనుగ్రహం చేత నే పలికారు. కానీ మీ అభిప్రాయం మాకు తెలియలేదు. మాధవా! మీరు బ్రాహ్మణులకు హితం చేకూర్చే వారు గనుకనే లోకానికాదర్శంగా నాకు బ్రాహ్మణులారాధ్యులని పలికారు. సత్యం ఆలోచిస్తే బ్రాహ్మణులూ, దేవతలూ కూడా, మిమ్మే ఆరాధిస్తారు. సనాతన ధర్మం మీవల్లనే జనించింది. అనేక సమయాలలో అనేక అవతారాలుధరించి సనాతన ధర్మాన్ని రక్షిస్తూంటారు మీరు. నిర్వికారులైన మీరే గుహ్యమైన ధర్మస్వరూపులు. మీ కరుణచేత నే నివృత్తపరాయణులైన పరమయోగులు మృత్యురూపమైనసంసార సాగరంనుండి తరిస్తారు. అలాంటి పరిస్థితిలో నీయందు కృపనుంచు వారెవరు? అర్థార్థులు ఏమాత పదరజస్సంపర్కాన్ని శిరమందు ధరిస్తూ ఉంటారో, అట్టిలక్ష్మీదేవి, నిరంతరం మిమ్ము సేవిస్తూ ఉంటుంది. నిరంతరం మీ కథాశ్రవణంలో మీ సేవచేసే లక్ష్మి కంటే కూడా మీరు భక్తులనే ఎక్కువగా ప్రేమిస్తూ ఉంటారు. మీరు సద్గుణనిలయులు. అట్టి మిమ్ము బ్రాహ్మణుల పదరజస్సు పవిత్రం చేస్తూందా? పరమాత్మా! మీరు సాక్షాత్తూ ధర్మస్వరూపులు. మీరు కృత త్రేత ద్వాపరాలలో ప్రత్యక్షంగా దర్శనం ఇస్తూంటారు. మీరు తపో సత్య

తత్తేనభిష్టమివ సత్త్వనిధేర్విధిత్సోః క్షేమం జనాయనిజశక్తిభిరుద్ధృతారేః,
నైతా వతాత్ర్యధిపతేతవ విశ్వభర్తుస్తేజః క్షతం త్వవనతస్య సతే వినోదః.
యం వానయోర్దమమధీశ భవాన్ విధత్తే వృత్తిం తు వాతదనుమన్మహినిర్వ్యలీకాం
అస్మాసు వాయ ఉచితో ధ్రియతాం సదండో యేఽనాగసౌవయమయుంక్ష్మహికిల్బిషేణ
ఏతౌ సురేతరగతిం ప్రతిపద్య సద్యస్సంరంభ సంభృత సమాధ్యనుబద్ధయోగౌ,
భూయస్సకాశముపయాస్యత ఆశు యోవశ్శాపో మయైవ దమితస్తదవైతవిప్రాః.
అథతే మునయో దృష్ట్వా నయనానందభాజనం,
వైకుంఠం తదధిష్ఠానం వికుంఠం చ స్వయంప్రభం.
భగవంతం పరిక్రమ్య ప్రణిపత్యాను మాన్యచ,
ప్రతిజగ్ముః ప్రముదితాః శంసంతో వైష్ణవీం శ్రియం.
భగవాననుగావాహయా తం మా భైష్టమస్తుశమ్,
బ్రహ్మతేజస్సమర్థోఽపి హంతుంనేచ్ఛే మతం తుమే.

దయలనే మూడు పాదాలలోనూ చరాచర ప్రపంచాన్ని రక్షిస్తూంటారు. సత్యస్వరూపంతో, ధర్మవిరోధములైన రజస్తమోగుణాలను దూరంచేయండి. బ్రాహ్మణకులం మీచేతనే రక్షింపబడుతూ ఉంటుంది. మీరుధర్మస్వరూపులైకూడా, పూజాదులద్వారా యీకులాన్ని రక్షిస్తున్నారట. ఇలా రక్షింపకపోతే మీచే నిర్ణయింపబడిన కళ్యాణమార్గమే నశించిపోతుంది. లోకంలో ఆదర్శప్రాయమైన పురుషులచేచేయబడు కర్మలే సామాన్యులకు మార్గదర్శకము లౌతాయి. మీ రేశక్తిరూపమైన రాజాదిరూపాల్లో అవతరించి ధర్మాన్ని రక్షించి లోకమర్యాదను నిలుపుతూంటారు. వేదమార్గం నశించడం మీ అభిమతం కాదు. వేదమార్గాన్ని ఉల్లంఘించువారు తాత్కాలికంగా ఔన్నత్యం పొందినా మీ అనుగ్రహం లేకపోవడంచేత శీఘ్రంగా నశించిపోతారు. మీరు జగత్పతులైయుండి కూడా బ్రాహ్మణులకింత వినమ్రులై యుండుటచేత మీకు హానిలేదు. ఇది మీ లీలమాత్రం. సర్వేశ్వరా! ద్వారపాలురైన జయవిజయులకు యోగ్యమైన శిక్షమీరే విధించండి లేదా అనుగ్రహించండి. వీరినిశపించినందులకై మమ్ములనే దండించండి. అదీమీకు సంతోషమే, శీఘ్రచర్యలో ఆదేమీరు చెయ్యండి. అని సనకాదులు శ్రీహరిని ప్రార్థించి వినమ్ర శీర్షులై నడిచారు. శ్రీహరి వారిపలుకులాలించి వారి

ఏతత్పురైవ నిర్దిష్టం రమయా క్రుద్ధయా యదా,
పురాపవారితా ద్వారి విశతీ మయ్యుపారతే.
మయి సంరంభయోగేన నిస్తీర్య బ్రహ్మహేళనం,
ప్రత్యేష్యతో నికాశం మే కాలేనాల్పీయసా పునః.
ద్వార్స్థావాదిశ్య భగవాన్విమానశ్రేణి భూషణం,
సర్వాతిశయయా లక్ష్మ్యా జుష్టం స్వం ధిష్ణ్యమావిశత్.
తౌ చ గీర్వాణఋషభౌ దుస్తరాద్ధరిలోకతః.
హతశ్రియౌ బ్రహ్మశాపాదభూతాం విగతస్మయౌ.
తతో వికుంఠధిషణాత్తయోర్నిపతమానయోః,
హాహాకారో మహానాసీద్విమానాగ్రేషు పుత్రకాః.
తావేవ హ్యధునా ప్రాప్తౌపార్షదామృషభౌహరేః,
దితేర్జఠరమావిష్టౌ కాశ్యపం తేజఉల్బణం,

నాదరించి, ఋషులారా! మీరు వీరిని శపించడంలో కూడా నాసంకల్పం ఉంది. వీరు శీఘ్రంగా రాక్షసులై జన్మించి నాయందు బద్ధవైరులై క్రోధంచేత నిరంతరం నాయందే ఏకాగ్రతకలవారై తిరిగి అచిర కాలంలోనే నన్ను పొందగలుగుతారు. అని అనుగ్రహ దృష్టిని ప్రస రించిన శ్రీహరికి నమస్కరించి సనకసనందనాది మహర్షులు మాధవుని ఆజ్ఞపొంది, నారాయణుని సంకీర్తన చేసుకుంటూ వెళ్ళిపోయారు.

అనంతరం కేశవుడు జయవిజయులను చూచి, వెళ్ళండి, కొంచం కూడా భయపడకండి నా అభిమతాన్ననుసరించినేను సర్వసమర్థుడనై కూడా బ్రహ్మతేజస్సును నిరోధించను. పూర్వకాలంలో నేను యోగ నిద్రలో ఉండగా ద్వారమందు ప్రవేశించిన లక్ష్మిని కూడా యిలాగే నిరోధించారు. ఆ నాడే లక్ష్మి మిమ్ములను శపించింది. కనుక మీరు భూమండలంలో ఆదిత్యులై జన్మించి నా యందు బద్ధవైరులైయుండుట చే మీకు యేకాగ్రత కలుగుతుంది. దానివల్ల విప్రతిరస్కార రూపమైన పాపాన్నుండి విముక్తులై కొలదికాలంలోనే నన్ను చేరగలుగుతారని చెప్పి భగవానుడు స్వధామానికి వెళ్ళాడు. దేవశ్రేష్ఠులైన జయవిజ యులు బ్రాహ్మణ శాపంవల్ల వైకుంఠంలోనే తేజోహీనులైనారు.

తయోరసురయోరద్య తేజసా యమయోర్హి వః,
ఆక్షిప్తం తేజ ఏతర్హి భగవాన్ సంవిధిత్సతి.
విశ్వస్య యః స్థితిలయోదయహేతురాద్యో యోగేశ్వరైరపి దురత్యయయోగమాయః,
క్షేమం విధాస్యతి స నో భగవాంస్త్ర్యధీశస్తత్రాస్మదీయవిమృశేన కియానిహార్థః

వైకుంఠ ద్వారపాలురు జారిపోతూంటే హాహాకారాలు బయలుదేరాయి. వారే యీ దితి గర్భంలో ఉన్న కశ్యపుని ఉగ్రతేజం. దానివల్లనే మీరు తేజోహీనులౌతున్నారు. అది ఈశ్వరేచ్ఛ, సృష్టి స్థితి లయకారకుడై యోగిదుర్లభుడైన, మధుసూదనుడే మనల ననుగ్రహించుగాక! అని బ్రహ్మ దేవతలకు చెప్పిన దే మైత్రేయుడు విదురునకు చెప్పినట్లు శ్రీశుకుడు పరీక్షిత్తునకు వినిపించాడు.

## 16 అధ్యాయం

నిశమ్యాత్మభువా గీతం కారణం శంకయోజ్ఝితాః,
తతస్సర్వే న్యవర్తంత త్రిదివాయ దివౌకసః.
దితిస్తు భర్తురాదేశాదపత్యపరిశంకినీ,
పూర్ణే వర్షశతే సాధ్వీ పుత్రౌ ప్రసుషువే యమౌ.
ఉత్పాతా బహవస్తత్ర నిపేతుర్జాయమానయోః,
దివి భువ్యంతరిక్షే చ లోకస్యోరుభయావహాః.
సహాచలా భువశ్చేలుర్దిశస్సర్వాః ప్రజజ్వలుః,
సోల్కాశ్చాశనయః పేతుః కేతవశ్చార్తిహేతవః,

బ్రహ్మవల్ల అంధకారకారణం గ్రహించి దేవతలు స్వర్గానికి వెళ్లిపోయారు.

పుత్రులవల్ల ఉపద్రవాలు కలుగుతాయని దితి గ్రహించి నూరు సంవత్సరాలు గర్భంధరించి ఒకసమయంలో ఇద్దరు కుమారులను కన్నది. ఆసమయంలో స్వర్గ, పృథివీ, అంతరిక్షాలలో, భయంకరమైన ఉత్పాతాలు బయలుదేరాయి. భూమికంపించింది. దిశలు మండుతూన్నట్లున్నాయి, ఉల్కాపాతాలు కలుగుతున్నాయి. పిడుగులు పడుతున్నాయి.

వవౌ వాయుస్సుఖస్పర్శః ఫూత్కారానీదయన్మహుః,
ఉన్మూలయన్నగపతీన్వాత్యానీకో రజోధ్వజః.
ఉద్ధసత్తటి దంభోదఘటయా నష్టభాగణే,
వ్యోమ్ని ప్రవిష్టతమసా నస్మ వ్యాదృశ్యతే పదం.
చుక్రోశ విమనా వార్ధి రుదూర్మిః క్షుభితోదరః,
సోదపానాశ్చ సరితశ్చుక్షుభుశ్శుష్కపంకజాః.
ముహుః పరిధయోఽభూవన్ సరాహ్వోః శశిసూర్యయోః
నిర్ఘాతరథనిర్హ్రాదా వివరేభ్యః ప్రజజ్ఞిరే.
అంతర్గ్రామేషు ముఖతో వమంత్యో వహ్నిముల్బణం,
సృగాలోలూకటంకారైః ప్రణేదురశివాశ్శివాః.
సంగీతవద్రోదనవదున్నమయ్య శిరోధరాః,
వ్యముంచన్ వివిధా వాచో గ్రామసింహాస్తతస్తతః.
ఖరాశ్చ కర్కశైః క్షత్తః ఖురైర్ఘ్నంతో రసాతలం,
ఖార్కార రభసామత్తాః పర్యధావన్ వరూథశః.

ధూమకేతువులు గోచరిస్తున్నాయి. మాటిమాటికీ భయంకరమైన వాయువువీస్తూ వృక్షాలను పెకలిస్తూన్నది. ఆవాయువు వికటంగా అసహ్యంగా ఉంది. ధూళిలేచి ఆకాశాన్నీ భూమినీ యేకం చేస్తూన్నది. భయంకరంగా మెరుపులు మెరుస్తున్నాయి. సూర్యచంద్ర నక్షత్రాదులు గోచరించడంలేదు. సముద్రం రోదిస్తుందా అన్నట్లు ఉత్తాల తరంగాలతో ఘోషిస్తున్నది. నదులుకూడా అలానే ఉన్నాయి. కమలములు వాడి పోయాయి. జల జంతువులు భయంతో ఇటూ అటూ తిరుగుతూన్నాయి. సూర్యచంద్రులు తరచుగా గ్రసించబడుతున్నారు. వారిచుట్టూ అమంగళ మండలాలు ప్రవేశించి ఉంటున్నాయి. గుహాల్లో రథనేమిధ్వనులు బయలుదేరాయి. గ్రామాల్లో గ్రద్దలు రాబందులతో పాటు నక్కలు కూడా తమ ముఖాన్నుండి అగ్నిని జ్వలింప జేస్తూ భయంకరంగా యేడుస్తున్నాయి. కుక్కలు తలలు పైకెత్తి యేడుస్తున్నాయి. గాడిదలు గిట్టలతో భూమిని త్రవ్వుతూ కఠోర శబ్దంతో అటూయిటూ పరువులెత్తుతూ ఉన్నాయి. ఆ శబ్దానికి భయపడి పక్షులు నలుమూలలా యెగిరిపోతున్నాయి. గోవులూ, వృషభాలూ,

రుదంతో రాసభత్రస్తాసీదాదుదపతన్ ఖగాః,
ఘోషేఽరణ్యేచ పశవశ్శకృన్మూత్రమకుర్వత.
గావోఽత్ర సన్నసృగ్దోహస్తోయదాః పూయవర్షిణః,
వ్యరుదన్ దేవలింగాని ద్రుమాః పేతుర్వినానిలం.
గ్రహాన్పుణ్యతమానన్యే భగణాంశ్చాపి పీడితాః,
అతిచేరుర్వక్రగత్యా యుయుధుశ్చ పరస్పరం.
దృష్ట్వాన్యాంశ్చ మహోత్పాతాన తత్తత్త్వ విదః ప్రజాః,
బ్రహ్మపుత్రా నృతేభీతా మేనిరే విశ్వసంప్లవమ్.
తావాదిసై త్యౌసహసా వ్యజ్యమానాత్మ పౌరుషౌ.
వవృధాతేఽశ్మసారేణ కాయేనాద్రి పతీ ఇవ.
దివిస్పృశౌ హేమకిరీటకోటిభిర్నిరుద్ధకాష్ఠౌ స్ఫురదంగదా భుజౌ,
గాంకంపయంతౌ చరణైః పదే పదే కట్యాసు కాంచ్యార్కమతీత్య తస్థతుః.
ప్రజాపతిర్నామ తయోరకార్షీద్యః ప్రాక్స్వదేహాద్య మయోరజాయత,
తం వై హిరణ్య కశిపుం విదుర్యథాయుం తం హిరణ్యాక్ష మసూత సాగ్రతః.
చక్రే హిరణ్యకశిపుర్దోర్భ్యాం బ్రహ్మవరేణ చ,
వశేనపాలాన్ లోకాం స్త్రీనకుతోమృత్యురుద్ధతః.

భయంచేత మలమూత్రాలు విడుస్తున్నాయి. గోవులను పాలు పితుకుతూంటే రక్తధారలే పడుతున్నాయి. మేఘాలు మలమూత్రాలు వర్షించడం గ్రహాలు తమతమ గమనంలో నక్షత్రాలనుల్లంఘించి వక్రగతుల్లో చరించడం పరస్పరయుద్ధాలూ చూస్తే అకాల ప్రళయశంకతో దేవతలు కూడా, భయపడుతున్నారు.

అదితిగర్భంనుండి జనించిన ఆ దైత్యులు ఉక్కుతో సమానమైన దేహములతో శీఘ్రంగా పెరిగిపోతున్నారు. వారి స్వర్ణ కిరీటాలు స్వర్గాన్ని స్పృశిస్తున్నాయి. వారి శరీరాలు దిక్కులనాక్రమించాయి. విద్యుత్ప్రకాశంతో వారిభుజాలయందు అంగదములు ప్రకాశిస్తున్నాయి. వారు నడుస్తూంటే అడుగడుగుకూ భూమి కంపిస్తూన్నది. వారిద్దరూ కవలలు. కశ్యపుడు వారిరువురికీ యిలా నామ కరణం చేశాడు. దితి గర్భమందు ప్రథమతః తాను స్థాపించిన వీర్యంవల్ల జనించినవాడు హిరణ్యకశ్యపుడనీ, దితిగర్భంనుండి తొలుత జనించినవాడు హిరణ్యాక్షు

హిరణ్యాక్షోఽనుజస్తస్య ప్రియః ప్రీతికృదన్వహం,
గదాపాణిర్దివం యాతో యుయుత్సుర్మృగయన్ రణం.
తం వీక్ష్య దుస్సహజవం రణత్కాంచననూపురం,
వైజయంత్యా స్రజాజుష్టమంసన్యస్త మహాగదం,
మనో వీర్యబలోత్సిక్త మసృణ్య మకుతోభయం,
భీతానిలిల్యిరే దేవాస్తార్క్ష్యత్రస్తా ఇవాహయః.
న వై తిరోహితాన్ దృష్ట్వా మహసా స్వేన దైత్యరాట్,
సేంద్రాన్ దేవగణాన్ క్షీబో న పశ్యన్వ్యనదద్భృశం.
తతో నివృత్తః క్రీడిష్యన్ గంభీరం భీమనిస్వనం,
విజగాహే మహాసత్త్వో వార్ధిం మత్త ఇవ ద్విపః.
తస్మిన్ప్రవిష్టే వరుణస్య సైనికా యాదోగణాస్సన్నధియస్స సాధ్వసాః,
అహన్యమానా అపి తస్య వర్చసా ప్రధర్షితా దూరతరం ప్రదుద్రువుః.
సవర్షపూగానుదధౌ మహాబలశ్చరన్మహోర్మీన్ శ్వసనేరితాన్ముహుః,
మౌర్వ్యాభిజఘ్నే గదయా విభావరీ మాసేదివాంస్తత్ర పురీం ప్రచేతసః.
తత్రోపలభ్యాసురలోక పాలకం యాదోగణానామృషభం ప్రచేతసం,
స్మయన్ప్రలబ్ధుం ప్రణిపత్య నీచవజ్జగాద మే దేహ్యధిరాజ సంయుగం,

డనీ నామకరణం చేశాడు. హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులు తీవ్రతపో నిష్ఠలో బ్రహ్మసాక్షాత్కారం పొంది వరములు గ్రహించి వరమద గర్వితులై, లోకపాలురను జయించి త్రిలోకాలూ స్వాధీనం చేసుకున్నారు. హిరణ్యకశ్యపుడు తమ్ముడైన హిరణ్యాక్షుని యెక్కువగా ప్రేమిస్తున్నాడు. హిరణ్యాక్షుడు అన్న అనుగుజాడల్లో నడుస్తున్నాడు. ఒకనాడు హిరణ్యాక్షుడు గదాపాణియై యుద్ధాభిలాషతో స్వర్గానికి వెళ్ళాడు. అతనియందు శరీర, మనో, వరబలాలు సంపూర్ణంగా ఉండటంచేత మదోన్మత్తుడై గర్జిస్తూ ఉంటే దేవతలు భయపడి దాక్కున్నారు. అదిచూసి హిరణ్యాక్షుడు ఆలోకాన్నుంచి తిరిగి తిరిగి ప్రతిపక్షులను పొందలేక సముద్రంలో ప్రవేశించి మదించిన యేనుగువలె విహరిస్తూ జలచరాలను భయపెడుతున్నాడు. క్రమంగా వరుణలోకానికి వెళ్ళి దానిరాజధానియైన విభావరీపురియందు ప్రవేశించి వికటంగా నవ్వుతూ ఆరాజుకు నమస్కరించి మహారాజా! యుద్ధభిక్ష పెట్టండి. మీరు మహావీరుల్ని జయించినవారు. రాజసూయం చేసినవారు.

త్వం లోకపాలాధిపతిర్బృహచ్ఛ్రవా వీర్యాపహో దుర్మదవీరమానినామ్,
విజిత్య లోకే కిల దైత్యదానవాన్ యద్రాజసూయేన పురాయజత్ప్రభో,
స ఏవముత్సిక్తమదేన విద్విషా దృఢం ప్రలబ్ధో భగవానపాం పతిః,
రోషం సముత్థం శమయన్ స్వయా ధియా వ్యవోచదంగోపశమం గతా వయం,
పశ్యామి నాన్యం పురుషం పురాతనాద్యః సంయుగే త్వాం రణమార్గకోవిదం,
ఆరాధయిష్యత్యసురర్షభేహి తం మనస్వినో యం గృణతే భవాదృశాః.
తం వీరమారాదభిపద్య విస్మయః శయిష్యసే వీరశయే శ్వభిర్వృతః,
యస్త్వద్విధానామసతాం ప్రశాంతయే రూపాణి ధత్తే సదనుగ్రహేచ్ఛయా.

అని హేళనగా గర్వించి పలుకుతూన్న హిరణ్యాక్షునిపై తీవ్రతరకోపం కల్గినా ఆ కోపాన్ని నిరోధించి వరుణుడు.

కశ్యపనందనా! సోదరా! నీతో యుద్ధానికి తలపడేశక్తి నాకు లేదు. నీతో యుద్ధంచేయగల సమర్థుడు పురాణపురుషుడైన మధుసూదను డొక్కడే. నీవాయనతో యుద్ధంచేస్తే నీ మనోరథం నెరవేరుతుంది. నీ కళేబరం కుక్కలతోనూ, నక్కలతోనూ చుట్టబడి వీరభూమియందు శయనిస్తుంది. సత్పురుషుల ననుగ్రహించేటందులకై అనేక అవతారాలు ధరించే శ్రీహరిగాక నీతో యుద్ధంచేయగలవారెవరు? నీవు వైకుంఠునితో యుద్ధం సాగించుమన్నాడు.

## 17 అ ధ్యా య ం

తదేవమాకర్ణ్య జలేశభాషితం మహామనాస్తద్విగణయ్య దుర్మదః,
హరేర్విదిత్వా గతిమంగ నారదాద్రసాతలం నిర్వివిశే త్వరాన్వితః.
దదర్శ తత్రాభిజితం ధరాధరం ప్రోన్నీయమానావనిమగ్రదంష్ట్రయా,
ముష్ణంతమక్ష్ణా స్వరుచోఽరుణశ్రియా జహాస చాహో వనగోచరో మృగః.

వరుణుని పలుకులువిన్న హిరణ్యాక్షుడానందంతో విష్ణువును జయించాలనుకున్నాడే కాని హరిచేతుల్లో నీవు మరణిస్తావన్న వరుణుని పలుకులయందు వానికి దృష్టి లేనేలేదు. వెంటనే నారదునివల్ల హరిజాడ తెలుసుకొని హిరణ్యాక్షుడు రసాతలానికి వెళ్ళి భూమిని

ఆహైవమేహ్యజ్ఞ మహీంవిముంచ నో రసౌకసాం విశ్వసృజేయ మర్పితా,
న స్వస్తి యాస్యస్యనయా మమేక్షతస్సురాధమాసాదితసూకరాకృతే.
త్వం నస్సపత్నైరభవాయ కిం భృతో యో మాయయా హంత్యసురాన్పరోక్షజిత్
త్వాం యోగమాయాబలమల్పపౌరుషం సంస్థాప్య మూఢప్రమృజే సుహృచ్ఛుచః.
త్వయి స్థితేగదయా శీర్ణశీర్షణ్యస్మద్భుజచ్యుతయాయే చ తుభ్యం,
బలిం హరిష్యంత్యృషయో యే చ దేవా స్స్వయం చసర్వే న భవిష్యంత్యమూలాః
స తుద్యమానోదురుక్తితోమ రైర్దంష్ట్రాగ్రగాం గాముపలక్ష్య భీతాం,
తోదం మృషన్నిరగాదంబుమధ్యాద్గ్రాహాహతస్సకరేణుర్యథేభః.
తంనిస్సరంతం సలిలాదను ద్రుతో హిరణ్యకేశో ద్విరదంయథా ఝషః,
కరాళదంష్ట్రోఽశనినిస్వనోఽబ్రవీద్గతహ్రియాం కిన్త్వసతాం విగర్హితమ్,
సగాముదస్తాత్సలిలస్య గోచరే విన్యస్య తస్యామదధాత్స్వసత్త్వమ్,
అభిష్టుతో విశ్వసృజాప్రసూనైరాపూర్యమాణో విబుధైః పశ్యతోఽరేః.
పరానుషక్తం తపనీయోపకల్పం మహాగదం కాంచనచిత్రదంశం,
మర్మాణ్యభీక్ష్ణం ప్రతుదంతం దురుక్తైః ప్రచండమన్యుః ప్రహసంస్తం బభాషే.

ఉద్ధరించి తెచ్చే వరాహమూర్తిని చూచి వికటాట్టహాసం చేస్తూ యీ అరణ్యపశువు యిక్కడకు యెక్కడనుంచి వచ్చింది? అని పలుకుతూ, వరాహమూర్తిని సంబోధించి అంటున్నాడు. అరే! అజ్ఞానీ విశ్వస్రష్ట యీ భూమండలాన్ని రసాతలవాసులకై సృష్టించి యిచ్చాడు. వరాహరూపధారీ దేవాధమా! దీన్ని యెక్కడకు తీసుకువెళతావు? భూమిని యిక్కడనేవదలు, లేదా నీకీనాటితో ఆయువుసరి. నీవుమాయ నాశ్రయించి రాక్షసులను జయిస్తూంటావు. మాయాబలమేగాని నీకు పురుషబలంలేదు, నిన్ను సంహరిస్తే నిన్నాశ్రయించిన దేవతలూ, ఋషులూ నిరాశ్రయులై వారే పోతారు. రాక్షసులు నిష్కంటకంగా సుఖిస్తారు. అని కటువచనాలు పలుకుతున్నాడు.

హిరణ్యాక్షుని కటు వాక్యాలు క్రోధాన్ని కలిగిస్తున్నా భయం చేత కంపిస్తూఉన్న భూమిని ఒకే కోరయందు నిలిపి హిరణ్యాక్షునకు సమాధానమే చెప్పకుండా జలోపరిభాగానికి వచ్చి సురక్షితస్థానంలో జలంమీద భూమిని స్థిరంగా ఉంచాడు. మకరముచే గాయపడి జలాంతర్భాగాన్నుండి పైకివచ్చేగజరాజులా శ్రీవరాహమూర్తి గజరాజును

సత్యం వయం భో వనగోచరామృగాయుష్మ ద్విధాన్మృగయే గ్రామసింహాన్,
న మృత్యుపాశైః ప్రతిముక్తస్య ధీరావికత్థనం తవ గృహ్ణంత్యభద్రం.
ఏతే వయంన్యాసహరారసౌకసాం గతహ్రియో గదయా ద్రావితాస్తే,
తిష్ఠామహేథాపి కథంచిదాజౌ స్థేయం క్వ యామో బలినోత్పాద్య వైరం,
త్వం పద్రథానాం కిల యూథపాధిపో ఘటస్వ నోఽస్వస్తయఅశ్వనూహః,
సంస్థాప్య చాస్మాన్ ప్రమృజాశ్రుస్వకానాం యస్స్వాం ప్రతిజ్ఞాం నాతిపిపర్త్యసభ్యః.
సోఽధిక్షిప్తో భగవతా ప్రలబ్ధశ్చ రుషా భృశం,
ఆజహారోల్బణం క్రోధం క్రీడ్యమానోహిరాడివ.
సృజన్నమర్షి తశ్శ్వాసం మన్యు ప్రచలి తేంద్రియః,
ఆసాద్య గదాయా దైత్యస్తరసాభ్యహనద్ధరిం.
భగవాంస్తు గదావేగం విసృష్టమరిణోరసి,
అవంచయత్తిరశ్చీనో యోగారూఢఇవాంతకం.
పునర్గదాం తామాదాయ భ్రామయంతమభీక్ష్ణశః,
అభ్యధావద్ధరిః క్రుద్ధస్సంరంభాద్దష్టదచ్ఛదం.

వెన్నంటివచ్చే మకరిలా హిరణ్యాక్షుడు కనుపిస్తున్నాడు. సమాధానం చెప్పకుండా వచ్చే శ్రీవరాహమూర్తిని చూచి శ్రీహరీ! నీవు వీరుడవని సమస్తలోకాలూ ఘోషిస్తూంటే ఇలా సమాధానమే చెప్పకుండా పలాయనమంత్రానుష్ఠానం చెయ్యడంలో నీకు సిగ్గులేదా! ఎందుకుంటుందిలే! అసత్పురుషులకు మానాభిమానా లెక్కడుంటాయి. అని పలికే హిరణ్యాక్షుని మాటలు లెక్కించక సర్వాధారరూపమైన జగద్ధాత్రిశక్తిని జలోపరిభాగమందు స్థాపించి అప్పుడు హిరణ్యాక్షుని వైపు తిరిగి భయంకరమైన గదను సారిస్తూ దశదిశలూ పిక్కటిల్లేలా గర్జిస్తూ పలుకుతున్నాడు శ్వేత వరాహమూర్తి

ఆదిదానవా! సత్యంగా మేము అరణ్యమృగాలమే. నీవంటి గ్రామసింహాలను (కుక్కలను) వెతుకుతూ ఉంటాము. వీరపురుషులు మృత్యుపాశబద్ధులై ఆత్మస్తుతి చేసుకునే నీవంటి తుచ్ఛుల వాక్యాల యందు దృష్టి ఉంచరు. అవును రసాతల వాసుల స్వత్వమైన భూమిని హరించి సిగ్గులేకుండా నీగదకు భయపడి యిలావచ్చాను. నీవంటి వీరునితో మేమెక్కడ పోరగలము? నీతో వైరంపొంది యెక్కడకు

తతశ్చ గదయారాతిర్దక్షిణాం నభువి ప్రభోః,
అజఘ్నేనతు తాం సౌమ్యగదయఘాకోవిదోఽహనత్.
ఏవం గదాభ్యాం గుర్వీభ్యాం హర్యక్షో హరిరేవ చ,
జిగీషయా సుసంరబ్ధావన్యోన్యమభిజఘ్నతుః.
తయోస్స్పృధోస్తిగ్మగదా ఘాతాంగయోః క్షతాస్రవాఘ్రాణవివృద్ధమన్వ్యోః,
విచిత్రమార్గాంశ్చరతోర్జిగీషయా వృషావిళాయామివశుష్మిణోర్మిథః.
దైత్యస్య యజ్ఞావయవస్య మాయయా గృహీతవారాహతనో ర్మహాత్మనః,
కౌరవ్యమహ్యాం ద్విషతోర్విముర్ధ నందిదృక్షురాగాదృషిభిర్వృతస్స్వరాట్.
అనన్నశౌండీర్యముపేతసాధ్వసం కృత్ప్రతికారమహార్యవిక్రమమ్,
విలక్ష్య దైత్యం భగవాన్ సహస్రణీర్జగాద నారాయణమాదిసూకరం.
ఏషతే దేవ దేవానా మంఘ్రిమూలము పేయుషామ్,
విప్రాణాం సౌరభేయాణాం భూతానామప్యనాగసామ్,

పోగలము? నీవు పదాతి సైన్యానికి అధిపతివి గనుక వృథా కాలయాపన సాగించక నాతో యుద్ధం చెయ్యి. అలా నిలబడడం తగదని శ్రీహరి తిరస్కారపూర్వకంగా వ్యంగ్యంగా పలుకుతూ ఉండగా మహాక్రోధంతో హిరణ్యాక్షుడు మాధవునిపై గదాప్రహారం చేశాడు. నారాయణుడా ప్రహారాన్ని తప్పించుకొని తానుకూడా గదను త్రిప్పుతూ అసురునిపై ఝుళిపించాడు.

అసుర దేవశ్రేష్ఠులిద్దరూ ఒకరినొకరు జయించాలనే సంకల్పంతో యుద్ధం సాగిస్తున్నారు. ఇద్దరి దేహాలూ గదాఘాతాలచే గాయపరుప బడుతున్నాయి. విచిత్ర గతులతో సాగించే వారియుద్ధక్రమం గోవుకొరకై రెండు వృషభాలు యుద్ధంచేస్తున్నట్లుగా కనపడుతూన్నది. ఈ విధంగా యజ్ఞవరాహమూర్తీ హిరణ్యాక్షుడూ, భూమికొరకై పరస్పరయుద్ధం సాగిస్తూండగా, అక్కడకు ఆయుద్ధం చూడడానికి దేవతలతో కూడా వచ్చిన బ్రహ్మ వరాహమూర్తికి నమస్కరించి ఇలా పలుకుతున్నాడు.

దేవాధిదేవా! యజ్ఞవరాహరూపా! వీడు నావల్ల వరం పొంది గర్వించి నిరపరాధులైన దేవతలనూ ఋషులను హింసించడమే గాక యుద్ధవాంఛతో అన్నిలోకాలూ తిరిగి నీతో యుద్ధం ఆరంభిం

అగస్కృద్భయకృద్దుష్కృదస్మద్రాద్ధవరోఽ సురః,
అన్వేషన్న ప్రతిరథో లోకానటతి కంటకః,
ఏవం మాయావినం దృష్టం నిరంకుశమసత్తమమ్.
మా క్రీడ బాలవద్దేవ యథాశీవిషముత్థితమ్.
నయావదేషవర్ధేత స్వాం వేళాంప్రాప్య దారుణః,
స్వాం దేవమాయామాస్థాయ తావజ్జహ్యఘమచ్యుత.
ఏషా ఘోరతమా సంధ్యా లోకఛంఛట్కరీ ప్రభో,
ఉపసర్పతి సర్వాత్మన్ సురాణాం జయమావహ.
అధునైషోఽభిజిన్నామయోగో మౌహూర్తికోఽభ్యగాత్,
శివాయ నస్త్వంసుహృదామాశునిస్తర దుస్తరమ్.
దిష్ట్యా త్వాం విహితం మృత్యుం మాయామాసాదితస్స్వయమ్,
విక్రమ్యైనం మృధే హత్వా లోకానాధేహి శర్మణి.

చాడు. సంధ్యాకాలం సమీపిస్తే యీ క్రూరునిబలం పెరిగిపోతుంది. వీడు మాయావి. రాత్రి వీనిమాయాబలం జయించడం కష్టం. బాలుడు సర్పంతో చెలగాటలాడినట్లు వీనితో క్రీడించక మీ యోగమాయా బలంతో వీనిని సంహరించండి. ఇది అభిజిల్లగ్నం. దేవతలకు చాల ప్రియమైనది. ఈ ముహూర్తంలోనే వీనిని సంహరించండి. వీనికి మీ చేతుల్లోనే మృత్యువు ఉంది. ఇతడే మృత్యువును వెతుక్కుంటూ మీ దగ్గరకు వచ్చాడు గనుక మీరు వెంటనే యితనిని సంహరించండి. అని ప్రార్థించాడు.

## 18 అ ధ్యా య ం

అవధార్య విరించస్య నిర్వ్యళీకామృతం వచః,
ప్రహస్య ప్రేమగర్భేణ తదపాంగేన సోఽగ్రహీత్.
తతస్సపత్నం ముఖతశ్చరంతమకుతో భయమ్,
జఘానోత్పత్య గదయా హనావసురమక్షజః.

కపటరహితమైన బ్రహ్మపలుకు లాలించి భగవానుడు చిరునవ్వు నవ్వుతూ, కటాక్షవీక్షణాలతో ఆయన ప్రార్థనను స్వీకరించి గదచే హిరణ్యాక్షుని వేధించడం ఆరంభించాడు. ఆ దేసమయంలో హిరణ్యా

సా హతా తేన గదయా విహతా భగవత్కరాత్,
విఘూర్ణితాపతద్రేజే తదద్భుతమివాభవత్.
సతదా లబ్ధతీర్థోఽపి నబబాధే నిరాయుధమ్,
సమానయన్ మృధే ధర్మం విష్వక్సేనం ప్రకోపయన్.
గదాయామపవిద్ధాయాం హాహాకారే చ నిర్గతే,
మానయామాస తద్ధర్మం సునాభం చాస్మరద్విభుః.
తం వ్యగ్రచక్రం దితిపుత్రాధమేన స్వపార్షదముఖ్యేన విషజ్యమానమ్,
చిత్రావాచోఽతద్విదాం ఖేచరాణాం తత్ర స్మాసన్ స్వస్తి తేఽముం జహీతి.
సతం నిశామ్యాత్తరథాంగమగ్రతో వ్యవస్థితం పద్మపలాశలోచనమ్,
విలోక్య చామర్షపరిప్లుతేంద్రియో రుషాస్వదంతచ్ఛదమాదశచ్ఛ్వసన్.
కరాళదంష్ట్రశ్చక్షుర్భ్యాం సం చక్షాణో దహన్నివ,
అభిద్రుత్య స్వగదయా హతోఽసీత్యాహనద్ధరిమ్.
పదా స వ్యేన తాం సాధో భగవాన్ యజ్ఞసూకరః,
లీలయామిషతశ్శత్రోః ప్రాహరద్వాతరంహసమ్.
ఆహ చాయుధమాధత్స్వఘటస్వ త్వం జిగీషసి,
ఇత్యుక్తస్సవరాహాయ తాం గదాం వ్యసృజద్భృశమ్,
తాం సఆపతతీం వీక్ష్య భగవాన్ సమవస్థితః,
జగ్రాహ లీలయా ప్రాప్తాం గరుత్మానివపన్నగీమ్.

క్షుడుకూడా గదాయుద్ధంచేస్తూ ఉంటే పరస్పర గదాప్రహారాలలో శ్రీహరి చేతియందలి గద జారిపోయింది. మాధవుడు నిరాయుధుడు కావడంతోనే హిరణ్యాక్షుడు యుద్ధమాపివేశాడు. శ్రీహరి దానితో ఉగ్రుడై సుదర్శన చక్రాన్ని స్మరించాడు. వెంటనే చక్రం ఆయన హస్తంలో తిరుగుతూంది. కాని భగవానుడా రాక్షసునితో క్రీడిస్తు న్నాడు. చక్రప్రయోగం చెయ్యడం లేదు. అదిచూసి దేవతలు ప్రభూ! వీనితో ఆటలాడకు, వీనిని సంహరింపుమని మొరపెట్టడం ఆరంభించారు. హిరణ్యాక్షుడు తీక్షణ దృష్టితో శ్రీనాథుని భస్మం చేస్తాడా? అన్నట్లుచూస్తున్నాడు. అంతలో గదను త్రిప్పి శ్రీహరిపై విసరిన వెంటనే అచ్యుతుడాగదను యెడమకాలితో లీలగా తన్నేశాడు. తన ఉద్యమం విఫలం కావడంతో దైత్యుని గర్వం, తేజంకూడా, తగ్గి పోయాయి. ఉత్తమబ్రాహ్మణునిపై చేసినప్రయోగతంత్రింపలె అతని

స్వపౌరుషే ప్రతిహతే హతమానో మహాసురః,
నైచ్ఛద్గదాం దీయమానాం హరిణా విగతప్రభః.
జగ్రాహ త్రిశిఖం శూలం జ్వలజ్జ్వలనలోలుపమ్,
యజ్ఞాయ ధృతరూపాయ విప్రాయాభిచరన్యథా.
తదోజసా దైత్యమహాభటార్పితం చకాసదంతః ఖ ఉదీర్ణదీధితి,
చక్రేణ చిచ్ఛేద నిశాతనేమినా హరిర్యథా తార్క్ష్యపతత్రముజ్ఝితమ్.
వృక్ణే స్వశూలే బహుధారిణా హరేః ప్రత్యేత్య విస్తీర్ణమురో విభూతిమత్,
ప్రవృద్ధరోషస్సకఠోరముష్టినా నదన్ప్రహృత్యాంతరధీయతాసురః.
తేనేత్థమాహతః క్షత్తర్భగవానాదిసూకరః,
నాకంపత మనాక్క్వాపి స్రజాహత ఇవ ద్విపః.
అథోరుధాసృజన్మాయాం యోగమాయేశ్వరే హరౌ,
యాం విలోక్య ప్రజాస్త్రస్తా మేనిరేఽస్యోపసంయమం.
ప్రవవుర్వాయవశ్చండాస్తమః పాంసవమైరయన్,
దిగ్భ్యో నిపేతుర్గ్రావాణః క్షేపణైః ప్రహితా ఇవ.
ద్యౌర్నష్టభగణాభ్రౌఘైస్సవిద్యుత్స్తనయిత్నుభిః,
వర్షద్భిః పూయకేశాసృగ్విణ్మూత్రాస్థీని చాసకృత్.
గిరయః ప్రత్యదృశ్యంత నానాయుధముచోఽనఘ,
దిగ్వాససో యాతుధాన్యః శూలిన్యో ముక్తమూర్ధజాః.

ప్రయత్నం నిష్ఫలమైపోయింది. గద పోవడంచేత శూలాన్ని ప్రయోగించాడు ఆ రాక్షసుడు. ఆ శూలం కూడా చక్రంచేత నరుకుతే రాక్షసుడింక ఆసురీమాయను ప్రయోగించడం ఆరంభించాడు. ఆ మాయచేత పాషాణవర్షం కురుస్తూన్నది. మలమూత్రాలూ, రుధిర కేశాలూ, అస్థులూ వర్షిస్తూంటే సూర్యచంద్రుల ప్రకాశం కప్పబడి ప్రచండ వాయువుచే ధూళి రేగి భూనభోంతరాళాలునిండి అంధకారబంధురమై ఆకాలప్రళయం కలుగుతుందా అనే శంక కలుగుతూన్నది. అంతలో ఆ ఆసురీమాయలో అపూర్వ పర్వతాలూ, రథ గజ తురగపదాతి వర్గం యొక్క నరుకూ చంపూ అనే శబ్దాలూ దశదిశలూ వ్యాపించాయి. భయంకరాకారులైన స్త్రీలూ పురుషులూ కూడా ఆయుధాలు ధరించి పరుపులిడుతూన్నట్లు గోచరిస్తూన్నది. భయంకరమైన ఆ అసురీమాయను చూసి అనంతుడా మాయను ఉపసంహరింప చక్రాన్ని ప్రయోగిస్తే ఆ చక్రం ఆ అసురీమాయనాశక్తిని సంహరించే సరికి హిరణ్యాక్షు

బహుభిర్యక్షరక్షోభిః పత్త్యశ్వరథకుంజరైః,
ఆతతాయిభిరుత్సృష్టా హింస్రావాచోఽతివైశసాః.
ప్రాదుష్కృతానాం మాయానామాసురీణాం వినాశనం,
సుదర్శనాస్త్రం భగవాన్ ప్రాయుంక్త దయితం త్రిపాత్.
తదాదితేస్సమభవత్సహసా హృది వేపథుః,
స్మరంత్యాభర్తురాదేశం స్తనాచ్చాసృక్ప్రసుస్రువే.
వినష్టాసు స్వమాయాసు భూయశ్చాభ్యేత్య కేశవమ్,
రుషోపగూహమానోఽముం దదృశేఽవస్థితం బహిః.
తం ముష్టిభిర్వినిఘ్నంతం వజ్రసారైరధోక్షజః,
కరేణ కర్ణమూలేఽహన్ యథాత్వాష్ట్రం మరుత్పతిః.
సఆహతో విశ్వజితాహ్యవజ్ఞయా పరిభ్రమద్గాత్ర ఉదస్తలోచన
విశీర్ణబాహ్వంఘ్రిశిరోధరోఽపతద్యథా నగేంద్రో లులితో నభస్వతా.
క్షితౌ శయానం తమకుంఠవర్చసంకరాళదంష్ట్రం పరిదష్టదచ్ఛదమ్,
అజాదయో వీక్ష్యశశంసురాగతా అహో ఇమం కోను లభేత సంస్థితిమ్
యం యోగినో యోగసమాధినా రహో ధ్యాయంతి లింగాదసతో ముముక్షయా,
తస్యైష దైత్యో నిహతః కర్ణపైముఖం ప్రపశ్యంస్తనుముత్ససర్జహ.
ఏతౌ హి పార్షదావస్య శాపాద్యాతావసద్గతిం.
పునః కతిపయైః స్థానం ప్రపత్స్యేతే హ జన్మభిః.

ఒక్కడే మిగిలాడు. యజ్ఞవరాహమూర్తి మహాక్రోధుడై అసురుని కర్ణమూలంలో ముష్టి ప్రహారం చేశాడు. వజ్రాఘాత సదృశమైన పిడికిటిపోటుతో హిరణ్యాక్షుడు గిరగిరా తిరిగి గ్రుడ్లు తేలవేసి శిరోజములు అస్తవ్యస్తములు కాగా చేతులూ, కాళ్లూ విలవిలా తన్నుకుని అసువులు బాశాడు. ప్రాణములు పోయినా వానిముఖం తేజోహీనం కాలేదు. బ్రహ్మాది దేవతలా హిరణ్యాక్షుని ప్రశంసించారు. ఆహా వీడెంత ధన్యుడు! అలభ్యమైన మృత్యువు వీనికి లభించింది. యోగి దుర్లభుడైన యజ్ఞమూర్తి చేతుల్లో మంగళమూర్తిని చూస్తూ దేహాన్ని చాలించిన వీడెంత పుణ్యాత్ముడు. పరమేశ్వర చరణసన్నిధిని దేహం చాలించాడు. శాప వశంచేత క్రూరజన్మ కలిగినా కొలది జన్మలలోనే శ్రీహరిని చేరగలడని వాని చరిత్రను స్మరిస్తూ యజ్ఞవరాహమూర్తిని చూసి ప్రభూ మీరు సమస్తయజ్ఞాలనూ విస్తరింప జేశేవారు. శుద్ధసత్త్వ

నమోనమస్తేఽఖిలయజ్ఞతంతవే స్థితౌగృహీతామలసత్త్వమూర్తయే,
దిష్ట్యాహతోఽసౌ జగతామరుంతుదస్త్వత్పాదభక్త్యా వయమీశ నిర్వృతాః.
ఏవం హిరణ్యాక్షమసహ్యవిక్రమంసంసాదయిత్వా హరిరాదిసూకరః,
జగామలోకం స్వమఖండితోత్సవం సమీడితఃపుష్కరవిష్టరాదిభిః.
మయా యథానూక్తమవాదితే హరేః కృతావతారస్యసుమిత్రచేష్టితం,
యథాహిరణ్యాక్ష ఉదారవిక్రమో మహామృధే క్రీడనవన్నిరాకృతః.
ఇతి కౌషారవాఖ్యాతా మాశ్రుత్య భగవత్కథాం,
క్షత్తానందం పరం లేభే మహాభాగవతో నృప.
అన్యేషాం పుణ్యశ్లోకానా ముద్దామ యశసాం కథాం,
ఉపశ్రుత్య భవేన్మోదః శ్రీవత్సాంకస్య కిం పునః.
యోగజేంద్రం ఝషగ్రస్తం ధ్యాయంతం చరణాంబుజ,
క్రోశంతీనాం కరేణూనాం కృచ్ఛ్రాచ్చామోచయద్ద్రుతం.
తంసుఖారాధ్యమృజుభి రనన్యశరణైర్నృభిః,
కృతజ్ఞః కో న సేవేత దురారాధ్యమసాధుభిః.
యో వై హిరణ్యాక్షవధం మహాద్భుతం విక్రీడితం కారణసూకరాత్మనః,
శృణోతి గాయత్యను మోదతే జనో విముచ్యతే బ్రహ్మవధాదపి క్షణాత్
ఏతన్మహాపుణ్యమలం పవిత్రం ధన్యం యశస్యం పదమాయురాశిషాం,
ప్రాణేంద్రియాణాం యుధి శౌర్యవర్ధనం నారాయణోఽంతే గతిరంగ శృణ్వతాం.

మయరూపంతో ప్రపంచాన్ని రక్షించేవారు కూడా. గనుకనే యీ భయంకర రాక్షసుని సంహరించి లోకకళ్యాణం ప్రసాదించారు. అట్టి మీ కనేకవేల నమస్కారా లర్పిస్తున్నాము. అని స్తుతించి భగవానుని అనుజ్ఞపొంది వారివారి లోకాలకు వెళ్ళిపోయారు. యజ్ఞవరాహ మూర్తి వీరిదృష్టిలో అంతర్ధానమైనాడు.

ఈ వరాహచరిత్ర గురుముఖతః విన్నది విన్నట్లుగా నీకు వివరించానని మైత్రేయుడు చెప్పినట్లు పరీక్షిన్మహారాజుకు శుకయోగీంద్రుడు చెప్పాడని శౌనకాదులకు సూతమహర్షి చెప్పి శౌనకాదులారా! పృథివీ ఉద్ధారరూపమైన వరాహావతార చరిత్ర చదివినా విన్నా సమస్తపాప విముక్తుడై ఇహలోకంలో సమస్తసౌఖ్యాలూ అనుభవించి మోక్షం పొందుతాడు అన్నాడు.

19. అధ్యాయం

మహీం ప్రతిష్ఠామధ్యాస్య సౌత్తే స్వాయంభువో మనుః,
కాన్యన్వతిష్ఠద్ద్వారాణి మార్గాయావరజన్మనామ్.
క్షత్తా మహాభాగవతః కృష్ణస్యైకాంతికస్సుహృత్,
యస్త్యక్త్వాగ్రజం కృష్ణేసాపత్యమఘవానితి.
ద్వైపాయనాదనవ మో మహత్వేతస్య దేహజః,
సర్వాత్మనా శ్రితః కృష్ణంతత్పరాంశ్చాప్యనువ్రతః,
కిమన్వపృచ్ఛన్మైత్రేయంవిరజా స్తీర్థసేవయా,
ఉపగమ్యకుశావర్త ఆసీనం తత్త్వవిత్తమం.
తయో స్సంవదతోస్సూత ప్రవృత్తాః హ్యమలాః కథాః
ఆపో గాంగాఇవామఘ్నీర్హరేః పాదాంబుజాశ్రయాః.
తాసః కీర్తయ భద్రం తే కీర్తన్యోదారకర్మణః,
రసజ్ఞఃకోనుతృప్యేత హరిలీలామృతం పిబన్.
ఏవముగ్రశ్రవాః పృష్టఋషిభిర్నైమిశాయనైః,
భగవత్యర్పితాధ్యాత్మస్తానాహ శ్రూయతా మితి.
హరేర్ధృతక్రోడతనోస్స్వమాయయా నిశమ్య గోరుద్ధరణం రసాతలాత్,
లీలాం హిరణ్యాక్షమవజ్ఞయా హతం సంజాతహర్షో మునిమాహ భారతః.

సూతమహర్షీ! పృథివిని ఆధారం చేసికొని స్వాయంభువమనువు సృష్టిఎలావృద్ధి చేశాడు? భగవద్భక్తుడైన విదురుడు రాయబారిగావచ్చిన శ్రీకృష్ణుని అనాదరించారని కౌరవులను వదలి అరణ్యానికి వచ్చాడు. ఆయన కృష్ణద్వైపాయనుని కుమారుడు. జ్ఞాని. అట్టి విదురుడు తీర్థ యాత్రలు సేవిస్తూ కుశావర్త క్షేత్రంలో మైత్రేయుని ఇంకా యేయే ప్రశ్నలు వేశాడు? వానికి మైత్రేయుడిచ్చిన సమాధానాలేమిటి? సమస్త పాపవినాశకమై హరికథారూపమైన విదుర మైత్రేయ సంవాదం సవిస్త రంగా వినిపించమని అడిగిన మునులప్రశ్నలకు ఆనందించి. ఋషులారా! చెపుతాను వినండి తనమాయచే శ్వేత వరాహరూపంలో హిరణ్యా క్షుని సంహరించిన కథా వృత్తాంతం విని ఆనందించి విదురుడు మైత్రే యుని యిలా అడుగుతున్నాడు.

మైత్రేయా! మీరు పరోక్ష అపరోక్షాలు రెండూ తెలిసినవారు. చతుర్ముఖుడు సృష్టిని వృద్ధి పొందించాలని మరీచ్యాదులను సృష్టించాడు.

ప్రజాపతి పతిస్సృష్ట్వా ప్రజాసర్గే ప్రజాపతీన్,
కిమారభత మే బ్రహ్మన్ ప్రబ్రూహ్యవ్యక్తమార్గవిత్.
యే మరీచ్యాదయో విప్రాః యస్తు స్వాయంభువో మనుః,
తే వై బ్రహ్మణ ఆదేశాత్కథమేతదభావయన్.
సద్వితీయాః కిమసృజన్ స్వతంత్రా ఉత కర్మసు,
ఆహోస్విత్సంహతాస్సర్వఇదం స్మ సమకల్పయన్.
దైవేన దుర్వితర్క్యేణ పరేణానిమిషేణ చ,
జాతక్షోభాద్భగవతో మహానాసీద్గుణత్రయాత్.
రజఃప్రధానాన్మహతస్త్రిలింగో దైవచోదితాత్,
జాత స్ససర్జ భూతాదిర్వియదాదీని పంచశః.
తాని చైకైకశస్స్రష్టుమసమర్థాని భౌతికం,
సంహత్య దైవయోగేన హైమమండమథాసృజన్.
సోఽశయిష్టాబ్ధిసలిలమండకోశో నిరాత్మకః,
సమగ్రం వర్షసాహస్రమన్వవాత్సీత్తమీశ్వరః.
యస్య నాభేరభూత్పద్మం సహస్రార్కోరుదీధితి,
సర్వజీవనికాయౌకో యత్ర స్వయమభూత్స్వరాట్.

మరీచ్యాదులూ స్వాయంభువమనువూ కలిసి ఈ సృష్టిని వృద్ధిచెందించారా? లేక వేరుగా వారివారి భార్యలతో యీ సృష్టి వృద్ధిచేశారా సవిస్తరంగా చెప్పండి.

విదురా! ఎవరి గతిని అర్థం చేసుకోవడానికి శక్యం కాదో అట్టి జీవుల ప్రారబ్ధం ప్రకృతికి నియంతయగు పురుషుడూ కాలమూ యీ మూడు హేతువుల వల్ల భగవంతుని సన్నిధానంచేత త్రిగుణాత్మకమైన ప్రకృతియందు క్షోభం కలిగిన తోడనే మహాతత్త్వం ఉత్పన్నమైంది. దేవ ప్రేరణచే రజోప్రధానమైన మహాతత్త్వం వల్ల సాత్విక, రాజస, తామసాహంకారాలు పుట్టాయి. అహంకార త్రయాన్నుండి పంచ తన్మాత్రలూ పంచమహాభూతాలూ పంచజ్ఞానేంద్రియాలూ పంచకర్మేంద్రియాలూ ఇంద్రియాధిష్ఠాన దేవతలూ ఆవిర్భవించారు.ఇవన్నీ వేరు వేరుగా ఉన్నంతవరకూ బ్రహ్మాండ రచన సమర్థం కాలేదు. అందు వల్లనే యివన్నీ భగవంతుని శక్తిచే సంఘటితమై సువర్ణవర్ణమైన అం

సోఽనువిష్టో భగవతా యశ్శేతే సలిలాశయే,
లోకసంస్థాం యథాపూర్వం నిర్మమే సంస్థయా స్వయా.
ససర్జ చ్ఛాయయా విద్యాం పంచపర్వాణమగ్రతః,
తామిస్రమంధతామిశ్రం తమోమోహామహత్తమః.
విససర్జాత్మనః కాయం నాభ్యనందం స్తమోమయమ్,
జగృహుర్యక్షర క్షాంసి రాత్రిం క్షుత్తృట్సముద్భవాం.
క్షుత్తృడ్భ్యాము పసృష్టాస్తే తం జగ్ధు మభిదుద్రువుః,
మారక్షతైనం జక్షధ్వమిత్యూచుః క్షుత్తృడర్దితాః.
దేవస్తానాహ సంవిగ్నో మామా జక్షత రక్షత,
అహో మే యక్షరక్షాంసి ప్రజాయూయంబభూవిథ.
దేవతాః ప్రభయా యాయాదీవ్యన్ప్రముఖతోఽసృజత్,
తేఽహారిషు ర్దేవయంతో విసృష్టాం తాం ప్రభామహః.
దేవోఽదేవా జఘనతస్స్రజతి స్మాతిలోలుపాన్,
తఏనం లోలుపతయా మైథునాయాభిపేదిరే.

డాన్ని సృష్టించాయి. ఆ అండం చేతనాశూన్యంగా వేయిసంత్సరాలు కారణాబ్ధిలో పడి ఉంది. భగవంతుడు దాన్నధిష్ఠించాడు. ఆయన నాభినుండి కోటిసూర్యప్రకాశ భాసమానమైన కమలం ఆవిర్భవించింది. ఆ కమలమే సమస్త జీవాశ్రయము. దానియందే చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు.

ఎప్పుడైతే బ్రహ్మాండ గర్భరూపమైన జలమందు శయనించిన నారాయణుడు బ్రహ్మయొక్క అంతఃకరణయందు ప్రవేశించాడో అప్పుడే పూర్వకల్పమందు తనద్వారా నిశ్చితమైన నామరూపములచే వ్యవస్థితమైన లోకాల్ని సృష్టించడం ఆరంభించాడు. అన్నిటికంటే తన ఛాయనుండి తామిస్ర, అంధతామిస్ర, తమ, మోహ, మహామోహ రూపమైన పంచాత్మకమగు అజ్ఞానాన్ని సృష్టించాడు. బ్రహ్మకు ఆ తమోమయదేహం రుచించక దాన్ని వదలివేశాడు. దానినుండి ఆకలి దప్పులు ఉత్పన్నమయాయి. బ్రహ్మచే విసువబడిన రాత్రిరూపమైన ఆ శరీరాన్ని దానివల్ల ఉత్పన్నమైన యక్ష రాక్షసులు గ్రహించారు. వారు ఆకలిదప్పులు కలవారై బ్రహ్మవైపు తిరిగి వీనిని తిని వెయ్యండి.

తతోహసన్ స భగవానసురైర్నిరపత్రపైః,
అన్వీయమాన స్తరసా క్రుద్ధోభీతః పరాపతత్.
స ఉపవ్రజ్య వరదం ప్రపన్నార్తిహరం హరిం,
అనుగ్రహాయ భక్తానామనురూపాత్మదర్శనం.
పాహి మాం పరమాత్మంస్తే ప్రేషణేనాసృజం ప్రజాః,
తా ఇమా యభితుం పాపా ఉపక్రామంతి మాం ప్రభో.
త్వమేకః కిల లోకానాం క్లిష్టానాం క్లేశనాశనః,
త్వమేవ క్లేశదస్తేషామనాసన్న పదాం తవ.
సోఽవధార్యాస్య కార్పణ్యం వివిక్తాధ్యాత్మదర్శనః,
విముంచాత్మతనుం ఘోరామిత్యుక్తో విముమోచ హ.
తాం క్వణచ్చరణాంభోజాం మదవిహ్వల లోచనాం,
కాంచీకలాపవిలసద్దుకూలచ్ఛన్న రోధసమ్,
అన్యోన్యశ్లేషణోత్తుంగ నిరంతరపయోధరాం,
సునాసాం సుద్విజాం స్నిగ్ధహాసలీలావలోకనామ్,
గూహంతీం వ్రీడయాత్మానం నీలాలకవరూధినీం,
ఉపలభ్యాసురా ధర్మతాదృశీం ముముహు స్స్త్రియం.

వీరిని రక్షించవద్దని అరుస్తూంటే బ్రహ్మ భయం చెంది మీరు నా సంతానం, నన్ను రక్షించండి అని పలుకుతూంటే భక్షించమన్నవారు యక్షులైనారు రక్షించమన్నవారు రాక్షసులైనారు.

తిరిగి బ్రహ్మ సాత్విక ప్రభవల్లో ప్రకాశిస్తూ ముఖ్య దేవతలను సృజించాడు. ఆయనా సమయంలో త్యజించిన దినరూపమైన శరీరాన్ని దేవతలు గ్రహించారు. అటుతరువాత బ్రహ్మతన జఘన దేశంనుండి కామాసక్తులయిన అసురులను సృష్టించడంతో వారు కామాసక్తులై మైథునేచ్ఛతో బ్రహ్మపైకి వెళ్లారు. అదిచూచి బ్రహ్మనవ్వి సిగ్గులేకుండా తనవెనుక రావడంచూచి భయభీతుడై క్రోధంతో పరువెత్తి భక్తరక్షకుడైన శ్రీహరిని చేరి పరమాత్మా! మీ ఆజ్ఞా బద్ధుడనై నేను సృష్టి ఆరంభిస్తే వీరు కామాసక్తులై నన్నే ఇబ్బంది పెడుతున్నారు. నా దుఃఖం పోగొట్టడానికి నీవే సమర్థుడవు గనుక రక్షించమని ప్రార్థించాడు.

అహో రూపమహోధైర్యమహో అప్యానవం వయః,
మధ్యే కామయమానానామకామేవ విసర్పతి.
వితర్కయింతో బహుధా తాం సంధ్యాం ప్రమదాకృతిం,
అభిసంభావ్య విస్రంభాత్పర్యపృచ్ఛన్ కుమేధసః,
కాసి కస్యాపి సుశ్రోణి కోవార్థస్తేఽత్రభామిని,
రూపద్రవిణపణ్యేన దుర్భగాన్నో విబాధసే.
యావా కా వా త్వమబలే దిష్ట్యా సందర్శనం తవ,
ఉత్సునోషీక్ష మాణానాం కందుకక్రీడయా మనః.
నైకత్రతే జయతి శాలిని పాదపద్మం ఘ్నంత్యాముహుః కరతలేన పతత్పతంగం,
మధ్యం విషీదతి బృహత్ స్తనభార భీతం క్రాంతా చ దృష్టిరమలిస్సుశిఖాసమూహః.
ఇతి సాయంతనీం సంధ్యా మసురాః ప్రమదాయతీమ్,
ప్రలోభయంతీం జగృహుస్మత్వా మూఢధియః స్త్రియమ్.
ప్రహస్య భావగంభీరం జిఘ్రన్త్యాత్మానమాత్మనా,
కాంత్యా ససర్జ భగవాన్ గంధర్వాప్సరసాం గణాన్.

బ్రహ్మప్రార్థన విని నారాయణుడు చతుర్ముఖా! కామాసక్త మైన యీ దేహాన్ని వదలకుంటే స్వాయంభువు ఆశరీరం వదలగా సుందరీ స్వరూపంలో సంధ్యాదేవి ఆవిర్భవించింది. కాళ్ల గజ్జెలు ఘల్లు ఘల్లు మంటూ సింహంతో సమానమైన నడుము కలిగి సర్వాంగ సుందర మైన సంధ్యాదేవి అసురులపై దృష్టిని ప్రసరింప జేసిన మాత్రాన అసురులామె సౌందర్యానికి వ్యామోహితులై ఆమెను గురించి తర్క వితర్కాలు చేసుకుంటూ ఆమెను సమీపించి,

భామినీ! నీ వెవతెవు? ఎవని కుమార్తెవు? ఎందులకిలా వచ్చావు. సౌందర్యాన్ని చూపి మమ్ముల నిర్లిందుకు బాధిస్తున్నావు? నీ వెవతవైతే నేమి? కందుకక్రీడవలె నీ క్రీకంటి ప్రసారముచే మమ్ముల నీచేతిలోనికి తీసుకుంటున్నావు. ఇప్పుడు నీ అడుగులు ఒకచోట నిలుచుటలేదు. నీ కటి ప్రదేశం స్తనభారంతో శ్రమచెందుతూన్నట్లుంది. నిర్మలమైన నీ దృష్టి కూడా అలసటనే తెలుపుతూన్నది. ఆహా నీ కేశపాశం యెంతసుంద రంగా ఉందీ. అని దేహాలుమరచి ప్రలాపిస్తూన్నారు. ఆ సంధ్యాదేవి వారందరినీ వ్యామోహ పరవశులుగా చేసింది.

విససర్జ తనుం తాం వై జ్యోత్స్నాం కాంతిమతీం ప్రియామ్,
త ఏవ చాదదుః ప్రీత్యా విశ్వావసుపురోగమాః.
సృష్ట్వా భూతపిశాచాంశ్చ భగవానాత్మతంద్రిణా,
దిగ్వాససో ముక్తకేశాన్వీక్ష్య చామీలయద్దృశౌ.
జగృహుస్తద్విసృష్టాం తాం జృంభణాఖ్యాం తనుం ప్రభోః,
నిద్రామింద్రియవిక్లేదో యయా భూతేషు దృశ్యతే.
యేనోచ్ఛిష్టాన్ ధర్షయంతి తామున్మాదం ప్రచక్షతే,
ఊర్జస్వంతం మన్యమాన ఆత్మానం భగవానజః,
సాధ్యాన్ గణాన్ పితృగణాన్ పరోక్షేణాసృజత్ప్రభుః,
త ఆత్మసర్గం తం కాయం పితరః ప్రతిపేదిరే.
సాధ్యేభ్యశ్చ పితృభ్యశ్చ కవయో యద్వితన్వతే,
సిద్ధ విద్యాధరాంశ్చైవ తిరోధానేన సోఽసృజత్.

అనంతరం బ్రహ్మ గంభీరభావంతో చిరునవ్వు నవ్వుతూ తన కాంతిమయమైన మూర్తిచే గంధర్వులను, అప్సరసలను, సృష్టించి ఆ చంద్రికారూపమైన శరీరాన్ని వదలడంతో ఆశరీరాన్ని గంధర్వులానందంతో గ్రహించారు.

అటుతరువాత బ్రహ్మ తంద్రనుండి భూతపిశాచాలను సృష్టించాడు. వారు దిగంబరులై జుట్టు విరయబోసుకుని భీభత్సంగా కనుపించడంతో ఆయన కళ్లుమూసుకున్నాడు. వెంటనే జృంభ (ఆవలింత) నామ్యమైన ఆశరీరాన్ని భూతపిశాచాలు స్వీకరించాయి. దీనినే నిద్ర అని కూడా అంటారు. దీనివలనే జీవుల ఇంద్రియములందు శైథిల్యత కలుగుతుంది. ఉచ్ఛిష్టముఖాలతో నిదురించే వారియందు యీ భూత పిశాచాలు ఆవహిస్తాయి. అదే ఉన్మాదంగా పరిణమిస్తుంది. ఇదే స్త్రీల యందు యోషాపస్మారము (హిస్టీరియా) అని చెప్పబడుతుంది. (శౌచ విధులు) సక్రమంగా అనుసరించక పోవుట నిరంతరం పరుండియే యుండుట సహనశక్తి లేకపోవుట నలుగురుతో కలసిమెలసి చరించలేక పోవుట చంచలత్వము, అనుమానము, భయము, క్రోధము లోభము, పెద్దలయందు అవిశ్వాసము-ఇవన్నీ పైశాచిక లక్షణాలుగా పరిగణింపబడతాయి.

తేభ్యోఽదదాత్తమాత్మానమంతర్ధానాఖ్యమద్భుతమ్,
సకిన్నరాన్కింపురుషాన్ప్రభుః ప్రత్యాత్మనా సృజత్.
మానయన్నాత్మనాత్మానమాత్మాభాసం విలోకయన్,
తే తు తం జగృహూరూపం త్యక్తం యత్పరమేష్ఠినా.
మిథునీభూయ గాయంతస్తమేవోషసి కర్మభిః,
దేహేన వై భోగవతా శయానో బహుచింతయా,
సర్గేఽనుపచితే క్రోధాదుత్ససర్జ హ తద్వపుః,
యే ఽహీయంతాముతః కేశా అహయస్తేంగ జజ్ఞిరే.
సర్పాః ప్రసర్పతః క్రూరా నాగా భోగోరుకంధరాః,
సఆత్మానం మన్యమానః కృతకృత్యమివాత్మభూః

బ్రహ్మ నేను తేజోమయుడను గద్దుననుగాక యని భావించడంతో పితృసాధ్యగణాలు ఉత్పన్నమైనాయి. పితరులూ సాధ్యులు కూడా తమ ఉత్పత్తిస్థానమైన ఆ అదృశ్య దేహాన్నే స్వీకరించారు. దీనినే లక్ష్యంలో ఉంచుకొని పండితులు క్రమంగా సాధ్యులకు కవ్యములూ, పితరులకు పిండములూ సమర్పిస్తూంటారు.

చతుర్ముఖుడు తనతిరోధానశక్తి చేసిద్ధవిద్యాధరగణాలను సృష్టించి అంతర్ధాన రూపమైన ఆశరీరం వారికి ప్రసాదించాడు. ఒకప్పుడు పితామహుడు సౌందర్యంతో కూడిన తన ప్రతిబింబంనుండి కిన్నర విద్యాధరులను సృష్టించి వారికా ప్రతిబింబ శరీరమే యిచ్చాడు. వీరు ఉషఃకాలంలో తమ భార్యలతో కూడా బ్రహ్మ యొక్క గుణకర్మాదులను గానంచేస్తూ ఉంటారు. సృష్టివృద్ధి చెందలేదని స్వాయంభువు ఒకనాడు చేతులూ కాళ్లూ జాపుకుని వెల్లగిలా పరున్నాడు. క్రోధవశుడై భోగమయ శరీరాన్ని విసర్జించడంతో కేశాలనుండి సర్పజాతి ఉద్భవించింది. కాలుచేతులు ముడుచుకొని నడువడంవల్ల విషముతో క్రూరస్వభావగలు గల క్రోధపరిధానములైన సర్పాలు ఆవిర్భవించాయి.

తానుకృత కృత్యుడైనట్లు భావించి చతుర్ముఖుడు మనసువల్ల మనువులను సృష్టించాడు. వీరంతా ప్రజా వృద్ధిని కలిగించేవారే. వారికోరకు బ్రహ్మ తన పురుషాకారమైన శరీరాన్ని త్యజిస్తే వారు

తదా మనూన్ ససర్జాంతే ।మనసా లోకభావనాన్,
తేభ్యస్సోఽప్యసృజత్స్వీయం పురం పురుషమాత్మనః.
తాన్ దృష్ట్వా యే పురా సృష్టాః ప్రశశంసుః ప్రజాపతిం,
అహో బత జగత్స్రష్టుస్సుకృతం బతతే కృతం.
ప్రతిష్ఠితాః క్రియా యస్మిన్ సాకమన్నమదామహే,
తపసా విద్యయా యుక్తో యోగేన సుసమాధినా.
ఋషీనృషిర్హృషీకేశస్ససర్జాభిమతః ప్రజాః,
తేభ్యశ్చైకైకశస్స్వస్య దేహస్యాంశమదాదజః.
యత్తత్సమాధియోగర్ధితపోవిద్యావిరక్తిమత్.

ఆశరీరాన్ని గ్రహించారు. మనస్సులనుచూసి వారికంటె ముందుజనించిన దేవతలు చతుర్ముఖుని స్తుతించారు. పితామహా! మీ యీ మనురూపమైన సృష్టిచాలా అందంగా ఉంది. వీరియందు అగ్నిహోత్రాది కర్మలు ప్రతిష్ఠితములై ఉన్నాయి. వీరి సహాయంవల్ల మేముకూడా హవిర్భాగాలు గ్రహిస్తాము.'

అటుతరువాత బ్రహ్మ ఇంద్రియజయమూ, తపస్సూ, విద్యా, యోగమూ, సమాధీ మొదలగు శ్రేష్ఠలక్షణాలతో కూడిన ఋషులను సృష్టించి వారి కందరకూ, సమాధీ, ఐశ్వర్యమూ, యోగమూ, తపస్సూ, విద్యా, వైరాగ్యాలతో కూడిన ఉత్తమ శరీరాలు, ప్రసాదించాడు.

## 20 అధ్యాయం

స్వాయంభువస్య చమనోర్వంశః పరమసమ్మతః,
కథ్యతాంభగవన్ యత్ర మైథునేనైధిరేప్రజాః,
ప్రియవ్రతోత్తాన పాదౌ సుతౌ స్వాయంభువస్యవై,
యథాధర్మం జుగుపతుస్సప్తద్వీపవతీం మహీమ్.

మైత్రేయా! స్వాయంభువ మనువుయొక్క వంశం అత్యాదరణీయమైనది. ఆ వంశం మైథునధర్మప్రధానంగానే వృద్ధిచెందింది. స్వాయంభువ మనువు పుత్రులు, ప్రియవ్రత, ఉత్తానపాదులు. వీరుసప్త

తస్యవై దుహితా బ్రహ్మన్ దేవహూతిరితి శ్రుతా,
పత్నీప్రజాపతేరుక్తా కర్దమస్య త్వయానఘ,
తస్యాం సవై మహాయోగీ యుక్తాయాం యోగలక్షణైః,
ససర్జ కతిధా వీర్యం తన్మేశుశ్రూష వేవద.
రుచిర్యోభగవాన్ బ్రహ్మన్ దక్షోవా బ్రహ్మణస్సుతః,
యథా ససర్జ భూతాని లబ్ధ్వా భార్యాం చ మానవీమ్.
ప్రజాస్సృజేతి భగవాన్ కర్దమో బ్రహ్మణోదితః,
సరస్వత్యాం తపస్తేపే సహస్రాణాం సమాదశ.
తతస్సమాధియుక్తేన క్రియాయోగేన కర్దమః,
సం ప్రపేదే హరిం భక్త్యా ప్రసన్నవరదాయినమ్.
తావత్ప్రసన్నోభగవాన్ పుష్కరాక్షః కృతే యుగే,
దర్శయామాస తం క్షత్తశ్శాబ్దం బ్రహ్మదధద్వపుః.
సతం విరజమర్కాభం సితపద్మోత్పల స్రజమ్,
స్నిగ్ధనీలాలకవ్రాతవక్త్రాబ్జం విరజాంబరమ్.

ద్వీప వసుమతిని ఏకచ్ఛత్రాధిపత్యం క్రింద పరిపాలించారు. ఉత్తానపాదుడు తనకుమార్తె దేవహూతిని కర్దమునకిచ్చి వివాహంచేశాడు. దేవహూతి యోగశాస్త్ర సాంప్రదాయం అనుభవపూర్వకంగా గుర్తించింది. కర్దముడు మహాయోగి. వీరిద్దరివల్లనూ యెంతమంది సంతానం జనించారు ? ఇదేవిధంగా బ్రహ్మపుత్రులైన దక్షుడూ, రుచీ, కూడా మనువు యొక్క కుమార్తెలనే వివాహమాడారు. వారిద్దరికీ కలిగిన సంతానసంఖ్యను సవిస్తరంగా వినిపించండి – అనికోరిన విదురునికి మైత్రేయుడు చెపుతున్నాడు.

ప్రజావృద్ధిని కలిగించమన్న బ్రహ్మ ఆజ్ఞపై కర్దముడు సరస్వతీ నదీతీరంలో యేకాగ్రచిత్తంతో పదివేల సంవత్సరాలు శ్రీహరిని గూర్చి తపమాచరించాడు. సత్యయుగాదియందు శ్రీహరి కర్దమునకు దర్శనమిచ్చాడు. సూర్యసమ తేజంతో శ్వేతకమలమాలతో, నీలవర్ణమైన అలకావళి ముఖకమలంపై ప్రకాశిస్తూండగా నిర్మలమైన వస్త్రాన్ని ధరించి సువర్ణమయమైన రత్నకిరీటంతో కమలపాణియై లక్ష్మీవక్షస్థలాలయుడై మకరకుండలధారి మహానుభావుడు గరుడవాహనారూఢుడై కర్దము

కిరీటినం కుండలినం శంఖచక్రగదాధరమ్,
శ్వేతోత్పలక్రీడనకం మనస్స్పర్శస్మితేక్షణమ్.
విన్యస్య చరణాంభోజమంసదేశే గరుత్మతః,
దృష్ట్వాఖేఽవస్థితం వక్షశ్శ్రియం కౌస్తుభకంధరమ్.
జాతహర్షోపతన్మూర్ధ్నా క్షితౌ లబ్ధమనోరథః,
గీర్భిస్త్వభ్యగృణా త్ప్రీతిస్వభావాత్మకృతాంజలిః.
జుష్టం బతాద్యాఖిల సత్త్వరాశే స్సాం సిధ్య మక్ష్ణో స్తవదర్శనాన్నః,
యద్దర్శనం జన్మభిరీడ్య సద్భిరాసాది తైర్యోగినో రూఢయోగాః.
యే మాయయా మోహితచేతసస్త్వ త్పాదారవిందం భవసింధుపోతం,
ఉపాసతే కామలవాయ తేషాం రాసీశకామాన్నిరయేఽపి యేస్యుః.
తథాపి చాహం పరివోఢుకామ స్సమానశీలాం గృహమేధధేనుం,
ఉపేయివాన్మూల మశేషమూలం దురాశయః కామదుఘాంఘ్రిపస్య,
ప్రజాపతేస్తే వచసాధీశ తంత్ర్యాలోకః కిలాయుం కామహతోఽనుబద్ధః,
అహం చ లోకానుగతో వహామి బలిం చశుక్లాని మిషాయ తుభ్యమ్.

నకు దర్శనమిచ్చాడు. ఆ మూర్తిని చూచిన మాత్రాన గద్గద కంఠుడై ఆనందబాష్పములురాల నారాయణుని ఇట్లు స్తుతించాడు కర్దమ ప్రజాపతి.

పరమేశ్వరా! సత్యాధారా! అనేకజన్మలలో నిన్ను సేవించి పరమయోగులు తుదకు నీదర్శనం వాంఛిస్తారు. దర్శనయోగ్యమైన నిన్నే నేడు నేను దర్శించగలిగాను. నాకు నేత్రములున్నందుకు ఫలం కలిగింది. నీ దర్శనం సంసార సముద్రతారకమైనది. మాయామోహితుడైన వాడు క్షణిక సుఖాలిచ్చే విషయ వాంఛలతో కాలం గడిపి తుదకు నరకం పాలౌతాడు. నీచరణాలాశ్రయించిన వాడు విషయసుఖాలనుభవించి కూడా మోక్షం పొందగలుగుతాడు. నా హృదయం కామంచేత కలుషితమైంది. నాకు అనురూపమైన కళత్రం లభించాలని నిన్ను గురించి తపస్సుచేశాను. సంసారమనే సాగరంలో ప్రయాణించే వానికి భార్య చుక్కాని వంటిది. అదిసరిగా లేకపోతే మార్గం తప్పుతుంది. అందువల్ల వళశానుభవమేగాక యీ లోకంకూడా నరకమే అవుతుంది. మీరు సర్వలోకాలకూ అధిపతులు. ఈలోకాలన్నీ మీ వేదవాణిచే

లోకాంశ్చ లోకానుగతాన్పశూంశ్చ హిత్వా(శ్రితాస్తే చరణాతపత్రమ్,
పరస్పరం త్వద్గుణవాదశీధుపీయూష నిర్యాతితదేహ ధర్మాః.
నైవాయురేషా మజరభ్రమిస్త్రిశతయోదశారం త్రిశతం షష్టిపర్వ,
షణ్ణేమ్యనంత చ్ఛదియత్త్రినాభి కరాళస్రోతో జగదాచ్ఛిద్య ధావత్.
ఏక స్స్వయం యోజగతస్సిసృక్షయా ద్వితీయయాత్మన్యధియోగమాయయా,
సృజస్యదః పాసి పునర్గ్రసిష్యసే యథోర్ణనాభిర్భగవాన్ స్వశక్తిభిః.
నై తద్బతాధీశపదం తవేప్సితం యన్మాయయా నస్తనుషే భూతసూక్ష్మమ్,
అనుగ్రహాయాస్త్వపి యర్హి మాయయా లసత్తులస్యా భగవాన్విలక్షితః.
తం త్వానుభూత్యోపరతక్రియార్థం స్వమాయయా వర్తితలోకతంత్రమ్,
నమామ్యభీక్ష్ణం నమనీయపాదసరోజమల్పీయసి కామవర్షమ్.
ఇత్యవ్యళీకం ప్రణుతోఽబ్జనాభ స్తమాబభాషే వచసామృతేన,
సువల్గుపృష్ఠోపరి రోచమానః ప్రేమస్మితోదీక్షణవిభ్రమద్భ్రూః.
విదిత్వా తవ చైత్యంమే పురైవ సమయోజితమ్,
యదర్థమాత్మనియమై స్త్వయైవాహం సమర్చితః.

బంధింప బడ్డాయి. నేను ధర్మమూలమైన వేదాన్ని అనుసరించే మిమ్మ్ము లను సేవిస్తున్నాను. నీ భక్తులు విషయాసక్తులై కర్మజడులైన నావంటి పశువులను లెక్కచేయక నీ చరణాలనే ఆశ్రయిస్తున్నారు. వారు పరస్పరం నీ గుణగానం చేస్తూ, గానసుధాపానంవల్ల దేహధర్మాలైన క్షుత్పిపాసలను శాంతింప జేసుకుంటున్నారు. ఈ కాలచక్రం చాలా బలమైన బ్రహ్మకాడి. అధికమాసములతో కూడిన పదమూడుమాసాలూ ఆకులు. షడృతువులూ నేమి. అనంతమైన క్షణఫలాదులే యీ చక్రం యందు పత్రఛ్ఛారలు. మూడువందల అరవైరోజులే యీ చక్రంయొక్క కలియక. మూడుచాతుర్మాస్యాలే శీత వర్ష గ్రీష్మ ఋతువులనే యీ చక్రానికాధారభూతమైన నాభి, అతివేగంతో తిరిగే యీ సంవత్సర రూపమైన కాలచక్రం చరాచరజగత్తు యొక్క ఆయుర్దాయాన్ని క్షీణింపజేస్తుంది. కాని భక్తుల ఆయువును మాత్రం తగ్గించ లేదు. సాలిపురుగు తననుండి దారం ఉత్పత్తిచేసి దానితో జాలం అల్లి దాని యందే క్రీడించి, తిరిగి తనలో లయంచేసుకున్నట్లే నీవుకూడా ఒక్కడవై యీ చరాచర ప్రపంచాన్ని, నీయందే సృష్టించి నీలోనే లయం

న వై జాతుమృషైవస్యాత్ప్రజాధ్యక్షమదర్హణమ్,
భవద్విధేష్వతితరాం మయి సంగృభితాత్మనామ్.
ప్రజాపతి సుతస్సమ్రాణ్మనుర్విఖ్యాతమంగళః,
బ్రహ్మావర్తం యోఽధివసన్ శాస్తి సప్తార్ణవాం మహీమ్,
సచేహ విప్రరాజర్షిర్మహిష్యా శతరూపయా.
ఆయాస్యతి దిదృక్షుస్త్వాం పరశ్వోధర్మకోవిదః.
ఆత్మజామసితాపాంగీం వయశ్శీలగుణాన్వితాం,
మృగయంతీం పతిం దాస్యత్యనురూపాయతే ప్రభో.
సమాహితం తే హృదయం యత్రేమాన్పరివత్సరాన్,
సా త్వాంబ్రహ్మన్నృపవధూః కామమాశు భజిష్యతి,
యాత ఆత్మభృతంవీర్యం నవధా ప్రసవిష్యతి,
వీర్యే త్వదీయఋషయ ఆధాస్యంత్యంజసాత్మనః,
త్వం చ సమ్యగనుష్ఠాయ నిదేశం మఉశత్తమః.
మయి తీర్థీకృతాశేషక్రియార్థో మాం ప్రపత్స్యసే,

చేసుకుంటావు. మాయాపరిచ్ఛన్నుడవై సగుణమూర్తిగా గోచరిస్తున్నావు. మనస్సునకూ, వాక్కునకూ అందనివాడవైనా భక్తుల ననుగ్రహించుటకై సగుణరూపాన్ని ధరిస్తూంటావు. నీవు నిష్క్రియుడవై కూడా సృష్టికర్మంకొరకై క్రియాచరణకలవానివలె గోచరిస్తూంటావు. అట్టి నీ చరణకమలాలకు నమస్కరిస్తున్నాను. అని కర్దముడు స్తుతించడంతో శ్రీహరి, అనుగ్రహదృష్టిని ప్రసరింపజేస్తూ పలుకుతున్నాడు.

కర్దమా! నీ వెందులకై నన్నుగురించి తపమాచరించావో అట్టి నీహృదయం నాకు తెలుసు. నన్నుగురించి చేసిన తపస్సు వృథాపోదు. అధికమైన ఫలాన్నిస్తుంది. సుప్రసిద్ధుడైన స్వాయంభువ మనువు బ్రహ్మావర్తంలో సప్తద్వీపయుతమైన భూమండలాన్ని పాలిస్తున్నాడు. ధర్మస్వరూపుడైన స్వాయంభువ మనువుకు రూప, యౌవన, గుణ, శీల సంపదగల దేవహూతియను కుమార్తె కలదు. ఆ కన్యకు వివాహ యోగ్యమైన వయస్సు వచ్చింది. స్వాయంభువు, శతరూపలో రెండు రోజులలో నీదగ్గరకువచ్చి ఆ త్రైలోక్య సుందరియైన దేవహూతిని నీకిచ్చి వివాహం చేస్తాడు. నీవింతకాలాన్నుండి యెట్టి కన్యకావాలని

కృత్వా దయాం చ జీవేషుదత్వా చాభయమాత్మవాన్,
మయ్యాత్మానం సహ జగద్ద్రక్ష్యస్యాత్మని చాపిమాం,
అహం చ స్వాం శకలయా త్వద్వీర్యేణ మహామునే.
తవ క్షేత్రే దేవహూత్యాం ప్రణేష్యే తత్త్వసంహితాం,
ఏవం తమనుభాష్యాథ భగవాన్ ప్రత్యగక్షజః.
జగామ బిందుసరసస్సరస్వత్యాపరిశ్రితాత్.
నిరీక్షతస్తస్య యయావశేషసిద్ధేశ్వరాభిష్టుతసిద్ధమార్గః,
ఆకర్ణయన్పత్రరథేంద్ర పక్షైరుచ్చారితం స్తోమముదీర్ణసామ.
అథ సంప్రస్థితే శుక్లే కర్దమో భగవానృషిః,
ఆస్తేస్మ బిందుసరసి తం కాలం ప్రతిపాలయన్,
మనుస్స్యందనమాస్థాయ శాతకౌంభపరిచ్ఛదం,
ఆరోప్య స్వాం దుహితరం సభార్యః పర్యటన్మహీం.
తస్మిన్ సుధన్వన్నహని భగవాన్ యత్సమాదిశత్,
ఉపాయాదాశ్రమపదం మునేశ్శాంతవ్రతస్య తు.
యస్మిన్ భగవతో నేత్రాన్న్యపతన్నశ్రుబిందవః.
కృపయా సంపరీతస్య ప్రపన్నేర్పితయా భృశమ్.

తపస్సుచేశావో అట్టికన్యయే దేవహూతి. దేవహూతియందు నీకు తొమ్మండుగురు కన్యలావిర్భవిస్తారు. వారిని మరీచ్యాది ఋషులు వివాహమాడి వారివల్ల సంతానం కంటారు. నీవుకూడా నా ఆజ్ఞా బద్ధుడవై శుద్ధమైన చిత్తంతో సత్కర్మలాచరిస్తూ ఆ కర్మఫలాన్ని నా కర్పణచేస్తూ ఆత్మజ్ఞానివై జగత్తును నాయందూ, నన్ను నీయందూ చూస్తూ బ్రహ్మానుభూతి నందకలుగుతావు. నీ యొక్క వీర్యంద్వారా నేను దేవహూతి గర్భంనుండి కళావతారంగా అవతరించి సాంఖ్య శాస్త్రాన్ని వ్యాఖ్యచేస్తాను — అని కర్దమునకు వరాలు ప్రసాదించి సిద్ధ పురుష సేవితమైన వైకుంఠ మార్గాన్నను సరించి శ్రీహరి సరస్వతీ నదిచే ఆవృతమైన బిందు సరస్సునుండి అంతర్ధానమైనాడు.

శ్రీహరి అంతర్ధానమైనతోడనే కర్దమ ప్రజాపతి స్వాయం భువుని రాకను నిరీక్షిస్తూ తన ఆశ్రమంలోనే ఉండిపోయాడు. భక్తుడైన కర్దమునియందు కల కరుణచే ద్రవించిన హృదయంకల శ్రీహరికనుల

తద్వై బిందుసరో నామ సరస్వత్యా పరిప్లుతమ్,
పుణ్యం శివామృతజలం మహర్షిగణసేవితమ్.
పుణ్యద్రుమలతాజాలైః కూజత్పుణ్యమృగద్విజైః,
సర్వర్తుఫలపుష్పాఢ్యం వనరాజిశ్రియాన్వితమ్.
మత్తద్విజగణైర్ఘుష్టం మత్తభ్రమరవిభ్రమం,
మత్తబర్హినటాటోపమాహ్వయన్మత్తకోకిలమ్.
కదంబచంపకాశోక కరంజబకులాసనైః,
కుందమందారకుటజైశ్చూతపోతైరలంకృతమ్.
కారండవైః ప్లవైర్హంసైః కురరైర్జలకుక్కుటైః,
సారసైశ్చక్రవాకైశ్చ చకోరై ర్వల్గు కూజితమ్.
తథైవ హరిణైః క్రోడైశ్శ్వావిద్గవయకుంజరైః,
గోపుచ్ఛైర్హ రిభిర్మర్కైర్నకులైర్నాభిభిర్వృతం.
ప్రవిష్య తత్తీర్థవరమాదిరాజస్సహాత్మజః,
దదర్శ మునిమాసీనం తస్మిన్ హుతహుతాశనం.
విద్యోతమానం వపుషా తపస్యుగ్రయుజా చిరం,
నాతిక్షామం భగవతః స్నిగ్ధాపాంగావలోకనాత్,

నుండి రాలిన బాష్ప బిందువులచే పవిత్రమైన కారణంచేతనే దానికి బిందుసరమని పేరువచ్చింది. దానియందున్న జలం పరమ పవిత్రమైన దగుటచే అనేకులైన ఋషులు ఆసరోవరతీరంలో ఆశ్రమాలు కల్పించుకొని తపస్సు చేసుకుంటున్నారు. ఆ బిందుసరోవరం నానా వృక్షలతాదులచే ఆవృతమైఉంది. అనేకత్రగతులకు చెందిన పక్షులూ, మృగములూ, మనోహరమైన ధ్వనులు చేస్తూన్నాయి. పక్షులు కిలకిలరావాలతో పల్లీలు కొడుతున్నాయి. నెమళ్లు పురులువిప్పి ఆడుతున్నాయి. కదంబ, చంపక, అశోక, కుంద, మందార, కుటజ, ఆమ్రాది వృక్షాలు పుష్పించి సువాసనలు వెదజల్లుతున్నాయి. హంస, కారండవ, చక్రవాక, బక జలకుక్కుటాదులు కలస్వరం చేస్తున్నాయి. హరిణ, కుంజర, గో, వృషభ, సింహాది మృగ సేవితమై ఉంది.

ఆ ఆశ్రమంలో అగ్నిహోత్రాన్ని ఉపాసించి కూర్చున్నాడు కర్దముడు. దేవహూతిని తీసుకుని శతరూపా సమేతంగా వచ్చాడు

తద్వ్యాహృతా మృతకలాపీయూషశ్రవణేన చ,
ప్రాంశు పద్మపలాశాక్షం జటిలం చీరవాససం.
ఉపసంసృత్య మలినం యథార్హణమసంస్కృతం.
అథోటజముపాయాతం నృదేవం ప్రణతం పురః,
సపర్యయా ప్రత్యగృహ్ణాత్ప్రతినంద్యానురూపయా.
గృహీతార్హణమాసీనం సంయతం ప్రీణయన్ మునిః,
స్మరన్ భగవదాదేశమిత్యాహ శ్లక్ష్ణయా గిరా.
నూనం చంక్రమణం దేవసతాం సంరక్షణాయ తే,
వధాయ చాసతాం యస్త్వం హరేశ్శక్తిః పాలినీ.
యోఽర్కేంద్వగ్నీంద్రవాయూనాం యమధర్మ ప్రచేత
రూపాణి స్థాన ఆధత్సే తస్మై శుక్లాయతేనమః.
నయదా రథమాస్థాయ జైత్రం మణిగణార్పితం,
విస్ఫూర్జచ్చండకోదండతరవేణ త్రాసయన్నఘాన్,
స్వసైన్యచరణక్షుణ్ణం వేపయన్మండలం భువః,
వికర్షన్మహతీం సేనాం పర్యటస్యంశుమానివ.
తదైవ సేతవస్సర్వే వర్ణాశ్రమనిబంధనాః,

స్వాయంభువమనువు. కర్దముడు చిరకాలం తపస్సు చేసినా శ్రీహరి సందర్శనంవల్ల శరీరం కృశించలేదు. దేహం తేజోమయమ్మై ఉంది. నేత్రములు కమలదళములవలె విశాలములై ఉన్నాయి. జటామకుట ధారియైన కర్దముడు బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. స్వాయంభువమనువు కర్దముని సమీపించి నమస్కరించగా గ్రహించి ఋషి స్వాయంభువమనువుకు స్వాగతసత్కారాలు చేసి ఉత్తమమైన ఆసనం యిచ్చాడు.

కర్దమునిచే పూజితుడైన మనువు ఆనందించి సుఖాసీనుడైన తరువాత, కర్దము డాయనను సమీపించి దేవా! మీరు విష్ణువుయొక్క పరిపాలనా శక్తిస్వరూపులు. మీరు సజ్జన సంరక్షణకోరకే చరిస్తూంటారు. మీరు సాక్షాత్తూ విష్ణుస్వరూపులు. భిన్నభిన్న కార్యాలకోసం ఇంద్రాగ్ని, యమ, వరుణ, వాయు కుబేర ఈశానాది రూపాలనూ, సూర్యచంద్రాది రూపాలనూ, ధరిస్తూంటారు. మీరు మణిఖచిత

భగవద్రచితా రాజన్ భిద్యేరన్ బత దస్యుభిః.
అధర్మశ్చ సమేధేత లోలుపైర్వ్యంకుశైర్నృభిః,
శయానే త్వయి లోకోఽయందస్యుగ్రస్తో వినంక్ష్యతి.
అథాపి పృచ్ఛేత్వాం వీర యదర్థం త్వమిహాగతః,
తేఽద్వయం నిర్వ్యళీకేన ప్రతి పద్యామహే హృదా.

మైన సువర్ణరథాన్ని అధిరోహించి ధనుర్ధారులై దుష్టుల్ని శిక్షిస్తూం టారు. సూర్యునితో సమానంగా విహరించగల సమర్థులు. మీరు సరిగా చూడకపోతే, లోకంలో వర్ణాశ్రమ వ్యవస్థ చెడిపోతుంది. జారత్వ చోరత్వాదులు వృద్ధిచెందుతాయి. సత్పురుషుల్ని దుర్మార్గులు హింసిస్తారు. గనుకనే దుర్మార్గాన్ని నశింపచెయ్యడానికి ఇలా తిరుగు తూంటారు. ఐతే మీరిప్పుడు ఇక్కడకు రావడానికి ప్రత్యేక కారణం ఉండాలి. నావల్ల కాదగిన కార్యమేదైనా ఉంటే అజ్ఞాపించండి. నిష్కప టంగా మీ ఆజ్ఞను పాలిస్తాను – అన్నాడు కర్దమ ప్రజాపతి.

## 21 అధ్యాయం

ఏవమావిష్కృతాశేషగుణకర్మోదయో మునిం,
సవ్రీడఇవ తం సమ్రాడుపారతమువాచహ.
బ్రహ్మాసృజత్స్వముఖతో యుష్మానాత్మపరీప్సయా,
ఛందోమయాంస్తపోవిద్యాయోగయుక్తానలంపటాన్.
తత్త్రాణాయాసృజచ్చాస్మాన్ దోస్సహస్రాత్సహస్రపాత్,
హృదయం తస్యహి బ్రహ్మక్షత్రమంగం ప్రచక్షతే,

కర్దముడు మనువుయొక్క గుణగణాలను వర్ణిస్తూ మీ ఆజ్ఞను పాలిస్తాననడంతో స్వాయంభువు ఆనందంతో,

కర్దమా! వేదమూర్తియైన బ్రహ్మతన వేదమయ విగ్రహ రక్ష ణార్థం తపస్సా, విద్యా, యోగబలాలతో, సంపన్నులైన బ్రాహ్మణు లగు మిమ్మల్ని ముఖాన్నుండి సృష్టించాడు. తిరిగి మీ రక్షణకొరకే సహస్ర బాహువులనుండి మమ్మల్ని సృజించాడు. వేదమయుడైన

అతోహ్యన్యోన్యమాత్మానం బ్రహ్మక్షత్రం చ రక్షతః,
రక్షతి స్మావ్యయో దేవ స్సయస్సదసదాత్మకః.
తవ సందర్శనాదేవ ఛ్ఛిన్నామే సర్వసంశయాః,
యత్స్వయం భగవాన్ ప్రీత్యాధర్మమాహ రిరక్షిషోః.
దిష్ట్యా మే భగవాన్ దృష్టో దుర్దర్శో యోఽకృతాత్మనామ్.
దిష్ట్యాపాదరజస్స్పృష్టంశీర్ష్ణామే భవతశ్శివమ్.
దిష్ట్యా త్వయానుశిష్టోఽహం కృతశ్చానుగ్రహోమహాన్,
అపావృతైఃకర్ణరంధ్రైర్జుష్టాదిష్ట్యోశతీర్గిరః.
సభవాన్ దుహితుస్స్నేహపరిక్లిష్టాత్మనో మమ,
శ్రోతుమర్హతి దీనస్య శ్రావితం కృపయా మునే.
ప్రియవ్రతోత్తానపదోస్స్వసేయందుహితా మమ,
అన్విచ్ఛతిపతిం యుక్తం వయశ్శీలగుణాదిభిః.
యదా తు భవతశ్శీలశ్రుతరూపవయోగుణాన్,
అశృణోన్నారదాదేషా త్వయ్యాసీత్కృతనిశ్చయా.

ఆయనకు హృదయం బ్రాహ్మణులు. శరీరం క్షత్రియులు. ఒకే శరీరం కావడంచేత ఒకరియొక్క రక్షణ మరొకరు చేస్తారంటే వీరిద్దరినీ వాస్తవంగా శ్రీహరియే రక్షిస్తున్నాడు. అతడు కార్యకారణరూపుడై కూడా నిర్వికారుడే. మీదర్శనం కావడంతోనే నాసంశయాలన్నీ విచ్ఛిన్నమైనాయి. మీరు నన్ను ప్రశంసిస్తూ రాజధర్మాలన్నీ ఉపదేశించారు. మీవంటి సత్పురుషుల సందర్శనం వృధాపోదు. పుణ్యవిశేషం చేతనే లభ్యమౌతుంది. అట్టి మీ దర్శనంవల్ల నేను ధన్యుడనైనాను. మీ వాణిని వినే మంగళకాలం నాకు ప్రాప్తించింది.

ఋషీశ్వరా! ఈకన్యనాకుమార్తె దేవహూతి: ప్రియవ్రత ఉత్తానపాదులకు చెల్లెలు. వయో, గుణ, శీలాదులచే తనకు యోగ్యమైన వరుని వాంఛించింది. నారదునివల్ల మీ వయోగుణ సౌందర్యాదులు విన్న నాటినుండీ మిమ్మల్నే భర్తగా వరించాలని నిశ్చయించుకుంది. నేను శ్రద్ధాభక్తులతో ఈకన్యను మీకు సమర్పిస్తున్నాను. మీరు స్వీకరించండి. ఈమె గృహస్థునకు ఉచితమైన సర్వధర్మాలూ పాటిస్తుంది. స్వతస్సిద్ధంగా కోరకుండా లభించిన భోగాలను ఆస్వాదిస్తూ చేసి

తత్ప్రతీచ్ఛ ద్విజాగ్ర్యేమాం శ్రద్ధయోపహృతాం మయా,
సర్వాత్మనానురూపాం తే గృహమేధేషు కర్మసు.
ఉద్యతస్య హి కామస్య ప్రతివాదో న శస్యతే,
అపి నిర్ముక్తసంగస్య కామరక్తస్య కిం పునః.
య ఉద్యతమనాదృత్య కీనాశమభియాచతే,
క్షీయతే తద్యశస్స్ఫీతం మానశ్చావజ్ఞయా హతః.
అహంత్వాశృణవం విద్వన్వివాహార్థం సముద్యతమ్,
అతస్త్వముపకుర్వాణః ప్రత్తాం ప్రతిగృహాణ మే.
బాఢముద్వోఢుకామోఽహమప్రత్తా చ తవాత్మజా.
ఆవయోరనురూపోఽసావాద్యో వైవాహికో విధిః.
కామస్సభూయాన్నరదేవ తేఽస్యాః పుత్ర్యాస్సమామ్నాయవిధౌ ప్రతీతః,
కఏవ తే తనయాం నాద్రియేత స్వయైవ కాంత్యా క్షిపతీమివ శ్రియం.
యాం హర్మ్యపృష్ఠే క్వణదంఘ్రిశోభాం విక్రీడతీం కందుకవిహ్వలాక్షీమ్,
విశ్వావసుర్న్యపతత్స్వాద్విమానాద్విలోక్య సమ్మోహవిమూఢచేతాః.

కాలాంతరమందు పరులను యాచిస్తే వారు నిరాదరిస్తారు. దానివల్ల గతంలో ఉన్న కీర్తి నశించి, మానభంగం కూడా కలుగుతుంది. మీరు వివాహం చేసుకుంటారని నేను విన్నాను. మీ బ్రహ్మచర్యం కాలపరిమితమైనది. మీరు నైష్ఠికబ్రహ్మచారులు కారు. కనుక యీ కన్యను స్వీకరించండి. నేను మీకు సమర్పిస్తున్నాను.

కర్దముడు స్వాయంభువమనువు యొక్క వాక్యాలువిని చెపుతున్నాడు. మీరు పలికినది సత్యమే. నేను వివాహం చేసుకోవాలనే వాంఛతోనే ఉన్నాను. ఇంతవరకూ మీ కన్యయెవరికీ వాగ్దత్తం కాలేదు. అందువల్ల మాకిరువురకూ బ్రాహ్మవివాహం కావడం ఉచితంగా ఉంటుంది. రాజా! వేదోక్త వివాహంలో ప్రసిద్ధమైన "గృభ్ణామితే సౌభాగ్యంగల మంత్రములందు చెప్పబడిన కామప్రవృత్తి, సంతానోత్పాదకత్వమైన కోర్కె నెరవేరుటకే కదా వివాహం. అట్టి కోర్కె యీ కన్యతో వివాహం కావడంలో నెరవేరుతుంది. తన అవయవకాంతిచే ఆభరణాలకే శోభను కలిగించే యీ కన్య నెవడు కాదనగలడు! [illegible] మీ సౌధోపరిభాగంలో కందుకక్రీడలో

తాం ప్రార్థయంతీం లలనాలలామమాసేవితశ్రీచరణైరదృష్టామ్;
వత్సాం మనోరుచ్చపదస్స్వసారం కో నానుమన్యేత బుధోఽభియాతామ్.
అతో భజిష్యే సమయేన సాధ్వీం యావత్తేజో బిభృయాదాత్మనో మే,
అతోధర్మాన్ పారమహంస్యముఖ్యాన్ శుక్లప్రోక్తాన్ బహుమన్యే విహింస్రాన్.
యతో భవద్విశ్వమిదం విచిత్రం సంస్థాస్యతే యత్ర చ వావతిష్ఠత్,
ప్రజాపతీనాం పతిరేష మహ్యం పరం ప్రమాణం భగవాననంతః.
స ఉగ్రధన్వన్నియదేవాబభాష ఆసీచ్చ తూష్ణీమరవిందనాభం,
ధియోపగృహ్ణాన్స్మితశోభితేన ముఖేన చేతో లులుభే దేవహూత్యాః.
సోఽనుజ్ఞాత్వా వ్యవసితం మహిష్యా దుహితుః స్ఫుటం,
తస్మై గుణగణాఢ్యాయ దదౌ తుల్యాం ప్రహర్షితః.
శతరూపా మహారాజ్ఞీ పారిబర్హాన్ మహాధనాన్,
దంపత్యోః పర్యదాత్ప్రీత్యా భూషావాసః పరిచ్ఛదాన్.
ప్రత్తాం దుహితరం సమ్రాట్సదృక్షాయ గతవ్యథః,
ఉపగుహ్య చ బాహుభ్యా మౌత్కంఠ్యోన్మథితాశయః.

నిమగ్నమైంది. కాళ్ళగజ్జెలూ, కరకంకణాలూ, మనోహరంగాధ్వనిస్తూంటే చంచల నేత్రాలతో బంతితో అటునిటూ లేడివలె విహరిస్తూంటే యీ కన్యనుచూసివిశ్వావసువనేగంధర్వుడువిమానంలోనే మూర్ఛపోదాడు. ఆ కన్యయే ఈ సమయంలో స్వయంగా వచ్చి ప్రార్థిస్తూంటే స్వీకరించకుండా ఉండటం ఎలాగ? సాక్షాత్తూ స్వాయంభువ మనువునకు కుమార్తె. ఉత్తానపాదునకు చెల్లెలు, రమణులలో రత్నం, లక్ష్మీచరణసేవచేయని వారికీమె దర్శనమే కాదే! అలాంటి కన్యారత్నం లభిస్తే కాదనను. స్వీకరిస్తాను. ఒకనిబంధనం మాత్రం ఉంది. దానికి మీరూ, మీకుమార్తె ఇష్టపడాలి. అది చెబుతా వినండి. సంతానం కలిగే వరకూ గృహస్థాశ్రమంలో ఉంటాను. అనంతరం సన్న్యాసాశ్రమం స్వీకరించి కారణకారణుడైన పరమాత్మను సేవించి ఆత్మసాక్షాత్కారం పొందుతాను. అది మీ కంగీకారమైతే ఈ కన్యను యీ క్షణంలోనే వివాహమాడతానని కర్దముడు శ్రీహరిని ధ్యానిస్తూ మౌనం వహించాడు.

స్వాయంభువమనువు తనకూ, కర్దమునకూ జరిగిన సంవాదం వింటూన్న శతరూపా దేవహూతుల ముఖ వైఖరి చూసి చిరునవ్వుతో

అశక్నువంస్తద్విరహం ముంచన్ బాష్పకలాం ముహుః,
ఆసించదంబ వత్సేతి నేత్రోదైర్దుహితుః శిఖాః.
ఆమంత్ర్య తం మునివరమనుజ్ఞాతస్సహానుగః
ప్రతస్థే రథమారుహ్య సభార్యః స్వపురం నృపః.
ఉభయోరృషికుల్యాయాస్సరస్వత్యాస్సురోధసోః,
ఋషీణాముపశాంతానాం పశ్యన్నాశ్రమసంపదః.
తమాయాంతమభిప్రేత్య బ్రహ్మావర్తాత్ప్రజాః పతిమ్,
గీతసంస్తుతివాదిత్రైః ప్రత్యుదీయుః ప్రహర్షితాః.
బర్హిష్మతీ నామపురీ సర్వసంపత్సమన్వితా,
న్యపతన్ యత్ర రోమాణి యజ్ఞస్యాంగం విధున్వతః.
కుశకాశాస్త ఏవాసన్ శశ్వద్ధరితవర్చసః,
ఋషయో యైః పరాభావ్య యజ్ఞఘ్నాన్ యజ్ఞమీజిరే.
కుశకాశమయం బర్హిరాస్తీర్య భగవాన్మనుః,
అయజద్యజ్ఞపురుషం లబ్ధా స్థానం యతో భువమ్.

వారు అంగీకారాన్ని సూచించినట్లు గ్రహించి విధివిధానంగా దేవహూతిని కర్దమున కిచ్చి వివాహం చేసి అమూల్య వస్త్రభూషణాదులిచ్చి గృహోపకరణ యోగ్యములైన పాత్రసామగ్రి కూడా సారెరూపంగా ఇచ్చి వెళ్ళిపోతూ కుమార్తెను దగ్గరకు తీసుకొని పుత్రీ పుత్రీ అంటూ కన్నీరు వదల్చాడు. దేవహూతి శిరము నిమిరి కుమార్తెకు చెప్ప వలసిన మాటలు చెప్పి కర్దముని ఆజ్ఞను పొంది రథాన్నధిరోహించి సరస్వతీ తీరంలో ఉన్న ఆశ్రమాలు చూస్తూ వెళ్ళిపోయాడు.

బ్రహ్మావర్త దేశంలో ఎప్పుడైతే మహారాజైన స్వాయంభువ మనువు వచ్చాడనే వార్త విన్నారో అప్పుడే ప్రజలందరూ మంగళ ధ్వనులతో యెదురుగా వచ్చి స్వాగత మిచ్చారు. వారినందరినీ ఆదరించి రాజధాని యైన బర్హిష్మతీ నగరంలో ప్రవేశించాడు. యజ్ఞవరాహమూర్తి భూమి నుద్ధరించి దేహం విదలించినప్పుడు రాలిన రోమాలే కుశకాశాదుల రూపాలలో వృద్ధి చెందాయి. యజ్ఞపురుషుని దేహం వల్ల ఆవిర్భవించాయి కనుకనే అవి పవిత్రమై రాక్షసులను తిరస్కరించి నిష్కంటకంగా కుశలంగా ఋషులు యజ్ఞాలు చేసుకొనుటకు ఉపయోగిస్తున్నాయి.

బర్హిష్మతీం నామపురీం యాం నిర్విశ్య సమావసత్,
తస్యాం ప్రవిష్టో భవనం తాపత్రయవినాశనమ్.
సభార్యస్సప్రజః కామాన్బుభుజేన్యావిరోధతః,
సంగీయమానసత్కీర్తిస్సస్త్రీకైస్సురగాయకైః,
ప్రత్యూషేష్వనుబద్ధేన హృదా శృణ్వన్హరేః కథాః.
నిష్ణాతం యోగమాయాసు మునిం స్వాయంభువం మనుం,
యథా భ్రంశయితుం భోగానశేకుర్భగవత్పరం.
అయాతయామాస్తస్యాసన్ యామాస్స్వాంతరయాపనాః.
శృణ్వతో ధ్యాయతో విష్ణోః కుర్వతో బ్రువతః కథాః.
స ఏవం స్వాంతరం నిన్యేయుగానామేకసప్తతిమ్,
వాసుదేవప్రసంగేన పరిభూతగతిత్రయః.
శారీరామానసాదివ్యా వైయాసే యే చ మానుషాః,
భౌతికాశ్చ కథం క్లేశాబాధేరన్ హరిసంశ్రయాన్.
యః పృష్టో మునిభిఃప్రాహ ధర్మాన్నానావిధాన్ శుభాన్,

ఆ దర్భలచేతనే భూమినాచ్ఛాదించి యజ్ఞం చేసిరాజ్యాన్ని స్వీకరించిన ప్రదేశం అదే గనుక దానికి బర్హిష్మతీనగరం అని పేరువచ్చింది.

తన నగరంలో తాపనాశకమైన భవనమందు ప్రవేశించి స్వాయంభువమనువు భార్యా పుత్రులతో భోగాలనుభవిస్తూ ధర్మ అర్థములకూ మోక్షానికీ భంగం కలుగకుండా చరిస్తున్నాడు. వాటి యందులోలుడు కాకుండా శ్రీహరినే మనస్సులో ధ్యానించుకుంటూ ఉన్నాడు. గంధర్వగణం స్త్రీలతో కూడా మనువుయొక్క గుణగణాలు గానంచేస్తూ ఉంది. వారి ఇచ్ఛాను సారం భోగాలను నిర్మించగలశక్తి కలిగి కూడా శ్రీహరి పరాయణులు కావడంచేత భోగములందాసక్తి కలవారుగా కావడంలేదు. మన్వంతర పరిమితమైన కాలం క్షణంకూడా వ్యర్థంకాకుండా శ్రీహరి లీలాగుణగాన శ్రవణాదులతో వ్యయమౌతూంది. సర్వమానవ కళ్యాణదాయకమైన మనుస్మృతి రచించి ధర్మాన్నుపదేశించి డెబ్బైయొక్క మహాయుగాలుకూడా సర్వభూతదయతో పాలనసాగించి ఆదర్శ పురుషుడైనాడు స్వాయంభువమనువు. శ్రీహరి నాశ్రయించిన వానికి శారీరక, మానసిక, దైవిక, మానుషిక, భౌతి

నృణాం వర్ణాశ్రమాణాం చ సర్వభూతహితస్సదా,
ఏతత్త ఆదిరాజస్య మనోశ్చరిత మద్భుతమ్,
వర్ణితం వర్ణనీయస్య తదపత్యోదయం శృణు.

కాది దుఃఖాలు ఏ విధంగానూ కలుగవు. జగత్తులో సర్వప్రథము డైన సామ్రాట్ స్వాయంభువమనువు. ఆయన చరిత్ర గ్రహింపదగ్గది. అట్టి స్వాయంభువమనువు చరిత్రె చెప్పాను. ఇక దేవహూతి ప్రభావం చెబుతాను వినమని ముందుకు సాగుతున్నాడు మైత్రేయుడు.

## 22 అ ధ్యా య ం

పితృభ్యాం ప్రస్థితే సాధ్వీ పతిమింగితకోవిదా,
నిత్యం పర్యచరత్ప్రీత్యా భవానీవ భవంప్రభుమ్.
విస్రంభేణాత్మశౌచేన గౌరవేణ దమేన చ,
శుశ్రూషయా సౌహృదేన వాచా మధురయా ప్రభో.
విసృజ్య కామం దంభం చ ద్వేషం లోభమఘంమదమ్,
అప్రమత్తోద్యతానిత్యం తేజీయాంసమతోషయత్.
సవైదేవర్షివర్యస్తాం మానవీం సమనువ్రతామ్,
దైవాద్గరీయసః పత్యురాశా సానాం మహాశిషః.
కాలేన భూయసా క్షామాం కర్శితాం వ్రతచర్యయా,
ప్రేమగద్గదయా వాచా పీడితః కృపయాబ్రవీత్.

భర్త మనస్సుకు అనుగుణంగా పార్వతి శివుని సేవించినట్లు దేవహూతి కర్దముని సేవిస్తూన్నది. ఆమె కామవాసన, దంభ, ద్వేష, లోభ, పాప, మదాదులను త్యజించి అణకువతో శ్రద్ధగా భర్తను సేవిస్తూ విశ్వాసమును, పవిత్రత గౌరవము, శుశ్రూష ప్రేమసంభాషణాదులతో కర్దముని సంతుష్టి పరుస్తూన్నది. పెద్దపెద్దకోర్కెలు మనస్సులో ఉంచుకొని వ్రతపరాయణురాలై కఠిన నియమములతో శుష్కించిన శరీరంతో తన్ను సేవించే దేవహూతిని చూచి కర్దముడు దయకలవాడై ప్రేమగద్గదవాక్కుతో—

తుష్టోఽహమద్యతవమానిని మానదాయాశ్శుశ్రూషయా పరమయా పర యా చ భక్త్యా
యో దేహినామయమతీవ సుహృత్స్వదేహో నాపేక్షితస్స ముచితః క్షపితుం మదర్థే.
యే మే స్వధర్మనిరతస్య తపస్సమాధివిద్యాత్మ యోగవిజితా భగవత్ప్రసాదాః,
తానేవ తే మదనుసేవనయావరుద్ధాన్ దృష్టిం ప్రపశ్య వితరామ్యభయానశోకాన్.
అన్యే పునర్భగవతో భ్రువఉద్విజృంభ విభ్రంశితార్థరచనాః కిముదుక్రమస్య,
సిద్ధాసి భుంక్ష్వ విభవాన్నిజధర్మదోహాన్ దివ్యాన్నరైర్దురధిగాన్నృప విక్రియాభిః.
ఏవం బ్రువాణమబలాఖిల యోగమాయా విద్యావిచక్షణమవేక్ష్య గతాధిరాసీత్,
సంప్రశ్రయప్రణయ విహ్వల యాగిరైషద్ వ్రీడావలోకవిలసద్ధసితాననాహ.
రాద్ధం బత ద్విజవృషైతదమోఘయోగమాయాధిపే త్వయి విభో తదవైమి భర్తః,
యస్తేభ్యధాయి సమయస్సకృదంగ సంగో భూయాద్గరీయసి గుణప్రసవస్సతీనామ్.
తత్రేతికృత్యముపశిక్ష యథోపదేశం యేనైష మే కర్శితో ఽతిరిరంసయాత్మా,
సిద్ధ్యేత తేకృతమనోభవధర్షితాయాః దీనస్తదీశభవనం సదృశంవిచక్ష్వ.

> ప్రియాయాః ప్రియమన్విచ్ఛన్ కర్దమో యోగమాస్థితః,
> విమానం కామగం క్షత్తస్తర్హ్యే వావిరచీకరత్.
> సర్వకామదుఘం దివ్యం సర్వరత్నసమన్వితమ్,
> సర్వర్ద్ధ్యుపచయోదర్కం మణిస్తంభైరుపస్కృతమ్.

మనుపుత్రీ! లోకంలో దేహధారులకు అన్నిటికంటే ప్రియమైనది తన దేహం. నీవా దేహాన్ని కూడా ప్రేమించక కృశింపజేసి సర్వసుఖాలను వర్జించి నన్ను సేవిస్తున్నావు. నీయందునాకు ప్రసన్నత కలిగింది. నీవు నా సత్కార్యానుష్ఠానానికి ఆటంకం కలిగించకుండా సేవించడంవల్ల తప, సమాధి, ఉపాసనా యోగములద్వారా, నేనార్జించిన మోక్షఫలం మీద నీవుకూడా అధికారం సంపాదించావు. నీకు నేను దివ్య దృష్టిని ప్రసాదిస్తున్నాను. చూడు. సమస్తభోగాలూ శ్రీహరి భృకుటీ విన్యాస మాత్రంచేత నశించి పోతాయి. ఈశ్వరానుగ్రహం ముందు భోగాలన్నీ లెక్కలోనికి రావు. నేను మహారాజును. నాకుసమస్త భోగాలూ ఉన్నాయి— అనుకునే అహంకారంగల వ్యక్తుల కీదివ్యభోగాలు లభింపవు. నీవునా సేవచే పతివ్రతా ధర్మాన్ని పాటించ గలిగావు. నీకు సమస్తభోగాలూ లభిస్తాయి. అని ఆనందంతో పలుకుతూన్న కర్దముని పలుకులు విన్న దేవహూతి తనభర్త యోగమాయా ప్రభా

దివ్యోపస్కరణోపేతం సర్వకాలసుఖావహం,
పట్టికాభిః పతాకాభిర్విచిత్రాభిరలంకృతమ్.
స్రగ్భిర్విచిత్రమాల్యాభిర్మంజుశింజత్షడంఘ్రిభిః,
దుకూలక్షౌమకౌశేయైర్నానావస్త్రైర్విరాజితమ్.
ఉపర్యుపరి విన్యస్తనిలయేషు పృథక్పృథక్,
క్లిప్తైః కశిపుభిః కాంతం పర్యంకవ్యజనాసనైః.
తత్ర తత్ర వినిక్షిప్తనానాశిల్పోపశోభితమ్,
మహామరకతస్థల్యా జుష్టం విద్రుమవేదిభిః.
ద్వాఃసు విద్రుమ దేహల్యా భాతం వజ్రకవాటవత్,
శిఖరేష్వింద్రనీలేషు హైమకుంభైరధిశ్రితం.
చక్షుష్మత్పద్మ రాగాగ్ర్యైర్వజ్రభిత్తిషు నిర్మితైః,
జుష్టం విచిత్రవై తానైర్మహార్హైర్హేమతోరణైః.
హంసపారావతవ్రాతైస్తత్ర తత్ర వికూజితం,
కృత్రిమాన్మన్యమానైస్స్వానధిరుహ్యా ధిరుహ్య చ.
విహార స్థానవిశ్రామసంవేశప్రాంగణాజిరైః,
యథోపజోషం రచితైర్విస్మాపనమివాత్మనః,

వం కలవాడనీ సర్వ విద్యాకుశలుడనీ గ్రహించి చిరునవ్వుతో లజ్జా వనత శిరస్కయై—

నాథా! యోగమాయాశక్తిచే సాధించిన మీ ఐశ్వర్యం నిష్ఫలమైంది కాదని నేనెరుగుదును. మీరు వివాహ సమయంలో సంతానం కలిగే వరకూ గృహస్థ ధర్మంలో ఉంటానని ప్రతిజ్ఞచేశారు. మీరా ధర్మాన్నే అనుష్ఠించి గృహస్థ సంబంధమైన సుఖాన్ని నాకు ప్రసాదించి నాకానందాన్ని చేకూర్చండి. ఉత్తముడైన భర్తవల్ల సంతానం పొందడమే కులస్త్రీకి ధర్మమూ వాంఛాకూడా. మనఉభయులసమాగమానికి శాస్త్రవిహితమైన సామగ్రిని సమకూర్చండి. ఆహారపానీయాలూ, సుగంధమాల్యాదులూ, సమకూర్చండి. సృష్టికి ప్రతిసృష్టి చేయగల మీకు అది కష్టమైన పనికాదు. నాశరీరం దుర్బలమైపోయింది. అంగసంగ యోగ్యంగా ఉండేటట్లు నా శరీరానికి బలాదులూ, పుష్టీ, ప్రసాదించండి. భోగయోగ్యమైన భవననిర్మాణం చేయండి అని ప్రార్థించింది.

ఈదృగ్గృహం తత్పశ్యంతీం నాతిప్రీతేన చేతసా,
సర్వభూతాశయాభిజ్ఞః ప్రావోచత్కర్దమస్స్వయం.
నిమజ్జ్యాస్మిన్ హ్రదే భీరు విమాన మిదమారుహ,
ఇదం శుక్లకృతం తీర్థమాశిషాం యాపకం నృణామ్.
సా తద్భర్తుస్సమాదాయ వచః కువలయేక్షణా,
సరజం బిభ్రతీ వాసో వేణీభూతాంశ్చ మూర్ధజాన్.
అంగం చ మలపంకేన సంఛన్నం శబలస్తనం,
ఆవివేశ సరస్వత్యా స్సర శ్శివజలాశయమ్.
సాంతస్సరసి వేశ్మస్థా శ్శతాని దశకన్యకాః,
సర్వాః కిశోరవయసో దదర్శో త్పలగంధయః,
తాం దృష్ట్వా సహసోత్థాయ ప్రోచుః ప్రాంజలయస్త్రియః,
వయం కర్మ కరీస్తుభ్యం శాధి నః కరవామ కిం,
స్నానేన తాం మహార్హేణ స్నాపయిత్వా మనస్వినీం,
దుకూలే నిర్మలే నూత్నేదదురస్యై చ మానదాః.

దేవహూతి కోర్కెను నెరవేర్చుటకు ఇచ్ఛాను సారం చరించగల విమానాన్ని సృష్టించాడు. కర్దముడు ఆ విమానం నవరత్నఖచితమై సర్వాలంకార శోభితమై ఇచ్ఛానుసారం సమస్త భోగాలనూ ప్రసాదిస్తుంది. తోరణపతాకాలతో విరాజిల్లే ఆ విమానం సర్వఋతువుల యందూ సుఖాన్నే ప్రసాదిస్తూన్నది. ఎన్నోగదులుగలిగి రకరకాల తల్పాలూ దిండ్లూ పంకాలూ, దివ్యమైన ఆసనాలూ, కలిగి సమస్త సుఖాలకూ ఆలవాలమై ఉంది. ఇంద్ర నీలమణి స్తంభాలమీద స్వర్ణ కలశాలు ప్రకాశిస్తున్నాయి. మణిమయస్తంభాలూ, విద్రుమ మణి నిర్మితములైన గడపలూ ' వజ్రఖచితమైన తలుపులూ కలిగి అపూర్వంగా ప్రకాశిస్తూన్నది. ఉద్యాన వనాలతో మణిమయ వేదికలతో, కృత్రిమములైన హంసపారావత, శుకాది పక్షిజాలం ఆవిమానమందు చెక్కబడి ఉన్నాయి. ఆకృత్రిమ పక్షులులచూచిపక్షిజాతం వానిదగ్గరకు చేరి కిలకిలారవాలు చేస్తూన్నాయి. అందులో అనేక క్రీడాస్థలాలూ, శయనగృహాలూ, చిత్రవిచిత్రంగా నిర్మింపబడి ఉన్నాయి. ఆవిమానం కర్దమునికే ఆశ్చర్యాన్ని కలిగించింది కాని దేవహూతి అదిచూచి ఆనం

భూషణాని పరార్థ్యాని వరీయాంసి ద్యుమంతి చ,
అన్నం సర్వగుణోపేతం పానం చైవామృతాసవం.
అథాదర్శే స్వమాత్మానం స్రగ్విణం విరజాంబరం,
విరజన్కృం స్వస్త్యయనం కన్యాభిర్బహుమానితం.
స్నాతం కృతశిరస్స్నానం సర్వాభరణ భూషితం,
నిష్కగ్రీవం వలయినం కూజత్కాంచననూపురం.
శ్రోణ్యోరధ్యస్త యా కాంచ్యా కాంచన్యా బహురత్నయా,
హారేణ చ మహార్హేణ రుచకేన విభూషితం.
సుభ్రువా సుదతా శ్లక్ష్ణస్నిగ్ధాపాంగేన చక్షుషా,
పద్మకోశస్పృధా నీలైరలకైశ్చ లసన్ముఖం.
యదా సస్మార ఋషభమృషీణాందయితం పతిం,
తత్రచాస్తే సహస్త్రీభిర్యత్రాస్తే సప్రజాపతిః.
భర్తుః పురస్తా దాత్మానం స్త్రీ సహస్రవృతం తథా,
నిశామ్య తద్యోగ గతిం సంశయం ప్రత్యపద్యత.

దించకపోవడం చూసిన కర్దమ ప్రజాపతి ఆమె హృదయాన్ని గ్రహించి దేవీ! యీ బిందు సరోవరంలో స్నానం చెయ్యమన్నాడు.

వెంటనే దేవహూతి సరస్వతీ జలంతో నిండిన బిందుసరోవరంలో మునిగింది. అలా మునిగిన వెంటనే ఆ జలంలో ఒక భవనం ఆ భవనంలో అనేకులైన దివ్యమైన స్త్రీలామెనుచేరి-అమ్మా మేము మీదాసీలమని చెప్పి సుగంధ ద్రవ్యాలతో అమె దేహమంతా నలుగు పెట్టి స్నానం చేయించి చీనిచీనాంబరాలతో అమూల్యాభరణాలతో, అలంకరించి సర్వగుణ సంపన్నములగు భోజనపదార్థాలూ, స్వాదిష్టములైన మధురములగు పానీయములు, సిద్ధం చేశారు. దేవహూతి దర్పణంలో తన ప్రతిబింబం చూచుకున్నది. తన అపూర్వ సౌందర్యానికి తోడు దివ్యమాల్యాంబరధారిణియై పరిపుష్టమైన దేహంతో తన సౌందర్యం తనకే ఆశర్యం కలిగించేలా ఉంది. సర్వాలంకారశోభితయైన దేవహూతి భర్తను స్మరించే సరికి వేలకొలదీ దాసీజనంతో తాను భర్తసమీపంలో ఉంది. ఇదంతా కర్దమముని యోగశక్తి అని గుర్తించి లజ్జావనత శిరస్కయై, కర్దముని ప్రక్క-

సతాం కృతామలస్నానాం విభ్రాజంతీమపూర్వవత్,
ఆత్మనో బిభ్రతీం రూపం సంవీతరుచిరస్తనీం.
విద్యాధరీసహస్రేణ సేవ్యమానాం సువాససం,
జాతభావో విమానం తదారోహ యదమిత్రహా.
తస్మిన్నలుప్తమహిమా ప్రియయానుషక్తో విద్యాధరీభిరుపచీర్ణవపుర్విమానే,
బభ్రాజ ఉత్కచకుముద్గణవానపీచ్యస్తారాభిరావృతఇవోడుపతిర్నభస్థః.
తేనాష్టలోకపవిహారకులాచలేంద్ర ద్రోణీష్వనంగ సఖమారుతసౌభగాసు,
సిద్ధైర్నుతోద్యుధునిపాతశివస్వనాసు రేమే చిరం ధనదవల్లలనా వరూథీ,
వైశ్రంభకే స్వరసనే నందనే పుష్పభద్రకే,
మానసే చైత్రరథ్యే చ స రేమే రామయా రతః.
భ్రాజిష్ణునా విమానేన కామగేన మహీయసా,
వైమానికానత్యశేత చరన్ లోకాన్ యథానిలః.
కిందురాపాదనం తేషాంపుంసా ముద్దామచేతసామ్,
యైరాశ్రితస్తీర్థపదశ్చరణో వ్యసనాత్యయః.
ప్రేక్షయిత్వా భువో గోళం పత్న్యై యావాన్ స్వసంస్థయా,
బహ్వాశ్చర్యమహా యోగీ స్వాశ్రమాయ న్యవర్తత.

నిలచింది. వివాహకాలానికి యేరూపంలో ఉందో అదేరూపంలో సర్వాలంకార శోభితయై మనోహరంగా ఉన్న దేవహూతిని చూచి కర్దముడు విమానమెక్కించాడు. ప్రియురాలి యందనురక్తుడై కామకేళియందాసక్తుడైనా కర్దముని ప్రభావం తగ్గలేదు. కర్దముడు దేవహూతితో కలసి యెనమండుగురు లోకపాలురు విహరించే మేరు సాను ప్రదేశాల్లో శీతల మంద సుగంధ వాయువులు, వీచుతూన్న ఆ ప్రదేశాల్లో గంగా స్రవంతీ సమప్రదేశాలలోనూ విహరిస్తూ వైశ్రంభక, సురసన, నందన పుష్పభద్ర, చైత్రరథ ఆదిగాగల అనేక దేవోద్యాన వనాల్లో విహరిస్తూన్నాడు. శ్రీహరి అనుగ్రహం సాధించిన వాడు పొందలేని భోగమేముంటుంది?

ఈవిధంగా కర్దముడు నవనదీద్వీపాలతో కూడిన భూమండలం అంతాచూపుతూ, విహరిస్తూ దేవహూతి కానందాన్ని కలిగిస్తూ తిరిగి తన ఆశ్రమం చేరి తాను నవధా విభక్తుడై రతియందత్యాశక్తురాలైన

విభజ్య నవధాత్మానం మానవీ సురతోత్సుకామ్,
రామాం నిరమయన్ రేమే వర్షపూగాన్ ముహూర్తవత్.
తస్మిన్ విమాన ఉత్కృష్టాం శయ్యాం రతికరీం శ్రితా,
నచాబుధ్యత కాలం తం పత్యా పీచ్యేన సంగతా.
ఏవం యోగానుభావేన దంపత్యోరమమాణయోః,
శతం వ్యపయుశ్శరదః కామలాలసయోర్మనాక్.
తస్యామాధత్త రేతస్తాం భావయన్నాత్మనాత్మవిత్,
నోధా విధాయ రూపం స్వం సర్వసంకల్పవిద్విభుః.
తతస్సా సుషువే సద్యో దేవహూతిః స్త్రియః ప్రజాః,
సర్వాస్తాశ్చారుసర్వాంగ్యోలోహితోత్పలగంధయః.
పతీం సా ప్రవ్రజిష్యంతం తదాలక్ష్యోశతీ సతీ,
స్మయమానా విక్లబేన హృదయేన విదూయతా.
లిఖంత్యధోముఖీ భూమిం పదానఖ మణిశ్రియా,
ఉవాచ లలితాం వాచం నిరుధ్యాశ్రుకలాంశనైః.
సర్వం తద్భగవన్మహ్యముపోవాహ ప్రతిశ్రుతం,
అథాపి మే ప్రపన్నాయా అభయం దాతుమర్హసి.

దేవహూతి కానందాన్ని కలిగిస్తున్నాడు. ఇలా అనేక సంవత్సరాలు గతించాయి. కాని ముహూర్తమాత్రంగా నడిచింది కాలమంతా. యోగశక్తిగల ఆదంపతులు కామాసక్తులై వందల సంవత్సరాలు గడిపారు. ఆత్మజ్ఞాని కర్దముడు ఆమెకు సంతానవాంఛకలదని గ్రహించి భగవదాదేశంకూడా అదే గనుక తొమ్మిది రూపాల్లో ఉన్న కర్దముడు దేవహూతి గర్భమందు ఇంద్రియాన్ని స్థాపించాడు. ఆమె ఒకే సమయంలో తొమ్మండుగురు కన్యలను కన్నది. వారు సర్వాంగసుందరులై వృద్ధిచెందుతున్నారు.

అదే సమయంలో పూర్వప్రతిజ్ఞననుసరించి, కర్దముడు సన్యాసం స్వీకరిస్తాడని గ్రహించి దేవహూతి భర్తనుజేరి కన్నీరు కారుస్తూ నాథా! మీ ప్రతిజ్ఞ పూర్ణమైంది. కాని దయామయులైన మీరు నాకభయమివ్వాలి. ఈకన్యల కనురూపమైన వరులనుచూచి వివాహం చెయ్యాలి. మీరు వనానికి వెళ్ళినపిమ్మట నాకు జనన మరణరూప

బ్రహ్మన్ దుహితృభిస్తుభ్యం విమృగ్యాః పతయస్సమాః,
కశ్చిత్స్యాన్మే విశోకాయ త్వయి ప్రవ్రజితే వనం.
ఏతావతాలం కాలేన వ్యతిక్రాంతేన మే విభో,
ఇంద్రియార్థప్రసంగేన పరిత్యక్త పరాత్మనః.
ఇంద్రియార్థేష్వసజ్జంత్యాః ప్రసంగస్త్వయి మే కృతః
అజానంత్యాః పరం భావం తథాప్యస్త్వభయాయ మే.
సంగోహి సంసృతేర్హేతురసత్సువిహితోఽధియా,
సఏవ సాధుషు కృతో నిస్సంగత్వాయ కల్పతే.
నేహ యత్కర్మధర్మాయ న విరాగాయ కల్పతే,
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః.
సాహం భగవతో నూనం వంచితా మాయయా దృఢం,
యత్త్వాం విముక్తిదం ప్రాప్య న ముముక్షేయ బంధనాత్.

మైన దుఃఖంలేకుండా ఉండాలి. ఇంతవరకూ కాలం వ్యర్థంచేసి ఇంద్రియ సుఖాలను అనుభవించాను. హరిని ధ్యానించలేకపోయాను. ఐనా నాకోరిక నెరవేరలేదు. మీ ప్రభావం తెలుసుకోలేక ఇంద్రియ సుఖాలను వాంఛించి మీకాలంకూడా వ్యర్థంచేశాను. ఇదికూడా నాకు సంసారవిముక్తిని కలిగించేదే ఔగాక! అజ్ఞానంచేత అసత్పురుష సంగంజేస్తే, బాధకారణమౌతుంది. సత్పురుష సంగం మోక్ష కారణమౌతుంది. మాయామోహితనై కామాసక్తనైన నాకు మీవంటి భర్త లభించడం వల్లనే సంసారబంధ విముక్తి నొందాలని వాంఛ కలుగుతూన్నది. అనుగ్రహించండి అని ప్రార్థించింది.

## 23 అధ్యాయం

నిర్వేదవాదినీమేవంమనోర్దుహితరంమునిః,
దయాళుశ్శాలినీ మాహశుక్లాభి వ్యాహృతంస్మరన్.

ఉత్తమ గుణాలు కల దేవహూతి పలుకులాలించి కర్దముడు ప్రియా! నువ్వీ విషయంలో విచారించకు. నీ గర్భమందు సాక్షాత్తూ శ్రీహరి ఆవిర్భవిస్తాడు. ధర్మంగా ప్రవర్తిస్తూ ఉత్తమ వ్రతావలంబనం

మాఖిదో రాజపుత్రీర్థమాత్మానం ప్రత్యనిందితే,
భగవాం స్తేఽక్షరో గర్భమదూరాత్సంప్రపత్స్యతే.
ధృతవ్రతా త్వం భద్రం తేదమేన నియమేన చ,
తపో ద్రవిణదానైశ్చ శ్రద్ధయా చేశ్వరం భజ.
సత్వయారాధితశ్శుక్లో వితన్వన్మామకం యశః,
ఛేత్తా తే హృదయగ్రంథిమౌదర్యో బ్రహ్మభావనః.
దేవహూత్యపి సందేశం గౌరవేణ ప్రజాపతేః,
సమ్యక్ శ్రద్ధాయ పురుషం కూటస్థమభజద్గురుం,
తస్యాం బహుతిథే కాలే భగవాన్మధుసూదనః,
కార్దమం వీర్యమాపన్నో జజ్ఞేఽగ్నిరివ దారుణి.
అవాదయం స్తదావ్యోమ్ని వాదిత్రాణి ఘనాఘనాః,
గాయంతి తం స్మ గంధర్వానృత్యంత్యప్సరసో ముదా,
పే తుస్సుమనసో దివ్యాః ఖేచరైరపవర్జితాః,
ప్రసేదుశ్చ దిశస్సర్వా అంభాంసి చ మనాంసి చ.
తత్కర్దమాశ్రమపదం సరస్వత్యా పరిశ్రితం,
స్వయంభూస్సాకమృషిభిర్మరీచ్యాదిభిరభ్యగాత్.
భగవంతం పరం బ్రహ్మ సత్త్వేనాంశేన శత్రుహన్,
తత్త్వసంఖ్యానవిజ్ఞప్త్యై జాతం విద్వానజస్స్వరాట్.

చేశావు. నీవు తపోదాన నియమాదులతో శ్రీహరిని సేవిస్తూఉండు. నాకీర్తిని వృద్ధి చెందించేవాడుగా శ్రీహరియే నీకుమారుడై జన్మిస్తాడు. ఆ కుమారుడు నీకు బ్రహ్మజ్ఞానం ఉపదేశించి నీ హృదయ గతమైన అహంకార రూపమైన గ్రంథిని విచ్ఛిన్నం చేస్తాడు- అని చెప్పిన కర్దముని ఆజ్ఞానుసారం దేవహూతి నిర్వికారుడూ, జగద్గురువూ, పురుషోత్తముడూ, ఐన శ్రీహరిని సేవిస్తూ కాలంగడుపుతూంటే కర్రనుండి అగ్ని జనించినట్లు మాధవుడు దేవహూతి గర్భంనుండి ఆవిర్భవించాడు. ఆ సమయంలో పుష్పవృష్టి కురిసింది. అప్సరసలాడారు. గంధర్వులు గానం చేశారు, కిన్నరలు పాడారు, ఋషులు స్తుతించారు, దేవదుందుభులు మ్రోగాయి, సమస్త దిక్కులూ ఆనందంతో నిండాయి. మరీచ్యాది ఋషిపరివృతుడై బ్రహ్మ కర్దముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ బాలుణ్ణి చూచీ చూడంతోనే జననమరణ శూన్యుడైన శ్రీహ

సభాజయన్ విశుద్ధేన చేతసా తచ్చికీర్షితం,
ప్రహృష్యమాణైరసుభిః కర్దమం చేదమభ్యధాత్.
త్వయా మేపచితిస్తాత కల్పితా నిర్వ్యళీకతః,
యన్మే సంజగృహే వాక్యం భవాన్ మానద మానయన్.
ఏతావత్యేవ శుశ్రూషా కార్యా పితరి పుత్రకైః,
బాఢమిత్యనుమన్యేత గౌరవేణ గురోర్వచః.
ఇమా దుహితరస్సభ్యాస్తవ వత్స సుమధ్యమాః,
సర్గమేతం ప్రభావైస్స్వైర్బృంహయిష్యంత్యనేకధా,
అత స్త్వమృషిముఖ్యేభ్యో యథాశీలం యథారుచి,
ఆత్మజాః పరిదేహ్యద్య విస్తృణీహి యశో భువి.
వేదాహమాద్యం పురుషమవతీర్ణం స్వమాయయా,
భూతానాం శేవధిం దేహం బిభ్రాణం కపిలం మునిం.
జ్ఞానవిజ్ఞానయోగేన కర్మణాం చోద్ధరన్ శిఫాః,
హిరణ్యకేశః పద్మాక్షః పద్మముద్రాపదాంబుజః.
ఏష మానవి తే గర్భం ప్రవిష్టః కైటభార్దనః,
అవిద్యాసంశయగ్రంథిం ఛిత్త్వా గాం విచరిష్యతి.

సాంఖ్య శాస్త్రాన్ని లోకానికుపదేశించడానికే యీలా అవతరించాడని బ్రహ్మ గ్రహించాడు. వెంటనే కర్దమునితో-

కుమారా! తండ్రి యొక్క ఆజ్ఞ పాలించడమే పుత్రుని ధర్మం. నీవు పుత్రధర్మాన్ని సక్రమంగా పాలించావు. దీనివల్ల నేను చాలా ఆనందించాను. నీవిప్పుడు మరీచ్యాదులకు వారివారి అభిరుచులనను సరించి నీ కుమార్తెలనిచ్చి వివాహం చెయ్యి. దానివల్ల యీ సృష్టి అనేక విధాలుగా వృద్ధి చెందుతుంది. నీ కీర్తికూడా దశదిశలా వ్యాపిస్తుంది. సర్వాధార మూర్తియగు ఆదినారాయణుడే కపిల నామంతో నీకు కుమారుడై అవతరించాడని కర్దమునితో చెప్పి, దేవహూతిని చూసి రాజపుత్రీ! కైటభమర్దనుడే నీ కుమారుడై ఆవిర్భవించాడు. ఈయనే జ్ఞాన విజ్ఞానముల ద్వారా కర్మవాసనలను సమూలంగా విచ్ఛేదం చేస్తాడు. అవిద్యా రూపమైన మోహగ్రంథిని విచ్ఛేదం చేస్తాడు. ఈ బాలుడు సిద్ధగణ సేవితుడైన సాంఖ్యాచార్యులకు కూడా పూజనీయుడే.

అయం సిద్ధగణాధీశస్సాంఖ్యాచార్యైస్సుసంమతః,
లోకే కపిలఇత్యాఖ్యాం గతాం తే కీర్తివర్ధనః.
తావాశ్వాస్య జగత్స్రష్టాకుమారైస్సహ నారదః.
హంసోహంసేన యానే నత్రిధామ ప్రత్యపద్యత.
గతేశతధృతౌ క్షత్తః కర్దమస్తేన చోదితః,
యథోచితం స్వదుహితౄః ప్రాదాద్విశ్వసృజాం తతః.
మరీచయే కలాం ప్రాదాదనసూయామథాత్రయే,
శ్రద్ధామంగిరసే యచ్ఛత్పులస్త్యాయ హవిర్భువం,
పులహాయగతిం యుక్తాం క్రతవే చ క్రియాం సతీం,
ఖ్యాతిం చ భృగవే ఒయచ్ఛద్వసిష్ఠాయాప్యరుంధతీం.
అథర్వణే దదా చ్ఛాంతిం యయా యజ్ఞో వితన్యతే,
విప్రర్షభాన్ కృతోద్వాహాన్ సదారాన్ సమలాలయత్.

లోకంలో కపిలనామంతో విఖ్యాతి చెంది నీ కీర్తిని దశదిశలా వ్యాపింప జేస్తాడు – అని చెప్పి నారదాది ఋషి సేవితుడై బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళాడు —

అనంతరం కర్దముడు బ్రహ్మయొక్క ఆజ్ఞననుసరించి కళా అనే కుమార్తెను మరీచికీ, అనసూయను అత్రికీ, శ్రద్ధను అంగిరునకూ, హవిర్భూని పులస్త్యునకూ, గతిని పులహునకూ, క్రియనుక్రతువునకూ, ఖ్యాతిని భృగునకూ, అరుంధతిని వశిష్ఠునకూ, శాంతిని అధర్వునకూ, ఇచ్చి విధివిధానంగా వివాహాలు చేసి వారిని యథాతథంగా సత్కరించాడు. వివాహముతైన పిమ్మట కర్దముని అనుజ్ఞపొంది భార్యలసమేతంగా, మరీచ్యాదులు వారివారి ఆశ్రమాలకు వెళ్ళిపోయారు.

తరువాత కర్దముడు, పరిశుద్ధహృదయుడై దేవాధిదేవుడే తన గృహంలో అవతరించాడనే ఆనందంతో ఏకాంతంగా ఆబాలుని, రూపంలో ఉన్న శ్రీహరిని చేరి. ఆహా! దేవతలుకూడా చాలాకాలం, సేవిస్తేనేగాని పాపపంకితులై దుఃఖించే మానవులకు ప్రసన్నులుకారు. యోగిజన్మలనేక జన్మలలో సర్వసంగ పరిత్యాగులై సేవించినా యెవని [illegible] పరమయోగులుకూడా, సమాధియందుండి

తతస్తమృషయః క్షత్తః కృతదారా నిమంత్ర్యతం,
ప్రాతిష్ఠన్నందమాపన్నాస్స్వం స్వమాశ్రమమండలం.
స చావతీర్ణం త్రియుగమాజ్ఞాయ విబుధర్షభం,
వివిక్త ఉపసంగమ్య ప్రణమ్య సమభాషత.
అహో పాపచ్యమానానాం నిరయే స్వైరమంగళైః,
కాలేన భూయసా నూనం ప్రసీదంతి హి దేవతాః.
బహుజన్మవిపక్వేన సమ్యగ్యోగసమాధినా,
ద్రష్టుం యతంతే యతయశ్శూన్యాగారేషు యత్పదం.
సఏష భగవానద్య హేళనం న గణయ్యనః,
గృహేషు జాతో గ్రామ్యాణాం యస్స్వానాం పక్షపోషకః,
స్వీయం వాక్యమృతం కర్తుమవతీర్ణోఽసి మే గృహే,
చికీర్షుర్భగవాన్ జ్ఞానం భక్తానాం మానవర్ధనః.
తాన్యేవ తేఽభిరూపాణి రూపాణి భగవంస్తవ,
యాని యాని చ రోచంతే స్వజనానామరూపిణః.
త్వాం సూరిభిస్తత్త్వబుభుత్సయాద్ధా సదాభివాదార్హణ పాదపీఠమ్,
ఐశ్వర్యవైరాగ్యయశోవబోధవీర్యశ్రియా పూర్తమహం ప్రపద్యే.
పరం ప్రధానం పురుషంమహాంతం కాలం కవిం త్రివృతం లోకపాలమ్,
ఆత్మానుభూత్యానుగతప్రపంచం స్వచ్ఛందశక్తిం కపిలంప్రపద్యే.

ఏకాంతంగా దర్శించాలని కోరతారో అట్టి మీరు విషయ లోలురమై అజ్ఞానంలో చరించే మా యందపూర్వాను గ్రహించూపి మమ్ములననుగ్రహించారు. సాంఖ్యయోగోపదేశం చెయ్యాలనే కరుణా దృష్టితో మాగృహంలో అవతరించారు. మీరు అప్రాకృతమైన రూపం కలవారు. చతుర్భుజాది రూపాలన్నీ అలౌకిక రూపాలు. ఆ రూపాలే మీకు యోగ్యమైనవి. ఆ రూపాలే మీ భక్తులకు కూడా ప్రియమైనవి. శ్రీహరీ మీరు ఐశ్వర్య, జ్ఞాన, వైరాగ్య, యశ, వీర్య, శ్రీ అను ఆరింటిచేత పరిపూర్ణులు. అట్టిమిమ్ములను శరణు పొందుతున్నాను. మీరు పరబ్రహ్మ మూర్తులు. సమస్త శక్తులూ మీ అధీనంలోనే ఉంటాయి. ప్రకృతి, పురుష, మహత్తత్త్వ, కాల, అహంకారాదులూ, సమస్త లోకాలూ, లోకపాలురూ, మొదలుగాగల సర్వం మీ రూపమే. మీరుసర్వజ్ఞులు. ఈ సమస్త ప్రపంచాన్నీ చేతనా శక్తి

అస్మాభిపృచ్ఛేద్యపతిం ప్రజానాం త్వయావతీర్ణర్ణ ఉతాప్తకామః,
పరివ్రజాంపదవీమాస్థితోఽహం చరిష్యేత్వాం హృది యుంజన్ విశోకః.
మయా ప్రోక్తం హి లోకస్య ప్రమాణం సత్యలౌకికే,
అథాజని మయా తుభ్యం యదవోచమృతం మునే.
ఏతన్మే జన్మ లోకేఽస్మిన్ ముముక్షూణాం దురాశయాత్,
ప్రసంఖ్యానాయ తత్త్వానాంసమ్మతాయాత్మదర్శనే.
ఏష ఆత్మపథో వ్యక్తో నష్టః కాలేన భూయసా,
తం ప్రవర్తయితుం దేహ మిమం విద్ధి మయా భృతం.
గచ్ఛ కామం మయా పృష్టో మయి సన్న్యస్తకర్మణా,
జిత్వాసు దుర్జయం మృత్యు మమృతత్వాయ మాం భజ.
మామాత్మానం స్వయంజ్యోతి స్సర్వభూతగుహాశయమ్,
ఆత్మన్యేవాత్మనా వీక్ష్య విశోకో ఽభయమృచ్ఛసి,
మాత్ర ఆధ్యాత్మికీం విద్యాం శమనీం సర్వకర్మణామ్,
వితరిష్యే యథాచాసౌ భయం చాతితరిష్యతి.
ఏవం సముదితస్తేన కపిలేన ప్రజాపతిః,
ప్రదక్షిణీకృత్య సుతం వనమేవ జగామ హ.

ద్వారా మీయందే లయం చేసుకుంటూ ఉంటారు. అన్నిటికంటే పరమైన వారు కూడా మీరే. నేను మీ అనుగ్రహంచేతనే ఋణత్రయంనుండి విముక్తుడనయ్యాను. నేనుకపిలావతారమూర్తులైన మిమ్ము లను శరణు పొందుతున్నాను. నామనోరథాలన్నీ నెరవేరాయి. నేను సన్యాసాశ్రమం స్వీకరించి మిమ్ముధ్యానించి నిత్యానందానుభూతి నొందాలని కోరుతూ మీఆజ్ఞను వాంఛిస్తున్నాను. అనుగ్రహించండని శ్రీహరిని కపిలమూర్తిగా ప్రార్థించాడు.

శ్రీహరి కర్దమునీ అనుగ్రహ దృష్టితో చూస్తూ పలుకుతున్నాడు. మునీ! పూర్వం నీవు నన్నుగూర్చి తపస్సు చేసినప్పుడు నేను నీ గృహంలో అవతరిస్తానని వరమిచ్చాను. సత్యప్రతిజ్ఞుడనైన నేనిప్పుడందు లకే అవతరించాను. ఈ లోకంలో లింగశరీరంనుండి ముక్తులుకావాలని కోరేమునులకు ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించడానికే అవతరించాను. ఆత్మ జ్ఞాన సంబంధమైన సూక్ష్మ మార్గం చిరకాలంనుండి లుప్తమైపోయింది.

వ్రతం స ఆస్థితో మౌనమాత్మైక శరణో మునిః,
నిస్సంగో వ్యచరత్ క్షోణీ మనగ్నిరనికేతనః.
మనో బ్రహ్మణి యుంజానో యత్తత్సదసతః పరమ్,
గుణావభాసే విగుణ ఏకభక్త్యానుభావితే,
నిరహంకృన్నిర్మమశ్చ నిర్ద్వంద్వ స్సమదృక్ స్వదృక్,
ప్రత్యక్ప్రశాంతధీర్ధీరః ప్రశాంతోర్మి రివోదధిః.
వాసుదేవే భగవతి సర్వజ్ఞే ప్రత్యగాత్మని,
పరేణ భక్తియోగేన లబ్ధాత్మా ముక్తబంధనః.
ఆత్మానం సర్వభూతేషు భగవంత మవస్థితమ్,
అపశ్య త్సర్వ భూతాని భగవత్యపి చాత్మని,
ఇచ్ఛాద్వేషవిహీనేన సర్వత్ర సమచేతసా,
భగవద్భక్తియోగేన ప్రాప్తా భాగవతీ గతిః.

తిరిగి అట్టి సాంఖ్యశాస్త్రాన్ని వ్యాప్తిచెయ్యడమే నా అవతారప్రయోజనం అని గ్రహించు. నీ యిచ్ఛానుసారం గృహంవదలి వెళ్లి సర్వసంగపరిత్యాగివై ఆత్మస్వరూపుడనైన నన్ను ధ్యానించిగ్రహించి, ముక్తిని పొందు. నేను నా మాత యగు దేవహూతికి ఆత్మజ్ఞానాన్ని బోధించి మోక్షం ప్రసాదిస్తానని చెప్పిన కపిలుని వాక్యాలువిని కర్దముడు కపిలునకు ప్రదక్షిణ నమస్కారాలుచేసి వనానికి వెళ్లి పోయాడు.

అగ్నినీ ఆశ్రమాన్నీ త్యజించి సన్యాస ధర్మావలంబకుడై కార్య కారణాతీతమైన నిర్గుణ బ్రహ్మోపాసకుడై ద్వంద్వరహితుడై సమదృష్టికలవాడై కర్దముడు పరమపదాన్ని పొందాడు.

## 24 అధ్యాయం

కపిలస్తత్త్వసంఖ్యాతా భగవానాత్మమాయయా,
జాతస్స్వయ మజస్సాక్షా దాత్మప్రజ్ఞప్తయే నృణామ్.

విదుర మైత్రేయ సంవాద రూపమైన హరిచరిత్రను విన్న శౌనకుడు కథాకథన కుశలుడైన సూతుని చూచి మహర్షీ! మీ ముఖతః వినే హరికథ యెంతవిన్నా వినాలనే ఉంటుంది. సాంఖ్య

నహ్యస్య వర్ష్మణః పుంసాం వరిష్ఠస్సర్వయోగినామ్,
విశ్రుతౌ శ్రుతదేవస్య భూరి తృప్యంతి మేఽసవః.
యద్యద్విధత్తే భగవాన్ స్వచ్ఛందాత్మాత్మమాయయా,
తానిమే శ్రద్ధధానస్య కీర్తనీయాని కీర్తయ.
ద్వైపాయనసఖిస్త్వేనం మైత్రేయో భగవాం స్తథా,
ప్రాహేదం విదురంప్రీత ఆన్వీక్షక్యాం ప్రచోదితః.
పితరి ప్రస్థితేఽరణ్యంమాతుః ప్రియాచికీర్షయా,
తస్మిన్ బిందుసరేఽవాత్సీ ద్భగవాన్ కపిలః కిల.
తమాసీనమకర్మాణం తత్త్వమార్గాగ్రదర్శినమ్,
స్వసుతం దేవహూత్యాహ ధాతుస్సంస్మరతీ వచః.
నిర్విణ్ణా నితరాం భూమన్నసదింద్రియతర్పణాత్,
యేన సంభావ్యమానేన ప్రవిష్టాంధంతమః ప్రభో.
తస్య త్వంతమసోఽంధస్య దుష్పారస్యాద్య పారగః,
సచ్చక్షుర్జన్మనామంతే లబ్ధం మే త్వదనుగ్రహాత్.

యోగ ప్రవర్తకుడుగా శ్రీహరి దేవహూతియందు కపిల మూర్తిగా అవతరించి యేమేమి యెవరెవరికి ఉపదేశించాడో వినాలని ఉంది గనుక చెప్పండని అడిగాను. శౌనకునకు సూతుడు చెప్పడం ఆరంభించాడు.

కర్దముడు వనానికి వెళ్లిన పిమ్మట, కపిలుడు తల్లికి ఆనందాన్ని కలిగిస్తూ ఆశ్రమంలోనే ఉంటూండగా ఒకనాడు ప్రాతఃకాల కర్మ కలాపం సమాప్తి చేసుకొని సుఖాసీనుడై కూర్చున్న కపిలునిచేరి దేవహూతి —

ప్రభూ ! ఇంద్రియసంబంధమైన విషయలాలసత్వం కారణంగా నేను అజ్ఞానాంధకారంలో మునిగిపోయాను. మీ అనుగ్రహంచే జనన మరణ రూపమైన దుఃఖం నశించింది. అజ్ఞానాంధకారాన్ని పోగొట్టడానికి సూర్యునివలె మీ దర్శన మైంది. దేహ గేహములందుగల అహంకార మమకారములను కలిగించేవారు మీరే గనుక, మీరే ఆ మోహాన్ని పోగొట్టి అనుగ్రహించాలి.

య ఆద్యో భగవాన్ పుంసా మీశ్వరో వై భవాన్ కిల,
లోకస్య తమసాంధస్య చక్షుః సూర్య ఇవోదితః.
అథ మే దేవసంమోహ మపాక్రష్టుంత్వమర్హసి,
యోఽవగ్రహోఽహం మమేతీత్యేతస్మిన్ యోజితస్త్వయా.
తం త్వాం గతోఽహం శరణం శరణ్యం స్వభృత్యసంసార తరోః కుఠారం,
జిజ్ఞాసయా ప్రకృతేః పూరుషస్య నమామి సద్ధర్మవిదాం వరిష్ఠమ్.
ఇతి స్వమాతుర్నిరవద్యమీప్సితం నిశమ్య పుంసామపవర్గవర్ధనం,
ధియాభినంద్యాత్మవతాం సతాం గతిర్బభాష ఈషత్స్మితశోభితాననః.
యోగఆధ్యాత్మికః పుంసామతో నిశ్శ్రేయసాయమే,
అత్యంతోపరతిర్యత్ర దుఃఖస్య చ సుఖస్య చ.
తమిమం తే ప్రవక్ష్యామి యమవోచం పురానఘే
ఋషీణాం శ్రోతుకామానాం యోగముర్వంగనైపుణం.

ఘోరమైన సంసార వృక్షానికి మీరు కుఠారం వంటివారు. ప్రకృతి పురుషుల తత్వం తెలుసుకోవాలని ఉంది. మిమ్ములను శరణంటు న్నాను. మీరు భాగవతధర్మం తెలిసినవారు నాకా ధర్మంఉపదేశిం చండి——అని అడిగిన దేవహూతికి ఆ పిలుడుఉత్తమమైన మోక్షధర్మం చెప్పడం ఆరంభించాడు.

మాతా! సుఖదుఃఖ రాహిత్యాన్ని కలిగించే అధ్యాత్మ యోగమే గొప్పదని నా అభిప్రాయం. సర్వాంగ సంపన్నమైన ఆ యోగం ఆదిలో నారదాదులకు వినిపించాను. అదే నీకు చెప్తాను విను. బంధమోక్షాలకు మనస్సే కారణం. విషయాసక్తమైతే బంధకారణమూ, పరమాత్మయందు దాసక్తి కలదైతే మోక్షకారణమూ ఔతుంది. నేను, నాది అనే భావనచేతనే కామక్రోధాదులు బాధి స్తాయి. అట్టి అహంకార మమకారాలను విడచివేస్తే సుఖదుఃఖము లకు అతీతమైన సమావస్థ కలుగుతుంది. అప్పుడు జీవుడు జ్ఞాన, వైరాగ్య, భక్తులతో కూడిన హృదయంతో, సజాతీయ, విజాతీయ, స్వగతభేద శూన్యమై స్వయంప్రకాశమై, సూక్ష్మమై, అఖండమై, సుఖదుఃఖరహితమై ప్రకృతికంటే పరమైన ఆత్మను చూడగలుగు

చేతః ఖల్వస్య బంధాయ ముక్తయే చాత్మనోమతమ్.
గుణేషు సక్తం బంధాయ రక్తం వా పుంసి ముక్తయే.
అహం మమాభిమానోత్థైః కామలోభాదిభిర్మలైః,
వీతం యథా మనశ్శుద్ధ మదుఃఖమసుఖం సమమ్.
తథా పురుష ఆత్మానం కేవలం ప్రకృతేః పరమ్,
నిరంతరం స్వయంజ్యోతి రణిమానమఖండితమ్.
జ్ఞాన వైరాగ్య యుక్తేన భక్తియుక్తేన చాత్మనా,
పరిపశ్యత్యుదాసీనం ప్రకృతించ హతౌజసమ్.
నయుజ్యమానయా భక్త్యా భగవత్యఖిలాత్మని,
సదృశోఽస్తిశివఃపంథా యోగినాం బ్రహ్మసిద్ధయే.
ప్రసంగ మజరం పాశ మాత్మనః కవయోవిదుః,
స ఏవసాధుషు కృతో మోక్షద్వార మపావృతమ్.
తితిక్షవః కారుణికా స్సుహృదస్సర్వదేహినాం,
అజాతశత్రవశ్శాంతాస్సాధవస్సాధుభూషణాః.

తాడు. ప్రకృతిని శక్తిహీనమైనదిగా గ్రహిస్తాడు. యోగులకు భగవత్ప్రాప్తికారణమైన హరిభక్తికంటే మించిన మార్గం లేదు. వివేకులు సంగము, ఆసక్తి, బంధహేతువులుగా భావిస్తారు. కాని, అదే సత్సాంగత్యం అయితే భగవంతునియందు ఆసక్తి కలిగితే మోక్షం కలుగుతుంది.

సహనం కలిగి దయాపరులైన సమస్త జీవులంటు హితభావం కలవారై యెవరినీ ద్వేషించక శాంత, సరళ స్వభావంతో సత్పురుషులను సేవిస్తూ, ఉంటారో సర్వసంగ పరిత్యాగులై అనన్య భావంతో నన్నే దృఢమైన భక్తితో ప్రేమిస్తూ ఉంటారో, సమస్త కర్మలూ నాయందే అర్పణచేస్తారో, పరమ పవిత్రమైన కథలను వింటూ కీర్తిస్తూ ఉంటారో అట్టి నాయందు లగ్నమైన చిత్తములుకల సత్పురుషులు తాపత్రయ విముక్తి నొందగలరు. సర్వసంగ పరిత్యాగులైన మహాపురుషులే సాధువు లౌతారు. సత్సాంగత్యంవల్ల విషయాసక్తి నశిస్తుంది. సమస్త దోషాలూ హరింప బడతాయి. సత్పురుస

మయ్యనన్యేన భావేన భక్తిం కుర్వంతి యే దృఢామ్,
మత్కృతే త్యక్తకర్మాణస్త్యక్తస్వజన బాంధవాః
మదాశ్రయకథామృష్టాశ్శృణ్వంతి కథయంతి చ,
తపంతివివిధాస్తాపానైతాన్మద్గతచేతసః,
తఏతేసాధవస్సాధ్వి సర్వసంగవివర్జితాః,
సంగస్తేష్వథ తే ప్రార్థ్యః సర్వదోషహరాహితే.
సతాం ప్రసంగాన్మమ వీర్య సంవిదో భవంతి హృత్కర్ణరసాయనాః కథాః
తజ్జోషణాదాశ్వపవర్గవర్త్మని శ్రద్ధారతిర్భక్తిరనుక్రమిష్యతి,
భక్త్యాపుమాన్ జాతవిరాగ ఐంద్రియాద్దృష్టశ్రుతాన్మద్రచనానుచింతయా,
చిత్తస్య యత్తోగ్రహణేన యుక్తో యతిష్య బుజుభిర్యోగమార్గైః.
అసేవయాయం ప్రకృతేర్గుణానాం జ్ఞానేన వైరాగ్యవిజృంభితేన.
యోగేన మయ్యర్పితయా చ భక్త్యా మాం ప్రత్యగాత్మాన మిహావరుంధే.

సమాగమమువల్ల హృదయానికి కర్ణములకు కూడా ప్రియాన్ని కలిగించే మా కథలు వినే అవకాశం కలుగుతుంది. ఆ భక్తులకే ప్రపంచంలో యేవిధమైన దుఃఖాలూ కలుగవు. అట్టి భక్తులకు మోక్షమార్గమందు శ్రద్ధ, ప్రేమ, భక్తి క్రమంగా వృద్ధిచెందుతాయి. భక్తివల్ల లౌకిక పారలౌకిక సుఖాలయం దాసక్తి నశించి వైరాగ్యం కలిగి మనుష్యుడు సావధాన చిత్తుడై యోగముయొక్క భక్తి ప్రధానమైన సరళ ఉపాయములచే మనోనిగ్రహం కొరకు ప్రయత్నం సాగిస్తాడు. ఈ విధంగా ప్రకృతి గుణాలచే ఉత్పన్నమైన శబ్దాది విషయాలను త్యజించడంవల్ల, వైరాగ్య యుక్తమైన జ్ఞానంచేత, యోగంవల్ల, నాయందుకల దృఢమైన భక్తిచేత అంతరాత్మనైన నన్ను దేహంతోనే పొందుతున్నాడు— అని చెప్పిన కపిలుని వాక్యాలు విన్న దేవహూతి తిరిగి అడుగుతూన్నది.

మీ యొక్క భక్తి ఎట్టిది? నావంటి అబలలకు యెట్టి భక్తి యోగ్యమైనది? సహజంగా నేను ఏ నిర్వాణ పదాన్ని పొందగలుగుతాను? దేనిద్వారా తత్వజ్ఞానం కలుగుతుంది? లక్ష్యాన్ని ఛేదించే బాణంవలె భగవత్ప్రాప్తిని కలిగించే యోగమార్గ మెట్టిది? దానికి

కాచిత్త్వయ్యుచితా భక్తిః కీదృశీ మమ గోచరా,
యయా పదంతే నిర్వాణ మంజసాన్వశ్నువా అహం,
యోయోగో భగవద్బాణో నిర్వాణాత్మంస్త్వయోదితః,
కీదృశః కతి వాంగాని యతస్తత్త్వావబోధనం.
తదేతన్మే విజానీహి యథాహం మందధీర్హరే,
సుఖం బుధ్యేయ దుర్బోధమేషా భవదనుగ్రహాత్,
విదిత్వార్థం కపిలో మాతురిత్థం జాతస్నేహో యత్ర తన్వాభిజాతః,
తత్త్వామ్నాయం యత్ప్రవదంతి సాంఖ్యం ప్రోవాచవైభక్తివితానయోగం,
దేవానాం గుణలింగానామానుశ్రవికకర్మణాం,
సత్త్వఏవైకమనసో వృత్తిస్స్వాభావికీతుయా.
అనిమిత్తా భగవతి భక్తిస్సిద్ధేర్గరీయసీ,
జరయత్యాశు యాకోశం నిగీర్ణమనలో యథా.

అంగా లెన్ని? నావంటి మందమతికి కూడా తెలిసేలాగున సుబోధకంగా ఉపదేశించం డని అడిగిన దేవహూతియందు మాతృప్రేమను చూపుతూ కపిలుడు చెపుతున్నాడు.

తల్లీ! ఎవని చిత్తం భగవంతునియందు లగ్నమై ఉంటుందో వానికి వేదవిహితమైన కర్మలయందు లగ్నమై, విషయజ్ఞానాన్ని కలిగించే ఇంద్రియములకు సత్త్వమూర్తియైన శ్రీహరియందుకల అహేతుకమైనభావమే భక్తి యనబడును. అతడే భక్తుడు. జఠరానలం భుజించిన ఆహారాన్ని యెట్లు పచనం చేస్తుందో, అట్లే కర్మ సంస్కారాలకు భాండాగారమైన లింగశరీరాన్ని భస్మం చేస్తుంది గనుక మోక్షం కంటె కూడా భక్తి గొప్పది. నా చరణ సేవయం దాసక్తులైనా ప్రసన్నతకొరకే సమస్త కర్మలూచేసే సత్పురుషు లొకచో చేరి వారిలో వారు నా పరాక్రమాన్ని వర్ణించుకొంటూ, నా సాయుజ్యాన్ని కూడా కోరరు వారు. అరుణ నయనుడనై, పరమ సుందరమైన చిరునవ్వుతో కూడిన ముఖారవిందంతో, ఒప్పే నా దివ్యమంగళ విగ్రహ సందర్శనాన్నే వాంఛిస్తూ నా లీలల నభినయిస్తూ లీలాగృహీతమైన నా రూపంతోనే భాసిస్తుంటారు. అట్టి

నైకాత్మతాం మే స్పృహయంతి కేచిన్మత్పాదసేవాభిరతా మదీహాః,
యోఽన్యోన్యతో భాగవతాః ప్రసజ్య సభాజయంతే మమపౌరుషాణి,
పశ్యంతి తే మే రుచిరాణ్యంబ సంతః ప్రసన్నవక్త్రారుణలోచనాని,
రూపాణి దివ్యాని వరప్రదాని సాకం వాచం స్పృహణీయాం వదంతి.
తైర్దర్శనీయావయవైరుదారవిలాసహాసేక్షితవామసూక్తైః,
హృతాత్మనో హృతప్రాణాంశ్చ భక్తిరనిచ్ఛతో గతిమణ్వీం ప్రయుంక్తే.
అథో విభూతిం మమ మాయయా వినా హ్యైశ్వర్యమష్టాంగమనుప్రవృత్తాం,
శ్రియం చ యే నస్పృహయంతి భద్రాం పరస్యమేతేఽశ్నువతే ను లోకే.
నకర్హిచిన్మత్పరాశ్శాంత రూపేనం క్ష్యంతి నోమేఽనిమిషో లేఢి హేతిః,
యేషా మహం ప్రియఆత్మా సుతశ్చసఖా గురుస్సుహృదో దైవమిష్టం.
ఇమం లోకం తథైవాముమాత్మాన ముభయాయినం,
ఆత్మాన మనుయేచేహ యేరాయఃపశవో గృహాః,

వారికి కోరకుండానే పరమపదం లభిస్తుంది. అట్టి భక్తివల్ల నివృత్తి కలిగిన తోడనే మాయాపతినైన నా సత్యాదిలోక భోగాలూ, భక్తి ప్రవృత్తివల్ల సంప్రాప్తమైన అష్టసిద్ధులూ, భగవత్సంబంధమైన వైకుంఠ భోగాలూ, వాంఛించరు. నా పరమధామంచేరిన పిమ్మట వారికి ఈశ్వరీయములైన ఐశ్వర్యములన్నీ స్వయంగా ప్రాప్తిస్తాయి. ప్రియమైన ఆత్మ, పుత్ర, మిత్ర, గురు, కళత్ర ఇష్ట దేవతా రూపంలో నాకంటె భిన్నం లేదని ఎవరు చూస్తూ నన్నే భావిస్తూంటారో, నన్నే ఆశ్రయిస్తారో వారు శాంతిమయమైన భక్తులు. వైకుంఠంపొంది సమస్తమైన భోగాలూ అనుభవించగలరు. వారికి లభించని భోగాలులేవు. కాలచక్రం వారి నేమీ చేయలేదు.

మాతా! ఇహపరలోకాల నిచ్చే లింగశరీరంయొక్క, స్థూల దేహంయొక్క సంబంధంగల ధన, పశు, పత్ని, సుతాదులందూ అనేకములైన వస్తు సముదాయమందూ, వాంఛను వదలి, అనన్య భక్తితో నన్నే సేవించే వారికి మృత్యు రూపమైన సంసారాన్నుండి ముక్తిని ప్రసాదిస్తాను. ప్రకృతి పురుషులకు కూడా నేనే ప్రభువును. సర్వప్రాణులకు ఆత్మను నేనే. నన్నువినా రెవరి నాశ్రయించినా

విసృజ్య సర్వానన్యాంశ్చ మామేవం విశ్వతోముఖం,
భజంత్య నన్యయా భక్త్యాతాన్మృత్యోరతిపారయే,
నాన్యత్ర మద్భగవతః ప్రధానపురుషేశ్వరాత్,
ఆత్మనస్సర్వభూతానాం భయం తీవ్రం నివర్తతే.
మద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతిమద్భయాత్,
వర్షతీంద్రో దహత్యగ్ని ర్మృత్యుశ్చరతి మద్భయాత్.
జ్ఞానవైరాగ్యయుక్తేన భక్తియోగేన యోగినః,
క్షేమాయ పాదమూలం మే ప్రవిశంత్యకుతోభయం.
ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాంనిశ్రే యసోదయః,
తీవ్రేణ భక్తియోగేన మనో మయ్యర్పితంస్థిరం.

సంసారసంగ విముక్తి నందలేరు. నా భయంచేత ఇంద్రుడు వర్షాన్ని కురిపిస్తాడు. నా భయంచేతనే వాయువు చలిస్తుంది. అగ్ని దహిస్తుంది. సూర్యుడు తపింప జేస్తాడు. మృత్యువు తన విధిని సక్రమంగా నిర్వర్తిస్తుంది. పరమయోగులు జ్ఞాన వైరాగ్య యుతమైన భక్తి ద్వారా నన్నే సేవిస్తారు. లోకంలో స్థిరచిత్తంతో నన్ను సేవించడం కంటే మించిన మోక్షమార్గం లేదు.

## 25 అధ్యాయం

అథ తే సంప్రవక్ష్యామి తత్త్వానాం లక్షణం పృథక్,
యద్విదిత్వా విముచ్యేత పురుషః ప్రాకృతైర్గుణైః.
జ్ఞానం నిశ్శ్రేయసార్థాయ పురుషస్యాత్మదర్శనం,
యదాహుర్వర్ణయే తత్తే హృదయ గ్రంథిభేదనం.
అనాదిరాత్మా పురుషోనిర్గుణః ప్రకృతేః పరః,
ప్రత్యక్ధామా స్వయంజ్యోతి ర్విశ్వంయేన సమన్వితం.

తల్లీ! ప్రకృతి మొదలుగాగల తత్వాల్నీ, వాటి ప్రత్యేక లక్షణాలనూ వేరువేరుగా చెపుతున్నాను విను.

ఆత్మదర్శన రూపమైన జ్ఞానమే పురుషునకు మోక్షకారణం. అదే అహంకార రూపమైన హృదయ గ్రంథిని విచ్ఛిన్నం చేస్తుందని

నజాయతే న మ్రియతే నహదేహద్యుపాధిభిః,
నిమిత్తైరాత్తతద్ధర్మా యథాస్వప్నే తనీక్షితా.
సఏషప్రకృతిం సూక్ష్మాం దైవీం గుణమయీం విభుః,
యదృచ్ఛయైవోపగతా మభ్యపద్యత లీలయా,
గుణై ర్విచిత్రాః సృజతీం సరూపాః ప్రకృతిం ప్రజాః,
విలోక్యముము హే సద్యః సఇవజ్ఞానగూహయా.
ఏవం పరాభిధ్యానేన కర్తృత్వం ప్రకృతేః పుమాన్,
కర్మసుక్రియమాణేషు గుణై రాత్మని మన్యతే.
తదస్య సంసృతిర్బంధః పారతంత్ర్యం చ తత్కృతం,
భవత్యకర్తురీశస్య సాక్షిణోనిర్వృతాత్మనః.
కార్యకారణకర్తృత్వే కారణం ప్రకృతిం విదుః,
భోక్తృత్వే సుఖదుఃఖానాం పురుషం ప్రకృతేఃపరమ్.

పండితులు (ఆత్మజ్ఞానులు) చెపుతున్నారు. ఆ జ్ఞానమే యిప్పుడు నీ దగ్గర వర్ణిస్తాను. ఈ సమస్త చరాచర జగత్తూ దేనిచేత వ్యాప్తమై ఉందో ఆ ఆత్మయే పురుషుడు. అది అనాది. నిర్గుణము. ప్రకృతికంటె పరమైనది. అంతఃకరణయందు ప్రస్ఫుటమయ్యే స్వయం ప్రకాశమూ, కూడా. ఆ సర్వవ్యాపకుడైన పురుషుడు విలాస పూర్వకంగా తన దగ్గరకు వచ్చిన అవ్యక్తమై, త్రిగుణాత్మకమైన మహా మాయను స్వేచ్ఛగా స్వీకరించాడు. లీలాపరాయణమైన ప్రకృతి తన సత్వాది గుణములద్వారా ఆ గుణాలకు అనురూపమైన ప్రజా సృష్టి చేసింది. అదిచూసి పురుషుడు జ్ఞానశక్తిని ఆచ్ఛాదించేదాని యొక్క ఆవరణ శక్తిచే మోహితుడై తన స్వరూపాన్ని మరచి పోయాడు. ఈ విధంగా తనకంటె భిన్నమైన ప్రకృతినే తన స్వరూపంగా భావించడంవల్ల ప్రకృతి గుణములద్వారా చేయబడే కర్మ లన్నిటియందు తనయందే కర్తృత్వాన్నాపాదించుకుంటున్నాడు. ఈ కర్తృత్వాభిమానంచేతనే, అకర్తా స్వాధీన, సాక్షీ ఆనంద స్వరూపుడూ ఐన పురుషుడు జన్మ మరణ రూపమైన బంధనం కలవాడై పరతంత్రతను పొందుతున్నాడు. కార్యరూపమైన శరీరం

ప్రకృతేః పురుషస్యాపి లక్షణం పురుషోత్తమ,
బ్రూహి కారణయోరస్య సదసచ్చ యదాత్మకమ్.
యత్త త్రిగుణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్,
ప్రధానం ప్రకృతిం ప్రాహురవిశేషం విశేషవత్.
పంచభిః పంచభిర్బ్రహ్మ చతుర్భి ర్దశభిస్తథా,
ఏత చ్చతుర్వింశతికం గణం ప్రాధానికం విదుః.
మహాభూతాని పంచైవ భూరాపోఽగ్నిర్మరున్నభః,
తన్మాత్రాణి చ తావంతి గంధాదీని మతాని మే.
ఇంద్రియాణి దశ శ్రోత్రత్వగ్దృగ్రసననాసికాః,
వాక్కరౌ చరణౌ మేఢ్రంపాయుర్దశమ ఉచ్యతే.
మనోబుద్ధి రహంకార శ్చిత్త మిత్యంతరాత్మకమ్,
చతుర్ధా లక్ష్యతే భేదో వృత్త్యా లక్షణరూపయా.

కారణరూపమైన ఇంద్రియాలూ, కర్తృత్వ రూపములైన ఇంద్రియానుష్ఠాన దేవతలూ, అనే వానియందు, ఆత్మభావాన్ని ఆరోపించుకుంటున్నాడు. దీనియందు పండితులు ప్రకృతినే కారణంగా నిరూపిస్తున్నారు. వాస్తవంచేత తాను ప్రకృతికంటె, భిన్నుడై, ఉండీ, యెవడైతే ప్రకృతియందు దాత్మ భావాన్ని ఆరోపించుకుంటాడో, ఆ పురుషుకు సుఖదుఃఖానుభవ యోగ్యుడగుచున్నాడు. అనిచెప్పిన కపిలుని దేవహూతి తిరిగి ఇలా అడుగుతున్నది.

పురుషోత్తమా! ఈ విశ్వ సంబంధమైన, స్థూల, సూక్ష్మ, కార్యాలు యెవరి యొక్క స్వరూపమో, యెవరు ఈ జగత్కారణులో, అట్టి ప్రకృతి పురుషుల లక్షణాలు కూడా నాకు వివరించి చెప్పమని అడిగిన దేవహూతికి చెపుతున్నాడు కపిలాచార్యుడు.

అమ్మా! ఏదైతే త్రిగుణాత్మకమై, అవ్యక్తమై, నిత్యమై కార్యకారణరూపమైయుండి తాను నిర్విశేషమైయుండీ కూడా, విశేషధర్మాల కాశ్రయమైన ప్రధాన నామకమగు తత్వాన్నే ప్రకృతి

ఏతావానేవ సంఖ్యాతో బ్రహ్మణస్స గుణస్యహ,
సన్నివేశో మయాప్రోక్తో యః కాలః పంచవింశకః,
ప్రభావం పౌరుషం ప్రాహుః కాలమేకే యతో భయమ్,
అహంకారవిమూఢస్య కర్తుః ప్రకృతిమీయుషః.
ప్రకృతేర్గుణసామ్యస్య నిర్విశేషస్య మానవి,
చేష్టా యతస్సభగవాన్ కాల ఇత్యుపలక్షితః.
అంతః పురుషరూపేణ కాలరూపేణ యో బహిః,
సమన్వేత్యేష తత్త్వానాం భగవానాత్మమాయయా.
దైవాత్ క్షుభితధర్మిణ్యాం స్వస్యాం యోనౌ పరః పుమాన్,
ఆధత్త వీర్యం సాసూత మహత్తత్త్వం హిరణ్మయమ్.

అంటారు. పంచమహాభూతములూ, పంచతన్మాత్రలూ, నాలుగు అంతఃకరణలూ, పది ఇంద్రియాలూ, యీ యిరువది నాలుగు తత్త్వముల సమూహాన్ని విద్వాంసులు, ప్రకృతి కార్యం అన్నారు. పృథివ్యాపస్తేజో వాయు రాకాశములే పంచమహాభూతములు, గంధ, రస, రూప, స్పర్శ శబ్దాలే తన్మాత్రలు. త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా, ఘ్రాణములూ, వాక్ పాణి పాద పాయూపస్థలూ కలసి దశేంద్రియాలు, మనో బుద్ధి చిత్త అహంకారాలే, అహంకార చతుష్టయం. ఒకే అంతఃకరణ సంకల్ప, నిశ్చయ, చింతా, అభిమానములనే వృత్తి భేదంచేత నాలుగు విధాలుగా గోచరిస్తుంది. ఈ విధంగా తత్త్వవేత్తలు సగుణ బ్రహ్మకు సన్నివేశ స్థానంగా చతుర్వింశతి తత్త్వ సంఖ్యను నిరూపించారు. కొందరు కాలశక్తిని పురుషునికంటే భిన్నంగా భావించక ఈశ్వర సంబంధమైన సంహారిణీ శక్తిగా నిరూపిస్తున్నారు. ఆ కాలశక్తి దేహాత్మభావంగల మానవులకు నిరంతరం మరణరూపమైన భయాన్ని కలిగిస్తుంది. ఎవని యొక్క ప్రేరణచే గుణములందు సామ్యావస్థారూపమైన, నిర్విశేషమగు ప్రకృతియందు గతి ఉత్పన్నమౌతున్నదో, వాస్తవంచేత ఆ పురుష రూపమైన భగవానుడే "కాల" మని చెప్పబడుతున్నాడు. ఈ విధంగా తన మాయద్వారా సమస్త ప్రాణులయందూ, లోపల

విశ్వమాత్మగతం వ్యంజన్ కూటస్థో జగదంకురః,
స్వతేజసాపిబత్తీవ్ర మాత్మప్రస్వాపనం తమః.
యత్తత్సత్త్వగుణం స్వచ్ఛం శాంతం భగవతః పదం.
యదాహుర్వాసుదేవాఖ్యం చిత్తం తన్మహదాత్మకమ్.
స్వచ్ఛత్వమవికారిత్వం శాంతత్వమితి చేతసః,
వృత్తిభిర్లక్షణంప్రోక్తం యథాపాంప్రకృతిః పరా.
మహత్తత్త్వాద్వికుర్వాణా ద్భగవద్వీర్య చోదితాత్,
క్రియాశక్తి రహంకార స్త్రివిధ స్సమపద్యత.
వైకారికస్తైజసశ్చతామసశ్చ యతోభవః,
మనసశ్చేంద్రియాణాం చ భూతానాం మహతామపి.

జీవరూపంలోనూ, బైట కాలరూపంలోనూ వ్యాప్తమైయుండు పరమేశ్వరుడే ఇరువది యైదవ తత్త్వము. ఎప్పుడైతే పరమాత్మ జీవుల యొక్క అదృష్టవశంచేత, క్షోభను పొందిన సమస్త జీవులకూ ఉత్పత్తి స్థానమైన తన మాయ యందు చిచ్ఛక్తి రూపమైన వీర్యాన్ని స్థాపిస్తాడో అప్పుడే అది తేజోమయమైన మహత్తత్త్వంగా ప్రభవిస్తుంది. లయ విక్షేపాది రహితమై జగత్తునకు అంకుర రూపమైన మహత్తత్త్వం తనయందున్న విశ్వాన్ని ప్రకటించడానికి తన్నాచ్ఛాదించి యున్న అంధకారాన్ని తన తేజస్సుచే మ్రింగి వేస్తుంది.

సత్వగుణమయమై, స్వచ్ఛమై, భగవంతునియొక్క ఉపలబ్ధి స్థాన రూపమైన చిత్తమే మహత్తత్త్వము. 'ఆ మహత్తత్త్వాన్నే వాసుదేవుడంటారు. దేనిని అధ్యాత్మమందు చిత్తమంటున్నారో, దానినే అధిభూతమందు మహత్తత్త్వ మంటున్నారు. చిత్తమందు అధిష్ఠాతగా ఉండే ఆ మహత్తత్త్వాన్నే "క్షేత్రజ్ఞుడు" గా ఉపాస్యమానమైన వాసుదేవుడుగా గ్రహించాలి. ఇదేవిధంగా అహంకార మందు అధిష్ఠాతగా "రుద్రుణ్ణీ", ఉపాస్యమాన దేవతగా సంకర్షణునీ, బుద్ధియం దధిష్ఠానంగా బ్రహ్మనూ, ఉపాస్య దేవతగా ప్రద్యుమ్ననీ,

సహస్రశిరసం సాక్షా ద్యమనంతం ప్రచక్షతే,
సంకర్షణాఖ్యం పురుషం భూతేంద్రియమనోమయం.
కర్తృత్వం కరణత్వం చ కార్యత్వం చేతి లక్షణమ్,
శాంతఘోరవిమూఢత్వ మితి వా స్యాదహంకృతేః.
వైకారికా దికుర్వాణాన్మన స్తత్త్వమజాయత,
యత్సంకల్పవికల్పాభ్యాం వర్తతేకామసంభవః.
య ద్విదుర్హ్య నిరుద్ధాఖ్యం హృషీకాణామధీశ్వరం,
శారదేందీవరశ్యామం సంరాధ్యం యోగిభిశ్శనైః,
తైజసాత్తు వికుర్వాణాద్బుద్ధిత త్త్వమభూత్సతి,
ద్రవ్యస్ఫురణవిజ్ఞానమింద్రియాణామనుగ్రహః,

మనస్సున కధిష్ఠానంగా చంద్రుని, ఉపాయ దేవతగా అని రుద్ధుని భావించాలి, దీనినే చతుర్వ్యూహ మంటారు. పృథివ్యాదులకు పూర్వం జల మెలాగైతే ఫేనాదిరహితంగా, స్వచ్ఛంగా నిర్మలంగా వికారశూన్యమై, శాంతంగా ఉందో అలాగే, స్వాభావికమైన అవస్థయొక్క దృష్టిలో స్వచ్ఛత్వ వికారశూన్యత్వ శాంతత్వ వృత్తులతో కూడిన చిత్తలక్షణమని చెప్తారు. అనంతరం భగవంతుని వీర్యరూపమైన చిత్ శక్తివల్ల ఉత్పన్నమైన మహత్తత్త్వం, వికృతిని పొందినప్పుడే, క్రియాశక్తి ప్రధానమైన అహంకారం, ఉత్పన్నమైంది. ఆ అహంకారం సాత్విక రాజస తామసములని మూడురకాలుగా ఉంటుంది. ఇందు సాత్వికాహంకారం నుండి మనస్సూ, రాజసాహంకారంవల్ల ఇంద్రియాలూ, తామసాహంకారంచేత పంచమహాభూతాలూ, పుట్టాయి. ఈ భూత ఇంద్రియ మనస్సులతో కూడిన అహంకారాన్నే పండితులు సంకర్షణ నామకమైన వేయిశిరములుగల అనంతు డన్నారు. అహంకారానికి దేవతా రూపంలో, కర్తృత్వం ఇంద్రియ రూపంలో కరణత్వం, పంచభూత రూపంలో కార్యత్వం లక్షణం. అదేవిధంగా, సత్వగుణంచేత శాంతత్వం, రజోగుణంవల్ల ఘోరత్వం, తమోగుణంవల్ల మూఢత్వం అహంకార లక్షణాలు. పైనచెప్పబడ్డ అహంకారత్రయంలో

సంశయోఽథ విపర్యాసోనిశ్చ యస్స్మృతి రేవచ,
స్వాప ఇత్యుచ్యతే బుద్ధేర్లక్షణంవృత్తితః పృథక్.
తైజసానీంద్రియాణ్యేవక్రియాజ్ఞాన విభాగశః,
ప్రాణస్యహిక్రియాశక్తిర్బుద్ధేర్విజ్ఞానశక్తితా.
తామసాచ్చవికుర్వాణాద్భగవద్వీర్యచోదితాత్,
శబ్దమాత్రమభూత్తస్మాన్నభశ్శ్రోత్రంతుశబ్దగమ్.
అర్థాశ్రయత్వం శబ్దస్యద్రష్టుర్లింగత్వమేవచ,
తన్మాత్రత్వంచ నభసోలక్షణం కవయోవిదుః.
భూతానాం ఛిద్రదాతృత్వం బహిరంతరమేవచ,
ప్రాణేంద్రియాత్మధిష్ణ్యత్వం నభసో వృత్తిలక్షణం.
నభసశ్శబ్దతన్మాత్రాత్కాలగత్యా వికుర్వతః,
స్పర్శో ఽభవత్తతో వాయుస్త్వక్స్పర్శస్య చ సంగ్రహః.

వైకారికా (సాత్వికా,) హంకారం, వికృతి నంధడంవల్లనే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ఆవిర్భవించింది. దీనినుండే కోర్కెలు కలుగుతూంటాయి. ఈ మనస్తత్వమే ఇంద్రియాధిష్ఠానమగు "అనిరుద్ధుడు". నీలకమలములతో సమానంగా శ్యామవర్ణంకల ఈ అనిరుద్ధునే యోగులు మెల్ల మెల్లగా వశంచేసుకుంటూ, ఆరాధిస్తూంటారు.

మహాసాధ్వీ! తైజసాహంకారమందు కలిగిన వికారమే బుద్ధితత్వం. దీనికి వస్తు స్ఫురణ రూపజ్ఞానం, ఇంద్రియవ్యాపారములందు సహకరించటం, పదార్థములయొక్క విశేషజ్ఞానాన్ని కలిగించడం అనేవి బుద్ధియొక్క కార్యాలు. వృత్తిభేదంచేత, సంశయం విపరీత జ్ఞానం, నిశ్చయం, స్మృతి, నిద్రా, కూడా బుద్ధిలక్షణాలే. ఈ బుద్ధితత్వాన్నే "ప్రద్యుమ్న" డన్నారు. ఇంద్రియాలు కూడా తైజసాహంకార కార్యాలే. కర్మ జ్ఞాన విభాగంచేత కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ, అని భేదం కలుగుతుంది. వీటిలో కర్మ ప్రధానమైంది. ప్రాణశక్తి, జ్ఞాన ప్రాధాన్యమైంది. బుద్ధి, శక్తి, భగవంతుని యొక్క చేతనాశక్తి ప్రేరణ చేత్లనే తామసాహంకారంవల్ల శబ్ద తన్మాత్రా

మృదుత్వం కఠినత్వం చ శైత్యముష్ణత్వమేవ చ,
ఏతత్స్పర్శస్య స్పర్శత్వం తన్మాత్రత్వం నభస్వతః.
చాలనం వ్యూహనం ప్రాప్తిర్నేతృత్వం ద్రవ్యశబ్దయోః,
సర్వేంద్రియాణా మాత్మత్వంవాయోఃకర్మాభిలక్షణమ్.
వాయోశ్చ స్పర్శతన్మాత్రాద్రూపం దైవేరితాదభూత్,
సముత్థితం తతస్తేజశ్చక్షూరూపోపలంభనమ్.
ద్రవ్యాకృతిత్వం గుణతా వ్యక్తిసంస్థానమేవచ,
తేజస్త్వం తేజసస్సాధ్వీరూపమాత్రస్య వృత్తయః.
ద్యోతనం పచనం పానమదనం హిమమర్దనమ్,
తేజసో వృత్తయస్త్వేతా శ్శోషణం క్షుత్తృడేవ చ.

ప్రాదుర్భావమైనది. శబ్దతన్మాత్రనుండే ఆకాశము, శబ్దజ్ఞానాన్ని కలిగించే శ్రోత్రేంద్రియమూ, ఆవిర్భవించాయి. అర్థాన్ని ప్రకాశింపచెయ్యడం,చాటునున్న వక్తయొక్క జ్ఞానాన్నికూడా ప్రదర్శించడం ఆకాశంయొక్క సూక్ష్మరూపమైన తన్మాత్రత్వం, యివన్నీ శబ్దానికి లక్షణాలని విద్వాంసుల మతం. భూతములకు అవకాశమివ్వడం, అన్ని భూతములయందూ లోపలా బైటా వ్యాప్తి చెందించడం, ప్రాణ ఇంద్రియ మనస్సులకు ఆశ్రయంగా ఉండడం యివన్నీ ఆకాశానికి వృత్తిరూపమైన (కార్యరూపమైన) లక్షణాలు.

శబ్దతన్మాత్రాకార్యమైన ఆకాశమందు కాలగతిచే వికారం సిద్ధించినప్పుడే, శ్పర్శతన్మాత్ర, దానివల్ల వాయువూ, స్పర్శగ్రహణాధారమైన త్వగింద్రియం, ఉత్పన్నమైనాయి. కోమలత్వం, కఠోరతా, శీతలతా, ఉష్ణతా, వాయువు యొక్క సూక్ష్మత్వమూ ఇవన్నీ స్పర్శ లక్షణాలు, వృక్షశాఖలను కదిలించుట, తృణాదుల నేకంచేయుట సర్వత్రగమనం, గంధాదులను ఘ్రాణేంద్రియం దగ్గరకూ, శబ్దాదులను శ్రోత్రేంద్రియం దగ్గరకూ, తీసుకురావడం, ఇంద్రియాలన్నిటికీ కార్యశక్తులను ప్రసాదించడం మొదలైనవి వాయువుకు వృత్తిలక్షణాలు. శ్పర్శమాత్రావశిష్టమైన, వాయువికారం చేతనే, రూపతన్మాత్ర, దానివల్ల తేజస్సూ, రూపగ్రహణయోగ్యమైన నేత్రేంద్రియం ప్రాదుర్భవిం

రూపమాత్రాద్వికుర్వాణా త్తైజసాద్దైవచోదితాత్,
రసమాత్రమభూ త్తస్మాదంభో జిహ్వారసగ్రహః.
కషాయో మధురస్తిక్తః కట్వమ్లఇతి నైకధా,
భౌతికానాం వికారేణ రసఏకో విభిద్యతే.
క్లేదనం పిండనం తృప్తిః ప్రాణనాప్యా యనోదనమ్,
తాపాపనోదో భూయస్త్వ మంభసో వృత్త యస్త్విమాః.
రసమాత్రాద్వి కుర్వాణా దంభసో దైవచోదితాత్,
గంధమాత్రమ భూత్తస్మాత్పృథ్వీఘ్రాణస్తు గంధగః,
కరంభపూతిసౌరభ్యశాంతో గ్రామ్లాదిభిః పృథక్,
ద్రవ్యా వయవవైషమ్యాద్గంధ ఏకో విభిద్యతే.

చాయి. వస్తువుయొక్క ఆకారాన్ని బోధచెయ్యడం, ద్రవ్యానికి అంగ రూపంగా ప్రతీతమవడం, ద్రవ్యంయొక్క ఆకార పరిమాణాదులలో ఉపలక్షితం కావడం, తేజానికి స్వరూపభూతంకావటం, యివన్నీ రూపతన్మాత్రిక లక్షణాలు. ప్రకాశించడం పచనం చెయ్యడం శీతాన్ని నశింప చెయ్యడం, శోషింపచేయడం ఆకలి దప్పికలను పుట్టించడం భుజింప జెయ్యడం, పానం చేయించడం, యివన్నీ తేజస్సు యొక్క వృత్తులు.

దైవప్రేరణచే రూపతన్మాత్రమయమగు తేజోవికారం వల్ల రస తన్మాత్రా దానివల్ల జలం రసగ్రహణసమర్థమైన రసనేంద్రియం ఆవిర్భ వించాయి. రసం తనశుద్ధ స్వరూపంలో ఒకటేగాని అన్యమైన భౌతిక పదార్థ సంయోగంచేత కటు,తిక్త,కషాయ మధుర,ఆమ్ల,లవణాది భేదా లు కలిగి ఆరు రసాలైనాయి.తడుపుట,పిండాకారంగా చేయుట,జీవింప జేయుట,తృప్తినికలిగించుటదప్పికనుపోగొట్టుట,పదార్థములందుమార్దవం కలిగించుట, తాపనివృత్తిని కలిగించుట, కూపాదులనుండి నీరు గ్రహి స్తూంటే తిరిగి వృద్ధి పొందుతూ ఉండటం యివన్నీ జలానికి వృత్తులు.

రసస్వరూపమైన జలం వికృతి చెందటంవల్ల గంధ తన్మాత్రా, దానివల్ల పృథివీ, గంధగ్రహణ సమర్థమైన ఘ్రాణేంద్రియం ఉద్భవిం చాయి. గంధం ఒక్కటే అయినా పరస్పర సంయోగంచేత పదార్థముల

భావనం బ్రహ్మణః స్థానం ధారణం సద్విశేషణమ్,
సర్వస త్త్వగుణోద్భేదః పృథివీవృత్తి లక్షణమ్.
నభో గుణవిశేషోఽర్థో యస్య తచ్ఛ్రోత్రముచ్యతే,
వాయోర్గుణవిశేషోఽర్థో యస్య తత్స్పర్శనం విదుః.
తేజో గుణవిశేషోఽర్థో యస్య తచ్చ క్షురుచ్యతే,
అంభో గుణవిశేషోఽర్థో యస్యతద్రసనం విదుః,
భూమేర్గుణవిశేషోఽర్థో యస్య తద్ఘ్రాణముచ్యతే.
పరస్య దృశ్యతే ధర్మోహ్యపరస్మిన్ సమన్వయాత్,
అతో విశేషో భావానాం భూమావేవోపలక్ష్యతే,
ఏతాన్యసంహత్య యదా మహదాదీని సప్తవై,

హెచ్చు తగ్గుల ననుసరించి సుగంధం, మిశ్రమగంధం, తీవ్రగంధం, మొదలైన అనేక తరగతులుగా వృద్ధిచెందుతుంది. ప్రతిమాది రూపాలలో బ్రహ్మయొక్క సాకారభావన కాశ్రయం కావడం జలాది కారణాలకు భిన్నమైన ఏ ఆశ్రయం అక్కర లేకుండా ఉండటం జలాది పదార్థాలను ధరించడం ఆకాశాదులకు అవచ్ఛేదం కావడం ఘటాకాశ పటాకాశాది భేదములను సిద్ధింప జేయుడం పరిమాణ విశేషం చేత, సమస్త ప్రాణులయొక్క స్త్రీత్వ పురుషత్వాది గుణాలను ప్రకటించడం యివన్నీ పృథివియొక్క కార్యరూపమైన లక్షణాలు.

ఆకాశానికి విశేషగుణం శబ్దం. అట్టి శబ్దం శ్రోత్రేంద్రియానికి విషయం. వాయువునకు విశేషగుణం స్పర్శ. ఆస్పర్శ త్వగింద్రియ విషయంగా నిరూపింప బడింది. తేజోవిశేషగుణం రూపం. రూపం విశేషముగాగలది నేత్రేంద్రియం. జలానికి విశేషగుణం రసం. రసం రసనేంద్రియ విషయం. గంధం పృథివీ విశేషగుణం. గంధం ఘ్రాణేంద్రియ విషయంగా పరిగణింప బడుతుంది. వాయువు మొదలుగాగల కార్యతత్త్వములందు ఆకాశాది కారణ తత్త్వముండడంవల్ల వాని గుణములుకూడా అనుగతంగా చూడబడుతున్నాయి. కనుక నే సమస్తభూతగుణములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు, పృథివియందే గోచరిస్తున్నాయి. ఎప్పుడైతే మహత్తత్త్వం, అహంకారం పంచభూతాలూ, ఒకదానితో

కాలకర్మ గుణోపేతో జగదాదిరుపావిశత్.
తతస్తేనానువిద్ధేభ్యోయుక్తేభ్యోఽండమచేతనమ్,
ఉత్థితం పురుషో యస్మాదుదతిష్ఠదసౌ విరాట్.
ఏతదండం విశేషాఖ్యం క్రమవృద్ధైర్దశోత్తరైః,
తోయాధిభిః పరివృత్తం ప్రధానే నావృతైర్బహిః.
యత్ర లోకవితానోఽయం రూపం భగవతో హరేః.
హిరణ్మయాదండకోశాదుత్థాయ సలిలేశయాత్,
తమావిశ్య మహాదేవో బహుధా నిర్బిభేద ఖమ్.
నిరభిద్యతాస్య ప్రథమం ముఖం వాణీ తతోఽభవత్,
వాణ్యా వహ్నిరథో నాసే ప్రాణతో ఘ్రాణ ఏతయోః.
ఘ్రాణాద్వాయురభిద్యేతా మక్షిణీ చక్షురేతయోః,
తస్మాత్సూర్యోఽన్వభిద్యేతాం కర్ణౌ శ్రోత్రం తతో దిశః.

ఒకటి కలియకుండా వేరువేరుగా ఉన్నాయో, అప్పుడే జగత్కారణు డైన నారాయణుడు కాల, అదృష్ట సత్త్వాది గుణములతో వాని యందు ప్రవేశించాడు.

పరమాత్మ ప్రవేశించిన వెంటనే క్షుభితములై పరస్పరం ఒక దానితో ఒకటి కలియడం జరిగి ఆతత్త్వములవల్ల జడరూపమైన ఒక అడం ఆవిర్భవించింది. ఆ అండంనుండి విరాట్పురుషు డభివ్యక్తమై నాడు. ఈ అండానికే విశేషమని పేరు. దీనియందే శ్రీహరియొక్క స్వరూప భూతములైన పదునాలుగు భువనాలు ఉన్నాయి. ఇది నలు మూలల నుండీ పదేసి రెట్లు ఉండి అధికమైన ఆవరణలు ఏడుకలిగి ఉంటుంది. జలావరణ దానికి పదిరెట్లు, అగ్ని దానికి పదిరెట్లు, ఇలాగే వాయువూ క్రమంగా ఆకాశ, అహంకార, మహత్తత్త్వాలూ, వీటన్ని టికి పైన ప్రకృతి, కారణమయమైన జలమందు శయనించి ఆ ఉన్న అండాన్నుండి లేచి పునః ఆ అండమందు ప్రవేశించాడువిరాట్పురు షుడు. దానియందు కొన్ని ఛిద్రాలు కలిగించాడు. అన్నిటికంటే ముందు ముఖం, దానినుండి వాగింద్రియం వాగింద్రియాధిష్ఠాన దేవత యగు అగ్నీ ఉద్భవించాయి. అనంతరం నాసికాఛిద్రాలూ వాని నుండి

నిర్భిభేద విరాజ స్త్వగ్రోమశ్మ శ్వాదయస్తతః,
తతఓషధయశ్చాసన్ శిశ్నం నిబిభిదే తతః.
రేతస్తస్మాదాప ఆసన్ నిరభిద్యత వై గుదమ్,
గుదాదపానోఽపానాచ్చ మృత్యుర్లోకభయంకరః.
హస్తౌ చ నిరభిద్యేతాం బలం తాభ్యాం తతస్స్వరాట్,
పాదౌ చ నిరభిద్యేతాం గతిస్తాభ్యాం తతో హరిః.
నాడ్యోఽస్య నిరభిద్యంత తాభ్యోలోహితమాభృతమ్,
నద్యస్తతస్సమభవన్నుదరం నిరభిద్యత.
క్షుత్పిపాసే తతస్స్యాతాం సముద్రస్త్వేతయోరభూత్,
అథాస్యహృదయం భిన్నం హృదయాన్మన ఉత్థితమ్.
మనసశ్చంద్రమా జాతో బుద్ధిర్బుద్ధేర్గిరాం పతిః,
అహంకార స్తతోరుద్రశ్చిత్తం చైత్త్యస్తతోఽభవత్.
ఏతే హ్యభ్యుత్థితాదేవానైవాస్యోత్థాపనేఽశకన్,
పునరావివిశుః ఖాని తముత్థాపయితుం క్రమాత్,

ప్రాణసహితమైన ఘ్రాణేంద్రియం ఇంద్రియాధిష్ఠానమైన వాయువూ, ఉత్పన్నమైనాయి. అనంతరం నేత్రాగోళాలూ, వానినుండి చక్షురింద్రియం, వాని కధిష్ఠాన దేవతయగు సూర్యుడూ ఆవిర్భవించాయి. కర్ణ రంధ్రాలూ వాని నుండి శ్రోత్రేంద్రియం ఆ ఇంద్రియాభిమానంకల దిగ్దేవతలూ, ఆవిర్భవించిన పిమ్మట విరాట్పురుషునియొక్క చర్మమూ, ఆ చర్మంనుండి కేశ, శ్మశ్రు, రోమాదులూ, ప్రకటితమైనాయి. త్వగభిమాన దేవతలుగా ఓషధులావిర్భవించాయి. అనంతరం లింగమూ, దానినుండి వీర్యమూ, లింగాభిమానదేవతగా ఆపో దేవతా వ్యుత్పన్నమైనాయి. ఇదే క్రమంలో గుదా, అపానవాయువూ, తదధిష్ఠానంగా లోక భయంకరమైన మృత్యుదేవతా, హస్తములూ, బలమూ, హస్తేంద్రియాధిష్ఠానంగా ఇంద్రుడూ పాదములూ, గమన క్రియా, పాదేంద్రియాభిమాన దేవతా, విష్ణువూ, ఆవిర్భవించాయి. అదేవిధంగా విరాట్పురుషుని యందునాడులూ, రుధిరమూ నదులూ పుట్టాయి. అనంతరం ఉదరం, దానినుండి క్షుత్పిపాసలూ ఉదరాభిమాన దేవత, సముద్ర దేవత, జనించారు. తరువాత హృదయం, మనస్సూ మనోభిమాన

వహ్నిర్వాచా ముఖంభేజే నోదతిష్ఠత్తదా విరాట్,
ఘ్రాణేన నాసికే వాయుర్నోదతిష్ఠత్తతోవిరాట్.
అక్షిణీ చక్షుషాదిత్యో నోతిష్ఠత్తదా విరాట్॰
శ్రోత్రేచ కర్ణౌచ దిశో నోదతిష్ఠత్తదా విరాట్.
త్వచం రోమభిరోషధ్యో నోదతిష్ఠత్తతో విరాట్,
రేతసా శిశ్నమాపస్తు నోదతిష్ఠత్తతో విరాట్.
గుదం మృత్యురపానేన నోదతిష్ఠత్తతో విరాట్,
విష్ణుర్గత్యైవ చరణౌనోదతి ష్ఠత్తతో విరాట్,
హస్తావింద్రో బలేనైవ నోదతిష్ఠత్తతో విరాట్,
నాడీర్నద్యోలోహితేననోదతిష్ఠత్తతో విరాట్.
క్షుత్తృడ్భ్యాముదరం సింధుర్నోదతిష్ఠత్తతో విరాట్,
హృదయం మనసాచంద్రో నోదతిష్ఠత్తతో విరాట్.
బుద్ధ్యా బ్రహ్మాదిహృదయం నోదితిష్ఠత్తతో విరాట్,
రుద్రోఽభిమత్యాహృదయం నోదతిష్ఠత్తతో విరాట్.

దేవతగా చంద్రుడూ పుట్టారు. ఆహృదయంనుండి బుద్ధీ, బుద్ధ్యభిమాన దేవత, బ్రహ్మ, అహంకారమూ, అహంకారాభిమాన దేవత, రుద్రుడూ, చిత్తమూ చిత్తాభిమాన దేవతా, క్షేత్రజ్ఞుడూ, క్రమంగా ఆవిర్భవించాయి. క్షేత్రజ్ఞుని కంటే భిన్నమైన ఎందరు దేవతలు పుట్టినా విరాట్పురుషుని మేల్కొల్పలేక పోయారు. కాని విరాట్పురుషుని లేవదీయుటకై వారు వారి ఉత్పత్తిస్థానాలలో ప్రవేశించడం ఆరంభించారు. అగ్నివారితో కూడా ముఖమందు ప్రవేశించినా, విరాట్పురుషుడు లేవలేదు. వాయువు ఘ్రాణేంద్రియ సమేతంగా నాసికయందూ, సూర్యుడు చక్షు రింద్రియ సమేతంగా నేత్రములందూ, దిక్కులు శ్రవణేంద్రియంతో కూడా కర్ణములందూ. ఓషధులు రోమసమేతంగా త్వక్కునందూ, జలంవీర్యసమేతంగా లింగమందూ మృత్యువపానసమేతంగా గుదమందూ, ఇంద్రుడు బలసమేతంగా హస్తములందూ విష్ణువు గతిసమేతంగా చరణములందూ నదులు రుధిరసమేతంగా నాడులందూ సముద్రుడు ఆకలిదప్పికలతో కూడా కుక్షి యందూ, చంద్రుడు మనస్సుతో హృదయమందూ, బ్రహ్మ బుద్ధిసమేతంగా హృదయ

చిత్తేనహృదయం చైత్త్యః క్షేత్రజ్ఞః ప్రావిశద్యదా,
విరాట్తదైవపురుషస్సలిలాదుదతిష్ఠత.
యథా ప్రసుప్తంపురుషంప్రాణేంద్రియమనోధియః,
ప్రభవంతి వినా యేన నోత్థాపయితుం మోజసా.
తస్మింస్తంప్రత్యగాత్మానం ధియా యోగప్రవృత్తయా,
భక్త్యా విరక్త్యా జ్ఞానేన వివిచ్యాత్మని చింతయేత్.

మందూ, రుద్రుడహంకారంతో కూడా హృదయమందూ, ప్రవేశించినా విరాట్పురుషుడు లేవలేదు. చిత్తాధిష్ఠాన దేవతయగు క్షేత్రజ్ఞుడెప్పుడైతే విరాట్పురుషునియందు ప్రవేశించాడో ఆ క్షణంలో విరాట్పురుషుడు లేచి నిలిచాడు. ప్రాణ, ఇంద్రియ, మనోబుద్ధ్యాదులు క్షేత్రజ్ఞుని సహాయంలేనిదే నిదురించే వానిని యెలాగైతే లేపలేవో అల్లే విరాట్పురుషుని కూడా క్షేత్రజ్ఞుడైన పరమాత్మ సంబంధంలేకుండా లేవదీయలేవు. గనుక భక్తి వైరాగ్యముల సహాయంతో ఏకాగ్రతవల్ల కలిగిన జ్ఞానంద్వారా అంతరాత్మ స్వరూపుడైన క్షేత్రజ్ఞుని తనశరీరమందున్న వాడుగా గ్రహించి ధ్యానించాలి.

## 26 అధ్యాయం

ప్రకృతిస్థోపి పురుషోనాజ్యతే ప్రాకృతైర్గుణైః,
అవికారాదకర్తృత్వాన్నిర్గుణత్వాజ్జలార్కవత్,
సఏషయర్హి ప్రకృతే ర్గుణేష్వభివిషజ్జతే,
అహంకారవిమూఢాత్మా కర్తాస్మీత్యభిమన్యతే.
తేన సంసారపదవీం మనసాభ్యేత్య నిర్వృతః,
ప్రాసంగికైః కర్మదోషైస్సదసన్మిశ్రయోనిషు,

మాతా! జలంలో ప్రతిబింబించిన సూర్యునకు జలమందుండే చంచలత్వాది గుణాలయొక్క సంబంధం యెలాగైతే లేదో అలాగే ప్రకృతికార్యమైన శరీరమందున్నప్పటికీ, ఆత్మ వాస్తవంగా శరీరసంబంధమైన సుఖదుఃఖాది ధర్మాలతో సంబంధంలేనిదిగానే ఉంటుంది. కారణమేమంటే స్వతః ఆత్మ నిర్వికారమూ నిర్గుణమూ కర్తృత్వరహితమూ,

అర్థేహ్యవిద్యమానేஉపి సంసృతిర్న నివర్తతే,
ధ్యాయతో విషయానస్య స్వప్నేనార్థాగమో యథా.
అతఏవ శనైశ్చిత్తం ప్రసక్తమసతాం పథి,
భక్తియోగేన తీవ్రేణ విరక్త్యా చనయే ద్వశం,
యమాభిర్యోగమార్గైరభ్యసన్ శ్రద్ధయాన్వితః,
మయిభావేన సత్యేన మత్కథాశ్రవణేన చ.
సర్వభూతసమత్వేన నిర్వైరేణా ప్రసంగతః,
బ్రహ్మచర్యేణ మౌనేన స్వధర్మేణ బలీయసా.
యదృచ్ఛ యోపలబ్ధేన సంతుష్టో మితభుఙ్మునిః,
వివిక్తశ్శరణశ్శాంతో మైత్రః కరుణ ఆత్మవాన్.
సానుబంధేచ దేహేஉస్మిన్నకుర్వన్న సదాగ్రహమ్,
జ్ఞానేన దృష్టతత్త్వేన ప్రకృతేః పురుషస్య చ.

అవడమేకాని అదే ఆత్మ ప్రకృతి గుణాలలో సంబధాన్ని కల్పించుకుని ఆహంకారంచే మోహితమై నేను కర్తనని అనుకుంటూ ఉంటూంది. ఆఅభిమానంవల్లనే దేహాసం సర్గం చేత చేయబడిన పుణ్యాపాప రూపము లైన కర్మలకు అధీనమై తన స్వతంత్రిత శాంతి అనే వానిని పోగొట్టు కుంటుంది. అంతేగాక, ఉత్తమ మధ్యమ అధమాది యోనులందు జన్మిస్తూ, సంసారచక్రంలో తిరుగులాడుతూ ఉంటుంది. స్వప్నమందు భయశోకాదులకూ సంబంధం లేకపోయినా స్వప్నపదార్థములందుండే ఆసక్తిచేత స్వప్నమందుకూడా సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉన్నట్లే భయ. శోక, అహం, మమకారాదులు కల్గియుండడంవలన జననమరణ రూపమైన సంసారంయొక్క సత్తా లేకపోయినా, విషయసుఖ చింతనచే జీవుడు సంసారచక్రంనుండి విడివడలేకున్నాడు. అందుకే బుద్ధిశాలియగు మనుష్యుడు విషయములందు చిక్కువడిన చిత్తాన్ని తీవ్రమైన భక్తి యోగ వైరాగ్యసాధనలసహాయంతో, వశపరచుకోవాలి.

యమాది యోగసాధనలద్వారా, శ్రద్ధాపూర్వకమైన అభ్యా సంవల్ల చిత్తానికి మాటిమాటికీ ఏకాగ్రతను కలిగిస్తూ నాయందు సత్యమైన భావంతో ఉండాలి. నా కథలను వినుట, సర్వజీవులయందూ

నివృత్త బుద్ధ్యవస్థానో దూరీభూతాన్యదర్శనః,
ఉపలభ్యాత్మనాత్మానం చక్షుషేవార్కమాత్మదృక్.
ముక్తలింగం సదాభాస మసతి ప్రతిపద్యతే,
సతో బంధుమ సచ్చక్షు స్సర్వాను స్యూతమద్వయమ్.
యథా జలస్థఆభాసః స్థలస్థేనావదృశ్యతే,
స్వాభాసేన యథాసూర్యో జలస్థేన దివిస్థితః.
ఏవం త్రివృదహంకారో భూతేంద్రియ మనోమయైః,
స్వాభాసైర్లక్షితోఽ నేన సదాభాసేన సత్యదృక్,
భూతసూక్ష్మేంద్రియమనోబుద్ధ్యాది ష్విహనిద్రయా,
లీనేష్వసత్సు యస్తత్ర వినిద్రో నిరహంక్రియః.

సమాన దృష్టి, యెవరినీ ద్వేషించక పోవడం, దేనియందూ ఆసక్తి లేకుండా ఉండడం, బ్రహ్మచర్యం, మౌనం, ప్రారబ్ధవశంచేత లభించిన పదార్థములతో సంతుష్టి చెందడం, సర్వం పరమేశ్వరుని యందర్పణ చేయడం, పరిమితంగా ఆహారాన్ని గ్రహించడం ఎల్లవేళలా ఏకాంత వాసం, శాంతస్వభావం, అందరియందు మైత్రి, దయ, ధైర్యం, ప్రకృతి పురుషుల యదార్థజ్ఞానం తెలియడంవల్ల స్త్రీ పుత్రగృహాదులందు మమకారం దేహం యందు అహంకారం లేకపోవుట, జాగ్రదాదిఅవస్థలందు కూడా ప్రపంచ సంబంధం లేకుండా బుద్ధిని పరమాత్మయందే స్థిరమొనర్చుట మొదలుగాగల ఆత్మదర్శియగు జ్ఞాని నేత్రములతో సూర్యుని చూసి నట్లే పరిశుద్ధమైన అంతఃకరణద్వారా పరమాత్మ సాక్షాత్కారం పొంది అద్వితీయమైన బ్రహ్మపదాన్ని పొందగలుగు తున్నాడు. దేహాది సమస్త ఉపాధుల కంటె భిన్నమైనదీ అహంకారాది అసద్వస్తువులందు సత్యరూపంతో ప్రకాశించేదీ జగత్కారణ భూతమైన ప్రకృతికి అధిష్ఠానంగా ఉండేదీ, సమస్త కార్యకారణవర్గమైన మహదాదుల్ని ప్రకాశింపజేసేదీ కార్యకారణ వర్గమందు వ్యాప్తి చెంది ఉండేదీ పరమాత్మయని గ్రహించాలి.

జలమందు ప్రతిబింబించిన సూర్యబింబం స్థలమందు కూడా, ఆభాసరూపంలో గోచరిస్తుంది. ఆభాస సంబంధంచేత జలప్రతిబింబా

మన్యమానస్తదాత్మాన మనష్టో నష్టవన్మృషా,
నష్టేఽహంకరణే ద్రష్టా నష్టవిత్త ఇవాతురః.
ఏవం ప్రత్యవమృశ్యాసావాత్మానం ప్రతిపద్యతే,
సాహంకారస్య ద్రవ్యస్య యోఽవస్థానమనుగ్రహః.
పురుషం ప్రకృతి ర్బ్రహ్మన్నవిముంచతి కర్హిచిత్,
అన్యోన్యా పాశ్రయత్వా చ్చ నిత్య త్వాదనయోః ప్రభో.
యథా గంధస్య భూమేశ్చ న భావో వ్యతిరేకతః,
అపాం రసస్యచ య థా తథా బుద్ధేః పరస్యచ,
అకర్తుః కర్మబంధోఽ యం పురుషస్య యదాశ్రయః,
గుణేషు సత్సు ప్రకృతేః కైవల్యం తేష్వతః కథమ్,

న్ననుసరించి ఆకాశమందున్న సూర్యుని యొక్క జ్ఞానంకలిగి నట్లే వైకారికాది భేదములచే మూడు విధములైన అహంకారం దేహ, ఇంద్రియ మనస్సులందున్న తన ప్రతిబింబంచేతనే లక్షితమౌతున్నది. సద్రూపమైన పరమాత్మ ప్రతిబింబ యుక్తమైన ఆ అహంకారం ద్వారా, సత్య జ్ఞాన స్వరూపుడైన పరమాత్మయొక్క జ్ఞానం కలుగుతుంది. సుషుప్తి యందు నిద్రవల్ల శబ్ద, భూత, సూక్ష్మ, ఇంద్రియమనోబుద్ధ్యాదులు, అవ్యాకృతమందు లీనమౌతున్నాయి. లీనమైన సమయంలో తానొక్కడే మేల్కొని ఉంటున్నాడు. పైగా అహంకార శూన్యుడుగా కూడా ఉంటున్నాడు. జాగ్రదవస్థయందీ ఆత్మభూత సూక్ష్మాది దృశ్యవర్గం యొక్క ద్రష్టరూపంలో స్పష్టంగా అనుభవంలోకి వస్తూన్నది. సుషుప్తిసమయంలో ఉపాధిభూతమైన అహంకారం కూడా, నశించి పోవడంవల్ల ఆతడు భ్రమవంశచేత తానుకూడా నష్టపోయినట్లే అనుకుంటున్నాడు. ధనం నాశమైపోయినవాడు తనే నాశమైపోయాననుకుంటాడు. అట్లే అహంకారం నశిస్తే తానే నాశనమైపోయాననుకుంటాడు.

తల్లీ! ఇవన్నీ ఆలోచించి మననంచేసి వివేకి యైనవాడు, సర్వాధిష్ఠానమైన ఆత్మానుభవం పొంది నిరతిశయమైన ఆనందం పొందగలుగుతాడు – అని చెప్పిన కపిలుని వాక్యాలు విని, దేవహూతి :–

క్వచిత్తత్త్వావమర్శేన నివృత్తం భయముల్బణమ్,
అనివృత్త నిమిత్తత్వాత్పునః ప్రత్యవతిష్ఠతే.
అనిమిత్తనిమిత్తేన స్వధర్మేణామలాత్మనా,
తీవ్రయా మయి భక్త్యాచ శ్రుత సంభృతయా చిరమ్.
జ్ఞానేన దృష్టతత్త్వేనవైరాగ్యేణ బలీయసా,
తపో యుక్తేన యోగేన తీవ్రేణాత్మసమాధినా.
ప్రకృతిః పురుషస్యేహ దహ్యమానాత్వహర్నిశమ్,
తిరోభవిత్రీశనకైరగ్నే ర్యోనిరివారణిః.
భుక్తభోగా పరిత్యక్తా దృష్టదోషా చ ని త్యశః,
నేశ్వరస్యా శుభం దత్తే స్వే మహిమ్ని స్థితస్య చ.

ప్రభూ! ప్రకృతీ, పురుషుడూ, యీ యిద్దరే నిత్యులై ఒకరి కొకరు ఆశ్రియభూతులుగా ఉంటారు. అందువల్ల ప్రకృతి పురుషుణ్ణి ఎప్పుడూ విడిచి ఉండదు. గంధానికీ పృథివికీ, రసానికీ జలానికీ ఎలా ఐతే అవినాభావసంబంధం ఉందో, అలాగే ప్రకృతి పురుషులుకూడా, అవినాభావసంబంధం కలవారే, ఒకరిని విడిచి ఒకరు ఉండడాని కవకాశం లేదు. అట్టి స్థితిలో దేని ఆశ్రియంవల్ల కర్తకాని పురుషునకు ఈ కర్మబంధం ప్రాప్తించింది? ఆ ప్రకృతిగుణాలు ఉండగా పురుషునకు కైవల్య మెలా ప్రాప్తిస్తుంది? తత్వావిచారణవల్ల సంసారబంధ రూపమైన భయం, నివృత్తికావచ్చు. ఐనా దానికి నిమిత్తభూతమైన ప్రకృతిగుణాలు, అభావం కాకపోవడంవల్ల ఆ భయం తిరిగి ఉపస్థితమవడానికి అవకాశం కనుపిస్తూ ఉంది. కనుక సాధ్యమైనంత వరకూ యీ సంశయాన్ని నివారింతువు గాక - అని అడిగిన దేవహూతికి తిరిగి చెప్పడం ఆరంభించాను కపిలమహర్షి.

అమ్మా! అగ్నికి ఉత్పత్తిస్థానమైన అరణి తనయందు పుట్టిన అగ్ని చేతనే యెట్లు భస్మమౌతుందో, అట్లే నిష్కామంగా పాలించే స్వధర్మ పాలనవల్లనూ, సత్కార్మానుష్ఠానాదులవల్లనూ అంతఃకరణ పరిశుద్ధమైనందువల్లనూ, చిరకాలం భగవత్కథా శ్రవణంచేత పరిశుద్ధ

యథాహ్యప్రతిబుద్ధస్య ప్రస్వాపోఽపి హ్యనర్థకృత్,
స ఏతత్ప్రతిబుద్ధస్య నవై మోహాయ కల్పతే.
ఏవం విదితతత్త్వస్య ప్రకృతిర్మయిమానసమ్,
యుంజతో నాపకురుత ఆత్మారామస్య కర్హిచిత్,
యథైన మధ్యాత్మరతః కాలేన బహుజన్మనా,
సర్వత్ర జాతవైరాగ్య ఆబ్రహ్మభువనాన్మునిః.
మద్భక్తః ప్రతిబుద్ధార్థో మత్ప్రసాదేన భూయసా,
నిశ్శ్రేయసం స్వసంస్థానం కైవల్యాఖ్యం మదాశ్రయమ్.
ప్రాప్నోతి హితతో ధీరస్స్వదృశాఛ్ఛిన్నసంశయమ్,
యద్గత్వానవివర్తేత యోగి లింగవినిర్గమైః,

ధైన, తీవ్రమైన భక్తిచేతనూ తత్త్వసాక్షాత్కార యోగ్యమైన జ్ఞానంవల్లనూ, ప్రబలమైన వైరాగ్యంతో కూడిన వ్రతనియమాది యుతమైన ధ్యానంచేతనూ, చిత్తంయొక్క గాఢమైన, ఏకాగ్రత వల్లనూ, పురుషునియొక్క అవిద్య రాత్రింబవళ్ళు క్షీణించి లయమై పోతుంది. విషయభోగములందు దోషములను గుర్తించి త్యజించిన పురుషుడు స్వతంత్రుడై, ఆత్మానుభూతి పొందగలుగుతాడు. అట్టి వానిని ప్రకృతి బంధింపలేదు. నిదురించిన వానికి స్వప్నమందనేకాలు కనుపించి సుఖదుఃఖాలను కలిగించినా మేల్కొంచేసరికి స్వప్నంయొక్క అనుభవాలనుండి యేవిధంగానూ మోహం కలుగదో, అదేవిధంగా తత్త్వజ్ఞానం కలవాడు నాయందే మనస్సు లగ్నంచేసి ధ్యానిస్తూంటాడు. అలాంటి ఆత్మారాముడైన మునిని ప్రకృతి యేవిధంగానూ మోహింప జేయలేదు. మానవుడనేక జన్మలలో యీ విధంగా ఆత్మచింతన చేయగా, చేయగా, తుదకు బ్రహ్మలోక పర్యంతం ఉండే సమస్త భోగాలయందూ విరాగం కలవాడవుతాడు. ధైర్యవంతుడైనట్టి నా భక్తుడు నా మహత్తరమైన కృపచే తత్త్వజ్ఞానం కలవాడై, ఆత్మానుభవం ద్వారా, సర్వసంశయాలనుండీ విముక్తుడై లింగదేహం నశించి ఏకమాత్రుడైన నాయందైక్యమై పునరావృత్తి రహితమైన మోక్షాన్ని పొందగలుగుతాడు. అదిఅవినాశనకరమైనది. జన్మమృత్యురహితమైనది.

యదా న యోగోపచితాసు చేతో మాయాసు సిద్ధస్య విషజ్జతేఽంగ,
అనన్యహేతుష్వథ మే గతిస్స్యా దాత్యంతికీయత్ర నమృత్యుహాసః.

అట్టి పరమపదప్రాప్తి నందినవాడు ప్రకృతికంటె పరమైన పరమాత్మ స్వరూపుడని గ్రహింపుము.

27 అధ్యాయం

యోగస్య లక్షణం వక్ష్యే సబీజస్య నృపాత్మజే,
మనోయేనైవ విధినా ప్రసన్నం యాతిసత్పథమ్.
స్వధర్మాచరణం శక్త్యా విధర్మాచ్చనివర్తనమ్,
దైవాల్లబ్ధేనసంతోషఆత్మవిచ్చరణార్చనమ్.
గ్రామ్యధర్మ నివృత్తిశ్చ మోక్షధర్మరతిస్తథా.
మితమేధ్యాదనంశశ్వద్వివిక్తక్షేమసేవనమ్.
అహింసాసత్యమస్తేయం యావదర్థపరిగ్రహః,
బ్రహ్మచర్యం తపశ్శౌచం స్వాధ్యాయః పురుషార్చనమ్.

అమ్మా! నే నిప్పుడు నీకు సబీజమైన యోగాన్ని గురించి చెబుతాను విను. ఈ యోగంవల్ల చిత్తం పరిశుద్ధ మవుతుంది. ప్రసన్నమైన చిత్తంతో, సన్మార్గంలో ప్రవృత్తు డౌతాడు. యథా శక్తిగా శాస్త్ర విహితమైన ధర్మాల్ని అనుష్ఠించడం, శాస్త్రవిరుద్ధ మైన ఆచారాలు వదలి వెయ్యడం, ప్రారబ్ధాన్ననుసరించి లభించిన దానితో తృప్తి చెందడం, ఆత్మజ్ఞానుల పాదసేవ, విషయ వాసనలను వృద్ధిచెందించే కర్మలకు దూరంగా ఉండడం, సంసార దుఃఖం నుండి విముక్తి నొందించు కర్మలను ప్రేమించుట, పవిత్రమైన అన్నాన్ని పరిమితంగా భుజించడం, ఏకాంతంగా నిర్భయంగా ఉండే ప్రదేశంలో నివాసం యేర్పరుచు కోవడం, మనస్సు వాక్కు శరీరాలతో యేజీవినీ హింసించకుండా సత్యమే పలుకుతూ దొంగ పనులు చేయక, అవసరాన్నతిక్రమించి అధికంగా వస్తు సంపాదన చేయక, బ్రహ్మచర్యాన్ని పాలిస్తూ, బాహ్యాభ్యంతర పారిశుద్ధ్యం

మౌనంసదాఽఽసనజయః స్థైర్యం ప్రాణజయశ్శనైః,
ప్రత్యాహారశ్చేంద్రియాణాం విషయాన్ మనసా హృది,
స్వధిష్ణ్యా నామేకదేశే మనసా ప్రాణధారణమ్.
వైకుంఠలీలా భిధ్యానం సమాధానం తథాత్మనః.
ఏతైరన్యైశ్చ పథిభిర్మనోదుష్టమసత్పథమ్,
బుద్ధ్యా యుంజీత శనకైర్జితప్రాణోహ్యతంద్రితః.
శుచౌ దేశే ప్రతిష్ఠాప్య విజితాసనఆసనమ్,
తస్మిన్ స్వస్తిక ఆసీనో ఋజుకాయస్సమభ్యసేత్.
ప్రాణస్య శోధయే న్మార్గం పూరకుంభక రేచకైః,
ప్రతికూలేన వా చిత్తం యథాస్థిరమచంచలమ్,
మనోఽచిరాత్స్యాద్విరజం జితశ్వాసస్య యోగినః,
వాయ్వగ్నిభ్యాం యథాలోహం ధ్మాతం త్యజతి వైమలమ్.

కలవాడై, శాస్త్రాధ్యయనం చేస్తూ, భగవంతుని ఆరాధించుకుంటూ, మౌనం వహించి, పద్మాది ఆసనాలను అభ్యాసంచేస్తూ, స్థిరంగా కూర్చొనుట అలవాటు చేసుకుని, మెల్లమెల్లగా ప్రాణాయామంవల్ల శ్వాసను జయించి, ఇంద్రియాలను విషయములనుండి వేరుపరచి హృదయమందు చేర్చవలెను. అనగా ఇంద్రియాలను అంతర్ముఖం చెయ్యాలి. మూలాధారాది కేంద్రములందు క్రమంగా ప్రాణములను స్థిరపరుస్తూ, సమాహితచిత్తంతో భగవంతుని లీలలు ధ్యానిస్తూ ఉండడంచేత, వ్రత దానాది ఇతర సాధనాలవల్ల సావధానంగా ప్రాణాల్ని జయించి, దుష్టమార్గంలో చరించే తన చిత్తాన్ని బుద్ధి ద్వారా మెలమెల్లగా ఏకాగ్రంచేసి పరమాత్మను ధ్యానించాలి. తొలుత ఆసనజయం కలవాడై ప్రాణాయామాభ్యాసం కొరకు పవిత్ర ప్రదేశమందు కుశాసనం మృగచర్మం చిత్రాసనం వరుస క్రమంలో పరచి ఋజుకాయుడై కూర్చుని చలనం లేకుండా అభ్యాసం చేయ్యాలి. పూరక కుంభక రేచక క్రమంలో కాని లేక రేచక కుంభక పూరక క్రమంలో కాని ప్రాణమార్గాన్ని శోధిస్తే చిత్తం నిశ్చలంగా వుంటుంది. అగ్నివాయువులచే తపింపచేయబడిన

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్,
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్.
యదామనస్స్వం విరజం యోగేన సుసమాహితమ్,
కాష్ఠాం భగవతో ధ్యాయేత్స్వనాసాగ్రావలోకనః.
ప్రసన్న వదనాంభోజం పద్మగర్భారుణేక్షణమ్,
నీలోత్పలదళశ్యామం శంఖచక్రగదాధరం.
లసత్పంకజకింజల్కపీతకౌశేయవాససం,
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభాముక్తకంధరం.
మత్తద్విరేఫకలయా పరీతం వనమాలయా,
పరార్ధ్యహారవలయం కిరీటాంగదనూపురం,
కాంచీగుణోల్లసచ్ఛ్రోణిం హృదయాంభోజవిష్టరం,
దర్శనీయతమం శాంతం మనోనయనవర్ధనం.
అపీచ్యదర్శనం శశ్వత్సర్వలోక నమస్కృతం.
సంతం వయసి కైశోరే భృత్యానుగ్రహకాతరం,

బంగారం మలాన్ని త్యజించినట్లే ప్రాణవాయువును జయించిన యోగి కూడా మలరహితుడై పరిశుద్ధుడౌతాడు. కనుకనే యోగి యైనవాడు, ప్రాణాయామంవల్ల వాతపిత్తాది దోషాల్నీ, ధారణచేత పాపాల్నీ. ప్రత్యాహారంవల్ల విషయాలకు సంబంధించిన రాగద్వేషాది దోషాలనూ, జయించాలి. యోగాభ్యాసం చేస్తూ చేస్తూండగా చిత్తం నిర్మలమై ఏకాగ్రత కలగడంతోనే నాసికాగ్రమందు దృష్టి నిలిపి భగవంతుని ధ్యానించాలి.

చిరునవ్వుతో కూడిన ముఖమూ, కమలములవంటి నేత్రాలూ. నీలికమలంతో సమానమైన వర్ణమూ, శంఖ చక్ర గదా ద్యాయుధములతో కూడిన హస్తములూ, కలిగి పీతాంబరధారియై వక్షస్థలమందు శ్రీవత్సలాంఛనుడై, కౌస్తుభమణి, వనమాలా, ధరించి కిరీట, హార, కటక, కేయూరాది అమూల్యాభరణధారియై శోభిస్తూ, భక్తుల హృదయకమలములే నివాసస్థానంగా, దర్శనీయమై, మనోహరమైన, ఆ శాంతస్వరూపుడూ, నయనాభిరాముడూ, అగు చతు

కీర్తన్యతీర్థయశసం పుణ్యశ్లోకయశస్కరం,
ధ్యాయేద్దేవం సమగ్రాంగం యావన్న చ్యవతే మనః.
స్థితం వ్రజంత మాసీనం శయానం వా గుహాశయం,
ప్రేక్షణీయే హితం ధ్యాయేచ్ఛుద్ధ భావేన చేతసా.
తస్మిన్ లబ్ధపదం చిత్తం సర్వావయవసంస్థితమ్,
విలక్ష్యైకత్ర సంయుజ్యా దంగేభగవతోమునిః.

సంచింతయేద్భగవతశ్చరణారవిందం వజ్రాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యం,
ఉత్తుంగరక్తవిలసన్నఖచక్ర వాళజ్యోత్స్నాభిరాహత మహద్ధృదయాన్ధకారమ్,
యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివశ్శివోఽభూత్,
ధ్యాతుర్మనశ్శమలశైలనిసృష్టవజ్రం ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిందం.
జానుద్వయం జలజలోచనయా జనన్యా లక్ష్మ్యా ఖిలస్య సురవన్దితయా విధాతుః,
ఊర్వోర్నిధాయకరపల్లవరోచిషా యత్సంలాలితం హృది విభోరభవస్య కుర్యాత్.
ఊరూ సువర్ణభుజయోరధిశోభమానావోజోనిధీ అతసికాకుసుమావభాసౌ,
వ్యాలంబిపీతవరవాససి వర్తమానకాంచీకలాపపరిరంభనితంబబింబమ్,
నాభిహ్రదం భువనకోశగుహోదరస్థం యత్రాత్మయోనిధిషణాఖిల లోకపద్మమ్,
వ్యూఢం హరిన్మణివృషస్తనయోరముష్యధ్యాయేద్ద్వయం విశదహారమరీచిగౌరమ్.

ద్విభుజ రూపుడైన శ్రీహరిని ధ్యానించవలెను. ఆ శ్రీహరి సర్వదా కిశోరావస్థయం దుండేవాడు. భక్తుల ననుగ్రహించడానికి ఆతురత కలవాడు. దర్శించతగిన రూపంకలవాడు. సమస్తలోక వందితుడు. ఆయన పవిత్రకీర్తి సర్వలోకవ్యాప్తమైనది. బలి మొదలైన కీర్తి వంతుల కీర్తిని వృద్ధిచెందించే వాడ యిన- నారాయణుని ధ్యానించాలి. శ్రీహరియొక్క సర్వ అవయవములనూ ధ్యానించాలి. భగవంతుని లీలలు దర్శనీయములైనవి. తన అభిరుచి ననుసరించి నిలచినట్లు కూర్చున్నట్లు నడచుచున్నట్లు పరుండి ఉన్నట్లు అంతర్యామి రూపంలో, హృదయపీఠమందున్నట్లు చింతనచేయాలి. ఎప్పుడైతే పైన చెప్పిన యేదో ఒక రూపమందు చిత్తం లగ్నమగునో సర్వాంగ సుందరమైన శ్రీహరియొక్క సర్వావయములమీాదా లగ్నమైన చిత్తాన్ని విశేషరూపంలో ఒక్కొక్క అంగమందే నిలపడం ఆరంభించాలి.

వక్షోధివాసమృషభస్య మహావిభూతేః పుంసాం మనోనయననిర్వృతిమాదధానమ్,
కంఠం చ కౌస్తుభమణేరధిభూషణార్థం కుర్యాన్మనస్యఖిలలోక నమస్కృతస్య.
బాహూంశ్చ మందరగిరేః పరివర్తనేన నిర్ణిక్తబాహువలయానధిలోకపాలాన్,
సంచింతయేద్దశశతారమసహ్యతేజశ్శంఖం చ తత్కరసరోరుహరాజహంసమ్.
కౌమోదకీం భగవతోదయితాం స్మరేత దిగ్ధామరాతిభటశోణిత కర్దమేన,
మాలాం మధువ్రతవరూథగిరోపఘుష్టాం చైత్యస్య తత్త్వమమలం మణిమస్య కంఠే,
భృత్యానుకంపితధియేహ గృహీతమూర్తేస్సంచింతయేద్భగవతో వదనారవిందమ్,
యచ్ఛ్రీస్ఫురన్మకరకుండల వల్గితేన విద్యోతితామలకపోలముదారనాసం,

భగవంతుని చరణకమలముల నిలా ధ్యానించవలెను. వజ్ర, అంకుశ, ధ్వజ, కమల చిహ్నములచే అంకితమై, రక్తవర్ణములుకల నఖచంద్రికలే భక్తుని అజ్ఞానాంధకారాన్ని నిర్మూలనం చేసేవిగా భావించవలెను. శ్రీహరి పాద ప్రక్షాళన మాత్రాన సర్వ నదులలో ఉత్తమమైన గంగానది ఆవిర్భవించింది. మంగళ మయమైన ఆ గంగను శిరస్సునందు ధరించి మంగళమయుడయ్యాడు. ఇంద్రునిచే ప్రయోగింపబడిన వజ్రాయుధంవల్ల పర్వతాలు నరకబడినట్లే భగవంతుని చరణధ్యానంచేత మానవుని పాపరాశులు నశిస్తాయి.

అనంతరం అతసీపుష్పసంకాశమైన జానుద్వయాన్ని ధ్యానించాలి. భగవంతుని జానుద్వయం లక్ష్మీదేవి తన తొడలయందుంచుకొని పాదసేవ చేస్తూంటుంది. విధాతను కన్న తల్లీ, దేవతలకు వంద్యురాలూ, ఐన లక్ష్మిచే సేవింపబడు జానుద్వయాన్ని ధ్యానించాలి, అటుతరువాత నీలివర్ణంగల భగవానుని జంఘలను ధ్యానించాలి. ఆ జంఘలు బలానికి నిధివంటివి. గరుత్మంతుని భుజపీఠాన్నలంకరించినవి. తరువాత పీతాంబరంచే ఆవరింపబడి బంగారు వికారమైన నడుము యందు ధరించిన, ఆభూషణంచే విరాజితమైన నితంబ ప్రదేశాన్ని ధ్యానించాలి.

సమస్త లోకాశ్రయమైన, ఉదరభాగమందు కలదీ, బ్రహ్మకు ఆధారభూతమైనదీ, సర్వలోకమయమూ, ఐన కమలం ఉద్భవించిన

యచ్ఛ్రీనికేతమళిభిః పరిషేవ్యమాణం భూత్యాస్వయా కుటిలకుంతలబృందజుష్టం,
మీనద్వయాశ్రయమధిక్షిప దబ్జనేత్రం ధ్యాయేన్మనోమయమతంద్రితఉల్లసద్భ్రు,
తస్యావలోకమధికం కృపయాతిఘోరతాపత్రయోపశమనాయ నిసృష్టమక్ష్ణోః,
స్నిగ్ధస్మితాను గుణితం విపులప్రసాదం ధ్యాయేచ్చిరం వితతభావనయా గుహాయాం.
హాసం హరేరవనతాఖిలలోకతీవ్రశోకాశ్రుసాగరవిశోషణమత్యుదారమ్,
సమ్మోహనాయ రచితం నిజమాయయాస్య భ్రూమండలం మునికృతే మకరధ్వజస్య.

నాభిప్రదేశాన్ని ధ్యానించాలి. మరకత సదృశమైన స్తనాలను ధ్యానించవలెను. అనంతరం లక్ష్మీనివాస స్థానమై నేత్రానందకర మైన శ్రీహరియొక్క వక్షస్థలాన్ని ధ్యానించాలి. కౌస్తుభమణిని కూడా శోభింపజేసే గళాన్ని, సముద్ర మథనకాలంలో మందరాచల ఘోషను కూడా అతిక్రమించి ధ్వనించు, కరకంకణాదులను ధరించు నవియూ, లోకపాలుర కభయప్రదాయకములూ, అగు చతుర్భుజ ములనూ ధ్యానించుట, క్రమవిధి; దేని తేజస్సును దేవతలుకూడా సహించలేరో, అట్టి సహస్రారములుగల సుదర్శనమూ, రాజ హంసవలె కరకమలమందు ప్రకాశించు శంఖమూ, ప్రతిపక్ష వీరుల రక్తంచే పంకిలమైయున్న కౌమోదకీ గద, తుమ్మెదలనాదచే గుంజాయమానమైన వనమాల, ఆయన కంఠమందు జీవుల నిర్మల తత్త్వమై, శోభించే కౌస్తుభమణి మొదలైనవి కూడా, ప్రత్యేకంగా ధ్యానయోగ్యములు.

భక్తులను కరుణించుటకుగాను సాకారరూపాన్ని ధరించిన శ్రీహరియొక్క ముఖకమలాన్ని ఈవిధంగా ధ్యానించాలి. మనోహరమై నువ్వుపూవుతో సమానమైన నాసిక, మకర కుండల కాంతిచే ప్రకాశించు కపోల భాగము, తుమ్మెద రెక్కలవలె నల్ల నైన అలకావళిచే సుశోభితమై కమలకోశములవలె చంచలములై, విశాలములై, కమలకోశంమీద, చంచలంగా చరిస్తూన్న మీన ద్వయంవంటి నేత్రాలూ కల, ఉన్నతమైన భ్రూలతా శోభితమైన భగవానుని ముఖకమలం ధ్యానించవలెను.

ధ్యానాయనం ప్రహసితం బహులాధరోష్ఠభాసారుణాయితతనుద్విజకుందపంక్తి,
ధ్యాయేత్స్వదేహకుహరేఽవసితస్యవిష్ణోర్భక్త్యార్ద్రయార్పితమనా న పృథగ్దిదృక్షేత్.
ఏవం హరౌ భగవతి ప్రతిలబ్ధభావో భక్త్యాద్రవద్ధృదయ ఉత్పులకః ప్రమోదాత్,
ఔత్కంఠ్యబాష్పకలయా ముహురర్ద్యమానస్తచ్చాపి చిత్తబడిశం శనకైర్వియుంక్తే,
ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం నిర్వాణమృచ్ఛతి మనస్సహసా యథార్చిః,
ఆత్మానమత్రపురుషోఽవ్యవధానమేకమన్వీక్షతే ప్రతినివృత్తగుణప్రవాహః.

భక్తుల తాపత్రయ నివారకములూ, భక్తులయందు విపులంగా ప్రసాదరూపమైన వర్షాన్ని కురిపించునవీ, ప్రేమపూరితమైన చిరునవ్వుచే ప్రతిక్షణం వృద్ధినొందునవీ, అగు శ్రీహరి నేత్రములనుకూడా ధ్యానించాలి. భక్తజనుల తీవ్రాతితీవ్రమైన శోకజలాన్ని యింకింప జేయునదీ, అత్యంత ఉదారమైనదీ, కామ దేవతను కూడా మోహింప జేయునదీ, చిరునవ్వుతో కూడిన భ్రూయుగాన్ని కూడా ధ్యానించవలెను. అత్యంత ప్రేమార్ద్రభావంతో, తన హృదయంలో విరాజిల్లే కిలకిల నవ్వుతూన్న శ్రీహరి నీ విధంగా ధ్యానించాలి. హాస్యరసంచేత చలించే పెదవులనుండి మల్లిమొగ్గలవలె ప్రకాశించే పలువరుస, అరుణవర్ణముగల పెదవుల కదలికలో మాటి మాటికీ ప్రకాశిస్తూన్న శ్రీహరియొక్క మందమనోజ్ఞ హాసాన్ని ధ్యానిస్తూ అన్యవస్తువు దేనినీ చూడకుండా ఉండేలాగు మనస్సును శ్రీహరి యందే లగ్నంచెయ్యాలి.

ఈ విధంగా ధ్యానాభ్యాసంవల్ల సాధకునకు శ్రీహరియందు ప్రేమ కలుగుతుంది. వానియొక్క హృదయం భక్తిచే ద్రవిస్తుంది. ఆనందాతిశయంవల్ల దేహమందు రోమాంచం కలుగుతుంది. ఉత్కంఠా జనితమైన ఆనందాశ్రుధారలచే మాటి మాటికీ శరీరాన్ని స్నానంచేయిస్తూంటాడు. చేపలు పట్టుట కుపయోగించు గాలము తన వైపున కాకర్షించునట్లే శ్రీహరిని తనవైపుకు ఆకర్షించు చిత్తాన్ని మెల మెల్లగా, ధ్యేయవస్తువునుండి త్రిప్పుతూ ఉంటాడు.

సోఽప్యేతయాచ రమయా మనసో నివృత్త్యా స్వస్మిన్మహిమ్న్యవసితస్సుఖదుఃఖబాహ్యే
హేతుత్వమప్యసతి కర్తరిదుఃఖయోర్యత్స్వాత్మన్విధత్త ఉపలబ్ధపరాత్మకాష్ఠః,
దేహం చ సశ్వరమవస్థిత ముత్థితం వా సిద్ధో విపశ్యతి యతోఽధ్యగమత్స్వరూపమ్,
దైవాదుపేతమథ దైవవశాదపేతం వాసో యథాపరికృతం మదిరామదాంధః.
దేహోఽపిదైవవశగః ఖలుకర్మయావత్స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః,
తం సప్రపంచమధిరూఢసమాధియోగస్స్వాప్నంపునర్నభజతే ప్రతిబుద్ధవస్తుః.

తైలాదు లయిపోయినప్పు డెలాగైతే దీపశిఖ తనకు కారణమైన తేజస్తత్త్వమందు లీనమై పోతుందో, ఆశ్రయ విషయాదులు రాగ రహితమైనప్పుడు అట్లే మనస్సు శాంతమై బ్రహ్మాకారాన్ని పొందు తుంది. అట్టి అవస్థను పొందిన జీవుడు గుణప్రవాహ రూపములైన దేహాది ఉపాధులనుండి నివృత్తుడైనందువల్ల ధ్యాతా, ధ్యేయమూ అనే భేదంలేకుండా, అఖండమైన పరమాత్మనే చూస్తూంటాడు. యోగాభ్యాసంవల్ల ప్రాప్తమైన చిత్తముయొక్క అవిద్యారహిత లయరూప నివృత్తివల్ల తన సుఖదుఃఖరహిత బ్రహ్మరూపమైన మహిమయందుండి పరమాత్మతత్త్వం యొక్క సాక్షాత్కారం పొందిన తరువాత అట్టి యోగియే, సుఖదుఃఖాలయొక్క అనుభ వాన్ని అజ్ఞాన వశంచేత తనయందే చూస్తూ ఉండేవాడో, దాని నిప్పుడు అవిద్యాకృతమైన అహంకారమందు చూస్తూ ఉంటాడు. మదిరాపానప్రమత్తుడైన మానవుడు దేహంమీద వస్త్రం ఉందా లేదా అనే విషయం కూడా తెలియకుండా యెలాగైతే ఉంటాడో అలాగే తుదియవస్థను పొందిన సిద్ధపురుషుడు కూడా కూర్చుండుట, నిలచుట, నడచుట, పరుండుట కూడా తెలియకుండా ఉంటాడు. అంటే పరమానందానుభూతి నందువాడు దేహాతీతుడు అవటంవల్ల దేహసంబంధమైన విషయాలు అట్టివాని నంటవు. దైవవశంచేత యెక్కడికైనా రాకపోకలు జరుగుతూ ఉన్నా ఆత్మారాముడైన అతను వానిని గుర్తించడు. బ్రహ్మజ్ఞానియొక్క శరీరం పూర్వజన్మ సంస్కారాధీనమై ఉంటుంది; అందువల్ల వానియొక్క దేహారంభక

యథా పుత్రాచ్చ మిత్రాచ్చ పృథఙ్మర్త్యః ప్రతీయతే,
అప్యాత్మత్వేనాభిమతాద్దేహాదేః పురుషస్తథా.
యథోల్ముకాద్విస్ఫులింగాద్ధూమాద్వాపి స్వసంభవాత్,
అప్యాత్మత్వేనాభిమతాద్యథాగ్నిః పృథగుచ్యతే.
భూతేంద్రియాంతఃకరణాత్ప్రధానాజ్జీవసంజ్ఞితాత్,
ఆత్మాతథా పృథగ్ద్రష్టాభగవాన్ బ్రహ్మసంజ్ఞితః.

మైన ప్రారబ్ధశేషం ఉన్నంతవరకూ ఇంద్రియ సహితంగా జీవించి ఉంటాడు. కాని సమాధి స్థితి పర్యంతం యోగస్థితుడై, పరమాత్మ తత్వాన్ని తెలుసుకున్న సిద్ధపురుషుడు పుత్రకళత్రాదులతో కూడిన యీ శరీరాన్ని, స్వప్నవస్తువులను జాగ్రదవస్థయందు పొందనట్లే తిరిగి పొందడు. అహంకార మమకారములను కూడా స్వీకరించడు.

అతిస్నేహవశంచేత సాధారణ జీవులకు పుత్రధనాదులందు కూడ ఆత్మబుద్ధి ఉంటుంది. కాని జ్ఞానదృష్టితో ఆలోచించి చూస్తే స్పష్టంగా వేరుగానే గోచరిస్తున్నాయి. అదేవిధంగా ఎవడు దేహాదులను ఆత్మబుద్ధితో చూస్తూంటాడో అట్టివాడు కూడా, తెలుసుకుంటే, దేహాదులు కూడా ఆత్మకంటె, జ్వలించే కాష్ఠా న్నుండీ, తననుండి జనించే మిణుగురులనుండీ, ధూమాన్నుండీ, కూడా వాస్తవంచేత అగ్ని వేరుగానే ఉంటుంది. అదే విధంగా, భూత ఇంద్రియ అంతఃకరణాదులకంటె, వాటికి సాక్షియగు ఆత్మ భిన్న మైనది. ఆత్మకంటె బ్రహ్మ భిన్నమైనది. ప్రకృతికంటె దానిని సంచ లింపజేసే పురుషోత్తముడు భిన్నమైనవాడు. యోగ్యు దేహదృష్టిచే జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్బిజ్జ, అను నాలుగు తరగతుల ప్రాణులూ, భూత పంచక మాత్రములో అట్లే సమస్త జీవులయందూ ఆత్మనూ, ఆత్మయందు సమస్త జీవులనూ, అనన్య భావంతో, అనుగతమైనట్లు ఆత్మజ్ఞాని చూస్తాడో. అట్లే చూడవలెను. భిన్నభిన్న ఆశ్రయాల ననుసరించి భిన్న భిన్న రూపాల్లో కనిపించు

సర్వభూతేషు చాత్మానం సర్వభూతానిచాత్మని,
ఈక్షితానన్యభావేన భూతేష్వపి తదాత్మతామ్.
స్వయోనిషు యథా జ్యోతిరేకం నానాప్రతీయతే,
యోనీనాం గుణవైషమ్యాత్తథాత్మా ప్రకృతౌ స్థితః.
తస్మాదిమాం స్వకృప్రణం దైవీం సదసదాత్మికామ్,
దుర్విభావ్యాం పరాభావ్య స్వరూపేణావతిష్ఠతే.

నట్లే దేవమనుష్యాది శరీరాలలో ఉండే ఒకే ఆత్మ తన ఆశ్రయముల యొక్క గుణభేదంచేత భిన్న భిన్న రూపాల్లో భాసిస్తూంటుంది. అందువల్ల భగవద్భక్తులైనవారు జీవునియొక్క స్వరూపాన్ని మరుగుపరచే కార్య కారణ రూపాలనుండి పరిణామాన్ని పొందిన భగవంతునియొక్క యీ అచింత్యమైన శక్తిమయమగు మాయను భగవంతుని కృపచే జయించి తన వాస్తవికమైన బ్రహ్మరూపమందే ఉంటున్నారు.

## 28 అధ్యాయం

లక్షణం మహదాదీనాం ప్రకృతేః పురుషస్య చ,
స్వరూపం లక్ష్య తేఽమీషాం యేన తత్పారమార్థికమ్.
యథా సాంఖ్యేషు కథితం యన్మూలం తత్ప్రచక్షతే,
భక్తియోగస్య మే మార్గం బ్రూహి విస్తరతః ప్రభో.
విరాగో యేన పురుషో భగవన్ సర్వతో భవేత్,
ఆచక్ష్వ జీవలోకస్య వివిధా మమ సంసృతీః.

కపిలుని ప్రబోధం విన్న దేవహూతి, ప్రభూ! ప్రకృతీ పురుషుడూ మహత్తత్త్వాదులూ, వానియొక్క లక్షణాలూ, యెట్లు సాంఖ్యయోగమందు చెప్ప బడ్డాయో, వాటియొక్క వేరువేరు స్వరూపాలు కూడా ఎట్లు తెలియబడుతున్నాయో, భక్తియోగం యొక్క ప్రయోజనమూ కూడా చెప్పారు. ఇప్పుడు కరుణించి భక్తి మార్గం నాకు సవిస్తరంగా వినుపించండి. ఇంతేగాక జీవులయొక్క జనన మరణ రూపమున అనేక విధములైన గతులుకూడా వివరించండి. ఏది విన్నమాత్రంచేత

కాలస్యేశ్వరరూపస్య పరేషాం చ పరస్యతే,
స్వరూపం బత కుర్వంతి యద్ధేతోః కుశలం జనాః,
అన్వయ వ్యతిరేకాచ్ఛ సాక్ష్యాత్మా వ్యభిచారిణః,
వైతత్యం వ్యభిచారేణ నిద్రాం తస్యన సంస్మరేత్.
లోకస్య మిథ్యాభిమతేరచక్షుషశ్చిరప్రసుప్తస్య తమస్యనాశ్రయే.
శ్రాంతస్య కర్మస్వనుబంధయాధియా త్వమావిరాసీః కిలయోగభాస్కరః.
ఇతి మాతుర్వచశ్శ్లక్ష్ణం ప్రతినంద్య మహామునిః,
ఆబభాషే కురుశ్రేష్ఠ ప్రీతస్తాం కరుణార్దితః.
భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే,
స్వభావగుణమార్గేణ పుంసాం భావో విభిద్యతే.
అభిసంధాయయద్ధింసాం దంభం మాత్సర్యమేవ చ,
సంరంభీ భిన్నదృగ్భావం మయికుర్యాత్సతామసః.

జీవులకు సమస్త వస్తువులందూ వైరాగ్యం కలుగుతుందో అట్టి సన్యాసిష యాలూ బోధించండి. దేనియొక్క భయంవల్ల మానవులు శుభ కర్మల యందు ప్రవృత్తులౌతారో, ఏది బ్రహ్మాదులను కూడా శాసించ గలదో అట్టి సర్వసమర్థమైన కాలస్వరూపాన్ని కూడా వివరించి చెప్పండి. చిరకాలాన్నుండీ మాయామోహిత అజ్ఞానవశులై దేహాదు లందు ఆత్మభావంకలిగి బుద్ధి కర్మాసక్తమగుట వల్ల మహాఘోర సం సారసాగరంలో శ్రమచెందే జీవులను మేలుకొలిపి వెలుగు ప్రసాదించు టకుగాను యోగాన్ని ప్రదర్శించే సూర్యుడవై అవతరించిన మీరే నాకు సర్వజ్ఞత్వాన్ని ప్రసాదించే జ్ఞానం బోధించండని అడుగగా, మనోహర శబ్దాలతో, ఆమెను ప్రశంసించి దయార్ద్రహృదయుడై బోధించడం ఆరంభించాడని విదురునకు మైత్రేయుడు చెప్పుతున్నాడు.

అమ్మా! మానవులయందు, స్వభావ, గుణభేదములచే భిన్నత్వం ఉండడంవల్ల సాధకుల భావాలననుసరించి భక్తి అనేకతరగతు లుగా ఉంటుంది. భేదదృష్టి, క్రోధం, హింసాస్వభావం, దంభం మాత్స ర్యం, మొదలైన లక్షణములుకలిగి నన్ను భజించేవాడు తామసభక్తుడన బడతాడు. విషయసుఖాలూ, కీర్తీ, ఐశ్వర్యమూ కోరి భేద భావంతో

విషయానభిసంధాయ యశఐశ్వర్యమేవచ,
అర్చ్యాదావర్చయేద్యో మార పృథగ్భావస్సరాజసః,
కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్వాతదర్పణమ్,
యజేద్యష్టవ్యమితి వా పృథగ్భావస్ససాత్త్వికః.
మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుణాశ్రయే,
మనోగతిరవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ,
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్,
అహైతుక్యవ్యవహితాయా భక్తిః పురుషోత్తమే.
సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్యైకత్వమిత్యుత,
దీయమానం నగృహ్ణంతి జనామత్సేవనం వినా,
సఏవభక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః,
యేనాతివ్రజ్య త్రిగుణాన్మద్భావాయోపపద్యతే.

ప్రతిమాదులందు నన్ను సేవించే వానిని రాజసభక్తుడంటారు. పాప క్షయం కొరకు సర్వకర్మలను పరమాత్మ యందర్పించుటకుగాను భేద భావంతో నన్ను పూజించేవాడు సాత్త్వికభక్తుడన బడతాడు. గంగా ప్రవాహం అఖండంగా సముద్రంవైపుకే పరువిడునట్లు నాగుణశ్రవణ మాత్రంచేత యొవనియొక్క మనస్సు తైలధారవలె అవిచ్ఛిన్నంగా సర్వాంతర్యామినగు నాయందే లగ్నంకావడం, పురుషోత్తముడనైన నాయందే అనన్య ప్రేమకలగడం నిర్గుణభక్తియోగలక్షణాలని గ్రహించవలెను. అలాంటి నిష్కామ భక్తుడు సాలోక్య, సార్ష్టి, సామీప్య సారూప్య, సాయుజ్య, మోక్షములిచ్చినా, నా సేవకు ఆటంకం కలుగుతుందని అట్టి మోక్షాన్ని గూడా, గ్రహించడు. భగవంతుని సేవించుటకై మోక్షాన్ని కూడా, త్యాగం చేయించగల యీభక్తి యోగమే పరమ పురుషార్థమై, సాధ్యమని విద్వాంసులంటారు. అట్టి నిష్కామభక్తి వల్ల సత్త్వరజస్తమోగుణాలు మూడింటినీ అతిక్రమించి నాఅప్రాకృతమైన ప్రేమస్వరూపాన్ని పొందకలుగుతాడు.

నిష్కామ భావంతో నిత్య నైమిత్తిక కర్మలాచరించుట, నాప్రతిమను దర్శించుట, స్పర్శ, పూజా, స్తుతి, వందనాదులాచరిం

నిషేవితేనానిమిత్తేన స్వధర్మేణ మహీయసా,
క్రియాయోగేన శస్తేన నాతిహింస్రేణ నిత్యశః.
మద్ధిష్ణ్యదర్శనస్పర్శపూజాస్తుత్యభివందనైః,
భూతేషు మద్భావనయా సత్త్వే నాసంగమేనచ.
మహతాం బహుమానేన దీనానామనుకంపయా,
మైత్ర్యాచైవాత్మతుల్యేషు యమేవ నియమేన చ.
ఆధ్యాత్మికానుశ్రవణాన్నామసంకీర్తనేనచ,
ఆర్జవేనార్యసంగేన నిరహంక్రియయా తథా.
మద్ధర్మిణో గుణైరేతైః పరిసంశోధితాశయః,
పురుషస్యాంజసాభ్యేతి శ్రుతమాత్రగుణం హి మామ్.
యథా వాతరథోఘ్రాణమావృంక్తే గంధ ఆశయాత్,
ఏవం యోగరతం చేత ఆత్మానమవికారి యత్,

చుటూ, సమస్త ప్రాణులయందూ, నన్నే భావించుటూ, ధైర్య[illegible] నవలంబించుట, మహాపురుషులను సేవించుట, దీనులయందుదయా, సమానులయందు మైత్రీ, యమనియమాదులను పాలించుట, అధ్యాత్మ శాస్త్రశ్రవణం నా నామములను ఉచ్చస్వరంతో, కీర్తించుచుండుట, మనస్సుయొక్క సరళత్వమూ, సత్సాంగత్యమూ అహంకారత్యాగమూ, భాగవత ధర్మానుష్ఠానమూ, అనేమార్గాలనను సరించే భక్తుల యొక్క చిత్తము పరిశుద్ధమై నా గుణశ్రవణ మాత్రం చేత అనాయాసంగా నాయందు లగ్నమౌతుంది.

వాయువుద్వారా చరించే సుగంధం తన కాశ్రయమైన పుష్పాన్నుండి ఘ్రాణేంద్రియం వరకూ పయనిస్తుందో అట్లే రాగద్వేష శూన్యుడై, భక్తియోగ తత్పరుడైన భక్తుని చిత్తం పరమాత్ముని పొందగలుగుతుంది. నేను ఆత్మరూపంలో సమస్త జీవులయందూ, వ్యాప్తమై ఉంటాను. అందువల్ల మానవులు, సర్వ భూతస్థితుడనైన నన్ను అనాదరించి కేవలం ప్రతిమలయందే పూజాదులొనర్చుట స్వాంగ మాత్రమే ఔతుంది. సమస్త భూతములకూ ఆత్మ స్వరూపుడనూ, పరమేశ్వరుడనూ ఐన నన్ను గుర్తించలేక మోహా

అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థితస్సదా,
తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేఽర్చావిడంబనం.
యోమాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరం,
హిత్వార్చాం భజతే మౌఢ్యాద్భస్మన్యేవ జుహోతి సః.
ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః,
భూతేషు బద్ధవైరస్య నమనశ్శాంతిమృచ్ఛతి.
అహముచ్చావచైర్ద్రవ్యైఃక్రియయోత్పన్నయానఘే,
నైవతుష్యేఽర్చితోఽర్చాయాం భూతగ్రామావమానినః.
అర్చాదావర్చయేత్తావదీశ్వరం మాం స్వకర్మకృత్,
యావన్నవేద స్వహృది సర్వభూతేష్వవస్థితం.
ఆత్మనశ్చపరస్యాపి యః కరోత్యంతరోదరం,
తస్య భిన్నదృశో మృత్యుర్విదధే భయముల్బణం.

వశంచేత కేవల ప్రతిమా రాధనలే సాగించేవాడు అగ్నిని వదలి భస్మం యందు హోమం చేసేవాని వలెనే పూర్ణమైన ఫలాన్ని పొందలేడు. లోకంలో భేదదృష్టికలిగి దురభిమానంకల మానవుడు ఇతర జీవులను ద్వేషిస్తాడు. అట్లే అంతర్యామి రూపంలో ఉన్న నన్ను కూడా ద్వేషిస్తాడు అట్టి వానికి మనశ్శాంతి కలుగదు. తల్లీ ! ఇతరుల నవ మానించే మానవుడు నన్నుగూర్చి యెన్నివిధములైన పూజలు చేసినా నేను వానికి ప్రసన్నుడను కాను. మనుష్యుడు ధర్మానుష్ఠానం విగ్రహా రాధన చేస్తూ ఉన్నా సర్వ హృదయాంతర్యామి యగు పరమా త్మానుభూతి పొందనంతకాలం ఆత్మ పరమాత్మల మధ్య యే మాత్రం అంతరం కల్పించు కున్నా అట్టి భేద దృష్టికల మానవునకు మృత్యు రూపమైన భయం కలిగిస్తూంటాను. అందువల్ల సర్వజీవులయొక్క దేహ మునందు అంతర్యామి రూపంలో ఉన్న పరమాత్మనగు నన్ను దాన మాన మిత్రత్వాదుల ద్వారా సమదృష్టితో పూజించవలెను.

మాతా ! పాషాణాది అచేతనముల కంటే వృక్షాది జీవులు శ్రేష్ఠమైనవి. వాటికంటే శ్వాసను పీల్చేవి శ్రేష్ఠములైనవి. వానికంటె కూడా మనస్సు కలవి గొప్పవి. అంతకంటే ఇంద్రియములు కలవి,

అథమాం సర్వభూతేషు భూతాత్మానం కృతాలయం,
అర్హయేద్దానమానాభ్యాం మైత్ర్యాఽభిన్నేన చక్షుషా.
జీవాశ్శ్రేష్ఠాహ్యజీవానాం తతః ప్రాణభృతశ్శుభే,
తతస్సచిత్తాః ప్రవరాస్తతశ్చేంద్రియ వృత్తయః.
తత్రాపి స్పర్శవేదిభ్యః ప్రవరా రసవేదినః,
తేభ్యో గంధ విదశ్శ్రేష్ఠాస్తతశ్శబ్దవిదో వరాః.
రూపభేదవిదస్తత్ర తతశ్చో భయతోదతః,
తేషాం బహుపదాశ్శ్రేష్ఠాశ్చతుష్పాదాస్తతో ద్విపాత్.
తతో వర్ణాశ్చ చత్వార స్తేషాం బ్రాహ్మణ ఉత్తమః,
బ్రాహ్మణేష్వపి వేదజ్ఞో హ్యర్థజ్ఞో ప్యధిక స్తతః.
అర్థజ్ఞాత్సంశయచ్ఛేత్తా తతశ్శ్రేయాన్ స్వకర్మకృత్.
ముక్తసంగస్తతో భూయానదోగ్ధా ధర్మమాత్మనః.

వానిలో కూడా కేవలం స్పర్శజ్ఞానం కలవానికంటే రసగ్రహణం చేసే మత్స్యాదులూ అంతకంటే గంధగ్రహణం కల భ్రమరాదులూ వానికంటే శబ్దగ్రహణ సామర్థ్యం కల సర్పాదులూ అంతకంటే రూపా దులు గ్రహించగల కాకాదులూ వానికంటే దంతములు కలవీ శ్రేష్ఠ మైన జీవులు. పాదములు లేనివాటికంటే పాదములు కలవీ అందులో బహుచరణములు కలవాని కంటే నాలుగు కాళ్ళు గలవీ అంతకంటే రెండు కాళ్ళుగలవీ అందులో మనుష్యులూ వారిలో నాల్గు వర్ణముల వారూ అందులోకూడా బ్రాహ్మణులూ వారిలో కూడా వేదవేదాంగ విజ్ఞానం కలవారూ వేదతాత్పర్యం పూర్ణంగా గ్రహించిన వారూ వారిలో సంశయ నివారణ చేయగలిగినవారూ వారికంటే కూడా వర్ణాశ్రమ ధర్మాన్ని పాలించేవారూ వారికంటే త్యాగులూ తమ ధర్మాన్ని నిష్కామ భావంతో ఆచరించే వారూ శ్రేష్ఠులు వారికంటే కూడా సమస్త కర్మలూ వానికి సంబంధించిన ఫలసమేతంగా శరీరాన్ని కూడా నా కర్పణ చేసి భేదభావం లేకుండా నన్ను ఉపాసించే వారు శ్రేష్ఠులు. ఇదేవిధంగా చిత్తమూ కర్మలూ నాయందే అర్పణచేసి కర్తృత్వంలేకుండా సమదర్శిగా ఉండే పురుషుని కంటే మించి నన్నేవరూ

తస్మాన్మయ్యర్పితాశేష క్రియార్థాత్మా నిరంతరః,
మయ్యర్పితాత్మనః పుంసో మయి సన్న్యస్త కర్మణః.
న పశ్యామి పరం భూతమకర్తుస్సమదర్శనాత్,
మనసైతాని భూతాని ప్రణమేద్బహుమానయన్.
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి.
భక్తియోగశ్చ యోగశ్చ మయా మానవ్యుదీరితః.
తయోరేకతరేణైవ పురుషః పురుషం వ్రజేత్,
ఏతద్భగవతో రూపం బ్రహ్మణః పరమాత్మనః.
పరం ప్రధానం పురుషం దైవం కర్మవిచేష్టితమ్,
రూపభేదాస్పదం దివ్యం కాలఇత్యభిధీయతే.
భూతానాం మహదాదీనాం యతో భిన్నదృశాం భయం,
యోఽంతః ప్రవిశ్య భూతాని భూతైరత్త్యఖిలాశ్రయః.
సవిష్ణ్వాఖ్యోఽధియజ్ఞోఽసౌ కాలః కలయతాంప్రభుః,
న చాస్య కశ్చిద్దయితో న ద్వేష్యో న చ బాంధవః.

వాడు లేడు. గనుక నిర్మలమైన మానవుడు జీవరూపమైన తన అంశ చేత సాక్షాత్తూ భగవంతుడే సమస్త ప్రాణులయందునా ఉన్నాడని గ్రహించి సమస్త ప్రాణులకు భగవద్దృష్టితో నమస్కరింప వలెను.

తల్లీ! ఈ విధంగా నీకోరకు భక్తియోగం చెప్పాను. అష్టాంగ యోగంకూడా వినిపించాను. ఇందులో ఏ ఒక్క దాన్ని సాధించినా మానవుడు పరమాత్మను పొందగలుగుతాడు. భగవానుడైన పరబ్రహ్మ యొక్క అద్భుతప్రభావ సంపన్నమగు జగత్సంబంధమైనపదార్థము లయొక్క నానావిధ విచిత్రములకూ హేతుభూతమైన స్వరూప విశేషమే " కాల " నామంచేత విఖ్యాతమైనది. ప్రకృతీ, పురుషుడూ దీని యొక్క రూపములే. దీనికంటే భిన్నరూపమైన, నానాప్రకారములైన కర్మలయొక్క మూలమైన అదృష్టంకూడా కాలమే. దీనివల్ల మహత్తత్త్వాదులయొక్క అభిమాన దేవతారూపములై భేదధర్మలను చూసి సమస్త ప్రాణులూ యెల్లప్పుడూ భయపడుతూ ఉంటాయి. సమస్తజీవులకూ ఆశ్రయమగుటచే సర్వప్రాణులయందూ అనుప్రవిష్టమై, భూతముల ద్వారా వానిని సంహరిస్తూ ఉండే జగత్తునంతనూ శాసిస్తూ బ్రహ్మాదులకు

అవిశత్యప్రమత్తోఽసౌ ప్రమత్తం జనమంతకృత్,
యద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతియద్భయాత్.
యద్భయాద్వర్షతే దేవో భగణో భాతి యద్భయాత్.
యద్వనస్పతయో భీతా లతాశ్చౌషధిభిస్సహ.
స్వే స్వే కాలేఽభి గృహ్ణంతి పుష్పాణి చ ఫలాని చ,
స్రవంతి సరితో భీతా నోత్సర్పత్యుదధిర్యతః,
అగ్నిరింధే సగిరిర్భూస్న మజ్జతి యద్భయాత్,
నభో దదాతి శ్వసతాం మార్గం యన్నియమాదదః.
లోకం స్వదేహం తనుతే మహాన్ సప్తభిరావృతమ్,
గుణాభిమానినో దేవా స్సర్గాదిష్వస్య యద్భయాత్,
వర్తంతేఽనుయుగం యేషాం వశఏతచ్చరాచరమ్.

కూడాప్రభువైన కాలరూపమైన భగవానుడే యజ్ఞఫలాన్నిచ్చే విష్ణువు. ఈకాలానికి మిత్ర శత్రు భేదంలేదు. బంధుబాంధవ భేదమూలేదు. నిరంతరం అప్రమత్తతో ఉండి తపస్వరూపమైన భగవంతుని మరచిభోగరూపమైనప్రమాదానికి గురియైన ప్రాణుల నాక్రమించి సంహరిస్తూంటుంది. కాలానికి భయపడే లతలూ, వృక్షాలూ, పుష్పించిఫలిస్తాయి. నదులు ప్రవహిస్తాయి. సముద్రం తనమర్యాద నుల్లంఘించదు. అగ్నిజ్వలిస్తుంది. పర్వతసమేతంగా భూమండలం జలంలో మునుగకుండాఉంటుంది. కాలం యొక్క భయంచేతనే ఆకాశంప్రాణులశ్వాసప్రశ్వాసల కవకాశమిస్తుంది. మహత్తత్త్వం అహంకారరూపమైన శరీరానికి సప్తావరణలతో కూడిన బ్రహ్మాండరూపమైన విస్తారాన్ని కలిగిస్తుంది. కాలానికిభయపడే తత్త్వాదులకు నియంతలైన విష్ణువూ మొదలగు దేవతలు సృష్టి,స్థితి,లయాలను యుగక్రమ విరుద్ధంలేకుండా, నడుపుతూంటారు. యీఅవినాశనమైన కాలం అనాది. ఇతరులకు అది కర్తకూడాను. తాను స్వయంగా అవినాశనమైయుండిఇతరులకు అంతకారణమేఅవుతుంది. ఈకాలమేతండ్రి వల్ల కుమారుణ్ణి ఉత్పత్తిచేస్తూ సర్వజగత్తునూ రచిస్తూ ఉంటుంది.

సోఽనంతోఽంతకరః కాలోఽనాదిరాదికృదవ్యయః,
జనం జనేన జనయ న్మారయన్మృత్యునాంతకమ్.

తనసంహారశక్తియగు మృత్యువుద్వారా, యముని కూడా సంహరించి అంతం చేస్తూంటుంది.

## 29 అధ్యాయం

త్యస్యైతస్య జనో నూనం నాయం వేదోరువిక్రమమ్,
కాల్యమానోఽపి బలినో వాయోరివ ఘనావళిః.
యం యమర్థముపాదత్తే దుఃఖేన సుఖహేతవే,
తం తం ధునోతి భగవాన్ పుమాన్ శోచతి యత్కృతే.
యదధ్రువస్య దేహస్య సానుబంధస్య దుర్మతిః
ధ్రువాణి మన్యతే మోహాద్గృహ-క్షేత్రవసూని చ.

కపిలుడు కాలస్వరూపం చెప్పియింకా యిలా చెప్తున్నాడు.

మాతా! వాయువుచే యెగరగొట్టబడిన మేఘములు వాయువుయొక్క శక్తి గ్రహించ లేనట్లే కాల ప్రేరితములై వివిధావస్థలలో అనేక యోనులయందు తిరుగులాడుచుండు జీవులు, కాలం యొక్క ప్రభావాన్ని గ్రహించలేవు. జీవుడు సుఖాభిలాషచే కష్టపడి సంపాదించిన వస్తు సముదాయాన్ని భగవంతుడైన కాలుడు నష్టపరుస్తూంటాడు. అది నిత్యం జరిగేపనే. అయినా దానినిగురించి జీవుడు విచారిస్తాడు. దీనికి ముఖ్యకారణం అనిత్యములైన శరీర పశు పుత్ర పత్నీ ధనాదులందు, జీవునకుగల నిత్యత్వ బుద్ధియే. యీ సంసారంలో జీవు డేయోనియందు జన్మిస్తే ఆ శరీరమే సుఖసాధనంగా భావిస్తూ ఉంటాడే కాని ఆ శరీరాదులందూ జన్మలందూ కూడా విరాగం పొందడు. తనకు విష్ఠాభోజనాదులుకల నరకాల్లో జన్మించికూడా, మాయామోహితుడై అదీ సుఖంగానే భావిస్తాడు. కాని ఆ శరీరాన్నైనా త్యజించడాని కంగీకరించడు యీ మూర్ఖుడు.

జంతుర్వై భవ ఏతస్మిన్ యాం యాం యోనిమనువ్రజేత్,
తస్యాం తస్యాం స లభతే నిర్వృతిం న విరజ్యతే.
నరకస్థోఽపి దేహం వై న పుమాంస్త్యక్తుమిచ్ఛతి,
నారక్యాం నిర్వృతౌ సత్యాం దేవమాయావిమోహితః.
ఆత్మజాయాసుతాగార పశుద్రవిణ బంధుషు,
నిరూఢమూలహృదయమాత్మానం బహుమన్యతే.
దందహ్యమానసర్వాంగ ఏషాముద్వాహనాధినా,
కరోత్యవిరతం మూఢో దురితాని దురాశయః.
ఆక్షిప్తాత్మేంద్రియ స్త్రీణామసతీనాం చ మాయయా,
రహోరచితాలాపైః శిశూనాం కలభాషిణామ్.

తన శరీరం స్త్రీ, పుత్ర, ధన, పశు, గృహ, బంధు, బాంధవులందు ఆసక్తి కలవాడై వారివల్లనే అనేక మనోరథాలు వాంఛిస్తూ తాను మహా భాగ్యశాలినని అనుకుంటూ ఉంటాడు. వీరందరినీ పాలించి పోషించడానికి వీడి శరీరమంతా దహించుకుపోతూ ఉంటుంది. ఇలా దుర్వాసనా దూషితమైన హృదయం కలవాడవడంవల్ల మూఢుడైన వాడు పత్నీ పుత్రాదుల కొరకై అనేక పాపాలు చేస్తుంటాడు. కులటలగు స్త్రీలు ఏకాంతంలో సంభోగాద్యవస్థలలో మాపే కపట పూర్ణమైన ప్రేమ యందూ, పిల్లలుపలికే తియ్య తియ్యని మాటల యందూ మనస్సు ఇంద్రియాలూ చిక్కి పడడంచేత గృహస్థుడగు పురుషుడు గృహసంబంధమైన దుఃఖ ప్రధానమైన కపటపూర్ణము లైన కర్మలయందు లిప్తుడై పోతాడు. ఆ సమయంలో అతి జాగ్రత్తగా, సాధించే కార్యములలో ఒకప్పుడు దుఃఖానికి ప్రతీకారం కలిగితే అదే పెద్ద సుఖంగా భావిస్తాడు. మూర్ఖుడైన మానవుడనేక హింసారూపములైన పాపకృత్యాలుచేసి తాను నరకయాతనలు అనుభవించడానికి కూడా సిద్ధపడి సంపాదించిన ధనాదులచే దారా పుత్రాదులను పోషిస్తూ వారు తినగా మిగిలిన దాన్ని తింటూ, ఇహపరాలు రెండింటికీ కూడా దూరమైపోతాడు. మాటి మాటికీ ప్రయత్నంచేసి విఫలుడౌతూంటే తుదకు ధైర్యంపోయి ఇతరుల ధనమును కోరు

గృహేషు కూటధర్మేషు దుఃఖతంత్రేష్వతంద్రితః,
కుర్వన్ దుఃఖప్రతీకారం సుఖవన్మన్యతే గృహీ.
అర్థైరాపాదితైర్గుర్వ్యా హింసయేత స్తతశ్చ తాన్,
పుష్ణాతి యేషాం పోషేణ శేషభుగ్యాత్యధస్స్వయమ్.
వార్తాయాం లుప్యమానాయామారబ్ధాయాం పునః పునః,
లోభాభిభూతో నిస్సత్త్వః పరార్థే కురుతే స్పృహామ్.
కుటుంబభరణా కల్పో మందభాగ్యో వృథోద్యమః,
శ్రియావిహీనః కృపణో ధ్యాయన్ శ్వసితి మూఢధీః.
ఏవం స్వభరణాకల్పం తత్కళత్రాదయస్తథా,
నాద్రియంతే యథాపూర్వం కీనాశాఇవగోజరమ్.

తూంటాడు. మంద భాగ్యుడైనవాడు యేవిధంగానూ సంపాదించలేక కుటుంబ పోషణయందు అసమర్థుడై అతి దీనంగా సంచరిస్తూ చింతచేత దీర్ఘమైన నిట్టూర్పులు విడుస్తూంటాడు.

కృపణుడైన రైతు, పనిచేయలేని యెద్దును అనాదరణచేసినట్లే ధనార్జన చేయలేని పురుషుని భార్యా, పిల్లలూ కూడా పూర్వంవలె చూడక అనాదరిస్తారు. అప్పుడు కూడా వానికి వైరాగ్యం కలుగదు. ఎవరినైతే తాను అంతవరకూ పోషించాడో వారే తన్ను పోషించవలసి వస్తుంది. వార్ధక్యం కారణంగా, శరీరం అంతా శిథిలమై పోతుంది. రోగగ్రస్తుడై పోతాడు. జఠరానలం మందగిస్తుంది. పూర్తిగా తిండి తినలేడు. పురుషార్థం మందమైపోతుంది. మరణాభిముఖుడై గృహంలో పడి ఉంటాడు. కుక్కనువలె విసరి కొడుతూ దారాపుత్రాదులు, ఓ ముద్ద పడవేస్తే తింటూ జీవనాన్ని గడుపుకొంటూ ఉంటాడు. మృత్యు వాసన్నమైనప్పుడు వాయువుయొక్క ఉత్క్రమణచే వాడు కనుగుడ్లు తేలవైచును. శ్వాస ప్రశ్వాసల కొఱకు నాడులు కఫంచేత రుద్ధమైపోతాయి. దగ్గడానికీ శ్వాస పీల్చుకోడానికీ కూడా చాలా కష్టం కలుగుతుంది. కఫం వృద్ధిచెందడం వల్ల కంఠమునందు గురక బయలుదేరుతుంది. బంధు బాంధవులు

తత్రాప్యజాతనిర్వేదో ధ్రియమాణస్స్వ యంభృతైః,
జరయోపాత్తవైరూప్యో మరణాభిముఖో గృహే.
ఆస్తేఽవమత్యోపన్యస్తం గృహపాల ఇవాహరన్,
ఆమయావ్యప్రదీప్తాగ్నిరల్పాహారోఽల్ప చేష్టితః.
వాయునోత్క్రమతోత్తారః కఫసంరుద్ధనాడికః,
కాసశ్వాస కృతాయాసః కంఠే ఘురుఘురాయతే.
శయానః పరిశోచద్భిః పరివీతస్స్వబంధుభిః,
వాచ్యమానోఽపి న బ్రూతే కాలపాశవశంగతః,
ఏవం కుటుంబభరణవ్యాపృతాత్మాఖిలేంద్రియః,
మ్రియతే రుదతాం స్వానామురువేదనయాస్తధీః.
యమదూతౌ తథా ప్రాప్తౌ భీమౌ సరభసేక్షణౌ,
న దృష్ట్వా త్రస్తహృదయః శకృన్మూత్రం విముంచతి.

చుట్టూచేరి ఏడుస్తూ పిలుస్తూంటే మృత్యుపాశ గ్రస్థుడైన జీవి మాట్లాడ లేకుండా ఉంటాడు. మూఢుడైన పురుషుడు ఇంద్రియా లను జయించలేక నిరంతరం కుటుంబ పోషణయందే కాలం గడప డంవల్ల జ్ఞానం కలుగదు. పైగా బాంధవులంతా ఏడుస్తూంటే మృత్యుభయానికితోడు రోదనంకూడా వినడంతో అచేతనుడై మృత్యువును పొందుతాడు.

ఆ సమయానికి ఆ జీవుని తీసుకు వెళ్ళడానికి భయంకరా కారులు రోషాగ్నిచే జాజ్వల్య మానములైన నేత్రములుకల యమ దూత లిద్దరు వస్తారు. వారిని చూచి భయంతో మాటిమాటికీ మలమూత్రాలు విడుస్తూంటాడు. ఆ యమదూత లా జీవుని యాతనా శరీరమందు ప్రవేశపెట్టి రాజభటులు లపరాధిని గొనిపోవునట్లే ఆ జీవుని మెడ పాశములచే బంధించి అతిదూరంలో ఉన్న యమలోకానికి తీసుకువెడతారు. మార్గంలో వారు కసరుతూ, తర్జన భర్జనలు చేస్తూంటే వాని గుండె పగిలిపోతూ శరీరమంతా కంపించిపోతూ ఉంటుంది. మార్గమధ్యంలో వానిని కుక్కలు పీకుతూంటే తాను చేసిన పాపాలు జ్ఞాపకంవచ్చి వ్యాకులం చెందుతూ ఉంటాడు. ఆకలి

యాతనాదేహమావృత్య పాశైర్బధ్వా గళే బలాత్,
నయతో దీర్ఘమధ్వానం దండ్యం రాజభటా యథా,
తయోర్నిర్భిన్నహృదయ స్తర్జనైర్జాతవేపథుః,
పథి శ్వభిర్భక్ష్యమాణ ఆర్తోఽఘం స్వమనుస్మరన్.
క్షుత్తృట్పరీతోఽర్కదవానలానిలైస్సంతప్యమానః పథి తప్తవాలుకే,
కృచ్ఛ్రేణ పృష్ఠే కశయా చ తాడితశ్చలత్యశక్తోఽపి నిరాశ్రమోదకే.
తత్ర తత్ర పతఞ్ఛ్రాంతో మూర్ఛితః పునరుత్థితః,
పథా పాపీ యసా నీతస్తరసా యమసాదనమ్.
యోజనానాం సహస్రాణి నవతిం నవచాధ్వనః,
త్రిభిర్ముహూర్తైర్ద్వాభ్యాం వా నీతః ప్రాప్నోతి యాతనామ్.

దప్పికలతో మూర్ఛ పడిపోతూ, దేహం సూర్యదావానలాది తాప ఫలములచే తపింపబడుతూ ఉంటుంది. ఆ సమయంలో నీరుకానీ విశ్రాంతిస్థానం కానీ లభించక తప్తవాలు కామయమైన మార్గంలో ఒక్క అడుగుకూడా వెయ్యడానికి శక్తిలేక బాధపడుతూంటే వాని వీపుమీద యమదూతలు కశలచే పొడుస్తూ అనేక యాతనలు పెడుతూంటే, అలాగే బాదపడుతూ, ప్రయాణం సాగిస్తూంటాడు. అక్కడక్కడ శ్రమచే మూర్ఛ చెందుతూ తుదకు లేస్తూ అతిదుఃఖ మయమైన మార్గంలో, క్రూరంగా యమదూతలచే బాధింపబడుతూ, యమపురానికి వెడతాడు. యమలోకం యిక్కడకు తొంభై తొమ్మిదివేల యోజనాల దూరంలో ఉంది. ఇంతదూరం కూడా ఆయమదూతలు రెండు లేక మూడు ముహూర్తాల కాలంలో తీసుకువెళ్ళిపోతారు. అక్కడ అనేక తరగతులకు చెందిన యాతన లనుభవిస్తాడు జీవుడు. అక్కడ వాని శరీరాన్ని మండుతూన్న కాష్ఠములమధ్య పడవేసి తగలబెడతారు. తన శరీరాన్ని తనచేతనేకాని, లేక యితరులచేతనే కాని ముక్కలుముక్కలుగా కోయించి తన మాంసాన్ని తనచేతనే తినిపిస్తారు. యమలోకంలో శరీరంలో జీవుడు ఉండగానే కుక్కల చేతా, గ్రద్దలచేతా, వాని ప్రేవులు లాగిస్తారు. సర్ప, వృశ్చికాదుల

ఆదీపనం స్వగాత్రాణాం వేష్టయిత్వోల్ముకాదిభిః,
ఆత్మమాంసాదనం క్వాపి స్వకృత్తం పరతోఽపి వా.
జీవతశ్చాంత్రాభ్యుద్ధారశ్శ్వగృధ్రైర్యమసాదనే,
సర్పవృశ్చిక దంశాద్యైర్దశద్భిశ్చాత్మవైశసమ్.
కృంతనం చావయవశో గజాదిభ్యో భిదాపనమ్,
పాతనం గిరిశృంగేభ్యో రోధనం చాంబుగర్తయోః.
యాస్తామిస్రాంధ తామిస్రారౌరవాద్యాశ్చ యాతనాః,
భుంక్తే నరో వా నారీ వా మిథస్సంగేన నిర్మితాః.
అత్రైవ నరకస్స్వర్గఇతి మాతః ప్రచక్షతే,
యా యాతనా వై నారక్యస్తా ఇహాప్యుపలక్షితాః,
ఏవం కుటుంబం బిభ్రాణ ఉదరంభర ఏవ వా,
విసృజ్యేహోభయం ప్రేత్య భుంక్తే తత్ఫలమీదృశమ్,

చేతనూ, యింకా కోరలుగల జీవులచేతనూ పొడిపించీ, కరిపించీ, పీకించీ, అనేకరీతులుగా హింసిస్తారు. శరీరాన్ని ముక్కలుముక్కలుగా నరకడం, యేనుగులచేత త్రొక్కించడం, పర్వతశిఖరాలనుండి క్రిందకు త్రోయించడం, నీటియందు ముంచి పైకి తేలనివ్వకుండా ఉంచడం, గోతులయందు పాతిపెట్టడం మొదలుగాగల తలచిన మాత్రాన శరీరం కంపింపజేసే యాతనలన్నీ కలిగిస్తారు. ఆ యమలోకంలో తామిస్ర, అంధతామిస్ర, రౌరవ, మహారౌరవాది నరకాలెన్నో ఉన్నాయి. స్త్రీ ద్వారాగాక, పురుషు ద్వారాగాక, పరస్పర సంసర్గంవల్ల కలిగే పాపాలు కారణంగా నరక యాతనలను అనుభవించే తీరాలి. అమ్మా! కొందరు స్వర్గనరకాలు యిక్కడే ఉన్నాయంటారు. ఎందువల్లనంటే నరక యాతనలతో సమానమైన యాతనలూ, భోగాలూ కూడా యిక్కడే ఉన్నాయని వారి భావము.

ఈ విధంగా అనేక కష్టాలకు లోనై తన కుటుంబ పోషణార్థం, తన పొట్ట నింపుకోడానికీ, కాలం యాపన చేసే మానవుడు

ఏకః ప్రపద్యతే ఒధ్వాన్తం హిత్వేదం స్వకళేబరమ్,
కుశలేతరపాథేయో భూతద్రోహేణ యద్భృతమ్,
దైవేనాసాదితం తస్యనిరయే శమలం పుమాన్,
భుంక్తే కుటుంబపోషస్య హృతవిత్త ఇవాతురః.
కేవలేన హ్యధర్మేణ కుటుంబభరణోత్సుకః,
యాతి జీవోఽన్ధతామిస్రం చరమం తమసః పదమ్.
అధస్తాన్నరలోకస్య యావతీర్యాతనాదయః,
క్రమశస్సమనుక్రమ్య పునరత్రావ్రజేచ్ఛుచిః.

కుటుంబాన్ని, శరీరాన్నికూడా యిక్కడే వదిలివేసి మరణించిన పాపఫలాన్ని నరకలోకంలో తానొక్కడుగానే అనుభవిస్తాడు. కుటుంబ పోషణకుగాను తాను ఈ లోకంలో చేసిన పాపాలూ, అన్యాయాలూ, ఫలితంగా దైవవశాత్తూ ప్రాప్తమైన దుష్కర్మఫలాన్ని నరకలోకంలో అనుభవించేటప్పుడు సర్వస్వం పోయినట్లుగా దుఃఖిస్తాడు. యే పురుషుడైతే పాపకార్యాలే చేసి కుటుంబాన్ని పోషిస్తాడో అతను అంధతామిస్రమనే నరకాన్ని పొందుతాడు. అది అధికమైన కష్టాన్నిస్తుంది. నరక యాతనల ననుభవించి శ్వాన సూకరాది జన్మలెత్తి తుదకు మానవ జన్మను పొందుతాడు.

## 30 అధ్యాయం

కర్మణా దైవనేత్రేణ జంతుర్దేహోపపత్తయే,
స్త్రియాః ప్రవిష్ట ఉదరం పుంసో రేతఃకణాశ్రయః.
కలలం త్వేకరాత్రేణ పంచరాత్రేణ బుద్బుదమ్,
దశాహేన చ కర్కంధూః పేశ్యండం వా తతః పరమ్.

కపిలుడింకా యిలా చెబుతున్నాడు. మాతా! యెప్పుడైతే జీవుడు మనుష్య శరీరాన్ని పొందే సమయం ఆసన్నమౌతుందో అప్పుడే పూర్వ కర్మానుసారం దైవప్రేరణచేత దేహప్రాప్తి కొరకు పురుషుని వీర్యకణం ద్వారా స్త్రీ యందు ప్రవేశిస్తాడు. స్త్రీయొక్క గర్భంలో

మాసేన తు శిరోద్వాభ్యాం బాహ్వంఘ్ర్యాద్యంగవిగ్రహమ్,
నఖరోమాస్థిచర్మాణి లింగచ్ఛిద్రోద్భవస్త్రిభిః,
చతుర్భిర్ధాతవస్సప్త పంచభిః క్షుత్తృడుద్భవః,
షడ్భిర్జరాయుణా వీతః కుక్షౌ భ్రామ్యతి దక్షిణే.
సప్తమే జన్మకర్మాణి గతాని స్మరతే ఋషిః.
జగత్యాం నిజదేహస్య మాయయా బంధమాత్మనః
మాతుర్జగ్ధాన్నపానాద్యైరేధద్ధాతు రసంమతే,
శేతే విణ్మూత్రయోర్గర్తే సజంతుర్జంతుసంభవే.
క్రిమిభిః క్షతసర్వాంగస్సౌకుమార్యాత్ప్రతిక్షణమ్.
మూర్ఛామాప్నోత్యురుక్లేశస్తత్రత్యైః క్షుధితైర్ముహుః.
కటుతీక్ష్ణోష్ణలవణక్షారామ్లాదిభిరుల్బణైః,
మాతృభుక్తై రుపస్పృష్ట సర్వాంగోత్థిత వేదనః.

రజస్సుతో కలసి ఒక రాత్రిలో కలల రూపాన్ని ధరిస్తుంది. ఐదు రాత్రులకు బుద్బుదంగా పది రాత్రులకు బదరీ ఫలరూపంలో పరిణమిస్తుంది. అనంతరం మాంస పేశీ లేక అండజ ప్రాణులందు అండంయొక్క రూపంలో పరిణమించి ఒక మాసంలో శిరస్సు రెండవ మాసంలో చేతులూ కాళ్లు మొదలైన అంగములు విభాగమై మూడవ మాసంలో నఖ రోమ అస్థి చర్మాదులూ స్త్రీ పురుష చిహ్నలూ నవరంధ్రాలూ ఏర్పడతాయి. నాలుగవ మాసంలో మాంసాది సప్తధాతువులూ ఐదవ మాసంలో ఆకలి దప్పికలూ ఆరవ మాసంలో జరాయువుచే కప్పబడి మాతృ గర్భంలో తిరుగులాడుతూ ఉంటాడు. ఆ సమయాన్నుండి తల్లిచే భుజింపబడిన ఆహార పానీయాల నుండి గర్భస్థ శిశువుయొక్క ధాతువులు వృద్ధి చెందుతాయి, క్రిములూ మొదలైన వాని జన్మస్థానమగు మలమూత్రముల గోతిలో పడి ఉంటాడు. గర్భస్థ శిశువు అతి సుకుమారంగా ఉండడం చేత గర్భమందున్న క్రిములచె పొడవబడి మాటి మాటికి మూర్ఛ చెందుతూ మాతృభుక్తము లైన కటు తిక్త కషాయ ఆమ్లాది ఉగ్రరసముల సంస్పర్శ వల్ల సమస్త శరీరంయందూ క్లేశం జనించి బాధపడు తూంటాడు. ఆజీవుడు గర్భాశయమందు జరా

ఉల్బేన సంవృత స్తస్మిన్నాంత్రైశ్చ బహిరావృతమ్,
అస్తే కృత్వా శిరః కుక్షౌ భుగ్నపృష్ఠశిరోధరః,
అకల్పస్స్వాంగచేష్టాయాం శకుంతఇవ పంజరే.
తత్రలబ్ధస్మృతిర్దైవాత్కర్మజన్మశతోద్భవమ్,
స్మరన్దీర్ఘ మనుచ్ఛ్వాసం శర్మ కిన్నామ విందతే.
ఆరభ్య సప్తమాన్మాసాల్లబ్ధబోధోఽతి వేపితః,
నైకత్రాస్తేసూతివాతైర్విష్ఠాభూరివ సోదరః.
నాథమానఋషి ర్భీతస్సప్తవధ్రిః కృతాంజలిః,
సంస్తౌతి తం విక్లబయా వాచా యేనోదరేఽర్పితః.
తస్యోపపన్నమవితుం జగదిచ్ఛయాత్తనానాతనోర్భువి లసచ్చరణారవిందం,
సోఽహంవ్రజామి శరణం న కుతోభయం మే యేనేదృశీ గతిరదర్శ్యసతోఽనురూపా.
యుస్త్వత్ర బద్ధ ఇవ కర్మభిరావృతాత్మా భూతేంద్రియాశయమయీామవలం
వ్యామాయామ్,

యువుచే కప్పబడి ప్రేవులచే బంధింపబడి శిరస్సూ, కుక్షియందు మెడ, నడుమూ వంగి కుండలాకారంగా ఉంటాడు.

గర్భస్థ శిశువు పంజరంలో బంధింపబడిన పక్షివలె పరాధీనుడై ఏ అవయవములనూ ఇటు, నటు కదల్చలేకుండా ఉంటాడు. ఆ సమయంలో అదృష్ట వశంచేత జీవునకు స్మరణ శక్తి కలుగుతుంది. వందల కొలదీ జన్మలలో చేసిన కర్మలన్నీ జ్ఞాపకంవస్తాయి. సుఖదుఃఖ ప్రాప్తి హేతుభూతములైన ఆ కర్మవల్ల కలిగే విషయాలు అన్నీ తలచుకుంటూ ఉంటే వానికి సుఖశాంతులెలా కలుగుతాయి? అప్పుడూ దుఃఖిస్తూనే ఉంటాడు. ఏడవమాసారంభంలో జ్ఞానశక్తి వికసిస్తుంది, కాని ప్రసూతి వాయువుచే కొట్టబడుటచే స్థిరత్వం లేక ఉదరస్థమైన మలమందుకల పురుగువలె ఇటు, నటు తిరుగుతాడు. అప్పుడు సప్తధాతుమయమైన స్థూల శరీరంచే బంధిప బడిన దేహాత్మభావంకల జీవు డతిభయభీతుడై చేతులుజోడించి ఆ శ్రీహరిని యిలా స్తుతిస్తాడు.

జీవుడు పలుకుతున్నాడు – నేను అధముడను. భగవంతుడు నా! గతిని కలిగించాడంటే ఇదినాకు తగినదే. తన్ను శరణన్న యీా ప్రప

అస్తేవిశుద్ధమవికారమఖండబోధమాతప్యమానహృదయేఽవసితంనమామి.
యః పంచభూతరచితే రహితశ్శరీరే ఛన్నో యథేంద్రియగుణార్థచిదాత్మకోఽహమ్,
తేనావికుంఠమహిమానమృషిం తమేనం వందే పరం ప్రకృతిపూరుషయోః పుమాంసం.
యన్మాయయోరుగుణకర్మనిబంధనేఽస్మిన్ సాంసారికే పథిచరం స్తదభిశ్రమేణ,
నష్టస్మృతిః పునరయం ప్రవృణీతలోకం యుక్త్యాకయా మహదనుగ్రహమంతరేణ.
జ్ఞానం యదేతదదధాత్కతమస్సదేవస్త్రైకాలికం స్థిరచరేష్వనువర్తితాంశః,
తంజీవకర్మపదవీమనువర్తమానాస్తాపత్రయోపశమనాయ వయం భజేమ.
దేహ్యన్యదేహవివరే జఠరాగ్నినాఽసృగ్విణ్మూత్రకూపపతితో భృశతప్తదేహః.
ఇచ్ఛన్నితో వివసితుం గణయన్ స్వమాసాన్ నిర్వాస్యతే కృపణధీర్భగవన్ కదా ను,
యేనేదృశీం గతిమసౌ దశ నంగ్రాహితః పురుదయేన భవాదృశేన,

చాన్ని రక్షించుటకే ఆభగవాను డనేక రూపాలు ధరిస్తూంటాడు. భూతలమందు చరించే శ్రీహరియొక్క నిర్భయమైన చరణాలను నేను శరణంటున్నాను. తల్లియొక్క గర్భంలో దేహేంద్రియ అంతః కరణ రూపమైన మాయనాశ్రయించి పుణ్యాపాప రూపమైన కర్మలచే ఆచ్ఛాదింపబడిన కారణంచే బద్ధునివలె కనబడే నా హృదయమందు స్ఫురించే విశుద్ధరూపుడూ, వికారరహితుడూ, అఖండ బోధ రూపుడూ, ఐన పరమాత్మకు నమస్కరిస్తు న్నాను. నేను శరీరాదులకంటె భిన్నుడ నైననూ చూచుటలో పాంచభౌతిక శరీరంచే బద్ధుడనై యున్నాను గనుకనే ఇంద్రియ, గుణ, శబ్దాది విషయచిదాభాస రూపుడనుగా కన బడుతున్నాను. ఈశరీరాది ఆవరణలచే ఎవని మహిమ కుంఠితము కాదో అట్టి ప్రకృతి పురుషులకు నియంతయగు పురుషోత్తమునకు నమస్కరిస్తున్నాను. ఆ భగవానుని మాయచేతనే స్వస్వరూపజ్ఞానం నష్టంకావడంవల్ల జీవుడనేక ప్రకారములైన సత్వాది గుణకర్మలయొక్క బంధనంచే బద్ధుడై యీ సంసార మార్గంలో అనేక కష్టాలను సహిస్తూ తిరుగుతూ ఉంటాడు. అట్టివానికి పరమపురుషుని కృపలేనిదే యేయు క్తుల చేతనూ స్వస్వరూప జ్ఞానంకలుగదు. నాకు యిప్పుడు కలిగిన త్రికాలజ్ఞానం ఆభగవానుని అనుగ్రహంవల్ల కలిగినదే. కాకయితరు లెవరివల్ల కలుగుతుంది? ఎందువల్లనస్థావర జంగమాత్మకమైన సమస్త

స్వైవైవతు వ్యతు కృతేన నపినసాథః కో నామతత్ప్రతివినాంజలిమన్య కుర్యాత్.
పశ్యత్యయం ధిషణయా సను నప్తవర్షిశ్శారిరకే దమశరీర్యపరస్స్వదేహే,
యత్స్సృష్టయానత మహం పురుషం పురాణం పశ్యేబహిర్హృది చ చైత్యమివ ప్రతీతం.
సోఽహం వసన్నపి విభో బహుదుఃఖవాసం గర్భాన్ననిర్జిగమిషే బహిరంధకూపే
యత్రోపయాతముపసర్పతి దేవమాయా మిథ్యామతిర్యదనుసంసృతిచక్రమేతత్.
తస్మాదహం విగతవిక్లబ ఉద్ధరిష్య ఆత్మానమాశు తమసస్సుహృదాత్మనైవ,
భూయో యథా వ్యసనమేతదనేకరంధ్రం మామేభవిష్యదుపసాదితవిష్ణుపాదః.

ఏవం కృతమతిం గర్భే దశమాస్యం నపద్యస్తుతిం,
నద్యః క్షిపత్యవాచీనం ప్రసూత్యై సూతిమారుతః,
తేనావసృష్టస్సహసా కృత్వావాక్చిర ఆతురః,
వినిష్క్రామతి కృచ్ఛ్రేణ నిరుచ్ఛ్వాసో హతస్మృతిః.

ప్రాణులయందూ, అంతర్యామి రూపంలో అంశమాత్రంగా ఆ భగవానుడే ఉంటాడు గనుక కర్మ జనితమైన జీవరూపమైన యీ పదవిని అనుసరించిన నేను నా త్రివిధములైన పాపాలూ నశించుటకుగాను ఆభగవానునే సేవించుచున్నాను.

భగవానుడా! యీ దేహధారియగు జీవుడు, మాతృ గర్భంలో మలమూత్ర రుధిర గర్తమందు పడియున్నాడు. ఆమెయొక్క జఠరాగ్నిచే వీనిశరీరంత ప్తమై పోతుంది. గర్భాన్నుండి బయట పడాలని వాంఛిస్తున్నాడు. మాసాలు లెక్క పెట్టుకుంటున్నాడు. అట్టి యీ దీనుణ్ణి యెప్పుడు బైట పడేస్తావు? స్వామీ! మీరు అతిదయాస్వభావులు. మీరు గొప్ప ఉదారస్వభావంగలవారు గనుకనే పదిమాసాల జీవునకు ఉత్కృష్టమైన యీ జ్ఞానం ప్రసాదించారు. దీనబాంధవా! మీ ఉపకారానికి చేతులుజోడించి నమస్కరించడం కంటె నేను చేయగలిగింది లేదు. కనుక యీ మాత్రానికే నన్నను గ్రహింతువుగాక!

ప్రభూ లోకంలో పశుపక్ష్యాదులు తమమూఢ బుద్ధిచేత సుఖదుఃఖాదుల ననుభవిస్తారే కాని జ్ఞానం సాధించలేవు. నీకృపచేత నేను శమాది సాధన సంపన్నమైన శరీరాన్ని పొందకలిగాను. అందువల్ల నీ దయచేత ప్రసాదింపబడిన వివేకంగల బుద్ధిచేత పురాణ పురుషులైన

పతితో భువ్యసృగ్దిగ్ధో విష్ఠాభూరివ చేష్టతే,
రోరూయతి గతే జ్ఞానే విపరీతాం గతిం గతః.
పరచ్ఛందం న విదుషా పుష్యమాణో జనేన సః,
అనభిప్రేతమాపన్నః ప్రత్యాఖ్యాతు మనీశ్వరః.
శాయితో శుచిపర్యంకే జంతుస్స్వేదజదూషితే,
నేశః కండూయనేఽంగానామాసనోత్థాన చేష్టనే.
తుదంత్యామత్వచం దంశామత్కుణా మశకాదయః.
రుదంతం విగతజ్ఞానంక్రిమయః క్రిమికం యథా.

మిమ్మల్ని లోపలా బైటాకూడా అహంకారాశ్రియమైన ఆత్మవలే ప్రత్యక్షంగా చూడగలుగుతున్నాను. పరమేశ్వరా! యీ గర్భ నరకంలో అనంతమైన దుఃఖం అనుభవిస్తున్నా, మీ ప్రసాదంవల్ల కలిగిన జ్ఞానంచే ఆగతానాగతాలు తెలియడంచేత నాకు జన్మించడం కూడా యిష్టం కావడంలేదు. ఎందుచేతననగా, మాతృగర్భాన్నుండి భూమి మీాద జనించిన ఉత్తరక్షణమందే నీ మహామాయ ఆవరిస్తుంది. వెంటనే దేహాత్మబుద్ధి కలిగి యీసంసారచక్రంలోనే పడవలసి వస్తుంది. అందువల్ల నేనిప్పుడు విచారాన్ని వదలుకొని నాహృదయాంతర్వర్తి యగు శ్రీవిష్ణుభగవానుని చరణపంకజాలనే హృదయంలో స్థాపించుకుని బుద్ధియొక్క సహాయంచేత తిరిగి సంసారదుఃఖం లేకుండా, ఉండే మార్గాన్నే అనుసరించి సంసారసముద్రాన్ని తరింతునుగాక! .

అమ్మా! ఆపదిమాసముల జీవుడూ, యీవిధంగా వివేకం కలవాడై భగవంతుని స్తుతిస్తాడు. అప్పుడా. అధోముఖుడైన బాలుణ్ణి ప్రసవకాలీనమైన వాయువు మాతృగర్భాన్నుండి బహిర్గతుణ్ణి చేయుటకై నెంటుతుంది. ఆ వాయువుచేత. త్రోయబడి ఆబాలు డధిక కష్టంతో, శ్వాసనిరోధింబడి, స్మృతి నశించి భూమియందు జన్మిస్తాడు. భూమియందు మాతృసంబంధమైన రక్తమూత్రాదులందు పడియున్న ఆబాలుడు మలమందున్న కీటకంతో సమానంగా యిటు, నటు, కొట్టుకుంటూ, గర్భవాస సంబంధమైన జ్ఞానం మరచిపోయి దేహాత్మభావం కలవాడై గట్టిగా. యేడవడం మొదలుపెడతాడు.

ఇత్యేవం శైశవం భుక్త్వా దుఃఖం పౌగండమేవ చ,
అలబ్ధాభీప్సితోఽజ్ఞానాదిద్ధమన్యుశ్శుచార్పితః.
సహ దేహేన మానేన వర్ధమానేన మన్యునా,
కరోతి విగ్రహంకామీ కామిష్వంతాయ చాత్మనః.
భూతైః పంచభిరారబ్ధే దేహే దేహ్యబుధోఽసకృత్,
అహం మమేత్యసద్గ్రాహః కరోతికుమతిర్మతిమ్.
తదర్థం కురుతే కర్మ యద్బద్ధో యాతి సంసృతిమ్,
యోఽనుయాతి దదత్క్లేశమవిద్యాకర్మ బంధనః.
యద్యసద్భిః పథి పునః శిశ్నోదరకృతోద్యమైః,
అస్థితో రమతే జంతుస్తమో విశతి పూర్వవత్,

అనంతరం వాని మనోగతభావాన్ని గుర్తించలేని వారివల్లనే పాలన పోషణాదు లందుచూ అనుకూలం యందు ఆనందించినా ప్రతికూలాన్ని నిషేధించే శక్తి కూడా లేకుండా, ఉంటాడు. శిశువుగా ఉండు కాలంలో శయనించి ఉన్నప్పుడు మలమూత్రాదుల నక్కడనే విసర్జించుచూ, స్వేదాదులచే శరీరం దూషితమైనా అలాంటి మలినాదులవల్ల దేహమందు కలిగిన కండూతి (దురద) ని కూడా మాన్పుకోడానికి శక్తిలేక బాధపడుతూంటాడు. ఆ బాలునియొక్క చర్మం చాలా మృదువుగా ఉంటుంది. నల్లులూ, దోమలూ చీమలూ మొదలైనవి కుడుతూ ఉంటే కదలలేక, లేవలేక, కూర్చునలేక పోవడమే కాకుండా గర్భావస్థయందున్న జ్ఞానంకూడా నశించడంచేత యేడవడం వినా యేమీ చేయలేకుండా ఉంటాడు.

ఈవిధంగా బాల్య, పౌగండావస్థలయందు, అనేక దుఃఖాలనుభవించి, యౌవనావస్థను పొంది తనుకోరిన భోగాలు ప్రాప్తించవనప్పుడు, అజ్ఞానవశంచేత క్రోధం కలిగి శోకం పొందుతాడు. దేహంతోకూడా అభిమానం, క్రోధం వృద్ధిచెందడంవల్ల కామపరవశుడైన జీవి తన నాశనహేతువైన ఇంకొక కాముకునిలో, వైరంపూని, కష్టాలే పొందుతూ ఉంటాడు. కుమతియగు మానవుడు పంచభూతములచే దేహమందే మిథ్యాభినివేశం కారణంగా, నిరంతరం, నేను, నాది అనే

సత్యం శౌచం దయా మౌనం బుద్ధిర్హ్రీశ్శ్రీర్యశః క్షమా,
శమో దమో భగశ్చేతి యత్సంగాద్యాతి సంక్షయమ్.
తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మస్వసాధుషు,
సంగం న కుర్యాచ్ఛోచ్యేష్వు యోషిత్క్రీడామృగేషు చ,
న తథాస్య భవేన్మోహో బంధశ్చాన్యప్రసంగతః,
యోషిత్సంగాద్యథాపుంసో యథా తత్సంగిసంగతః,
ప్రజాపతిస్స్వాం దుహితరం దృష్ట్వా తద్రూపధర్షితః
రోహిద్భూతాంయోఽన్వధావదృక్షరూపీ గతత్రపః.

అభిమానానికి లోనైపోయి కాలం వృథాగా అహంకార మమకారజన్యమైన అసత్కర్మలయందే గడుపుతాడు. ఈ శరీరం వార్ధక్యాది అవస్థలచే దుఃఖాన్నే కలిగిస్తూ ఉన్నా అవిద్యారూపమైన కర్మసూత్రబద్ధుడై అది ఆడించినట్లల్లా ఆడుతూ అనేక కర్మలు చేస్తూ మాటిమాటికీ యీ సంసారచక్రంలో తిరుగుతూ జనన మరణాలు, పొందుతూ ఉంటాడు. సన్మార్గమందు చరిస్తూకూడా, దుస్సాంగత్యంవల్ల శిశ్నోదర పరాయణులై, భోగాసక్తులైనవారితో, చరిస్తూ వారినే అనుసరిస్తూ చరిస్తే పూర్వంవలె తిరిగి మళ్ళీ రౌరవాది నరకగతినే పొందుతాడు' సత్యదయా శౌచ, సంయమాదులూ, బుద్ధీ, ధనం, సంపత్తూ, లజ్జా, కీర్తీ, క్షమా, మనస్సూ ఇంద్రియసంయమనం, ఐశ్వర్యం, సద్గుణాలు యెవరివల్లనైతే నశించిపోతాయో, అలాంటి శోచనీయమైన స్త్రీలకు క్రీడామృగమై అశాంత, మూఢ, దేహాత్మలక్షణాలుగల, అసత్పురుష సాంగత్యం యెన్నడూ చేయరాదు. ఎవరి సంగంవల్లా కలుగని మోహాదులు, స్త్రీసంగంవల్లా, స్త్రీలసంగం కలవారి సంగంవల్లాకూడా కలుగుతాయి. ఒకప్పుడు చతుర్ముఖుడే తన కుమార్తెయగు. సరస్వతి రూపానికి వ్యామోహం చెంది ఆమె మృగరూపాన్ని ధరించి పరుగెత్తుతూంటే తానుకూడా మృగరూపం ధరించి వెన్నంటి పరువెత్తాడు. ఆచతుర్ముఖుడే మరీచ్యాది ప్రజాపతులను, మరీచ్యాదులు కశ్యపాదులను, కశ్యపాదులు దేవమనుష్యాది ప్రాణులనూ సృష్టించారు. వీరిలో అతిఋషియగు నారాయణుడు వినా స్త్రీరూపిణియగు మాయచే

తత్సృష్ట సృష్టసృష్టేషు కోన్వఖండితధీః పుమాన్,
ఋషిం నారాయణమృతే యోషిన్మయ్యేహ మాయయా.
బలం మే పశ్య మాయాయాస్త్రీమయ్యాజయినో దిశామ్,
యా కరోతి పదాక్రాంతాన్ భ్రూవిజృంభేణ కేవలమ్.
సంగం న కుర్యాత్ప్రమదాసు జాతుయోగస్య పారం పరమారురుక్షుః,
మత్సేవయా ప్రతిలబ్ధాత్మలాభో వదంతి యానిరయద్వారమస్య.
యోపయాతి శనైర్మాయాయోషిద్దేవ వినిర్మితా,
తామీక్షేతాత్మనో మృత్యుం తృణైః కూపమివావృతమ్.

మోహితుడను కానివాడు లేడు. అమ్మా! మాయ నాయొక్క స్త్రీ రూపిణియైన మాయ భ్రూవిక్షేపమాత్రంచేత మహారాజులను కూడా పాదముల క్రింద నలిపివేస్తూ ఉంది. యోగాభ్యాసంవల్ల పరమపదం పొందాలనే కాంక్షకలవాడూ నన్ను సేవించి ఆ ప్రభావం వల్ల ఆత్మ, అనాత్మ, వివేకం, తెలుసుకోవాలనే యిచ్ఛకలవాడూ కూడా, నరక ద్వారమైన స్త్రీని పొందరాదు. భగవంతునిచే స్త్రీ రూపంలో నిర్మింపబడిన మాయ మెల్ల మెల్లగా, సేవచేసే మిషతో దగ్గరకు చేరుతుంది. ఆసమయంలో ఆకులచేత కప్పబడిన నేలవలె కనిపిస్తూ అడుగు వేసేసరికి మృత్యువును ప్రసాదించే నూతివలె అంటే మృత్యువువలె చూడాలి.

స్త్రీయందే ఆసక్తుడైఉండడంవల్లా అంత్యమందు స్త్రీయందే దృష్టికలిగి మరణించడంవల్ల ఉత్తర జన్మయందు స్త్రీయై జన్మిస్తాడు. యీవిధంగా స్త్రీరూపంలో జన్మించిన జీవి పురుషరూపంలో ప్రతీతమయే నామాయను చూచి ధన, పుత్ర, గృహాదుల నిచ్చేతన భర్తగా భావించి చరిస్తూ ఉంటుంది. అట్టి స్త్రీ కిరాతుని గానంవిని పశుపక్ష్యాదులు వచ్చి జాలంలో చిక్కుపడి మరణించినట్లే పతిపుత్రధనాదిరూప మాయాజాలంలో చిక్కుకుని మరణిస్తుంది. అంటే జ్ఞానమార్గంలో స్త్రీకి పురుషుడూ, పురుషునకు స్త్రీ కూడా మృత్యురూపంలోనే ఉంటారని గ్రహించ[illegible]. అమ్మా! జీవునకు ఉపాధిభూతమైన

యాం మన్యతే పతిం మోహాన్మన్మాయా మృషభాయతీం,
స్త్రీత్వం స్త్రీసంగతః ప్రాప్తో విత్తా పత్యగృహప్రదమ్.
తామాత్మనో విజానీయాత్పత్యపత్యగృహాత్మకమ్,
దైవోపసాదితం మృత్యుం మృగయోర్గాయనం యథా.
దేహేన జీవభూతేన లోకాల్లోక మనువ్రజన్,
భుంజానఏవ కర్మాణి కరోత్యవిరతం పుమాన్,
జీవోహ్య స్యానుగో దేహో భూతేంద్రియమనోమయః.
తన్నిరోధో స్య మరణమావిర్భావస్తు సంభవః,
ద్రవ్యోపలబ్ధిస్థానస్య ద్రవ్యేక్షాయోగ్యతా యదా,
తత్పంచత్వ మహంమానాదుత్పత్తిర్ద్రవ్యదర్శనం.
యథాక్ష్ణోర్ద్రవ్యావ యవదర్శనా యోగ్యతాయదా,
తదైవ చక్షుషోర్ద్రష్టుర్ద్ర ష్టృత్వాయోగ్యతానయోః.

లింగదేహంద్వారా, ఒకలోకాన్నుండి మరోలోకానికి తిరుగుతూ, ఒకదేహాన్నుండి మరో దేహాన్ని పొందుతూ, ప్రారబ్ధ వశముతైన కర్మలు అనుభవిస్తూ కొత్తకర్మలు కూడా చేస్తూఉంటాడు. జీవునకు ఉపాధిరూపమైన లింగశరీరం మోక్షపర్యంతం కూడా ఉంటూనే ఉంటుంది. భూత, ఇంద్రియ మనస్సులకు కార్యరూపమైన స్థూలశరీరమే దీనికి భోగాధిష్ఠానం. ఈ రెండూ సంఘటితమై పనీ చేయకుండా, ఉండడమే మృత్యువనబడుతుంది. ఈరెండూ ఒకదానితో నొకటి ప్రకటితం కావడమే జననం. పదార్థోపలబ్ధిస్థాన రూపమైన స్థూలశరీరమందు గ్రహణసామర్థ్యయోగ్యత లేక పోవుటయే మరణం. యీ స్థూల శరీరమే నేను అనే దేహాత్మభావం కలిగి యుండుటయే జన్మ యన బడును. దోషకారణంగా వస్తువును చూడలేని స్థితి నేత్రాలకు కలిగి నప్పుడు చక్షురింద్రియంకూడా రూపాన్ని గ్రహించలేదు. యెప్పుడైతే నేత్రాలూ, నేత్రేంద్రియమూ, రూపగ్రహణ సామర్థ్యం లేనివిగా ఐ పోతాయో, జీవుడుకూడా రూపాన్ని గ్రహించ లేకపోతాడు. అందు వల్ల మోక్షాసక్తి కలవాడు మరణాలయందు భయం దీనత్వం

తస్మాన్న కార్యస్సంత్రాసో న కార్పణ్యం న సంభ్రమః,
బుద్ధ్వా జీవగతిం ధీరో ముక్తసంగశ్చ రేదిహ.
సమ్యగ్దర్శనయా బుద్ధ్యా యోగ వైరాగ్యయుక్తయా,
మాయావిరచితే లోకే చరేన్న్యస్య కళేబరం.

మోహం మొదలైనవి విడచి వేయాలి. జీవుడు తనస్వరూపాన్ని గ్రహించి ధైర్యంగా నిస్సంగుడై చరిస్తూ ఈ మాయామయమైన జగత్తునందు యోగ వైరాగ్యయుక్తుడై జ్ఞానమయమైన బుద్ధితో శరీరాన్ని నిక్షేపంవలె ఉంచిదానియందనాసక్తుడై సంచరించడం మోక్షకారణం.

## 31 అధ్యాయం

అథ యో గృహమేధీయాన్ ధర్మానేవావసన్ గృహే,
కామమర్థంచ ధర్మాన్ స్వాన్ దోగ్ధిభూయః పిపర్తితాన్.
సచాపి భగవద్ధర్మాత్కామమూఢః పరాఙ్ముఖః,
యజతే క్రతుభిర్దేవాన్ పితౄంశ్చశ్రద్ధయాన్వితః.
తచ్ఛ్రద్ధయాక్రాంతమతిః పితృదేవవ్రతః పుమాన్,
గత్వాచాంద్రమసం లోకం సోమపాః పునరేష్యతి.
యదాచాహీంద్ర శయ్యాయాం శేతేఽనంతా ననోహరిః,
తదా లోకాలయం యాంతి తఏ తే గృహమేధినామ్.

తల్లీ! సకామభావంతో గృహమందే ఉండి, గృహస్థాశ్రమ ధర్మములనే పాలిస్తూ, వాని ఫలస్వరూపములైన అర్థకామోపభోగాలనే అనుభవిస్తూ, గృహస్థాశ్రమ సంబంధములైన కర్మలే చేస్తూ, అనేక తరగతులైన కోర్కెలచే వ్యామోహితుడవడంచేత భగవద్ధర్మ విముఖుడై, యజ్ఞములద్వారా దేవతలనూ, పితరులనూ, ఆరాధించి, వాని బుద్ధి శ్రద్ధాపూర్వకంగా దేవపితరులయందే లగ్నమై యుండడంవల్ల ,అతడు చంద్రలోకంచేరి వారితోకూడా సోమపానంచేస్తూ పుణ్యం క్షీణించినపిమ్మట తిరిగి యీలోకంలో పుడతాడు. ప్రళయకాలంలో భగవానుడు శేషశయ్యయందున్న

యే స్వధర్మాన్న దుహ్యంతి ధీరాః కామార్థ హేతవే,
నిస్సంగాన్యస్తకర్మాణః ప్రశాంతాః శుద్ధచేతసః.
నివృత్తిధర్మనిరత నిర్మమా నిరహంక్రియాః,
స్వధర్మాఖ్యేన సత్త్వేన పరిశుద్ధేన చేతసా.
సూర్యద్వారేణ తే యాంతి పురుషం విశ్వతో ముఖమ్,
పరావరేశం ప్రకృతిమస్యోత్పత్త్యంతభావనమ్.
ద్విపరార్ధావసానేయః ప్రళయో బ్రహ్మణస్తు తే,
తావద ధ్యాసతే లోకం పరస్యపరచింతకాః.

క్ష్మాంభోనలానిల వియన్మనఇంద్రియార్థభూతాదిభిః పరివృతం ప్రతిసంజిహీర్షుః
అవ్యాకృతం విశతి యర్హి గుణత్రయాత్మా కాలం పరాఖ్యమనుభూయ పరస్వయంభూః

ఏవం పరేత్య భగవంతమనుప్రవిష్టా యే యోగినో జితమరున్మనసో విరాగాః,
తేనైవ సాకమమృతం పురుషం పురాణం బ్రహ్మప్రధానముపయాంతి గతాభిమానాః
అథ తం సర్వభూతానాం హృత్పద్మేషు కృతాలయమ్,
శ్రుతానుభావం శరణం వ్రజ భావేన భామిని.

ప్పుడు గృహస్థులకు ప్రాప్తించిన చంద్రాది సమస్త లోకాలూ లయమైపోతాయి.

వివేకవంతుడైన పురుషుడు వేదోక్తధర్మాన్నాచరిస్తూ ఆ ధర్మార్థాల్ని భోగవిలాసాదులయందు ఉపయోగించక భగవంతుని యొక్క ప్రసన్నత కోరకే ఆ ధర్మాన్ని పాలిస్తూంటే, అనాసక్త, ప్రశాంత, శుద్ధచిత్త, నివృత్తి ధర్మపరాయణ మమతారహిత, అహంకార శూన్యుడైన పురుషుడు స్వధర్మ పాలన రూపమైన సత్వ గుణంద్వారా, సర్వదా శుద్ధచిత్తం కలవాడౌతాడు. అంతమందు సూర్యమార్గంద్వారా సర్వ వ్యాపకుడైన పురాణపురుషుడగు శ్రీహరిని పొందకలుగుతాడు. ఏ కార్య కారణ రూపమైన జగన్నియంత ప్రపంచానికి ఉపాదాన కారణంగా ఉంటాడో అట్టి సృష్టి, స్థితి, లయ కారుడగు భగవంతుని పొందుతాడు. ఎవరైతే పరమాత్మ దృష్టితో హిరణ్యగర్భ బ్రహ్మ నారాధిస్తారో, ఉపాశిస్తారో వారు ద్విపరార్ధ పర్యంతం అంటే ప్రళయ పర్యంతం, సత్యలోకంలో

అద్యస్థిరచరాణాం యో వేదగర్భస్సహర్షిభిః
యోగేశ్వరైః కుమారాద్యైః స్సిద్ధైర్యోగప్రవర్తకైః.
భేదదృష్ట్యాభిమానేన నిస్సంగేనాపి కర్మణా,
కర్తృత్వాత్సగుణం బ్రహ్మ పురుషం పురుషర్షభమ్.
ససంసృత్య పునః కాలే కాలేనేశ్వరమూర్తినా,
జాతే గుణవ్యతికరే యథాపూర్వం ప్రజాయతే,
ఐశ్వర్యం పారమేష్ఠ్యం చ తేఽపిధర్మవినిర్మితమ్,
నిషేవ్య పునరాయాంతి గుణవ్యతికరే సతి.
యేత్విహాసక్తమనసః కర్మసు శ్రద్ధయాన్వితాః,
కుర్వంత్యప్రతిషిద్ధాని నిత్యాన్యపి చ కృత్స్నశః.
రజసా కుంఠమనసః కామాత్మానోఽజితేంద్రియాః,
పితౄన్ యజంత్యనుదినం గృహేష్వభిరతాశయాః.

ఉంటారు. దేవశ్రేష్ఠుడైన బ్రహ్మ ద్విపరార్ధకాలం తన అధికారాన్ననుభవించి పృథివ్యాపస్తేజో వాయురాకాశాలూ, మనస్సూ, ఇంద్రియాలూ, శబ్దాది విషయాలూ, అహంకారాదులతో కూడిన సంపూర్ణమైన విశ్వాన్నీ ఉపసంహరించాలనే ఇచ్ఛ కలిగినప్పుడు, త్రిగుణాత్మకమైన ప్రకృతితో కూడిన ఏకరూపుడై నిర్విశేషమైన పరమాత్మయందు లయమౌతాడు. ఆ సమయమందే ప్రాణేంద్రియాదులను జయించి విరక్తులైన యోగులు కూడా దేహత్యాగంచేసి బ్రహ్మయందు ప్రవేశిస్తారు. ఆయనతో కూడా పరమానందరూపుడై పురుషోత్తమ, పరబ్రహ్మమందు లయం పొందుతారు. ఇంతకు పూర్వమందింకా అహంకారశేషం ఉండడంవల్ల లయం పొందలేరు. గనుక, అమ్మా! నేను నీకు శ్రీహరి ప్రభావం చెప్పాను. సమస్త ప్రాణుల హృదయాలలోనూ, అంతర్యామిరూపంలో ఉండే ఆ శ్రీహరినే సేవించి శరణుపొందుము. వేదగర్భుడైన బ్రహ్మకూడా సమస్త, స్థావర, జంగమాత్మకమైన ప్రాణుల కాదికారణుడై యుండే మరీచ్యాది ఋషులతోనూ, యోగేశ్వరులూ, సనకాదులూ, యోగ ప్రవర్తకులైన సిద్ధులూ మొదలైనవారందరితోడనూ, నిష్కామ

త్రైవర్గికాస్తే పురుషా విముఖా హరిమేధసః,
కథాయాం కథనీయోరువిక్రమస్య మధుద్విషః.
నూనం దైవేన విహతా యే చాచ్యుతకథాసుధామ్,
హిత్వా శృణ్వంత్యసద్గాథాః పురీషమివ విడ్భుజః.
దక్షిణేన పథార్యమ్ణః పితృలోకం వ్రజంతి తే,
ప్రజామను ప్రజాయంతే శ్మశానాంతక్రియాకృతః.
తతస్తే క్షీణసుకృతాః పునర్లోకమిమం సతి,
పతంతి వివశా దేవైస్సద్యోవిభ్రంశితోదయాః.
తస్మాత్త్వం సర్వభావేన భజస్వ పరమేష్ఠినమ్,
తద్గుణాశ్రయయా భక్త్యా భజనీయపదాంబుజమ్.

కర్మద్వారా ఆదిపురుషుడైన పరబ్రహ్మను పొందికూడా, భేదదృష్టి, కర్తృత్వాభిమానం ఉండడంవల్ల యీశ్వరేచ్ఛ ననుసరించి కాలప్రేరితుడై సృష్ట్యారంభంలో పూర్వంవలె హిరణ్యగర్భ రూపంలో ప్రకట మౌతుంటాడు. అదేరీతిగా గుణసంక్షోభం కలిగినప్పుడు ఋషులు కూడా వారి కర్మార్హతల ననుసరించి యీలోకానికి వస్తూంటారు.

ఎవరియొక్క చిత్తం యీలోకమందే ఆసక్తమై కర్మల యందే శ్రద్ధగలదై ఉంటుందో వాడు వేదోక్తమైన కర్మలే చేస్తూ ఉంటాడు. అతడు రజోగుణాధిక్యమైన బుద్ధికలవాడై కుంఠితుడౌతున్నాడు. వారి హృదయం కోరికలతో నిండిపోతుంది. ఇంద్రియాలు స్వాధీనంలో ఉండవు. దేహమందే ఆసక్తికలవారై పితృదేవతల నారాధిస్తూ ఉంటారు. అట్టివారు ధర్మ, అర్థ కామపరాయణులై ఉంటారు. ఎవని పరాక్రమం కీర్తనీయమైనదో, అట్టి భవభయహారియగు మధుసూదనుని కథలయందు విముఖులై చరిస్తూంటారు. ఆహా! అమేధ్యం తినే సూకరశ్వానాదులు అమేధ్యాన్నే కోరుతూన్నట్లు మానవులు భగవత్కథామృతాన్ని వదలి నిందితములైన విషయవార్తలనే వింటూంటారు. వారికంటే మందభాగ్యులుండరు. గర్భధానాది అంత్యేష్టివరకూ ఉండే విధిపూర్వకమైన సకామకర్మల నాచరించే

వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః
జనయత్యాశు వైరాగ్యంజ్ఞానం యద్బ్రహ్మదర్శనమ్.
యదాస్య చిత్తమర్థేషు సమేష్వింద్రియవృత్తిభిః,
న విగృహ్ణాతి వైషమ్యమప్రియం ప్రియమిత్యుత.
సతదైవాత్మనాత్మానం నిస్సంగం శమదర్శనమ్.
హేయోపాదేయరహిత మారూఢం పదమీక్షతే.
జ్ఞానమాత్రం పరం బ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్,
దృశ్యాదిభిః పృథగ్భావైర్భగవానేక ఈయతే.
ఏతావానేవ యోగేన సమగ్రేణేహ యోగినః,
యుజ్యతేఽభిమతో హ్యర్థోయదసంగస్తు కృత్స్నశః.

వారు దక్షిణమందుండే పితృయానం లేక ధూమ మార్గంద్వారా పితృలోకేశ్వర ఆర్యమునియొక్క లోకానికి వెడతారు. తిరిగి మళ్ళీ తన సంతతియొక్క వంశంలోనే పుడుతూంటారు. పితృలోక భోగానంతరం, పుణ్యం క్షీణం కావడంతోనే అక్కడ దేవతలు వారి నా లోకాన్నుండి గెంటివేస్తారు. ఆ సమయంలో వివశులై యీలోకంలో పడతారు. అమ్మా! అందువల్ల నీవు నిరంతరం భగవద్గుణ గానం చెయ్యి. మనోవాక్కాయకర్మభిః భగవంతుణ్ణే సేవించు. వాసుదేవుని సేవించుటచే సంసారమందు వైరాగ్యం కలిగి బ్రహ్మ సాక్షాత్కార రూపమైన జ్ఞానం కలుగుతుంది. సమస్త విషయాలూ భగవంతుని రూపంలోనే గోచరిస్తూంటాయి. అందువల్ల భక్తుని చిత్తం ఇంద్రియవృత్తుల ద్వారా కూడా ప్రియాప్రియములందు వైషమ్యం పొందదు. సర్వత్రా భగవద్దర్శనమే కలుగుతూంటుంది. ఆ సమయంలో భక్తుడు సంగరహితుడై అందరియందు సమాన రూపంలో ఉన్న హేయోపాదేయ రహితమై, గుణదోషరహితమై తన మహిమయందే ఆరూఢమై, ఆత్మస్వరూపమైన బ్రహ్మ సాక్షాత్కారం పొందుతున్నాడు. అదే జ్ఞానస్వరూపమూ, పరబ్రహ్మ, పరమాత్మ, ఈశ్వర పురుషాది శబ్దములచే చెప్పబడినది. ఒక్క భగవానుడే జీవ శరీర ఇంద్రియాది అనేక రూపాల్లో ప్రతీతమాతూ

జ్ఞానమేకం పరాచీనై రింద్రియైర్బ్రహ్మ నిర్గుణమ్,
అవభాత్యర్థరూపేణ భ్రాంత్యాశబ్దాది ధర్మిణా.
యథా మహానహం రూపస్త్రివృత్పంచవిధస్స్వరాట్,
ఏకాదశవిధస్తస్య వపురండం జగద్యతః.
ఏతద్వై శ్రద్ధయా భక్త్యా యోగాభ్యాసేన నిత్యశః,
సమాహితాత్మా నిస్సంగో విరక్త్యా పరిపశ్యతి.
ఇత్యేతత్కథితం గుర్వి జ్ఞానం తద్బ్రహ్మదర్శనం.
యేనావబుధ్యతే తత్త్వం ప్రకృతేః పురుషస్య చ.
జ్ఞానయోగశ్చ మన్నిష్ఠో నైర్గుణ్యో భక్తిలక్షణః.
ద్వయోరప్యేకఏవార్థో భగవచ్ఛబ్ద లక్షణః.
యథేంద్రియైః పృథగ్ద్వారైరర్థో బహుగుణాశ్రయః,
ఏకో నానేయతే తద్వద్భగవాన్ శాస్త్రవర్త్మభిః

ఉంటాడు. సమస్త చరాచర ప్రపంచమందూ, ఆశక్తి లేకుండా, ఉండడమే యోగులకు యోగసాధన రూపమైన అభీష్టఫలం. నిర్గుణుడూ, జ్ఞానస్వరూపుడూ ఒక్కడూ ఐ ఉండీ కూడా బాహ్య వృత్తులు కల ఇంద్రియములద్వారా, భ్రాంతివశుడైన కారణంచేత శబ్దాది ధర్మములుకల విభిన్న పదార్థములందు భాసిస్తున్నాడు. ఒకే పరబ్రహ్మ, మహత్తత్వ, వైకారిక రాజస తామసాది అహంకార త్రయ, పంచమహాభూత, ఏకాదశ ఇంద్రియాది రూపాల్లో పరిణమించాడు. ఆ పరబ్రహ్మ స్వయంప్రకాశుడై కూడా, వీటి సంయోగంవల్ల జీవుడని చెప్పబడుతున్నాడు. అదే విధంగా ఆ జీవునియొక్క శరీరరూపమైన బ్రహ్మాండరూపం కూడా బ్రహ్మనుండే ఉత్పన్నమవడంచేత, బ్రహ్మకంటె భిన్నంకాదు. యెవడైతే శ్రద్ధా, భక్తి, వైరాగ్యాలతో, నిరంతరం యోగాభ్యాసంవల్ల ఏకాగ్రచిత్తుడై ఉంటాడో అట్టివాడు సర్వం బ్రహ్మరూపంలో చూడ గలుగుతాడు.

పూజ్యురాల! ప్రకృతిపురుష యథార్థజ్ఞానాన్ని ప్రసాదించే బ్రహ్మసాక్షాత్కార సాధనరూపమైన జ్ఞానం బోధించాను. నిర్గుణ బ్రహ్మవిషయకమైన జ్ఞానయోగమూ, నాచేత యిప్పుడు చెప్పబడిన

క్రియయా క్రతుభిర్దానైస్తపస్స్వాధ్యాయమర్శనైః.
ఆత్మేంద్రియ జయేనాపి సన్న్యాసేన చ కర్మణామ్.
యోగేన వివిధాంగేన భక్తియోగేన చైవ హి,
ధర్మేణోభయచిహ్నేన యః ప్రవృత్తినివృత్తిమాన్.
ఆత్మతత్త్వావబోధేన వైరాగ్యేణ దృఢేన చ,
ఈయతే భగవానేభిస్సగుణో నిర్గుణస్స్వదృక్.
ప్రావోచం భక్తియోగస్య స్వరూపం తే చతుర్విధం,
కాలస్య చావ్యక్తగతేర్యోఽన్తర్ధావతి జంతుషు.
జీవస్య సంసృతీర్బహ్వీరవిద్యాకర్మనిర్మితాః.
యాస్వంగ ప్రవిశన్నాత్మా న వేద గతిమాత్మనః.
నైతత్ఖలాయోపదిశేన్నావినీతాయ కర్హిచిత్,
న స్తబ్ధాయ న భిన్నాయ నైవ ధర్మధ్వజాయ చ,

భక్తియోగమూ యీ రెండూ ఒక్కటే. కలిగే ఫలంకూడా సమానమే. రూప రస గంధాది అనేక గుణాల కాశ్రయభూతమైన ఒకే పదార్థం భిన్న భిన్నములైన ఇంద్రియాలద్వారా విభిన్న రూపంలో అనుభూతమౌతున్నట్లే, శాస్త్రములయొక్క విభిన్న మార్గాల ననుసరించి ఒకే భగవానునియొక్క అనుభూతి అనేక ప్రకారాలుగా ఔతూంది. అనేకములైన కర్మకలాపాలూ, యజ్ఞ దాన, తపో, వేదాధ్యయనాలూ, వేదవిచారణ, మనోఇంద్రియాదుల సంయమమూ, కర్మత్యాగమూ, వివిధ అంగములతో కూడిన యోగం భక్తియోగం, ప్రవృత్తి, నివృత్తులూ, సకామ,నిష్కామకర్మలూ, ఆత్మతత్త్వం, జ్ఞాన వైరాగ్యాలు, మొదలైన సర్వసాధనల చేతనూ సగుణ నిర్గుణరూపుడూ, స్వయంప్రకాశుడూ ఐన భగవత్ప్రాప్తినే పొందుతాడు. మాతా! సాత్త్విక, రాజస, తామస, నిర్గుణ భేదంతో, భక్తి నాలుగు విధాలు. అట్టి భక్తియోగం ప్రాణుల జన్మాది వికార హేతువులు. దేనియొక్క గతి గ్రహించడం కష్టమో అట్టి కాలం యొక్క స్వరూపంకూడా నీకు చెప్పాను. అమ్మా! అవిద్యా జనిత మైన కర్మకారణంగా జీవునకు అనేక గతులు కలుగుతున్నాయి.

న లోలుపాయోపదిశేన్న గృహారూఢచేతసే,
నాభక్తాయ చ మేజాతు న మద్భక్తద్విషామపి.
శ్రద్ధధానాయ భక్తాయ వినీతాయానసూయవే.
భూతేషు కృతమైత్రాయ శుశ్రూషా భిరతాయ చ.
బహిర్జాతవిరాగాయ శాంతచిత్తాయ దీయతా,
నిర్మత్సరాయ శుచయే యస్యాహం ప్రేయసాం ప్రియః.
య ఇదం శృణుయాదంబ శ్రద్ధయా పురుషస్సకృత్,
యో వాభిదత్తే మచ్చిత్తస్స హ్యేతి పదవీం చ మే.

ఆ గతులలో ప్రవేశించినప్పుడు జీవునకు స్వస్వరూప జ్ఞానం ఉండదు. తల్లీ! ఇప్పుడు నీకు నే నుపదేశించిన జ్ఞానం దుష్టులూ దుర్వినీతులూ, గర్విష్ఠులూ, దురాచారులూ, దంభాచారులూ విషయలోలురూ, గృహాసక్తులూ, భక్తిలేనివారూ భక్తులను ద్వేషించువారూ, యీ జ్ఞానోపదేశానికర్హులు కారు. అట్టివారి కీ మార్గం ఉపదేశించరాదు. శ్రద్ధా భక్తీ, వినయం, ఎవరినీ ద్వేషించకుండుట, సమస్త జీవుల యందూ మైత్రి, గురుసేవా తత్పరత, బాహ్యవిషయములందాసక్తి లేకుండుట, శాంతస్వభావము అసూయ లేకుండుట, పవిత్రమైన చిత్తమూ నాయందు పరమ ప్రీతీ కలవారలకే యీ జ్ఞానం ఉపదేశించాలి. తల్లీ! నాయందు చిత్తం లగ్నంచేసి శ్రద్ధతో ఇది చదివినా విన్నా నా పరమపదంపొందుతాడు.

## 32 అ ధ్యా య ం

ఏవం నిశమ్య కపిలస్య వచో జనిత్రీ సా కర్దమస్య దయితా కిల దేవహూతిః,
విస్రస్త మోహపటలాతమభిప్రణమ్య తుష్టావ తత్త్వవిషయాంకితసిద్ధిభూమిమ్.

మైత్రేయుడు చెపుతున్నాడు! విదుర! కపిలుని ప్రబోధం విన్న దేవహూతి మోహవిముక్తయై తత్త్వ ప్రతిపాదకమైన సాంఖ్య శాస్త్రానికి ఆధారభూమియగు కపిలునిట్లు స్తుతించడం ఆరంభించింది.

ఆథాప్యజోఽంతః సలిలే శయానం భూతేంద్రియార్థాత్మమయం వపుస్తే,
గుణప్రవాహం సదశేషబీజం దధ్యౌ స్వయం యజ్జఠరాబ్జజాతః.

సఏవవిశ్వస్య భవాన్ విధత్తే గుణప్రవాహేన విభక్తవీర్యః,
సర్గాద్యనీహోఽవితథాభిసంధి రాత్మేశ్వరోఽతర్క్యసహస్రశక్తిః.

స త్వం భృతో మే జఠరేణ నాథ కథంను యస్యోదర ఏతదాసీత్,
విశ్వం యుగాంతే వటపత్ర ఏకశ్శేతే స్మ మాయాశిశురంఘ్రిపానః.

త్వం దేహతంత్రః ప్రశమాయ పాప్మనాం నిదేశభాజాం చ విభో విభూతయే
యథావతారాస్తవ సూకరాదయ స్తథా యమప్యాత్మపథోపలబ్ధయే.

యన్నామధేయ శ్రవణానుకీర్తనాద్యత్ప్రహ్వణాద్యత్స్మరణాదపిక్వచిత్.
శ్వాదోఽపిసద్యస్సవనాయ కల్పతే కుతః పునస్తే భగవన్నుదర్శనాత్.

దేవహూతి పలుకుతూంది – కపిల! బ్రహ్మ నీయొక్క నాభి కమలాన్నుండి ఆవిర్భవించాడు. పంచభూత, ఇంద్రియ, శబ్దాది విషయ మనోమయమైన, సత్వాది గుణప్రవాహంతో కూడిన కార్యకారణ బీజమైన ప్రళయకా లీనమైన జలమంధు శయనించి యున్న నీరూపాన్నే బ్రహ్మ ధ్యానించాడు. నీవు నిష్క్రియుడవు, సత్యసంకల్పుడవు. సమస్తజీవులకూ ప్రభుడవు వేలకొలదిఅంచిత్యమైన శక్తులు కలవాడవు. నీశక్తి గుణప్రవాహం చేత బ్రహ్మాది అనంత మూర్తులయందు విభక్తంచేసి ఉంచి, నీవు యీ విశ్వరచనాదులు చేస్తూంటావు.

ప్రభూ! ప్రళయకాలమందు అనేకకోటి బ్రహ్మాండాల నుదర మందు ధరించేవాడవు. కల్పాంతమందు మాయామయమైన బాల ముకుందరూపాన్ని ధరించి కరారవిందంతో పదాగవిందం పట్టుకుని ముఖారవిందమందుంచుకొని ఒక్కడవుగా వటవృక్షశాఖాగ్రమందలి పత్రమందు శయనించువాడవైనా అటువన్ను నేను ఉదరమందు ధరించా నంటే, ఇది ఎంత ఆశ్చర్యంగా ఉంది! జగన్నాథ! నీవు పాపులను శిక్షించుటకూ, సత్పురుషులను రక్షించుటకూ గాను స్వేచ్ఛామయ మైన మత్స్య, కూర్మ, వరాహాది అవతారములను ధరించినట్లే

అహో బత శ్వపచోఽతో గరీయాన్ యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్,
తేపుస్తపస్తే జుహువుస్సస్నురార్యా బ్రహ్మానూచుర్నామగృణంతి యే తే.
తం త్వామహం బ్రహ్మపరం పుమాంసం ప్రత్యక్స్రోతస్యాత్మని సంవిభావ్యమ్,
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహం వందే విష్ణుం కపిలం వేదగర్భమ్.
ఈడితో భగవానేవం కపిలాఖ్యః పరఃపుమాన్,
వాచాఽవిక్లబయేత్యాహ మాతరంమాతృవత్సలః.
మార్గేణానేన మాతస్తే సుసేవ్యేనోదితేన మే,
ఆస్థితేన పరాం కాష్ఠామచిరాదవరోత్స్యసి,
శ్రద్ధత్స్వైతన్మతం మహ్యం జుష్టం యద్బ్రహ్మవాదిభిః,
యేన మామభవం యాయామృత్యుమృచ్ఛంత్య తద్విదః.

ముముక్షువులకు మోక్షమార్గాన్నుపదేశించుటకై యీ కపిల రూపంలో అవతరించావు. నీ నామ సంకీర్తన శ్రవణముల మాత్రం చేత మానవుడు తరిస్తాడు. కుక్కమాంసంతినే వాడైనా, యదృచ్ఛయా నీనామాన్ని స్మరించినా, విన్నా నీకు నమస్కరించినా, సోమ యాజితో సమానంగా పూజనీయుడౌతాడంటే నీ దర్శనంచేసిన వానివిషయంలో సందేహమేముంది! తపో, హోమ, దాన, తీర్థాది సేవలుచేసే వానికంటే వేదాధ్యయన పరునికంటే కూడా నీ నామ స్మరణంచేసే శ్వపచుడే శ్రేష్ఠుడుగా పరిగణింప బడతాడు. కపిలా చార్య! నీవే సాక్షాత్పరబ్రహ్మయగు పరమపురుషుడవు, వృత్తుల యొక్క ప్రవాహాన్ని అంతర్ముఖంచేసి అంతఃకరణయందు నిర్ధ్యానిస్తున్నారు విజ్ఞులు. నీ తేజస్సుచేత మాయా కార్యరూప మైన గుణప్రవాహాన్ని శాంతింపచేస్తున్నావు. నీ హృదయమంతే సంపూర్ణమైనవేదతత్వం యిమిడి ఉంది. అట్టి సాక్షాద్విష్ణు రూపు డవైన నీకు నమస్కరిస్తున్నాను. అని స్తుతించిన తల్లి యొక్క స్తుతిని విని కపిలదేవుడు గంభీరవాణితో యిలా చెపుతున్నాడు.

అమ్మా! నేనునీకు చెప్పిన యీ సుగమమార్గాన్ననుసరించడం వల్ల నీవు శీఘ్రంగా పరమపదాన్ని పొందగలవు. నీవీ నా మతాన్ని

ఇతి ప్రదర్శ్య భగవాన్ సతీం తామాత్మనో గతిమ్,
స్వమాత్రా బ్రహ్మవాదిన్యా కపిలోఽనుమతో యయౌ.
సా చాపి తనయోక్తేన యోగాదేశేన యోగయుక్,
తస్మిన్నాశ్రమ ఆపీడే సరస్వత్యాస్సమాహితా.
అభీక్ష్ణావగాహ కపిశాన్ జటిలాన్ కుటిలాలకాన్,
ఆత్మానం చోగ్రతపసా బిభ్రతీ చీరిణం కృశమ్.
ప్రజాపతేః కర్దమస్య తపోయోగవిజృంభితం,
స్వగార్హస్థ్యమనౌపమ్యం ప్రార్థ్యం వైమానికైరపి.
పయఃఫేననిభాశ్శయ్యా దాంతా రుక్మపరిచ్ఛదాః,
ఆసనాని చ హైమాని సుస్పర్శాస్తరణాని చ.
స్వచ్ఛస్ఫటికకుడ్యేషు మహామారకతేషు చ,
రత్నదీపాశ్చ్రిభాంతి లలనారత్నసంయుతాః.

విశ్వసించు. బ్రహ్మవాదులు యీ మతాన్నే అనుసరించారు. దీని వల్ల జనన మరణరహితమైన నా స్వరూపాన్ని నీవు పొందగలుగుతావు. ఈ నా మతం తెలియని మానవులు, కాలంచక్రంలోపడి చస్తూ, పుడుతూంటారు. అని శ్రేష్ఠమైన ఆత్మ జ్ఞానాన్ని తల్లికి ఉపదేశించి కపిలదేవుడు బ్రహ్మవాదినియగు తల్లియొక్క అనుజ్ఞను పొంది అక్కడనుండి వెళ్ళిపోయాడు. అప్పుడు దేవహూతి సరస్వతీ నదీ తీరంలో ఉన్న తన ఆశ్రమంలోనే యోగాభ్యాసం చేస్తూ సమాధి స్థితమై తపస్సు సాగిస్తూంది. త్రికాలస్నానంవల్ల ఆమెజుత్తు జడలు కట్టింది. నారచీరలచే ఆవృతమైన ఆమె శరీరం ఘోరమైన తపస్సుచే దుర్బలమై పోయింది. ఆమె తపోయోగాదులచే కర్దమ ప్రజాపతిచేసాధింపబడి గృహస్థ సంబంధమైన సమస్త సుఖసాధనాలూ వదలి వేసింది. పాలమీద నురగతో సమానమై కోమలమైన హంసతూలికా తల్పములతో కూడిన ఏనుగు దంతాల మంచాలూ, బంగారు పాత్రలూ, రత్నఖచితమైన బంగారు సింహాసనాలూ, రత్న నిర్మితములైన రమణీయ మూర్తులతో కూడిన మణిమయ దీపాలూ, ఫలాలతో కూడిన వృక్షాలూ, సుగంధం వెదజల్లే పుష్ప

గృహోద్యానం కుసుమితైః రమ్యం బహ్వమరద్రుమైః,
కూజద్విహంగమిథునం గాయన్మత్త మధువ్రతమ్.
యత్ర ప్రవిష్ట మాత్మానం విబుధానుచరా జగుః,
వాప్యా ముత్పలగంధిన్యాం కర్దమేనోపలాలితమ్,
హిత్వా తదీప్సితతమమప్యాఖ్యండలయోషితాం,
కించిచ్చకార వదనం పుత్రవిశ్లేషణాతురా,
వనం ప్రవ్రజితే పత్యా వ్యపత్యవిరహాతురా,
జ్ఞాతతత్త్వాప్యభూన్నష్టవత్సా గౌరివ వత్సలా.
తమేవ ధ్యాయతీ దేవమపత్యం కపిలం హరిం,
బభూవ చిరతో వత్సనిస్పృహా తాదృశే గృహే.
ధ్యాయతీ భగవద్రూపం యదాహ ధ్యానగోచరం,
సుతం ప్రసన్నవదనం సమస్తవ్యస్తచింతయా.
విశుద్ధేన తదాత్మాన మాత్మనా విశ్వతోముఖం,
స్వానుభూత్యాతిరోభూత మాయాగుణవిశేషణం.

లతలూ కలిగిన ఉద్యానవనాలలో స్వర్గాన్ని ధిక్కరించే భోగాలన్నీ సమకూర్చబడిన విమానాదులనూ వదలి తపోదీక్షలో ఉండి దేవహూతి సర్వజీవవరణీయుడైన శ్రీహరియే కుమారుడుగా అవతరించడం వల్ల పుత్రవియోగవ్యాకులం మాత్రం ఆ మోముఖంలో గోచరిస్తూంది. భర్త అరణ్యానికి వెళ్ళిపోయాడు. పుత్రుడు కూడా వదలి వెళ్ళిపోయాడు. దేవహూతి బ్రహ్మజ్ఞాన సంపన్నురాలై యుండి కూడా దూడను వదలిన గోవువలె వ్యాకులత చెందింది. విదురా! పుత్రుడైన కపిలరూపుడగు శ్రీహరిని ధ్యానిస్తూ సర్వవస్తు పరిత్యాగం చేసి ఉపరతిని పొందగలిగింది. కపిలునిచే చెప్పబడిన విధి ననుసరించి శ్రీహరి యొక్క ప్రతిఅవయవాన్నీ సమగ్రమైన శ్రీహరి రూపాన్నీ ధ్యానించడంవల్ల ఆమెకు భక్తి ప్రవాహ రూపం చెంది ప్రబల వైరాగ్యం కలిగి బ్రహ్మసాక్షాత్కార యోగ్యంగా చిత్తము పరిశుద్ధమైన పిమ్మట సర్వ వ్యాపకమై ఆత్మధ్యానంలో నిమగ్నురాలై పోయింది. ఆత్మస్వరూప ప్రకాశం చేత మాయా జనితమైన ఆవరణను దూరం చేసుకుని, ఈ విధంగా జీవున కధిష్ఠాన భూతమైన బ్రహ్మ భావం కలిగి

భక్తిప్రవాహయోగేన వైరాగ్యేణ బలీయసా,
యుక్తానుష్ఠానజాతేన జ్ఞానేన బ్రహ్మహేతునా.
బ్రహ్మణ్యవస్థితమతిర్భగవత్యాత్మసంశ్రయే,
నివృత్తజీవాపత్తిత్వాత్క్షీణక్లేశాప్తనిర్వృతిః,
నిత్యారూఢసమాధిత్వాత్పరావృత్తగుణభ్రమా,
నస్మార తదాత్మానం స్వప్నదృష్టమివోత్థితః.
తద్దేహః పరతః పోషోఽప్యకృశశ్చాధ్యసంభవాత్,
బభౌ మలైరవచ్ఛన్నస్సధూమ ఇవపావకః,
స్వాంగం తపోయోగమయం ముక్తకేశం గతాంబరం,
దైవగుప్తం న బుబుధే వాసుదేవే ప్రవిష్టధీః.
ఏవం సా కపిలోక్తేన మార్గేణాచిరతః పరం,
ఆత్మానం బ్రహ్మనిర్వాణం భగవంతమవాప హ.
తద్వీరాసీత్పుణ్యతమం క్షేత్రం త్రైలోక్యవిశ్రుతం,
నామ్నా సిద్ధిపదం యత్ర సా సంసిద్ధిముపేయుషీ,

బుద్ధి బ్రహ్మాకారంగా పరిణమించిన తోడనే జీవభావం నశించి సమస్త క్లేశములనుండీ విముక్తురాలై పరమానందంలో నిమగ్నురాలైంది. నిరంతరం సమాధియందుండుటచే విషయములయొక్క సత్యత్వభ్రాంతి నశించింది. దేహభావంకూడా పోయింది. మేల్కాంచిన వానికి స్వప్నశరీరం యెలాగైతే లేదో, అలాగే జ్ఞానావస్థలోనే నామె శరీరమందు కూడా స్మృతిలేని స్థితి కలిగింది. శరీర పోషణ కూడా ఇతరులవల్ల జరుగుతోంది. కాని ఆమెకు క్లేశం లేకపోవడంవల్ల శరీరం దుర్బలం కాలేదు. మలిన వస్త్రాదుల కారణంగా ధూమయుక్తమైన అగ్నివలె శోభిస్తూ ఉంది. కేశములు విడి పోయాయి. వస్త్రంకూడా దేహంమీద లేదు. ఆమె నిరంతరం శ్రీహరియందు లగ్నమైన చిత్తం కలదౌటచేత తన తపోయోగమయమైన శరీరంపై కొంచెమైనా స్మరణం లేదు. కేవలం ప్రారబ్ధమే ఆ శరీరాన్ని రక్షిస్తోంది.

విదురా! కపిలమహర్షి ప్రబోధించిన మార్గానుసారం దేవహూతి అనతి కాలంలోనే నిత్యమైన ముక్తిని సాధించి పరమాత్మను పొందగలిగింది. ఆమె సిద్ధి పొందిన ప్రదేశము సిద్ధపదమని ప్రఖ్యాతి

తస్యాస్తద్యోగవిధుతమార్త్యం మర్త్యమభూత్సరిత్,
స్రోతసాం ప్రవరా సౌమ్య సిద్ధిదా సిద్ధసేవితా.
కపిలోఽపి మహాయోగీ భగవాన్ పితురాశ్రమాత్,
మాతరం సమనుజ్ఞాప్య ప్రాగుదీచీం దిశం యయౌ.
సిద్ధచారణ గంధర్వైర్మునిః శ్చాప్సరోగణైః,
స్తూయమాన స్సముద్రేణ దత్తార్హణ నికేతనః.
ఆస్తే యోగం సమాస్థాయ సాంఖ్యాచార్యైరభిష్టుతః,
త్రయాణామపి లోకానాం ముపశాంత్యై సమాహితః.
ఏతన్నిగదితం తాత యత్పృష్టోఽహం తవానఘ,
కపిలస్య చ సంవాదో దేవహూత్యాశ్చ పావనః.
య ఇదమనుశృణోతి యోఽభిధత్తే కపిలమునేర్మతమాత్మయోగగుహ్యం,
భగవతి కృతధీస్సుపర్ణకేతా ఉపలభతే భగవత్పదారవిందం.

చెందింది. యోగసాధనవల్ల ఆమె శరీర మలాలు దూరమై పోయి ఒక ప్రవాహరూపం పొంది సిద్ధ గణసేవితమై సర్వసిద్ధి ప్రదాయక మని ప్రసిద్ధికెక్కింది.

కపిలుడు తల్లి అనుజ్ఞను గైకొని కర్దముని ఆశ్రమం వదలి ఈశాన్య దిశగా వెళ్ళిపోయాడు, అక్కడ సముద్రుడు యథోచితంగా పూజించి నిశ్చల సమాధియందుడుటకు అర్హమైన స్థానం ఇచ్చాడు. ముల్లోకాలకూ భ్రాంతిని ప్రసాదించడానికి కపిలుడు సమాధిలో నిమగ్నుడయాడు. అట్టి కపిలునిసిద్ధ, చారణ, గంధర్వ, ముని, అప్సరస, సాంఖ్యాచార్య గణాలన్నీ అనేక రీతుల స్తుతిచేశాయి.

విదురా ! నీవు కోరిన కారణంగా పవిత్రమైన కపిల దేవహూతుల సంవాదం వినిపించాను. ఇది అధ్యాత్మ యోగంలోని నిగూఢ రహస్యం. దీనిని భక్తియుక్తంగా విన్నా వర్ణించినా గరుడధ్వజుడగు శ్రీహరి చరణారవింద సేవాభాగ్యం అనతి కాలంలోనే లభిస్తుంది.

వేదవ్యాస మహర్షి ప్రోక్తమైన మహాభాగవతానికి
ఆంధ్ర వ్యాఖ్యానానువాదంతో తృతీయస్కంధము.

